# కనీనికా నిదానము

డా॥ హెన్రీ లిండ్లహారు, యం. డి. గారి
"ఇరిడయాగ్నోసిస్" అను గ్రంథము ననుసరించి



డా॥ మృత్తింటి ఆంజనేయులు, యన్. డి. గారు
రచించినది





వెల రు 6

# అంకితము

నను కని పెంచిన మాతకు
తినకూడును కట్టబట్ట తీర్చిన పితకున్
తనుఋణము తీర్పజాలమి
పనుపడ నీ కృతిని ప్రీతి వారికి నిత్తున్.

# అవతారిక

1935 లో బి. ఎ. చదువు అయిన తరువాత యింటికిచేరి వ్యవసాయము చేయవలసివచ్చింది. విద్యాతృష్ణ మాత్రము తగ్గలేదు. ఏమిచదువుదామని విచారించగా మా గ్రామములో ఉన్న శ్రీపుచ్చా వేంకటరామయ్యగారు ప్రకృతి వైద్యము గుర్తువచ్చింది. అప్పుడే ఆచార్యులవారి వద్దకు పోయి వినయవిధేయతలతో విద్య చెప్పమన్నాను. సరేనన్నారు. యథావిధిగా శాస్త్రము నభ్యసించాను. గురుకటాక్షముతో కృతార్థుడనైనాను.

అంతవరకు ప్రచారములోనికిరాక నిగూఢముగా ఉన్న క్రొత్తశాస్త్రమును దేనినైనా వ్రాయవలెనని బుద్ధిపుట్టింది. గురువుగారి లైబ్రరీనంతను తిరగవేశాను. మిగిలిన భాగములలోని గ్రంథముల వ్రాసిన మా గురువుగారు ఈ భాగములోనూ ప్రజ్ఞావంతులయ్యూ దీనిజోలికి పోలేదు. ఎందుకని విచారించగా

మ. ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విం బురాణావళుల్
తెనుగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు సేసెద బునర్జన్మంబు లేకుండగన్.

అన్న బమ్మెరపోతన పద్యము గుర్తువచ్చింది. సరేనని పని ప్రారంభించాను. పూర్తిచేసి నాల్గు సంవత్సరములైనది. కాగితపు కరువుచేత బయటపడలేదు.

గ్రంథవిషయము - బరామీటరును చూచి గాలి శక్తిని యెట్లుచెప్పగలమో అట్లనే కనీనికను చూచి రోగమును చెప్పగలము. కన్నులో తెల్లగుడ్డు నల్లగుడ్డులు ఉండును. నల్లగుడ్డులో కనుపాప పోను మిగిలిన భాగమును కనీనిక అందుము. దేహములోని ప్రతిచిన్న అవయవమునకును కనీనికలో ప్రతినిధిస్థానము గలదు. అంతరవయవములలో కలిగిన ప్రతిచిన్న మార్పు ఆప్రతినిధి స్థానములో రంగుతేడాతోగాని సాంద్రతతేడాతోగాని చిహ్నాలతోగాని కనుబడును. దేహమునకు ఉపయోగపడుతవని వాడబడు వివిధలోహముల నుండితయారగు వివిధమందులు వాటిరంగులతో వాటికి అనురాగముగల చోట్లకనుబడును. ఒక తడవప్రవేశించిన ఖనిజము చాలా సంవత్సరములకుగాని తనధర్మమును (నాశనము చేయుటను) మొదలుపెట్టదు. చాలా సంవత్సరములకుగాని బయటకుపోవు. బయటకుపోని ఖనిజములు కూడా గలవు.

ఇంత ప్రమాదములతో కూడినవగుటచే రస, విష, పాషాణాదులతో తయారగు వివిధమందులను మాని, ఇప్పుడుగాని యెప్పుడుగాని అపకారము చేయని సున్నితమగు ప్రకృతి శక్తులతో చికిత్సించు కొనమని చెప్పుట.

సుప్రసిద్ధుడగు డా. హెన్రీ లిండ్లహారు యం. డి. వ్రాసిన 'ఇరిడయాగ్నోసిస్' అను గ్రంథము ననుసరించి వ్రాశాను. అలోపతీ వైద్యము నందే గాక ప్రకృతివైద్యము, హోమోపతీవైద్యములందు అసాధారణమైన ప్రజ్ఞగలవాడు. కేవలము శాస్త్రజ్ఞానముగలవాడే గాక పదునెనిమిది సంవత్సరములు చికాగోనగరములో ఆరోగ్యసదనమును నిర్వహించి బాధిత మానవకోటికి సేవచేసినవాడు. తరువాతనే యీ గ్రంథమును రచించెను.

పైన చెప్పిన గ్రంథముతోబాటు మిగిలిన గ్రంథములు కూడా సాయపడినాయి. గ్రంథమును మక్కీకిమక్కీకిగా తెనుగు వ్రాయలేదు. ఆ గ్రంథములో లేని, మిగిలిన గ్రంథములలోగల చాలా విషయములను చేర్చాను. నాకు అనుభవములో గల వివిధవిషయములను చేర్చాను. గ్రంథముతో సంబంధము లేని కొన్ని విషయములను వదలివేశాను.

ఇంతవరకు దీనికి సంబంధించిన గ్రంథము తెనుగున లేకపోవుటచేత విషయమును విపులముగా చెప్పవలసివచ్చింది. అవసరమైనచోట ఆంగ్ల శబ్దములనే ఉంచి తెనుగువివరమును వ్రాసినాను. క్రొత్త శబ్దములను కూడా సృష్టించవలసి వచ్చింది.

గుణగ్రహణపారీణులగు పండితలోకము యిందలి లోపముల తెలియచేసిన యెడల సవరించుకొనుటకు సిద్ధముగా ఉన్నాను.

గ్రంథమును త్వరగా ముద్రింపించి యిచ్చిన ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ వారికిని, మేనేజరు గారికిని, తప్పులు పోకుండా ప్రూఫుల దిద్దిన పండిత సోదరులకును నా ధన్యవాదాలు.

పుస్తకమును ప్రకాశింపచేసిన ప్రకృతి కార్యాలయట్రస్టు వారికి నావందన శతంబులు.

బొమ్మలను గీచియిచ్చిన చిరంజీవి వలివేటి ఆంజనేయులుకు విశ్వపిత ఆయురారోగ్యములు ప్రసాదించుగాక.

వ్యయ : మార్గశిరము
బెజవాడ

మృత్తింటి ఆంజనేయులు.

# ప్రవేశిక

మానవాభ్యుదయము కొరకై యింతవరకు ప్రపంచభాషలలో వెలువడిన అత్యుత్తమ గ్రంథములలో 'కనీనికానిదానశాస్త్రము' ఒకటి. ఈ శాస్త్రమును మొట్టమొదట కనిపెట్టినవాడు వాన్ పెక్ జెలీ అను హంగరీ దేశస్థుడు. తరువాత డా. లేన్. యం. డి. అను ఆంగ్లవైద్యుడు దీనిని అభివృద్ధి పరచెను. అమెరికాదేశస్థుడైన హెన్రీ లిండ్లహారు, యం. డి. అనునతడు దీనిని పరిపక్వమునకు తెచ్చెను. అతడు రచించిన ప్రకృతి వైద్య గ్రంథమాలలోని ఇరిడయాగ్నసిస్ అను గ్రంథముయొక్క విశేషవివరణములతో గూడిన ఆంధ్రీకరణమే యీ కనీనికానిదానము.

వివిధములుగా అభివృద్ధిపొందిన నిదానశాస్త్రములన్నిటిలోను కనీనికానిదానము అత్యుత్తమమైనదని అత్యంతనిర్దుష్టమైనదని యీ శాస్త్రమును అనుభవముచేసి చిరకాలముగా నిదానము చేయుచున్న మాకు అనుభవసిద్ధమైన విషయము. ఈ గ్రంథమును అనువదించిన చిరంజీవి మృత్తిపాటి ఆంజనేయులు నాకు సన్నిహిత శిష్యుడు. అందువలన అతనిని అభినందించదలచుకొనలేదు. కాని గ్రంథము మొదటినుండీ చివరవరకు చదివినవారికి ధారాళమైన అతని శైలినిగూర్చియు, విషయ విశదీకరణమునందు అతని నేర్పును గూర్చియు మెచ్చుకొనకుండా ఉండజాలరు. కేవలము గ్రంథమును అనువదించుటయేగాక యీ శాస్త్రమునందు ప్రత్యేకనైపుణ్యమును సంపాదించి, అనేకమందికి రోగనిదానముచేసి, వారి మెప్పును పొందిఉండుట నేను స్వయముగా చూచిఉన్నాను. ఇందులో చేర్చిన పటములను దగ్గరనుంచుకొని యీ గ్రంథమును జాగ్రత్తగా అధ్యయనముచేసినయెడల యీ నిదానశాస్త్రము రేమి కొంచెము తెలివితేటలు గలవారైనా సులభముగానే అలవరచుకొనవచ్చునని నేను అభయమును యిచ్చుచున్నాను.

ఈ గ్రంథము వ్రాతప్రతిగా ఉండగానే కొంతమంది కనీనికానిదానమును అలవరచుకొనుటకు ప్రయత్నించినారు. వారిప్పుడు సులభముగానే రోగనిదానమును చేయగలుగుచున్నారు. అట్లు చేయగలిగినవారిలో యిటు

ఇంగ్లీషు గాని అటు యే యితర వైద్యశాస్త్రము గాని యెఱుగనివారు కూడా ఉన్నారు.

ఈ శాస్త్రమున ప్రావీణ్యము సంపాదించినయెడల ఒక రోగమును చాలా ముందుగానే పసిపట్టి నివారించుకొనుటకు వీలు యేర్పడును. రోగము యే స్థితిలోనున్నదో స్పష్టముగా తెలుసుకొనవచ్చును. చికిత్సా కాలమున రోగము యెంతభాగము నయమైనదో కనిపెట్టు చుండవచ్చును. ఎవరికివారు భూతఅద్దముతో తమకన్నును యింకొక అద్దములోనికి చూచి తెలుసు కొనుటకును వీలున్నది.

ఈ శాస్త్రము వలన మేమొక విషయమును స్పష్టముగా తెలుసు కొన్నాము. దేహమునందలి రోగముల పోగొట్టుటకు వాడినపాదరసము, గంధకము, వంగము, సీసము, పాషాణము, లోహము మొదలగు భూమి అడుగు నుండి త్రవ్విన ఖనిజములు దేహమునందలి రక్తముతో సారూప్య మును పొందవనియు అవి యేరోగములకు వాడబడినవో అంతకన్న దుర్భర వ్యాధులను కలిగించుచు దేహములోనే నిలిచియుండు ననియు మేమీశాస్త్రము వలన ప్రత్యక్షముగా చూచితిమి. మీ దేహమునందు ఫలానా లోహము ఉన్నదని చెప్పినప్పుడెల్లా రోగులు ఆశ్చర్యముతో మామాటలను ఒప్పుకొను చున్నారు. అలోపతీ విధానముగానే కాకుండా ఆయుర్వేద విధానముగా తయారుచేసిన లోహజాతి మందులుకూడా దేహమునుండి వదలిపోవనియు అవి చిరకాలము మరణాంతము వరకుకూడా దేహములోనే ఉండి వివిధా వయవములలో ఉద్రేకమును కలిగించు చుండుననియు మేము గుర్తించు చున్నాము.

ఏ తరహా వైద్యము చేసేవారైనా యెన్ని నిదానశాస్త్రములువారు యెఱిగి ఉన్నప్పటికీ ఈ నిదానశాస్త్రము నెఱిగి ఉండుటవలన వారి నిదాన నైపుణ్యము వృద్ధిపొందునని మాత్రము ధైర్యముగా చెప్పగలము. ఇంతే కాకుండా యితర విధాల చేసిన నిదానము తప్పో ఒప్పో చూచుకొనుటకు కూడా ఈ నిదానశాస్త్రము సాయపడుతుంది.

ఓషధులతో చేసినమందులు లోహములంత కాలము నిలిచి ఉండక సమయము చిక్కినప్పుడు అనగా ధాతుశక్తి వృద్ధిపొందినపుడు మలమూత్ర, స్వేద, శ్వాసములతోను, కఫ, శ్లేష్మ, కసుమ, గ్రహణి, ప్రదరాది వ్యాధులు

కలిగినప్పుడును బయటకు వెడలిపోవుచుండును. కాయలు కంతులు, గ్రంధులు కురుపులు, వ్రణములు, గజ్జి, తలచీడ, మొదలగువానిద్వారా కూడా బయటకు పోవును. అయినప్పటికినీ నాభి, క్వయినా మొదలైన విషయుతమైన ఓషధులు వాడినప్పుడు హృదయము దుర్బలమగుటయు, అవి దేహములో నిలిచి ఉండుటయు మేము చూచుచున్నాము. ఆహారపదార్ధములుగా గాక ఉద్రేకము కొరకై వాడిన కాఫీ, టీ, పొగాకు మొదలగునవి కూడా దేహములో నిలిచి ఉండుటను కనీనికను చూచి గుర్తించగలుగుచున్నాము. ఈ నిదానశాస్త్రమునందు ప్రావీణ్యము సంపాదించుట వలన మనము తినదగిన ఆహారములేవో, తినకూడని పదార్ధములేవో, త్రాగదగినవేవో, త్రాగదగనివేవో నిర్దుష్టముగా తెలుసుకొనగల్గుచున్నాము.

రచనా విధానమును గూర్చి ఒకమాట చెప్పవలసి ఉన్నది. గ్రంథమంతయు వ్యావహారిక భాషలోనే వ్రాసిఉన్నది. పారిభాషిక పదములను విరివిగా వాడక తప్పలేదు. మా ప్రకృతి సంస్థ కోడ్ ననుసరించియే యిందలి పారిభాషిక పదముల వాడి ఉండుటవలన ప్రకృతి కార్యాలయ ట్రస్టు గ్రంథముల చదివిన వారికి యిందలి పారిభాషికపదములు తేలికగానే అర్ధమగును. అయినను, ఆయా పదములు వచ్చినపుడు ఆయాచోట్ల విశేష వివరము గలదు. గ్రంథమందలి విషయములను సులభముగా చూచుటకు వీలుగా విపులమైన విషయసూచికయు, అకారాను క్రమణికయు గలదు. గ్రంథము నందలి కఠినపదములకు అర్ధమును చేర్చి ఉన్నారు.

గ్రంథముద్రణా కాలములో అవశ్యముగా దొర్లిన తప్పులను తప్పొప్పులపట్టికలో చేర్చినారు.

ఈగ్రంథము యితరదేశ భాషలలోకూడా అనువదిస్తే మేలు జరుగుతుందని మాకు నమ్మికగలదు. ఎవరైనా అనువాదము చేయదలచిన వారికి మేము కావలసిన సహాయము చేస్తాము.

పుచ్చా వేంకట్రామయ్య.

# సాంకేతిక పదములు



Omen-అం. వె. పెద్దప్రేగు, చిన్నప్రేగు నిలవఉండు కోశపుపైర అంత్రవేష్టనము. దీని వెలుపలి పొర పేరు Omen

Peritoneum -అం. లో. - అంత్రవేష్టనపు లోపలి పొర Peritoneum

Perin - పెరిన్ వృషణములకును, ఆసనమునకును మధ్యనుండు భాగము.

Sigmoid flexure సిగ్మాయిడ్ ఫ్లెక్షర్ - మలాశయమునకు పైగానుండు పెద్దప్రేగులోని భాగము, కూపకములోనికి జారిఉంటుంది.

Gall Bladder - గాల్ బ్లాడరు - పసరుతిత్తి.

Cardia - కార్డియా - జీర్ణకోశపు పైభాగము, హృదయకోశపు దిగువ భాగముల మధ్యనున్న సంధి.

జాతిద్రవములు - Sexualfluids

కనీనికానిదానము - కనీనికనుబట్టి రోగమును నిర్ణయించుట

కనీనిక - కంటిలోని నల్లగుడ్డులో కనుపాప లేక బింబముపోను మిగిలిన భాగము కనీనిక.

ముఖవైఖరీ విద్య - ముఖముయొక్క స్థితి అనగా తలవుండుస్థానమును బట్టి రోగమును నిర్ణయించుట.

కశేరుకానిదానము - వెన్నుపాములోని పూసలస్థితిని బట్టి రోగమును నిర్ణయించుట.

సరళాంత్రము - Transverse colon పెద్దప్రేగు మధ్యభాగము

అధోముఖాంత్రము - Descending colon పెద్దప్రేగు చివరిభాగము

ఊర్ధ్వముఖాంత్రము-Ascending colon పెద్దప్రేగు మొదటిభాగము

మూత్రపిండము - Kidney ఉలవకాయ

ప్లీహము - Spleen

ఊపిరితిత్తి - Lung

జీర్ణకోశము - Stomach

హృదయకోశము - Heart

Liver – యకృత్తు – పైత్యకోశము.
పురోభారము – ముందు భాగము పెరుగుట
పృష్ఠభారము – వెనుక భాగము పెరుగుట
మిశ్రమభారము – దేహము అన్నివైపులా పెరిగి ఉండుట
జననేంద్రియములు – పురుషులలో వృషణములు, స్త్రీలలో గర్భాండములు. మొదలగు సృష్టికి పనికివచ్చు భాగములు
నాడీమండలము – Nervous system
కనీనికాపటము – కనీకలోని వివిధభాగములను తెలుపు బొమ్మ
బహిఃపటలము – Scelera
మధ్యపటలము – Choroid
అంతఃపటలము – retina
కాచబింబము – కార్నియా (Cornea)
ఆమాశయము – క్రిమిక
సాంద్రత – density
స్వాస్థ్యసంకటము – healing crisis
రోగసంకటము – disease crisis
వర్గీకరణములు – classifications
శ్వాసనాళికలు – bronchus
Scurf rim – అంచు అనగా కనీనికయొక్క తెలుపటి ఆవరణ
Closed lesion (క్లోజుడు లీజియన్) కనీనికలో కనుబడు చిహ్నము
Open lesion (ఓపెన్ లీజియన్) కనీనికలో కనుబడు గుర్తు – కుడిపార్శ్వభారము – కుడిప్రక్కన ఉన్న అవయవములలో రోగపదార్థము చేరుట; వామపార్శ్వభారము – ఎడమప్రక్క ఉన్న అవయవములలో రోగపదార్థము చేరుట; సార్వత్రికభారము – దీనినే మిశ్రమభారమందుము.

Pancreas — వృక్కకము, మధుకోశము
Ergot — తొగరుచెక్క
Antikamnia — మందుపేరు

Turpentine — కర్పూరతైలము

Calomel — రసభస్మము

Gal-bladder — పసరు తిత్తి

Cerebrum — ముందు మెదడు

Paresis — తాత్కాలికముగా కాళ్ళు, చేతులు చచ్చుపడిపోవుట

Paris green — గోడలకు అంటించుటకు ఉపయోగించు పాషాణముతో తయారుకాబడు మందు

Fowler-Solution — మందుపేరు

Salvarsan — దీనిని '606' అంటారు

Acetanilid — అసిటానిలిడ్
Antipyrin — ఆంటిపైరిన్
Creosote — క్రియోసోట్
Phenacetin — ఫెనాసిటిన్
Antikamnia — ఆంటి కామ్నియా
} మందుల పేర్లు

Coal-Tar Products — కోల్టారుమందులు - బొగ్గునుండి, తారులనుండి తయారుచేయు మందులు

మూలగీతలు - పోయిన అవయవములను తెలుపు చిహ్నములు.

స్ట్రిచినిన్ - ఉద్రేకమును కలుగచేయు మందు -

పేరాగారిక్, మార్ఫిన్, లాడినమ్, కొకెయిన్ - మందుల పేర్లు

Lung Troubles - శ్వాసకోశవ్యాధులు

Myxodema — థైరాయిడ్ గ్రంధిలోని లోపమువలనవచ్చు రోగములలో నొకటి

Grave's disease — గ్రేవురోగము - గలగండవ్యాధి

Addison's disease — అడిసన్ రోగము

Bright's disease — బ్రైటు రోగము - [శ్వేతధాతువుపోవు రోగము]

---

# సహాయపడిన గ్రంథములు


1. Iridiagnosis and other diagnostic methods — Henry Lindlhar M. D.
2. Diagnosis from the iris of the eye — Henry Edward Lane M.D.
3. Nature cure and Iridiagnosis - V. S. Davidson N. D., D. O., D. C., D. A.,
4. ఇండియన్ మెటీరియా మెడికా.
5. వస్తుగుణ దీపిక.
6. బెర్నారుమాక్ ఫెడన్ ఫిజికల్ కల్చరు.
7. Naturopath } Journals.
8. Netur'spath } Journals.
9. సుఖసంసారము - పుచ్చా వెంకట రామయ్యగారు.
10 ప్రాణాయామం — డిటో

ఇతరగ్రంథములున్నూ —




# విషయసూచిక

## అధ్యాయము 1. పేజీలు 1–15

### రోగనిర్ణయము



## అధ్యాయము 2. పేజీలు 15–22

### పుట్టుపూర్వోత్తరములు

## అధ్యాయము 3. పేజీలు 23-34

### కన్ను - భాగములు

పంచేంద్రియములలో కన్నుకుగల స్థానము - మనసు ఆరవయింద్రియ మనుట - కన్నుకును మనసుకును గల సంబంధము - కన్ను - కనీనిక - కనీనికకును మానవదేహమునకును గల వైశాల్య భేదాలు - కనీనికరంగులు- కనుగుడ్డు - కంటిలోని పొరలు - బహిః పటలము, మధ్యపటలము, అంతః పటలము - మూడవ పొరలోని 11 భాగములు - కనీనికలోని అయిదు పొరలు - కనీనికయందలి నాడుల నిర్మాణము - కనీనిక యందలి రక్త ప్రసరణము.

## అధ్యాయము 4. పేజీలు 35-52

### రోగము

శాస్త్రసమ్మతముగా ఉండవలెననుట - రోగవిభాగము - ప్రతి భాగములోని దశలు - కనీనికలో కనుబడు గుర్తులు, చుక్కలు, వివరణము- తరుణరోగ కారణము - కాలిక రోగముల స్వరూపము - క్రియాప్రతి క్రియల సూత్రము- వివరణము- ఆమాశయమును తీసివేయుట - అవసరము- జలుబుకు కారణము-కణములధర్మములు - తరుణరోగములలోను కాలికరోగములలోను కనీనికలో కనుపడుగుర్తులు - అలోపతీ మందులవలన మూలకారణములు పోకపోవుట - తెల్లగీతలు నల్లపడుట - రోగము వంశానుగతమా - రోగ ప్రవణత - ఆహారవిహారములలోని మార్పు అవసరమనుట - కనీనికరంగు, సాంద్రత, వంశానుగతముగావచ్చిన రోగచిహ్నములను బట్టి ధాతుశక్తిని నిర్ణయించవలెను-ఒకదానినే ఆధారముగా తీసికొనరాదు.

## అధ్యాయము 5 పేజీలు 53-84

### గుర్తులు.

దేహములోని ప్రతిచిన్న అవయవమునకు కనీనికలో స్థానము - రంగులో మార్పు గీతలేర్పడుట - కనపడని విషయములు - గర్భముల ధరించుట, ఆడువారి సహజధర్మము - అందువలన కనుపడదనుట - పోయిన అవయవము స్థానములో మూలగీత - సజాతీయ విజాతీయములు - మందు

లకును అశయుకములకును గల అనురాగము - కుడిభాగములోని లోపములు కుడి కనీనికలోను, యెడమ భాగములోని లోపములు యెడమ కనీనికలోను కనుపడుననుట - ముచ్చలిగుంటకు పై భాగములో గల లోపములు వ్యతిరేక భాగమందు కనుబడుననుట - తెలుపు, నలుపులకు గల తేడా - రెంటి లక్షణములు - హిపోక్రిటీసు అభిప్రాయము - స్వాస్థ్య సంకటములు - వైద్యుల అభిప్రాయము - ఫలితము - కథ - నాడీ ఉంగరములు - రెండు రకముల వర్గీకరణములు - రెంటినిబట్టి రోగనిర్ణయము చేయావలెననుట - రెండవ వర్గీకరణమును గూర్చి చదువునపుడు యీ క్రింది విషయమును చేర్చవలెను. ముప్పది ఆరు ప్రతినిధి భాగములను లెక్కించునపుడు రెండు కనీనికలలోను అవలంబింపబడు విధానములలోని తేడాను గమనించ వలయును. గడియారములోని రెండు ముల్లులుతిరుగు విధము అందరు గమనించియే ఉంటారు. (←) దీనిని (Clock-wise) క్లాక్ వైజు అంటారు. చూడబడువాని యెడమ కనీనికలోని ముప్పదిఆరు భాగములను ఒకదానివెంట మరొకటి యీ విధముగా లెక్కబెట్టుకొనవలెను.

ఇక, చూడబడువాని కుడికనీనికనన్నునో (Anti Clock-wise) యాంటి క్లాక్ వైజు (→) విధముగా పైవానికి వ్యతిరేకముగా లెక్కపెట్టవలెను.

ఇట్లు చేసిన ఒక సౌలభ్య మేర్పడును. ఎడమ కనీనికలోని 26, 27, 28 భాగములను కుడి కనీనికలోని 26, 27, 28 భాగములును దగ్గరగా నుండును.

క్లోజుడు లీజియన్సు - వివరణము - ఓపెన్ లీజియన్సు - వివరణ - ఇకను open lesions ను గూర్చి తెలుసుకొందాము. ఈ గుర్తులలోను నల్లగీతలుగాని, చుక్కలుగాని మధ్యనుండును. వాటిచుట్టూ తెల్లగీతలు కొంతవరకే నుండును. ఉండకపోవుటయు గలదు. పై వాటికన్న యీ గుర్తులు ప్రమాదమును తెలుపును.

రోగపదార్థము పెరిగిపోవు చున్నపుడును, ధాతుశక్తి తగ్గిపోయిన వారిలోను యీ తెల్లటి చుట్టు గీతలు లోపించును.

అప్పుడు పుట్టినగాని, పుట్టినకొద్ది రోజుల తరువాతగాని శిశువుల కనీనికలను చూచినయెడల వారి కనీనికలలో వంశానుగతముగా వచ్చిన రోగ చిహ్నములు కనుబడును. ఆ చిహ్నముల చుట్టూ యీ తెల్లగీతలు ఉండుట గలదు. ఈ రకమైన వాటిని closed hereditary lesions అంటాము. తెల్లగీతలు లేనివాటిని open hereditary lesions అంటాము. తెల్లగీతలు చుట్టూ ఉన్న గుర్తులు గల కేసులలో రెండవవాటిలోకన్న రోగప్రాబల్యము తక్కువ ఉండును. చికిత్సాకాలములో యీ అవయవముల గూర్చి ప్రత్యేక శ్రద్ధ తీసికొనవలెను.

రోగము వార్ధకదశను పొందునపుడు కనీనికలో కనుపడుగుర్తులు – శోషరసమండలము – ఉదర మండలమునకును పాషాణ గుర్తులకును గల భేదా – గమనిక.

## అధ్యాయము 6. పేజీలు 85_93

## కనీనిక రంగు

శీతోష్ణములకును కనీనికల రంగునకును గలసంబంధము – ఆరోగ్య వంతుల కనీనికలు – సంకరజాతులు – కనీనిక రంగునకును మానసిక శక్తుల కును గల సంబంధము – హోమోపతీవైద్యము, అభిప్రాయము – ఐరోపాలో నివసించువారి కనీనికల రంగులు వారి మనోవికాసములు – ఆరోగ్యమునకును కనీనికరంగుకును గల సంబంధము – ఒకకథ – బహిష్కారణ జరుగుచున్నప్రడు ప్రతినిధిభాగములోనిరంగు వల్చనగుట.

## అధ్యాయము 7. పేజీలు 93_103

## సాంద్రిత

సాంద్రిత లక్షణము – రకములు – లోపభూయిష్టమైన సాంద్రిత– సాంద్రిత చెప్పుటకు మందుల రంగులను, సోరామచ్చలను, కనీనిక యొక్క ఆవరణలోనిరంగును ఆధారముగా తీసికొనరాదనుట – రోగపరీక్షము చేయవిధములు – భారములు – చికిత్సాకాలములోగలుగు భేదాలు – బహిష్కారావయవములు – పరస్పర సంబంధము – రంగులభేదాలు – రోగదశలు ఆయిను – పునర్నిర్మాణము – అంతరవయవములకును ప్రతినిధి స్థానమునకునుగల సంబంధము.

## అధ్యాయము 8. పేజీలు 104-115

### బహిష్కార్యావయవములు

కనీనికలోని 7 ఆవరణలు - వివిధ బహిష్కార్యావయవములకుగల పరస్పర సంబంధము - చర్మముయొక్క ధర్మము - ఆవరణ రంగుఅంతా ఒకటిగా నుండకపోవుట - క్రింద మీద సగములు, ముందు వెనుక భాగములకు ప్రతినిధిస్థానములనుట - చర్మమును శుభ్రముగా నుంచవలెననుట - దుస్తులను యెక్కువగా వేయరాదనుట - గాలి,యెండలు,వ్యాయామముబాగా అవసరమనుట - ఆరోగ్యవంతులకు కనీనికరంగు అంతయు ఒకటిగానే ఉండుననుట.

## అధ్యాయము 9. పేజీలు 116-133

### గజ్జిమచ్చలు

సముద్రతీరవాసులలో ఈ గజ్జిమచ్చలు యెక్కువనుట - సోరా - హానిమన్ అభిప్రాయము - మందు వైద్యమువారి ఆభాస సిద్ధాంతములు రోగప్రవణత - కనీని కాని హానము హానిమన్ వ్రాతలను రుజువు చేస్తున్నదనుట - హానిమన్ వ్రాతలు - గజ్జియొక్క పుటుక - గజ్జికిని కాలికరోగములకును గల సంబంధము - కనీనికలోని యేడవఅవరణరంగు మారుట - ఒక కామెచరిత్ర - గజ్జిని అణచిపెట్టినందువలన కాలికమగు తలనొప్పి కలుగుట - చికిత్సాకాలములో తిరిగి ప్రత్యక్షమగుట - పేలయొక్క పుట్టుక - సూక్ష్మజీవులను బయటకు పంపవలసిన అవసరము - సోరాలోని అంతర్వ్రణములు పుట్టుచున్నవనుట - అంతర్వ్రణముల చికిత్సాకాలములో గజ్జి లేచుట - అంతర్వ్రణములతో చావు యెక్కువగుచున్నదనుట - మరొక చరిత్ర - స్వాస్థ్యసంకటములు కలుగుట - హోమోపతీ మందులు దేహము శుద్ధిఅయినపుడే పనిచేయుననుట - ప్రకృతివైద్య నిర్వచనము.

## అధ్యాయము 10. పేజీలు 134-161

### మందుల రంగులు

సూచన:—134 పేజీనుండి 205 వ పేజీవరకు మూడుఅధ్యాయములకు ఒక అధ్యాయముక్రిందనే ముద్రింపబడినవి 134-161 వరకును మందుల

రంగుల క్రిందను 10 వ అధ్యాయముగాను, 162 నుండి 175 వరకును మందులగుర్తులు 11 వ అధ్యాయముగాను, 176 నుండి 205 వరకును పాదరసము 12 వ అధ్యాయముగాను చేసుకొందురుగాక.

సజాతీయము, విజాతీయముల వివరణ, ఖనిజముల వాడరాదనుట- కారణము- అంతరవయవములలో పేరుకొనుట-కలర్ ప్లేటులోని బొమ్మలు 1వ బొమ్మ వివరణము- 2వ బొమ్మ వివరణము- 3వ బొమ్మ వివరణము- 4వ బొమ్మ వివరణము- 5వ బొమ్మ వివరణము- 6వ బొమ్మ వివరణము- ఇనుము- ఈలోహముతో తయారుచేయుమందులు- ఒకరికథ- ఆయుర్వేద యునానీ వైద్యములు వాడువిధము- అలోపతీ వైద్యులు వాడువిధము - అగంతుక విషీకరణము సోడియము - సేవించినందువలన కనీనికలో కనుపడుగుర్తులు- కనీనికలోని గుర్తులు వెంటనే లోపించవనుట- పొటాషియము, కాల్షియమ్, మెగ్నీషియములు, కనుపడుగుర్తులు- మందులవలన జరుగు అపకారము- గంధకము-

## అధ్యాయము 11. పేజీలు 162-175

## మందలగుర్తులు

ఖనిజములు - వీటినుండి తయారుకాబడుమందులు - తినిన మందులను మరచిపోయినప్పటికినీ కనీనికలోమాత్రము తప్పకుండా కనబడుతాయి- అంతరవయవములలో పేరుకొనుట - పాషాణము ను ఉపయోగించువిధములు - డా. లిల్లీ అభిప్రాయము - తిరుబండారములలో వాడరాదనుట- రాగిగొట్టములనుండి వచ్చిననీరును త్రాగుటవలనను కనీనికలో తుప్పురంగు కనబడుననుట - నిజర్భనములు - చర్మముల పదునుచేయుటకు వాడిన పాషాణమువలన కీళ్ళనొప్పులు వచ్చినవనుట - అయోడిన్ వలన తలనొప్పి వచ్చినదనుట - భాషాభేషజము - రసభస్మమునువాడుట - పాదరసము వెన్నుపాములోచేరి మంటలను కలుగచేయుట - పాదరసమును వాడుటచే కాళ్ళూ చేతులూ చచ్చుపడుట- దేహములోని ప్రతిచిన్నమార్పూ కనీనికలో కనబడకపోవచ్చు - పరివర్తక ఔషధములు - మందులతో రోగపదార్థమును అణచివేయుట - కాలికరోగములు యేర్పడుననుట -

## అధ్యాయము 12. పేజీలు 176-205

## పాదరసము

పాదరసముతో తయారుకాబడిన మందులువాడితే కనీనికలో కనుబడు గుర్తులు - వివిధరంగులు - పది పదిహేను సంవత్సరములకుగాని మెదడులో చేరదనుట - సవాయి రోగమును పాదరసముతో అణచివేయుట - మందులు లేకుండానే సుఖరోగములు నయమవుతాయి - పసిపిల్లలకు మందులు పోయుట - కాలికరోగములుగా మారిపోవుట - డా. రాస్ డైఫెన్ డర్ఫ్ అభిప్రాయము. నీగ్రోలలో సవాయిలేదనుట - నాగరికులలోనే గలదనుట - వీటివలననే పిచ్చి, ఉన్మాదము పుట్టుచున్నవనుట - ప్రొ. ఫారిన్ గటన్ అభిప్రాయము - డాక్టరు హెర్మన్ అభిప్రాయము - సుఖరోగములు వంశానుగతముగా వచ్చుటలేదు - పాదరసమును వాడుటవలన ముక్కు, నోరు పోవుట - పాదరసపు గనులలో పనిచేయువారి దేహములలోను పాదరసము కనుబడుట - పాదరసము వాడుటవలనకలుగు అసంఖ్యాకమగు నష్టములు - సుఖరోగములకు ప్రత్యేకమగు గుర్తులులేకపోవుట - '606' - ఒకకథ - అసందర్భపు రోగనిర్ణయమువలన పరువు ప్రతిష్టలుపోవుట - విడాకులు పుచ్చుకొనుట - పాదరసమువలన సంధివాతముతో బాధపడుట - వైద్యకళాశాలలలో చేయుబోధనలు - మందులపేర్లను పొడిఅక్షరములలో వ్రాయమనుట - పండితునితో సంభాషణ - అలోపతీ వైద్యుల ప్రకటనలు - ఇండియన్ మెటీరియా మెడికాలోనివ్రాతలు - వస్తుగుణదీపికలోని వ్రాతలు - మందువైద్యులు ఉపయోగించు విధములు - స్వాస్థ్యసంకటములలో కనబడు చిహ్నములు - దంతవైద్యుల దేహములలోనికి ప్రవేశించుట.

## అధ్యాయము 13. పేజీలు 206-222

## క్వయినా

క్వయినాను తయారుచేయు విధము- సామాన్యజనమంతా నిరభ్యంతరముగా వాడుట- చెవుకు గుడ్డి, చీకాకు, తలదిమ్ము కలుగుననుట- పాదరసము, పాషాణములతోపాటు విరివిగా వాడుట - కలిపిన మందులరంగునుబట్టి క్వయినారంగు మారుట- నాటు పండితుని అభిప్రాయము, రైల్వేలో

పనిచేయువారికి క్వయినాను యివ్వరాదనుట-ప్రమాదము సంభవించుననుట- క్వయినావలన క్షయరోగము వచ్చుట - శీతలదేశములోను నిషావస్తువులు అవసరము లేదనుట - పాశ్చాత్యులలోను చాలామంది శాకాహారులుండుట- మందువైద్యుల అభిప్రాయము- చెమటపట్టించుకొంటే చలిజ్వరము రాకుండుననుట- చలిజ్వరమును కలుగచేయు సూక్ష్మజీవులు రాత్రిపూట వ్యాప్తిలో నుండుననుట-అసందర్భమైన వాదన-క్వయినావలన నాడీవ్యాధులువచ్చుచున్నదనుట- సంభాషణ - మందువైద్యమువారి తప్పుడు నిర్ణయము- మరొక చరిత్ర- చచ్చుపడిపోవుట- క్వయినాను ఉపయోగించువిధము- ఇండియన్ మెటీరియా మెడికా వ్రాతలు-మందువైద్యులు ఉపయోగించువిధములు - ఆగంతుక విషీకరణము- అగదచిహ్నములు- క్వయినావలన కలుగు బాధలు.

## అధ్యాయము 14. పేజీలు 223-236

## అయోడిన్

అయోడిన్‌ను గల స్థానము- అయోడిన్ మచ్చల లక్షణములు- గజ్జి మచ్చలకును అయోడిన్ మచ్చలకును తేడాగలదు- కాంతిగా నుండుననుట- మిచెల్ బ్రూక్ అభిప్రాయము- మూలశక్తిని చంపివేయును- క్రియా ప్రతిక్రియల సూత్రము- మందువైద్యము క్రియాఫలితమునే ప్రధానముగా భావిస్తారు- అయోడిన్ మందులను వాడు రోగములు- అయోడిన్ మందులను వాడినందువలన కలుగు భవిష్యత్ దుష్ఫలితములు - శోషరసగ్రంథుల పరిమాణము తగ్గును- అతిమాత్రము ముఖ్యము- అయోడిన్ పాదరసమును బయటకు పంపునా? భవిష్యత్ దుష్ఫలితముల గూర్చి ఫారిన్గటన్ అభిప్రాయము- ఒక చరిత్ర- గొంతునొప్పికి వ్రాసిన అయోడిన్ వలన కూడికణత నొప్పిగానుండుట- డా. లిండ్లహారు అనుభవము- పదహారు సంవత్సరములు ప్రకృతి వైద్యము చేసినప్పటికిని గుర్తులు పోకపోవుట - న్యూమోనియాకు రాచిన అయోడిన్ పట్టువలన క్షీరస్రోతస్సులు యెండిపోవుట- అయోడిన్ వలన నపుంసకత్వము సిద్ధించుట- మందువైద్యులు వాడువిధములు- ఆగంతుక విషీకరణము- అగదచిహ్నములు- విషచిహ్నములు.

## అధ్యాయము 18. పేజీలు 266-273

## కో ల్లా ర మం దు లు



## అధ్యాయము 19. పేజీలు 273-281

## ఇతర మందులు



## అధ్యాయము 20. పేజీలు 282-308

## ప్రధాన అవయవముల రోగములు

## అధ్యాయము 21. పేజీలు 309-329

### కాలికరోగములు కనీనికలో కనుబడుగుర్తులు

రోగిచరిత్ర- స్వాస్థ్యసంకటములు - ఉబ్బసము న్యూమోనియా, ప్లూరిసీలు, స్ట్రిచినిన్ యొక్క ఫలితములు - వంశానుగతముగా వచ్చిన రోగప్రవణత- కనీనికరంగు మారుట- సంధివాతము-వాడిన మందులగుర్తులు- గజ్జిమందులు- చర్మము చచ్చుపడుట స్వాస్థ్యసంకటములు - ప్రమాదమువలన కాలువిరిగిపోవుట- కనీనికలోనిగుర్తు- మధుమేహము లక్షణములు- మూత్రపిండములు-బ్రైటురోగము- అల్బుమినేరియా-మూత్రపిండములు వడియగట్టుట-రంకురోగములు- స్త్రీ, పురుషుల అవయవములస్థితి-సవాయి, గనేరియాలు- డాక్టరు ఫ్రాంకెల్ అభిప్రాయము- డాక్టరు హెర్మన్ అభిప్రాయము- రోగిచరిత్ర- నపుంసకత్వము సిద్ధించుట- సంధివాతము- క్షయినావలన కామోద్రేకము - మరొక రోగిచరిత్ర- భర్తనుండి సుఖరోగములు సంక్రమించుట-బొక్కనాసియేర్పడుట- స్త్రీత్వము లోపించుట - రోగమునయమగుట.

## అధ్యాయము 22. పేజీలు 330-350

### నాళరహిత గ్రంధులు

దేహములోని వివిధనాళరహితగ్రంధులు - వీటినుండి ఊరుధాతువులు - పీనియల్ గ్రంధి - ఈ గ్రంధినుండి ఊరు రసము - పిట్యూటరీ గ్రంధి - థైరాయిడ్ గ్రంధులు - పారాథైరాయిడ్ గ్రంధులు - ఎడ్రినాలు గ్రంధులు - ఎడ్రినాలిన్ ధాతువు - జననేంద్రియములు - థైమస్ గ్రంధులు -థైమస్ గ్రంధికిని వృషణములకును గర్భాండములకును గల సంబంధము - కోకీగల్ గ్రంధి - కరోటిడ్ గ్రంధి - నాళరహితగ్రంధుల పరస్పర సంబంధము - రెండవ తెగవారి అభిప్రాయము - సౌజా అభిప్రాయము - పిట్యూటరీ గ్రంధిలోని భాగములు - పాదరసము యొక్క ప్రభావము - గ్రంధులను బలపరచుటకు సౌజావాదము - అవయవిక చికిత్స - పెప్సినువలన కలుగు ఉపయోగము- కంఠమాల రోగములను జంతువుల థైరాయిడ్ను పెట్టకుండ నయముచేయుట - పెప్సినుతో అజీర్ణము పోవు.

## అధ్యాయము 23, పేజీలు 351–376

## నాళరహిత గ్రంథులలోపమువలన వచ్చు రోగములు

## కనీనికలోకనుపడుగుర్తులు

థైరాయిడ్ గ్రంథులు- కంఠమాల రోగములు- నత్రజని- సున్నము ఎక్కువగు నీటిని త్రాగుటవలన కలిగినదనుట- ఈ ప్రవాదము పూర్తిగా నిజము కాదనుట- కారణము- మొదటిరకమగు కంఠమాల రోగముత్వరగా కుదురును- రెండవరకము ఆలస్యముగా కుదురును- గ్రేవ్సు రోగము- లక్షణములు- నాళరహితగ్రంథులు- ఉద్రేకమును పొందుటకు కారణము-చికిత్స- మందు వైద్యమువారి చికిత్సాపద్ధతి - వాటివలనకలుగు ఫలితములు-శస్త్రచికిత్స - థైరాయిడ్ గ్రంథుల లోపమువలన కలుగురోగములు - మరగుజ్జులు- ఫలితములు - ప్రత్యేకలక్షణములు- Myxodema రోగలక్షణములు - అడిసన్ రోగము- ప్రకృతి చికిత్సాపద్ధతులు - ఎడ్రినాల్ గ్రంధుల లోపములు- ఉపవాసముంచరాదనుట. కనీకలోకనుపడుగుర్తులు- మందువైద్య చికిత్సా పద్ధతులలోని లోపములు.

---

# కనీనికా నిదానము

## అధ్యాయము 1

## రోగనిర్ణయము

మానవ దేహములో ఎన్ని అవయవములు గలవో అన్ని అవయవములకును వేరు వేరు జబ్బులు వచ్చునని అలోపతీ వైద్యమువారు చెప్పుదురు. వీరి అభిప్రాయము ప్రకారము కంటికి సంబంధించిన జబ్బులు వేరు. కాలికి సంబంధించిన జబ్బులు వేరు. ముక్కుకు సంబంధించిన జబ్బులు వేరు. నోటికి సంబంధించిన జబ్బులు వేరు. ఇవన్నియు యెన్నటికీ కలియవు. దీనికి నిదర్శనము కావాలంటే బస్తీలలో నేమి పల్లెలలో నేమి, కంటి వైద్య నిపుణులు, ముక్కు వైద్య నిపుణులు, సుఖరోగ నిపుణులు బయలుదేరారు. వీరి అభిప్రాయము ప్రకారము యే అవయవపు జబ్బు ఆ అవయవమునకు సంబంధించినదే. ఈ జబ్బుపడిన అవయవమునకు మిగిలిన దేహమునకును యేమియు సంబంధము లేదు. అందువలననే కాబోలు స్వప్నస్ఖలనముతో బాధపడుతుంటే- జాతిద్రవములు యెక్కువగా ఊరుచున్నవి. వాటిని విడుదల చేయుట అవసరము గాన సంభోగము జరుపమంటారు అలోపతీ వైద్యులు. ఈ స్వప్నస్ఖలనమునకు అజీర్ణము మూలమని యెరుగరు. తినిన ఆహారమంతయు రక్తముగా మారుట లేదనియు, రక్తముగా మారుటకు అవసరమైన (బి.కాంప్లెక్సు పిండి వంటి) మొదటి ధాతువే స్వప్నకాలమునందు బయటకు వెడలిపోవుచున్నదనియు, తెలిసికొనరు. శ్వాసాశయక్షయతో బాధపడుతుంటే దేహములో

బలము తక్కువగా నున్నదనియు, బలకరములగు కోడిగుడ్లను, మాంసమును తినమంటారు.

ప్రకృతి వైద్యమన్ననో, దేహము నంతటినీ ఒకే సమస్త పదార్థముగా భావించును. వీరి అభిప్రాయము ప్రకారము దేహము అతుకులబొంత కాదు. దేహమంతయు ఒకే సమస్తపదార్థముగాన యే ఒక భాగమునకు జబ్బుచేసినా మొత్తమున కంతకూ జబ్బుచేసినట్లే భావించి మొత్తమునకే వైద్యము చేయవలెనంటారు. ఆవైద్యమైనా యేమంటే ఆరోగ్యసూత్రములను విధిగా ఆచరించుటయే. ఆరోగ్య విధులను ఆచరించినందువలన రోగపదార్థములకు ప్రవృత్తిలేక తనంత టదియే అంతరించును. మానవదేహములో అనేక అవయవము లున్నవి. అందులోని ప్రతి ఒక అవయవమునకును వివిధమైన జబ్బులు వచ్చును.

ఇందులోని ప్రతి ఒక జబ్బునకును అనేకములగు మందులు గలవు.

మానవ దేహమునకు వచ్చు రోగము లన్నింటిలోను కొన్ని సమానలక్షణము లుండును. కొన్ని ప్రత్యేక లక్షణము లుండును, విశిష్టలక్షణముల బట్టి అలోపతివారు రోగములను నిర్ధారణ చేయుదురు. కాలికి చేయు జబ్బులకు వాడుమందులు వేరు. కంటికిచేయు జబ్బులకు వాడు మందులు వేరు. చెవికి గలుగు జబ్బులకు వాడు మందులు వేరు. ఇన్నిరకములగు మందు లుండుటచే తొందరపడి ఏమందును వాడరు.

అలోపతీ వైద్యము చిహ్నములనుబట్టియే రోగముల నిర్ధారణ చేయును. విశిష్టలక్షణములు కనుపడువరకును ఫలానా

రోగ మని నిర్ధారణ చేయలేరు. రోగమును నిర్ధారణచేసిన తరువాతగాని మందును వాడరు. నేడు ప్రపంచమునందు అలోపతి శాస్త్రపరిశోధనకు వెచ్చింపబడు ధన మంతయు రోగములనిర్ధారణ చేయుటకే వినియోగపడుచున్నది. రోగనిర్ణయము, రోగనివారణ అనునవి రెండును వేరువేరుఘట్టములు. రోగనిర్ణయము రోగికి పరోక్షముగా మాత్రమే ఉపకరించును. ప్రత్యక్షముగా మాత్రము ఉపయోగించదు. రోగనివారణయే రోగికి కావలయును. ఏరోగమైనదీ, యెందువలన ఆరోగము అట్లువచ్చినదీ మొదలగునవన్నియు శాస్త్రమునకు సంబంధించిన ప్రశ్నలు. శాస్త్రమునకు సంబంధించిన ప్రశ్నలగుటవల్ల వాటితో వైద్యునకు యెక్కువ సంబంధ ముండును. వైద్యుడు శాస్త్రమును పరిశోధించవలయును.

రోగనిర్ణయమును గూర్చి రోగియు తెలిసికొనవలసినదే. ఎందుకంటే, తాను చికిత్స ప్రారంభించుటకు పూర్వము యేలక్షణములు గలవో, చికిత్స ప్రారంభించిన రెండు మూడు నెలలకు యేలక్షణములు తగ్గినవో తెలిసికొనిన యెడల అతనికి నమ్మకము వృద్ధియగును. చికిత్సకు సుముఖుడుగ నుండును.

నేడు వియన్నానగరములో జరుగు వైద్యశాస్త్ర పరిశోధన లన్నియు రోగములను నిర్ణయించుటకే సాయపడుచున్నవి. అందువలన రోగనివారణకై రోగులకు ఉపయోగపడక వైద్యులకు రోగనిర్ణయములకే సాయపడుచున్నవి అని ప్రఖ్యాత మందు వైద్యులే సెలవిచ్చినారు.

ఇన్నికోట్లరూప్యముల వెచ్చించి జీవితముల ధారపోసి నప్పటికినీ రోగములనైననూ సరిగా నిర్ణయించుచున్నారేమో

చూద్దాము. వీరు తమ నిర్ణయములు సరిగా నున్నదీ లేనిదీ రోగి మరణించిన తరువాతనే తెలిసికొనగలరు. ఎట్లాగంటే శవములను కోసిన తరువాత చచ్చుటకు వీరు చెప్పు కారణము లును శవములోని లోపములును సరిపోవలెను అట్లయిననే వీరి నిర్ణయము సరిగా నున్నదని చెప్పవచ్చును. శవపరీక్షాఫలిత ముల దృష్టాంతములనుగా తీసికొన్న యెడల మందు వైద్యము వారి రోగనిర్ణయపద్ధతి ఎంత అధోగతిలో నున్నదీ చెప్ప గలము.

డాక్టరు కాబట్ గారు సుప్రసిద్ధ మందు వైద్యులు. వీరు చాలా సంవత్సరములు మెసాచుసెట్స్ జనరలు ఆసు పత్రిలో శస్త్రవైద్యులుగా పనిచేసినారు. ప్రపంచములోని పెద్ద ఆసుపత్రులలో యిది ఒకటి. వీరేమన్నారంటే మనము నిర్ధారణచేయు రోగమునకును దేహములోని రోగమునకును యేమీ సంబంధము లేదు. దేనితో దేనికే దారిది. నూటికి యేబదిమూడు కేసులలోనే మనము చెప్పునవి సరియగు చున్నవి. మిగిలిన నలుబదియేడు కేసులలోనూ మన ప్రయత్న మంతా వ్యర్థ మగుచున్నది. మన ప్రయత్నములు వ్యర్థ మగుటయేగాక రోగికి అపకారము జరుగుచున్నది." అన్ని వసతులూ గల పెద్ద ఆసుపత్రిలలో జరుగు రోగనిర్ణయమే యింతసందిగ్ధముగా నుంటే మామూలు వైద్యుల రోగ నిర్ణయము యెంత అధోగతిలో ఉండేది వేరుగా చెప్ప బనిలే దని కాబట్ గారే సెలవిచ్చారు. వైద్యుల కందఱకును తాము చేయు నిర్ణయములు సరిగావని తెలుసును. కాని సత్యము చెప్పిన యెడల తమ వద్దకు రోగులు రారనియు,

ధనము లభించదనియు, భయపడి అసలు విషయమును చెప్పరు. ఈవైద్యవరు లందఱును తోడుదొంగలే.

అలోపతీ వైద్యములోవారి రోగనిర్ణయము యెంత సందిగ్ధముగా నుండేవీ తెలియగలందులకు 'ఫిజికల్ కల్చర్' లోని ఒక చిన్నకథను వివరిస్తాను. బెర్నార్ మాక్ఫెడన్ గారు యీ మాసపత్రికకు సంపాదకులు. రోగము నిర్ధారణ చేయుటకు ఒక రోగిని యేడుగురు స్పెషలిస్టుల దగ్గఱకు పంపారుట. ఈ యేడుగురు వైద్యవరులును ఆరోగికే యేడురోగములున్నవని నిర్ధారణ చేసినారు. ఎవరికి తోచిన విధముగా వారు సెలవిచ్చారు. ఒకేరోగికి ఒకే రోజున యేడు రోగము లుండుటకు వీలు లేదుగదా! ఈ యేడుగురు బుద్ధిమంతులకును యేడు రోగములు కనబడినవి. అసలు ఉన్నరోగము యీయేడింటిలో యేఒకటియు గాదు.

మందువైద్యమువారి రోగనిర్ణయము యెంత ఆభాసముగా నుండునదీ తెలిసికొనుటకు యీ క్రింది వాక్యములు బాగుగా సహాయకారులగును. డాక్టరు సి. యల్. వీలరుగారు అమెరికన్ వైద్యమాసపత్రికకు సంపాదకులు మందువైద్యము వారి రోగనిర్ణయ పద్ధతిని గూర్చి వీ రీక్రిందివిధముగా సెలవిచ్చారు. 'అమెరికాలోనున్న డాక్టర్లందరును పిచ్చివారే. తాము పిచ్చివాళ్ళమని ప్రతిడాక్టరునకును తెలుసును. ఎందుకంటే తాము చెప్పురోగమునకును ఉన్న రోగమునకును యేమియు సంబంధము లేదు. ఈ సంగతిని విని తెలియని వాళ్లు ఆశ్చర్యపడవలసినదే గాని డాక్టర్లెవరును ఆశ్చర్యపడరు.'

రోగనిర్ణయమే యింత అధ్వాన్నముగా నుంటే యీ నిర్ణయముల నమ్ముకొని వారిచ్చు మందులన్నియు యెట్లుండునదీ చెప్పపనిలేదు. రోగ నిర్ణయము సరిగా నున్నదీ లేనిదీ తెలిసికొనుటకు పరీక్షయే ప్రమాణము. చావుకూడా అవయవము లన్నియు తూట్లు పడిన తరువాత వచ్చుదశ. ఈలోగా యేమిజరుగునదీ చెప్పలేము. నిన్నా, నేడూ యక్సరే పరీక్ష వచ్చినది. ఇందులోనూ గడ్డలుమాత్రమే కనుపడును గాని అంతకంటె ముందుదశలు తెలియవు. ప్రకృతి సూత్రములను విస్మరించుటచేతనే మానవకోటి యీ బాధల పడుచున్నారను ప్రకృతి వైద్యవాదమును మందు వైద్యులు ఒప్పుకోలేరు. ఒప్పుకోరు. దేహమునకు మంచినేచేయు రోగములను కృత్రిమమార్గములద్వారా అణచిపెట్టుటచేతనే మానవకోటి ఈ బాధల పడుచున్నారని మందువైద్యులు ఒప్పుకోనంత వరకు వారి నిర్ణయము అధోగతిలో పడవలసినదే.

మరొకచిత్రమేమంటే—రోగము ఫలాని కారణము వలన వచ్చినదని ప్రకృతి వైద్యులు చెప్పిననూ వీరు వినరు. ప్రకృతి చికిత్సకులు పిచ్చివారని ప్రచారము చేస్తారు. రాజ్యాధికారము మందు వైద్యుల చేతులలో నుండుటచే వీరలు ప్రకృతి చికిత్సకుల కొంపతవేస్తారు. పొరపాటున యేఒక్కరోగైనా వీరిచేతులలో చచ్చినా వారల రచ్చకీడ్చి నానాహంగామా చేస్తారు. మందు వైద్యులచేతులలో చచ్చురోగులకు అంతూ, పొంతూ లేదు. నోరెత్తకుండా ఈశవమును భూదేవి నెత్తిన కొట్టుతారు. వారు—ఆ శవములు లేచివచ్చునప్పుడుగదా వీరిమీద చర్య తీసికొనేది! (అదీ లేదు, ఇదీ లేదు.)

ఇంతమంది చస్తున్నారెందుకయ్యా అంటే యీచావుల నుండి శాస్త్రమును తెలిసికొని మానవకోటికి ఉపకారమును చేస్తామంటారు. వెనుకటికి హెన్రీ లిండ్లహారుగారు ఒక సంగతి చెప్పారు. 'The operation is a grand success- but the patient died.' ఆ ప రే ష ను బాగా జరిగినదటగాని (ఆపరేషను అయిన తరువాత) వైద్యుడు చేతులు కడిగికొన్నాడో లేదో రోగి చచ్చాడట. ఇది ఎట్లాఉన్నదంటే కేసు ఓడినా ప్లీడరు బల్లమాత్రం బాగా గ్రుద్దినాడట. దావా ఓడిన తరువాత ప్లీడరు యెట్లాగుద్దితేనేమి? ఆపరేషనువలన రోగి ఉపకారమును పొందవలెగదా! రోగియే చచ్చిన తరువాత ఉపయోగమును పొందున దెవరు?

మందువైద్యము వారి రోగ నిర్ణయము వలనగాని, మందులవలనగాని ప్రజలకు యేమీ ఉపకారము జరుగుట లేదని మహామహులు అందరును ఒప్పుకొనుచున్నారు. మందు వైద్యము, లాబోర్టులు రూపుమాసిపోతే దేశమున కేమియు నష్టము కలుగదని మహాత్మాగాంధీగారే సెలవిచ్చారు.

జర్మనీ మొదలగు ఐరోపా దేశములలో మందువైద్యమునందు సామాన్యప్రజలకే యేవగింపు కలిగినది. ఆస్పత్రుల చుట్టూ తిరిగి, తిరిగి రోగములు నయముగాక వేసారిపోవుచున్నారు. ప్రజల ఒత్తిడిని భరించలేక ప్రభుత్వము వారు సైనిక, నావికా శాఖలలో ప్రకృతివైద్యపద్ధతులను మొదలు పెట్టినారు. విదేశప్రభుత్వము మనల పాలించుచుండుటచే మనకు అవకాశము దొరకలేదు.

దీనికి సాదృశ్యముగా టీకాల విషయము చూద్దాము.-విదేశములలో టీకాలు వేయించుకోవలెనను నిర్బంధము లేదు.-మన దేశమందన్ననో టీకాలు వేయించుకోము అంటే శిక్షిస్తారు. టీకాచీములో యేమి బంగారమున్నదీ మీకు తెలియని విషయముకాదు. రోగనిర్ణయము ప్రకృతి వైద్యమునకును అవసరమే. మందువైద్యమున కున్నంత అవసరము మాత్రము లేదు. అంత ప్రధానముగాదు. రోగి, వైద్యులిద్దరిలోనూ రోగనిర్ణయము రోగికి పరోక్షముగా సహాయకారియగును. వైద్యునకు మాత్రము ప్రత్యక్షముగా సహాయ కారియగును. ఎట్లాగంటే- ఫలానా అవయవములో లోపమున్నదని తెలియగానే ఆ అవయవముమీాద యెక్కువగా ఉపయోగించు రంగును వాడును (ఇది రంగువైద్యమునకు సంబంధించిన విషయము) ఇంతేగాక మరొకవిధముగాను ఉపయోగకారియగును. రోగి వ్యాయామము చేయగల్గినయెడల లోపమున్న అవయవమునకే వ్యాయామము కలుగచేసినయెడల రోగపదార్థము పోవుటచే ఆ అవయవము శక్తివంతమగును.

ప్రకృతివైద్యములోనూ పెక్కురోగనిర్ణయ పద్ధతులు గలవు. అందులో ముఖ్యముగా మూడింటిని గూర్చి తెలిసికొందాము. అవేవన (1) ముఖవైఖరీవిద్య (2) కశేరుకానిదానము (3) కనీనికా నిదానము. ఈ మూడింటిలో ముఖవైఖరీ విద్యనుగూర్చి శ్రీయుత పుచ్చా వేంకటరామయ్యగారి తోటివైద్యము విపులముగా చెప్పను. కశేరుకా నిదానమును గూర్చి ఆంగ్లమున పెక్కు గ్రంథములు గలవు. తెలుగున ఒక్కటియు లేదు. కనీనికా నిదానమన నేమో, మిగిలిన నిదా-

నములకును యీ నిదానమునకును యేమి తేడా గలదో తెలిసి కొందాము.

కన్నులో తెల్లగుడ్డు నల్లగుడ్డు రెండునూ ఉండును. నల్లగుడ్డులో కనుపాప (దీనినే బింబమని యందురు) పోను మిగిలిన భాగమునకు కనీనిక యని వాడినాము. కనీనికలో బింబము ఉండును. గాని బింబములో కనీనిక ఉండదు. 'కనీనిక' అను శబ్దమును యెచ్చట వాడినను పైన చెప్పిన విధముగానే మా చదువరులు అర్థము చేసికొందురు గాక! ఈ కనీనికను బట్టి దేహములలోని మారుమూల అవయవములలో గూడా యేమిలోపమున్నదీ యెట్లు తెలిసికొనేదీ యీ గ్రంథములో తెలిసికొందాము.

ముఖవైఖరీవిద్యవలన ముఖమును చూచియే రోగమును చెప్పవచ్చును. రోగి చేతిని ముట్టుకొనవలసిన పని లేదు. తల దేహమునకు మధ్యనుండక ఒకప్రక్కకు వాలినయెడల ఫలానా ప్రక్కన రోగపదార్థ మున్నదని చెప్పవచ్చును. ఆరోగ్యవంతుని తల ముందు, వెనుకలకు గాని, కుడిప్రక్కకు గాని, యెడమ పక్కకుగాని, వంగదు. దేహమునకు సరిగా నడిమయందుననే ఉండును.

దేహములోని కుడి, యెడమ భాగములు రెండును సమానముగా పెరిగిన యెడల తల వెన్నుపాముతో బాటే నూటిగా నిలబడి ఉండును గాని ఒకప్రక్కకు ఒరగదు. అట్లు గాక దేహములో అనురూప్యము లేక, ఒకప్రక్క నెక్కువగా పెరిగినయెడల ఆభాగపు బరువును మోయుటకు (to keep the balance) తల రెండవ ప్రక్కకు ఒరుగును. దేహములోని

యెడమభాగము కన్న, కుడిభాగ మెక్కువగా పెరిగిన యెడల తల ఎడమ వైపుకు వాలును. దేహములోని ఎడమభాగము, కుడిభాగముకన్న యెక్కువగా పెరిగిన, తల కుడి ప్రక్కకు వాలును. కొన్నికేసులలో, కుడిపార్శ్వము యెక్కువగా పెరుగు టయు, తల కుడిప్రక్కకే వాలుటయు గలదు.

దేహములోని ఒక భాగము యెందుకు యెక్కువగా పెరిగినదంటే రోగపదార్థము ఆ భాగములో చేరుట చేతనే యెక్కువగా పెరుగును. ఒరగబడి నడచుటవలననూ రోగ పదార్థము అచ్చటనే చేరును. ఒరగపడి కూర్చొనుటవల ననూ కావచ్చును. ఒకే ప్రక్కను పడుకొనుటవలననూ కావ చ్చును. పితృయముగా సంక్రమించిన రోగపదార్థమువలననూ ఒక భాగము హెచ్చుగా పెరుగును.

తల కుడిప్రక్కన వాలిన దనగానే ఎడమ ప్రక్కఉన్న అవయవము లన్నియు కొద్దిగనో గొప్పగనో చెడినవనియే గ్రహించవలయును. ఎడమ ప్రక్కఉన్న అంతరవయవము లనగా, సరళాంత్రములోని సగభాగము, అధోముఖాంతరము, మూత్రపిండము, ప్లీహము, ఊపిరితిత్తి, జీర్ణకోశము, హృదయము కోశములు మొత్తముమీద తమ పనిని సరిగా నిర్వహించుచు చుండవు. తల యెడమ వైపునకు వాలినయెడల కుడివైపున ఉన్న అవయవములు తమ పనిని సరిగా నిర్వహించుట లేదని తెలిసికొన వలయును. కుడిప్రక్కన ఉన్నఅవయవము లనగా ఊపిరితిత్తి, లివరు, మూత్రపిండము, ఊర్ధ్వ ముఖాంత్రము, సరళాంత్రములోని సగము మొత్తము మీద తమ పనిని చేయుటలేదనియే చెప్పవలెను. అట్లనే పురో

భారము ఉన్నపుడు ముందున్న అవయవములు అనగా కన్ను, ముక్కు, పళ్లు, మూత్రకోశము చెడినవనియు, పృష్ఠభార మున్నప్పుడు వెనుకఉన్న అవయవములు అనగా మలకోశము, జననేంద్రియములు, మూత్రపిండములు, నాడీమండలము, మెదడు చెడిన వనియు మనకు తెలియును. అట్లనే మిశ్రమ భార మున్నపుడు దేహములోని అవయవములన్నియు మొత్తము మీద చెడినవని తెలిసికొనవలయును.

ఈ ముఖవైఖరీ విద్యానిదానము వలన కుడిప్రక్కగాని యెడమ ప్రక్కగాని ముందు గాని, వెనుకగాని ఉన్న అవయవ ములు మొత్తముమీద చెడినవనియే మనకు తెలియును. కుడి ప్రక్కగాని, యెడమప్రక్కగాని ఉన్న అవయవములలో ఏ ఒక అవయవము యెంతవరకు చెడినదియు మనకు తెలియదు.

ఇంతవరకు ముఖవైఖరీ విద్యనుగూర్చి తెలిసికొన్నాము. ఇకను కశేరుక యన నేమో, కశేరుకకును దేహమునకును ఏమి సంబంధము గలదో తెలిసికొందాము. కశేరుక యనగా వెన్నుపాము. దేహము మొత్తమునకును వెన్నుపామునకు సంబంధ ముండుటచే వెన్నుపాములోని వంపులకును అంతరవ యవములలోని లోపములకును సంబంధ ముండును. వెన్ను పాము దేహమునందలి ఉరము, ఉదరము, శిరస్సును, చేతులను నిలబెట్టును. దేహమునుభరించు భాగముగనేగాక దేహక్రియలో ప్రధానమైన క్రియలకు యీ వెన్నుపామే ముఖ్యమైన భాగమగును. వెన్నుపామునకుమధ్యగా ఒక కాలువయుండును. మెదడుతో చేరిన యీ కాలువగుండా నాడీశక్తి ప్రవ హించుచుండును. ఈ నాడీశక్తియే దేహము నందలి వివిధ

మగు చలనముల కెల్ల హేతువు. ఈ నాడీ శక్తితో సంబంధము లేకుండ దేహమునం దెట్టి స్వల్పమగు కదలికయు కలుగదు.

మెదడునుండి నాడీతంతువులు (తీగెలు) ఈ వెన్నుపూసలోనుండి ప్రవహించు చుండును. ప్రతి వెన్నుపూసలో నుండియును రెండేసి నాడీతంతువులు శాఖలుగా చీలి దేహముయొక్క కుడి, యెడమలకు వ్యాపించును. అచ్చట నుండి అవి కోటానుకోట్లగు శాఖలుగాచీలి దేహము నందలి ప్రతి భాగమునకును వ్యాపించును. వెన్నుపామును ముందు వెనుకలకును ప్రక్కలకును త్రిప్పునపుడును. వలయాకారముగ ద్రిప్పునపుడును మెలివేయునపుడు ఆ నాడీసంహతుల కెట్టి ఆపదయు కలుగకుండునట్లు వెన్నుపూసలు నిర్మింపబడినవి.

వెన్నుపూసలు తమ తమ స్థానములలో సరిగానుండక పోవుట వలనను, మాలిన్యములు చేరుట వలనను, చుట్టుప్రక్కల నుండు ధాతువుల యందును, అవయవములయందును సరియైనసమరసత లేకుండుటవలనను అనేక వ్యాధులుగలుగును.

కశేరుకానిదానము ముఖ్యవైఖరీ విద్యకన్న యే అంతరవయవము చెడినదీ సూక్ష్మముగా చెప్పును. వెన్నుపాములో 31 పూసలుఉండును. ప్రతి ఒకపూసనుండియు రెండుజతల నాడులు కుడికిని, రెండుజతల నాడులు యెడమకును పోవును. ఫలానా వెన్నుపూసనుండి బయలుదేరిన నాడులు ఫలానా అంతరవయవము యొక్క కదలికకు ఉపయోగపడునని మనకు తెలియునుగాన ఒక పూసలో వంపు కనబడగనే దానికి సంబంధించిన అంతరవయవము చెడినదని తెలిసికొనవచ్చును. వెన్ను

ఫ్రూసల సందున ఉన్న కాళీ హెచ్చుతగ్గులనుబట్టి యేఅంత రవయవములు చెడినదియు చెప్పగలము. ఫ్రూసల చ్యుతులను బట్టి యేఅంతరవయవము యెక్కువ పనిచేయుచున్నది, తక్కువ పనిచేయుచున్నదియు చెప్పగలము.

కశేరుకానిదానమువలన అంతరవయవములోని లోప ములను కొంతవరకు సూక్ష్మముగా చెప్పవచ్చునుగాన ముఖ్యమైన ఖరీవిద్యకన్న కశేరుకానిదానము ఒకడుగు ముందుకువేసినదని చెప్పవచ్చును. పైనచెప్పినరెండు నిదానములకన్న కనీనికానిదా నము వలన యేఅంతరవయవము యెంతగాచెడిపోయినదీ చెప్ప వచ్చును. దేహములోని అన్నిఅవయవములకును కనీనికలో ప్రతి నిధి స్థానములు గలవు. ప్రతి అవయవమునకును ప్రత్యేక భాగ ముండుటచే ఆభాగములో కనుపడు గుర్తునుబట్టి ఆభాగమునకు సంబంధించిన అవయవము యెంతగా చెడినదీ చెప్పగలము. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించుటచేత అంతరవ యవములు బాగుపడుటయు (కనీనిక రంగుమారుటవలన) కనీ నికలో చూడగలము. ఈ నిదానమువలన చిన్నప్పుడు త్రాగిన పాదరసము దగ్గరనుండి, అన్ని ఆశలు వదలుకొని పోసిన వచ్చి గరగడమునరకు గల మందులనన్నిటినీ కనీనికలోచూచి చెప్ప గలము. ఏ రోగమునకు యేమందును వాడినదీ చెప్పవచ్చును. ఆమందులు యేఅవయవములో చేరినదీ చెప్పగలము. ఆమం దులవలన కల్గిన, కల్గుతరువాతిఫలితములను (After effects)ను చెప్పగలము.

ఈనిదానసహాయముతో అప్పుడేకల్గిన శిశువు ఒళ్లును చూచి తల్లిదండ్రిల ఆరోగ్యమును చెప్పగలము. తల్లిదండ్రు

లలో యేఅంతరవయవము యెట్లున్నదియు చెప్పగలము. శిశువు (General health) మామూలు ఆరోగ్యము యెట్లుండు నదియు, మూడుమూడురోజులకు జ్వరమువచ్చునదియు, రాని దియు, చెప్పగలము. ఈనిదానములోని ప్రజ్ఞావంతులు దేహ ములోని అంతరవయవములను తమ భౌతికనేత్రములతో ప్రత్యక్షముగా చూడగలరు.

మందువైద్యము మాదిరిగా యిదేమీ ఊహాశాస్త్రము గాదు. ఊహాశాస్త్రమైనయెడల దేహములోని ప్రతిమార్పు కనీనికలో కనబడదు. ప్రత్యక్షశాస్త్రములలో యిదియొకటి. రూపాయికి పదునారుఅణాలని యెట్లుచెప్పగలరో అటులనే కనీ నికను చూచి ఫలాని అంతరవయవము యింతగా చెడినదని చెప్పగలము. ఈ నిదానసహాయముతో యెక్సు రే పరీక్షకన్న యినుమిక్కిలిగా అంతరవయవములోని లోపముల చెప్పగల మనుట అతిశయోక్తిగాదు.

నేడు ప్రతివారినోటనూ ఒకటేప్రశ్న వినబడుచున్నది. అన్నిటికీని ఒకటే చికిత్స చెప్పుచున్నారుగదా! చికిత్సాద్వైత మును బట్టి యిదిమంచిదే. కానీ చికిత్స ప్రారంభించుటకు పూర్వము అంతరవయవములస్థితికిని, చికిత్సామధ్యకాలములో అంతరవయవముల పద్ధతికిని గలతేడా తెలిసికొనుటకుమీ వైద్య శాస్త్రములో విధానములు లేవు గావున తెలిసికొనలేరు. అలోపతీ వైద్యమందన్ననో రక్తమును పరీక్షచేయుదురు. కళ్లెను పరీక్షచేయుదురు. మూత్రమును పరీక్షచేయుదురు. పురీషమును పరీక్షచేయుదురు. ఈపరీక్షలను చికిత్సప్రారంభించు టకు పూర్వమును, తరువాతను చేయుదురు గాన, ఆపరీక్షా

ఫలితములబట్టి అంతరవయవముల స్థితిని చెప్పగలరు. ఈపరీక్షల వలన రోగ స్వభావము వైద్యునకు తెలియును. ఈ పరీక్షా ఫలితములవలన రోగము నయమగు చున్నదను నమ్మకము రోగికి కలుగును. ఫలితములు అనుకూలముగా నున్నయెడల రోగి చికిత్సకు సుముఖుడుగానుండును. రోగము త్వరలో నయమగును.

ఇంతవరకు వీరి ప్రశ్నలన్నియు సమంజసములే. కాని కనీనికానిదానము వెలువడినదిగాన యిక నీ ప్రశ్నలకు తావు లేదు.

మొత్తముమీద చెప్పవలెనంటే ముఖముమీది ప్రతి చిన్నమచ్చా అద్దములో యెట్లుకనబడునో అటులనే దేహము లోని ప్రతిలోపమున్నూ కనీనికలో కనబడును. అందువలననే ఒంట్లోరోగము కంటిలో (కనీనికలో) కనుబడునందుము.

---

## అధ్యాయము 2

---

### పుట్టుపూర్వోత్తరములు.

ఇంత మహత్తరమైన నిదానమును తెలిసికొనుటకు ముందు యీనిదానమును కనుగొనిన డాక్టరు గారినిన్నీ, వారి అనుయాయులనున్నూ తెలిసికొనుట యుక్తముగాన వారిని గూర్చి తెలిసికొందాము.

హంగరీదేశమునకు బుడాపెస్టు రాజధాని. వాన్ పెక్ జెలీ బుడాపెస్టులో జన్మించెను. ఒకరోజున ఈపిల్లవాడు అక

స్మాత్తుగా యీ నిదానమును కనుగొనెను. పది సంవత్సరముల ప్రాయమునవే వీ రీ నిదానమును కనుగొనుట సంభవించినది.

ఒకరోజున తోటలో ఆడుకొనుచు ఒక గుడ్లగూబను పట్టుకొనెను. ఆగుడ్లగూబ పట్టువిడిపించుకొని పోవుటకు ప్రయత్నించెను. ఈపిల్లవాడు దానిని గట్టిగా పట్టుకొనెను. ఒదిలించుకొని పోవుటకు ఆపక్షి ప్రయత్నముచేయుచుండగా దాని కాలువిరిగెను. కాలువిరగగానే, కనీనికలోని క్రిందభాగములో నల్లటిమచ్చ కనబడెను. ఈనల్లమచ్చ కనబడగనే ఆపిల్లవానికి ఆశ్చర్యముకలిగెను. ఆ విరిగినకాలును కట్టుకట్టి నయముచేసెను. నయమగు కాలములో, కనీనికలో కనబడిన నల్లటిమచ్చమీద తెల్లగీతలు కనబడెను. నయముకాగానే నల్లటిమచ్చ లోపించెను. కనీనికయొక్క మామూలురంగు తిరిగివచ్చెను.

అదివరకల్లా తెల్లగానున్న భాగము కాలువిరగగనే నల్లబడుట ఆపిల్లవానికి వింతగా తోచెను. ఈ మార్పునకు కారణమేమని తీవ్రముగా ఆలోచించ సాగెను. ఎంతఆలోచించినను కారణము దొరకదయ్యెను కారణము కనవడనికొలదిని పిల్లవాని ఉత్సాహము అధికము కాసాగెను. దీని పుట్టుపూర్వోత్తరములును, కాలువిరగగనే కంటిలో నల్లమచ్చకనబడుటకును గల సంబంధము తెలుసుకొనుటకే తనజీవితమును వినియోగించ దలచెను. ఈవిషయములో యీమహానుభావుడు కొంతవరకు కృతకృత్యుడు అయ్యెను.

ఈ హంశమును బట్టి దేహమునకు హాని కలిగించు విజాతీయమైన ఘట్టములు కంటిలో నల్లగా కనబడునని మొట్టమొదటగా ఈ మహాశయుడు ఊహించెను.

1848వ సంవత్సరములో జరిగిన హంగరీ దేశపు జాతీయ విప్లవములో ఈపిల్లవాడు పాల్గొనెను. అందువలన ప్రభుత్వము వారు నిర్బంధించిరి. కారాగారములో నుంచిరి.

జైలులోనున్న కాలమంతా యీవిషయమునుగూర్చియే విచారించుచుండెను. ఈ క్రొత్తవిషయమును వ్యాప్తిలోనికి తెచ్చుటకు కృతనిశ్చయుడయ్యెను. జైలులోనుండి బయటకు రాగానే, తాను కనుగొనిన విషయముయొక్క నిజానిజములను తెలిసికొనుటకు వైద్యశాస్త్రము అవసరమని తలంచి వైద్య శాస్త్రమును చదివెను. శస్త్రవైద్యమునందు అభిమానము చూపుచూ వచ్చెను. శస్త్రవైద్యము నభ్యసించినంతవరకును తాను కనుగొనిన క్రొత్తవిషయమునుగూర్చి పరిశోధించుచునే ఉండెను.

ఆపరేషను జరుగకపూర్వము రోగుల కనీనికలను పరీక్షించుచుండెడివాడు. మత్తుమందులనిచ్చి ఆపరేషను చేసిన తదుపరి రోగుల కనీనికను పరీక్షించుచుండెడివాడు. ఏ అవయవమునుతొలగించిన కనీనికలో ఏభాగములో యేరకమైన మచ్చ కనబడునదీ చూచెడివాడు.

ప్రమాద వశమున దెబ్బలు తగిలినపుడు, అవయవముల తెలుపు కనీనికలోని భాగములో కనుబడు గుర్తులను చూచుచుండెడివాడు. ప్రమాదవశమున కల్గిన దెబ్బలకు కనీనికలో అవయవముల తెల్పు భాగములో కనబడు చిహ్నములకును, మత్తుమందులనిచ్చి అవయవముల తొలగించినపుడు కనీనికలో కనుబడు చిహ్నములకును గల తేడాలను చూచుచుండెడివాడు.

ఈ హాంశము అందరికళ్ళలోను ఒకటిగా నున్నదీ లేనిదీ సరి చూచుచుండెడివాడు.

ఈ క్రొత్త విషయమును కనుగొని, దానికిసంబంధించిన కసీనికాపటమును తయారు చేసినతరువాత ప్రపంచములోని అన్ని దేశములవారికిని యీశాస్త్రమందు అభిరుచి కలిగెను.

తరువాత అమెరికా, ఆస్ట్రియా, స్వీడను, జర్మనీదేశములలో యీ శాస్త్రమునుగూర్చిన పరిశోధనలు పెక్కు జరిగెను. ఆయా దేశస్థులు చాలామంది తమజీవితముల యీ క్రొత్త శాస్త్ర వ్యాప్తికై వినియోగించిరి. వీరి పరిశోధనల ఫలితముగనే యీ శాస్త్రము ప్రత్యక్ష శాస్త్రములలో నొకటై ప్రకృతి వైద్య నిదానములలో కెల్ల ముఖ్యమై అగ్రతాంబూలమును తీసికొన్నది. ఈనిదానమునుగూర్చి పరిశోధనలు జరిపినవారిలో యీ క్రిందివారు ముఖ్యులు.

లైల్జిక్విష్టు: వీరు స్వీడన్ దేశస్థులు. మతప్రచారకులు. కసీనికానిదానమునుగూర్చి పెక్కు పరిశోధనలు చేసిరి. తమ జీవితము నంతను యీ శాస్త్రపరిశోధనలకే వినియోగించిరి. తమపరిశోధనల ఫలితముగా ఫలాని మందులు, ఫలాని అవయవములలో ఫలాని రంగులతో, కనబడునని చెప్పిరి. వీరు చిన్నతనములో క్వైనాను యెక్కువగా సేవించిరి. ఈ క్వైనా ఫలితముగా పెక్కుబాధల ననుభవించిరి. తాము ప్రత్యక్షముగా బాధల ననుభవించుటచేత క్వైనా యేరంగుతో యే అవయవములో కనబడునదియు చెప్పగలిగిరి. పాదరసము, పాషాణము అయోడిన్, బ్రోమిన్, యే యేరంగులతో యే అవయవములలో కనబడునదియు తెలియచెప్పిరి.

డాక్టరు ఫీలు; పాష్టరు ఫెల్కే: వీరు ఉభయులు జర్మనీ దేశస్థులు. కనీనికానిదానమునుగూర్చి పెక్కు పరిశోధనలు చేసిరి. ప్రకృతి చికిత్సకొరకై తమ జీవితమునంతను గడిపిరి.

హెన్రీ లాహన్, యమ్, డి,: వీరు అమెరికాదేశస్థులు. కనీనికానిదానమునుగూర్చి వీరే మొట్టమొదటగా ఆంగ్లమున ఉద్గ్రంథమును రచించిరి. ఇంతవరకూ వెలువడినగ్రంథములలో కెల్ల యీ గ్రంథమే గొప్పది. ఈ నిదానమును ఇంత శాస్త్ర సమ్మతముగా చెప్పు గ్రంథము మరియొకటి లేదు.

హెన్రీ లిండ్లరు, యం. డి: సుప్రసిద్ధ ఆలోపతీ వైద్యులు. మూత్రపిండవ్యాధిచే బాధపడి తీవ్రవగానక ప్రకృతిని ఆశ్రయించి రోగవిముక్తులైరి. ప్రకృతి వైద్యశాస్త్రమును శ్రద్ధగా చదివి పదునెనిమిది సంవత్సరములపాటు చికాగో నగరములో ఆరోగ్య సదనమును యేర్పాటుచేసి తాను అధ్యక్షులుగానుండి ప్రకృతివైద్యపండితులద్వారా వేలకొలదిజనమును రోగవిముక్తులను చేసిరి. కనీనికానిదానమునందు చాలా అనుభవమును సంపాదించిరి. చాలా ఉద్గ్రంథములను రచించిరి. ఇరువదవశతాబ్దపు పూర్వభాగమునందు ఈశాస్త్రములో వీరే సింహాస్తులు.

వి. యన్. డేవిడ్ సన్. యన్. డి. సజీవులు. ఎసెక్సు వాస్తవ్యులు.

డేవిడ్ సన్ ప్రకృతివైద్యకళాశాలకు అధ్యక్షులు. కనీనికా నిదానమునందు ప్రత్యేకమైన అనుభవముగలవారు. ఇరువదవ శతాబ్దములోని రెండవ భాగములో శాస్త్రమునందు అనుభవము గలవారిలో వీరే ప్రథములు.

మందు వైద్యులు మిగిలిన నిదానములను ఒప్పు కొందురుగాని యీ నిదానమును సుతరాము ఒప్పుకొనరు. ఎందుకనిన, యీ నిదానమును ఒప్పుకొనిన యెడల తమ సిద్ధాంతము లన్నియు తారుమారగును. మందువైద్యమంతా నామరూపములు లేకుండా పోవును. ఇన్నిమందులతో గాని ఇన్ని ఆపరేషనులతోగాని అవసరమే లేదు. కాస్తకూ కూస్తకూ మందులనిచ్చి తరుణరోగముల నడచిపెట్టుటచేతనే కాలికరోగములుగా ప్రత్యక్షమగుచున్నవను విషయమును నిదర్శన పూర్వకముగా తెలుపును. యుక్తాయుక్తవిచక్షణా లేకుండా ఆపరేషనుల చేయుటచేతనే మానవకోటి కాలికరోగములతో బాధపడి అకాలమృత్యువువాత పడుచున్నారను విషయమును నిదర్శనములతో చాటును.

కాస్తకూ కూస్తకూ ఆపరేషను జేసి ధనము సంపాదించుటకు వీలుపడదు, గాన మందువైద్యులు యీనిదానమును ఒప్పుకొనరు. తమ వైద్యశాస్త్రమున కంతకూ మూలమైన మాత్రజీవిసిద్ధాంతము నామరూపములు లేకుండా మాయ మగునని భయపడుదురు.

మిగిలిన సంగతులన్నీ యెట్లా ఉన్నా యీక్రిందివిషయ ములను మాత్రము అన్నివైద్యములవారునూ యేకగ్రీవముగా ఒప్పుకొనక తప్పదు.

1. కంటిని చూచి మనస్సు ఎంత నిర్మలముగా నున్నది చెప్పగలము. కంటివలన మనస్సుయొక్క నిర్మలత్వమే గాక దేహములోని అంతరవయవముల స్థితిని చెప్పగలము.

2. ప్రతిఅవయవమునకు, కనీనికలో ప్రతినిధిస్థానము

గలదు. ఒకఅవయవములో యేలోపమువచ్చినా ఆ అవయవ మునకు సంబంధించిన కనీనికాభాగములోని రంగులో మార్పు కనబడును.

3. సూక్ష్మాతిసూక్ష్మమైన నాడులు కనీనికలో చాలా గలవు. ఈనాడులతో దృఙ్నాడులకును కశేరుక నుండి బయలు దేరు రెండుజతల నాడులకును సంబంధమున్నది. దేహములో మారుమూలల నున్న నాడులన్నియు కశేరుక నుండి బయలు దేరిన రెండుజతల నాడుల శాఖోపశాఖలే. అందువలన దేహ ములోని యేమూల నాడులలోనైనా చలనము కల్గిన, కనీనిక లోని అంతర్నాడులలో ప్రతిచలనము కల్గును. కనీనికలో నాడులు, కండరములు, రక్తవాహికలు గలవు. దేహములోని నాడులకును, కనీనికలోని నాడులకును సామరస్యము గలదు. దేహములోని కండరములకును కనీనికలోని కండరములకును సామరస్యముగలదు. దేహములోని రక్తవాహికలకును, కనీనిక లోని రక్తవాహికలకును సామరస్యము గలదు. ఇట్లు సామరస్య ముండుటవలన దేహములోని ప్రతిచిన్న మార్పూ కనీనికలో కానవగును.

4. మూల గీతలద్వారాను, నిలువు గీతలద్వారాను, రంగుల ద్వారాను దేహములోని రోగప్రవణతలను, వంశాను గతముగ వచ్చినరోగచిహ్నములను కనీనికలో ప్రకృతి మనకు తెలియచేయును.

5. రంగులలోని మార్పువలన దేహములోని తరుణ, కాలికరోగములను మనము గుర్తించ గలము. గీతలస్థితినిబట్టి (అనగా Position ను బట్టి) దేహములోని అవయవములు

ప్రమాదమువలన పోయినవో లేక మత్తుమందు నిచ్చి ఆప రేషను చేయుటచే లోపించినవో తెలిసికొనవచ్చును.

6. వంశానుగతముగా వచ్చిన రోగప్రవణతలవలనను, దేహమునకు విజాతీయమైన రోగపదార్థము దేహములో పేరు కొనుటచేతనే తరుణరోగములు వచ్చుచున్నవని కొన్నివందల సంవత్సరముల క్రితమే హోమోపతి వైద్యశాస్త్రపితామహు డగు హానిమన్ మహాశయుడు చెప్పెను. పైసిద్ధాంతములోని సత్యమును యీకనీనికానిదానము నిర్ధారణ చేయుచున్నది.

7. ఈ నిదానమువలన మానవుని (General health) సామాన్య ఆరోగ్యము సరిగా నుండునదీ, లేనిదీ తెలిసికొనగలము. అంతరవయవములలోని కొన్ని మార్పులు కూడ మనకు తెలి యనగును. చికిత్సాకాలములో యెన్ని స్వాస్థ్యసంకటములు కల్గునదీ చెప్పగలము.

8. రాబోవు ఆపదలను కనీనికను చూచి ముందుగనే చెప్పగలము. ప్రకృతినూత్రములకు అనుగుణముగా జీవించిన యెడల యీఆపదలు యెంతవరకు తొలగునదీ తెలిసికొన గలము. ప్రకృతి నియమములకు అనుగుణముగా జీవించుట వలన రోగపదార్థము యే బహిష్కార్యవయవముల ద్వారా యెంత బయటకు వెడలునదియు కనీనిక రంగును చూచి చెప్పగలము. రోగపదార్థము పూర్తిగా బయటకు పోయిన యెడల కనీనికయొక్క మొదటి (అసలు) రంగు వచ్చును. క్రొత్తగా వచ్చిన రంగు మాయమగును.

ఈపై విషయముల నన్నిటినీ తెలిసికొనుటకు యీ నిదానము బాగుగా ఉపయోగపడును.

# అధ్యాయము 3

## కన్ను — భాగములు

కపీనికా నిదానమును చదువునపుడు మానవదేహము యొక్క పంచేంద్రియములలో కన్నుకుగల స్థానమును గూర్చి తెలిసికొందాము. సృష్టిజీవరాసుల అన్నిటిలోను మానవ దేహము చాలా ఉత్తమమైనది. చాలా ప్రధానమైనది. సర్వ సంపూర్ణమైనది. మిగిలిన జీవకోటిలోని కొరతల నన్నిటిని మానవదేహములో భగవంతుడు పూర్తిచేశాడు. మానవునికిగల ధన, కనక, వస్తు, వాహనము లన్నింటి కన్నను మానవునకు పంచేంద్రియములు ఆప్తమిత్రులు. ఆరవమిత్రుడును గలడని ఆధునిక మానసిక తత్వవేత్తల అభిప్రాయము. విఖ్యాత మానసిక తత్వవేత్తయగు నెపోలియన్ హిల్ తన think and grow rich అనుగ్రంథములో మనస్సుచాలాప్రధానమైన ఆరవ యింద్రియ మన్నాడు. మరొక శతాబ్దమునకు గాని ఈవిషయమును అలోపతి వైద్యము గ్రహించి, ఒప్పుకోలేదు.

పంచేంద్రియములనగానే కన్ను, ముక్కు, చెవి, నోరు, త్వక్కు, అని వెంటనే మనకు ద్యోతకమగుతుంది. కన్ను చూసేది, చూడబడేదీ చాలా ప్రధానమైనది. గాన ప్రథమ స్థానమిచ్చారు. కన్ను లేనివానికి లోకమే లేదన్న లోకోక్తి అందరకును తెలిసినదేను. చెప్పుటలోనేగాక మానవదేహము నందు ఉండుటలోను కన్ను పైస్థానముననే గలదు. ముక్కు, చెవి, నోరు అన్నీ దిగువగానే ఉన్నవి.

కన్నునకును, మనసునకును చాలా దగ్గర సంబంధ మున్నది. మనసు నిర్మలముగా నున్న యెడల కన్ను నిర్మల ముగా నుండును. వివిధమైన ఆలోచనలతో ఉంటే బుర్ర (అర్థాత్ మనసు) వేడెక్కి యుంటే కన్ను కాక యెక్కుతుంది. ఎర్రగా ఉంటుంది. దేహము బద్ధకముగానున్నదీ,ఉత్సాహముగా నున్నది కంటినిచూచి చెప్పవచ్చును. ఒళ్ళు బద్ధకముగా ఉంటే కళ్ళు మంటలుగా ఉంటాయి. కళ్లుమంటలుగా ఉన్నా యనగానే దేహములో రోగపదార్థము చేరినదని గ్రహించ వచ్చును.

ఈపంచేంద్రియములలో ఒకదానికి మరొకదానితో చాలా దగ్గర సంబంధ మున్నది. అవినాసంబంధము లేని యింద్రియము లేదన్నమాటే. నోటిలో కారపుముద్ద పెట్టుకో గానే కంటివెంబడి నీళ్ళువస్తాయి, ముక్కువెంబడి నీళ్ళువస్తాయి. చెవులు గింగురు మంటాయి. చర్మము గగుర్పొడుస్తుంది. ఇవన్నీ బయటకు కనపడే లక్షణాలు. లోపల యెంత హంగామా జరిగేదీ బుద్ధిమంతులకు తెలియనిది కాదు.

తెల్లగుడ్డు, నల్లగుడ్డును కలిసినదానిని కన్ను అందుము. ఈ కంటికి పైన, క్రింద రెప్పలు గలవు. కంటికేమియు దెబ్బ తగులకుండా ఈ రెప్పలు కాపాడును. కన్ను అనగా తెల్ల గుడ్డు, నల్లగుడ్డు కలిసి ఒకటిన్నర అంగుళము పొడవు ఉండును. అందులో నల్లగుడ్డు ప్రత్యేకము అరఅంగుళము పొడవుండును. ఈ నల్లగుడ్డులో దాదాపుగా ఒక పాతిక అంగుళము పొడవున కనుపాప ఉండును. నల్లగుడ్డులో ఈ పాపపోను మిగిలిన పాతిక అంగుళము వ్యాసరేఖకలిగిన భాగ

మునకు కనీనిక అందుము. కనీనిక యొక్క మొత్తము వైశాల్యము చతురపు అంగుళములోనూ 8 వ భాగము ఉండును. ఈ చిన్న వైశాల్యములో దేహములోని అంతర బహిరవయవముల కన్నిటికిని ప్రతినిధిస్థానము గలదు.

దేహముయొక్క మొత్తము వైశాల్యమునకును కంటి యొక్క వైశాల్యమునకును గల సంబంధమును తెలుసు కొందాము. చర్మము నఖశిఖపర్యంతము ఉండునుగాన చర్మము యొక్క వైశాల్యము తెలుసుకొన్న యెడల దేహము మొత్తపు వైశాల్యము తెలిసినట్లగును. చర్మముయొక్క మొత్తము వైశాల్యము 15 చదరపు అడుగులు ఉండునని భౌతిక శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ 15 చతురపు అడుగుల వైశాల్యము గల మానవ దేహమున కంతటకును పాతిక అంగుళపు వలయములో ప్రతినిధి స్థానములు కలిగి, ఆ యా అవయవము లోని ప్రతిచిన్న మార్పులునూ అవయవములోని ఆ యా భాగములలోని ప్రతినిధిస్థానములలో నగపడుటకన్న విచిత్రము మరొకటి కలదా!

మానవుని కన్ను కోడిగ్రుడ్డు ఆకారముగా నుండును. రెండుమూలలను రెండు కోణములు తేలిఉండును. కోతి మొదలగు మిగిలిన అన్ని జంతువుల కన్నులును గుండ్రముగానే ఉండును. మానవుని కన్నులోని కనీనిక మానవుడు మేల్కొనినపుడు కనుపడును, రెప్పలు మూసికొనిఉండుటచే నిద్రపోవునపుడు కనీనిక కనుబడదు. మానవులలో కొందరు నిద్రపోవునపుడు కన్నును పూర్తిగామూయరు. సగమే మూతురు. ఇట్లు

నిద్రపోవువారిలోను కనీనిక మొత్తమంతా కనబడదు. ఒక పాతిక మాత్రమే కనబడుతుంది.

కోతి మొదలగు మిగిలిన అన్నిజంతువులును మేల్కొని నపుడు కనీనిక కానరాదు. నిద్రపోవునపుడు మాత్రమే కనీనిక కనబడును. అప్పుడు కంటియొక్క వెలుపటిపొర మూసుకొనును.

ప్రపంచములో నుండు మానవుల కన్నులలో నుండు కనీనికలు రెండే రంగులు గలవిగా నున్నవి. మన దేశమునకు వచ్చు యూరోపియనుల కన్నులలోవలె లేతనీలపురంగు కనీనికలు ఒకరకము. మన తెనుగువారి కన్నులలోవలె (లేత) గోధుమరంగు మరొక రకము. లేతనీలపు కనీనికలో ఉండే రెండవపొరలో రంగుపదార్థము లేదు. అందువల్ల అది నిర్మలమైన ఆకాశపు రంగుగా కనపడుతుంది. ఈ కనపడురంగు కనీనికలో ఉండే లోపలిపొరల రంగై యున్నది.

గోధుమరంగుకనీనికలో రెండవపొర నిర్మలముగా నుండక గోధుమరంగుగల పొరగా నుండును. అందువలన లోపలిపొరలయొక్క గోధుమరంగే కాన్పించును.

కనీనికలరంగు పైనచెప్పిన రెండు రకములుగా నే గాక మరొక రకముగాకూడా నుండును. ఈరకము చాలా అరుదుగా నుండును. ఈ కనీనికలో లోపలగాని, పైనగాని రంగు పదార్థ ముండదు. అందువల్ల కనీనికలోనికి వ్యాపించిన సన్నని రక్తకేశనాళికలు పారదర్శకముగు యీపొరలోకూడా కాన్పించుచుండును. అందువల్ల అట్టివారి కనీనిక లేతగులాబిరంగుగా




# CHART
TO
# IRIDIAGNOSIS.

1వ బొమ్మ

నుండును. ఏది యెట్లున్నను తికమకలు కలుగకుండుటకై మనకు తరుచుగా కన్పించుచుండు గోధుమరంగు కనీనిక, లేత నీలమురంగు కనీనికయొక్క వివరమునే యీ గ్రంథమునం దంతటను వ్రాయుచున్నాను.

అందరకును తేలికగా అర్థమగుటకుగాను కన్నులోని భాగములను సాధ్యమైనంత తేలికగా వ్రాస్తాను. చెప్పినదే చెప్పుట తటస్థించినయెడల మా చదువరులు క్షమించుకొందురు గాక. కన్నులోపలి భాగమంతయు ఖాళీగానే ఉండును. లోపల యేమియు ఉండదు కంటిలోని పొరలు కన్ను సంకోచము నొందుటకును, అనగా చిన్నదగుటకును, వ్యాకోచము నొందుటకును, అనగా పెద్దదగుటకును అనుకూలమగు పదార్థముతో తయారై యుండును. కన్నంతయు మొత్తముమీద గుండ్రము గానే యుండును. ఈ బంతియొక్క వ్యాసరేఖ (Diameter) ఒక అంగుళము ఉండును. కన్నుయొక్క మొత్తము ఆవరణలో ఆరింట అయిదు భాగములు గుండ్రముగా నుండును. ఒక భాగము ముందుకు ఉబికియుండును. మొదటి ఆవరణ అనగా వెలుపలి పొరలోని ముందుభాగము మాత్రమే ముందుకు ఉబికియుండును. లోపలిపొరలు ముందుకు ఉబికిరావు.

కంటిలో మూడు పొరలు గలవు. మొదటిది బహిఃపటలము. దీనిని వెలుపలిపొర అనికూడా అనవచ్చును. దీనిని ఆంగ్లమున (Scelera) అంటారు.

రెండవది మధ్య పటలము. దీనినేమధ్యపొర అనికూడా అనవచ్చును. దీనిని ఆంగ్లమున (Choroid) అంటారు.

మూడవది అంతఃపటలము. దీనినే లోపలిపొర యనవచ్చును, ఆంగ్లమున Retina అంటారు.

బహిఃపటలము:—వెలుపలి పొర, మధ్య పొర, లోపలి పొర మొదలగు మూడు పొరలలోను వెలుపలిపొర గట్టిగా నుండును. దీనిలో పీచువంటి పదార్థముండును. కంటి లోని మొత్తము ఆవరణలో ఆరింట అయిదు భాగములు గుండ్రముగా నుండుననియు ఒక భాగము ముందుకు ఉబికి యుండుననియు లోగడనే చదివినాము. వెలుపలిఆవరణలోని అయిదు భాగములును బయటి వెల్తురు లోనికి పోవుటకును లోపలి వెల్తురు బయటకువచ్చుటకును వీలుగానుండదు. అనగా అపారదర్శకముగా నుండును. ముందుకు ఉబికిన ఆవరణ మాత్రము పారదర్శకముగా నుండును. అనగా బయటివెల్తురు లోనికి పోవుటకు లోపలి వెల్తురు బయటికి వచ్చుటకును అనుకూలముగా నుండును.

మధ్యపొరకును, లోపలి పొరకును దెబ్బతగులకుండా వెలుపలి పొర కాపాడుచుండును. కన్ను గుండ్రముగా నుండుటకును యీ పొర అనుకూలముగా నుండును.

ముందుకు ఉబికిన ఆరవవంతు ఆవరణను ఆంగ్లమున కార్నియా (Cornea) అందురు. దీనికి తెలుగు కాచబింబము. కాచబింబమునకు లోపలివైపునందు ఖాళీప్రదేశ ముండును. దానిలో జలధాతువుండును. బయటనుండి వెల్తురు ఎక్కువ తక్కువలుగాకుండా లోనికి వచ్చుటకుగాను కాచబింబము స్వచ్ఛముగాను, గాజువలె తెల్లగాను ఉండును.



CROSS SECTION OF EYEBALL

కన్నులోని భాగములు

పుట 28

3 వ బొమ్మ

ధ్యపటలములో ఈపొర వెలుపలి పొరకు లోపలగాను
ొరకు వెలుపలగాను ఉండును. ఇది సంధాయక ధాతు
యొనై యుండును. దీనిలో రక్తకణములుండును. కన్ను
ధ ఆవయవములకు కావలసిన ఆహారపదార్థము ఈ
అందజేయును. అందువల్ల ఈపొర సాధారణముగా
. ఈ పొరలోని రంగువలననే కనీనిక రంగును
ము. సంధాయక ధాతువు కండకన్న
కన్న మెత్తగా నుండును. ఈ సంధాయక ధాతువు
సూక్ష్మాతిసూక్ష్మమైన భాగములతో
యుండును. ఈ సంధాయక ధాతువు
కనీనికయు అదే రంగులో నుండును.

రెండవపొర ముందు భాగమును అనగా కాచబింబము
ముకనున్న భాగమును కనీనిక యందురు.
ముగా నుండును. ఎప్పుడును కదలుచుండును.
గల తెరమాదిరిగా నుండును. కాచబింబమునకు
జలధాతువులో ఈ కనీనిక మునిగియుండును.

రెండవపొరకు లోపలగా నున్న అద్దమునకు ముందుగా
యుండును. ఈ కనీనిక మధ్యగాను ఒకింత
మొగ్గియు సన్నని రంధ్రముండును. ఈ సన్నని
ంబముండును. కనీనికలో బింబముండును
లో కనీనిక యుండదు. కనీనిక రంగు తరచుగా
ు.

అంతఃపటలము:— దీనినే లోపలి పొరయనవచ్చును.
ంగ్లమున Retina అందురు. పెద్దమెదడులోని

భాగమున ఉండే రెండుగోళములలోను, దృష్టికేంద్రమున్నది. అక్కడనుండి రెండు దృజ్నాడులు బయలుదేరి మధ్య భాగములో X తిక్కడిగా సంధించబడి ఎడమవైపున బయలుదేరిన దృజ్నాడి కుడికంటిలోనికి, కుడివైపున బయలుదేరిన దృజ్నాడి ఎడమకంటిలోనికిని పోవును. కంటిని చేరుటతోడనే దృజ్నాడి విరివిచెంది కంటియొక్క లోపలి భాగమును ఆక్రమించుకొనును. ఇట్లు ఆక్రమించుకొనిన దృజ్నాడియే కంటికి అంతఃపటలముగా నేర్పడును. బయట నున్న వస్తువుల రూపములు కనుపాపలగుండాను దాని వెనుకనున్న స్ఫటికాకారముగానున్న అద్దముగుండాను అంతఃపటలముమీదపడును. అంతఃపటలముమీది రూపములు దృజ్నాడిగుండా మెదడునందలి దృష్టికేంద్రమునకు చేరును. అప్పుడు మనము ఆ వస్తువును చూచినట్లు అనుభవింతుము.

మధ్యపటలములోని ముందు భాగమును కాచబింబామునకు వెనుక భాగమును కనీనిక యందుము. దేహములోని ప్రతి చిన్ని అవయవమునకును కనీనికలో ప్రతినిధిస్థానము గలదు. కనీనిక యొక్క సాంద్రతను బట్టిన్ని, కనీనిక రంగును బట్టిన్ని, కనీనికలో కనుపడు గుర్తుల బట్టిన్ని దేహములోని అంతరవయవముల స్థితి యెట్లున్నది మనకు తెలియును. కనీనికను బట్టి అంతరవయవముల స్థితిని తెలుపుటకు ఈ శాస్త్రము బాగుగా ఉపయోగపడును.

అంతఃపటలములో పదునొకండు పొరలుండును.

కనీనికలో అయిదు పొర లుండును:—

మొదటిపొర ఈ అయిదింటిలోని పైపొర కాచబింబము యొక్క లోపలి ప్రక్కతో కలిసియుండును. కనీనికలోని పై పొరలో రక్తవాహికలు, శ్లేష్మపుపొర రెండును కలిసియుండును.

రెండవ పొర:— ఈ పొరమీదనే కనీనిక అంతయు ఆధారపడును. దీనిని ఆధారధాతు వందుము. ఆంగ్లమున స్ట్రోమా అంటారు.

బహుసున్నితమైనటువంటి సంధాయక ధాతువు సబంధమైన తంతువులున్ను, సూక్ష్మాతి సూక్ష్మమైన నాడులకు సంబంధించిన తాంతవ పదార్థమున్ను, వెంట్రుకలకన్న సన్నగానుండు రక్తవాహికలున్ను, శోషరస సంబంధమైన సన్నని కేశనాళికలున్ను, క్రమరహితముగా చీలియుండిన సంధాయక ధాతు సంబంధమైన శాఖలున్ను యీఆధారధాతువు నందు మిక్కిలి దట్టముగా అల్లుకొని యున్నవి. అయిదు, ఆరు రంగులు కలిగినటువంటి 200 నెంబరు నూలుతో చమత్కారముగా నేయబడినగుడ్డ యెటులుండునో అట్లనే యీ యాధార ధాతువునందు దేహమునందుండు రసధాతువు, రక్తధాతువు, నాడీపదార్థము, మెదడుకు సంబంధించిన పదార్థములు దట్టముగా నేయబడి యున్నవి. లండను రాజసభలో వివిధదేశములనుండి వచ్చిన రాజకీయప్రతినిధులు చేరియుండినపుడు ప్రపంచ మంతయు యెటుల ప్రాతినిధ్యన్యాయముచేత ప్రదర్శింపబడునో అట్లనే కనీనికలో దేహమునందలి సర్వ ధాతువులకును, సర్వ అవయవములకును ప్రాతినిధ్యము గలదు.

## కనీనికయందలి నాడులనిర్మాణము

కనీనికలోని నాడులను గురించి ప్రత్యేకముగా చెప్పవలసి యున్నది. కనీనికకు సంబధించిన కండరములన్నియు మెదడులోనుండి బయలుదేరిన మూడవకపాలనాడినుండి చీలినశాఖలచే నడుపబడుచున్నవి. దేహములోనుండే స్వతంత్ర నాడీమండలమునకు పైభాగమున ఉండే నాడీకూటము అనగా మెదడునరములకు సంబంధముగల నాడీ కేంద్రము కనీనికలోనికి పోయే పెద్ద నాడితో సంబంధము కలిగియున్నది. అందువల్ల కన్నునందలి రెండవపొర అనగా మధ్యపటలముగుండ యీనాడులు కనీనిక వరకును వ్యాపించియున్నవి. కనీనిక వెలుపటి భాగమునుండి కనుపాప వంకకు ఈ నాడియొక్క శాఖలు వ్యాపించియున్నవి. కనీనికలోని రక్తవాహికలతోను, కండర భాగములతోను యితర నిర్మాణములతోను యీశాఖలు సంబంధించియున్నవి. అందువల్ల కనీనికయొక్క పైపొరకు దిగువగా యీ నాడుల యొక్క సన్నని శాఖలు వలవలె అల్లుకొని యున్నవి. ఇట్లు అల్లుకొన్న నాడులు, కనుపాపవంక ఒత్తుగానుండి కనీనిక చివరకు వచ్చునప్పటికి పలచబడును. కనీనికయొక్క వెలుపటి అంచునుండి కనుపాపవంకకు అమర్చిన త్రికోణముల సమూహముగా నుండును. ఇట్లు యేర్పడిన ముక్కోణములయొక్క అంచులు మన దేహమునందలి వివిధ అవయవములయొక్క ప్రతినిధి స్థానములకు హద్దులుగా కనీనికలో కాన్పించును. అనగా ఒక్కొక్క ముక్కోణము దేహమునందలి ఒక అవయవమునకు ప్రతినిధిగా నుండును. స్వతంత్ర నాడీమండలముతో సంబంధించిన నాడియొక్క శాఖలే కనీనికయందలి ప్రతినిధిస్థాన



THE NERVE-SUPPLY OF THE IRIS

కనీనికలోని నాడుల కూర్పు

పుట 32 4-వ బొమ్మ

మునకు హద్దులుగా నేర్పడియుండుటవలన ఆ యా దేహభాగ ములలో కలిగిన ఆరోగ్యలక్షణములను, అనారోగ్యలక్షణములను కనీనికయందు మనము చూడగలుగుచున్నాము. దేహము నందలి వివిధభాగములలోనుండు రక్తమునందలి లోటుపాటులు కూడా కనీనికలో వ్యాపించియున్న సన్నని కేశనాళికలయందు కన్పించుచుండును. అందువలన రక్తములోనుండే శ్లేష్మము రక్తములో నుండే మాలిన్యములు, విషాలుకూడా కనీనికలో చూడగలుగుచున్నాము.

మూడవపొర:—— ప్రధానధాతువులో అట్టడుగున కనుపాపను చుట్టుకొని అంగుళములో యిరువదిఅయిదవవంతు పొడవుకలిగిన సన్నని కండరములు ఉన్నవి. బయటనుండివచ్చు వెల్తురు యెక్కువగా నున్నప్పుడు, కనుపాపచుట్టు నుండు కండరములు విరివిచెంది కనుపాపను చిన్నదానినిగా చేయును. బయటనుండివచ్చు వెల్తురు తక్కువగానున్నపుడు కనుపాప చుట్టునుండు కండరములు సంకోచముపొంది కనుపాపను పెద్ద దానినిగా చేయును ఇట్లే కండరములందలి సంకోచ, వ్యాకోచ ములవలన కనుపాప పెద్దదగుటయు, చిన్నదగుటయు సంభవించును. అయితే దైవికమగు నిర్మాణస్వభావము ననుసరించి వెల్తురు ఎక్కువైనపుడు కనుపాప చిన్నదగుటయు, వెల్తురు తక్కువైనపుడు కనుపాప పెద్దదగుటయు సంభవించును.

## కనీనికయందలి రక్తప్రసరణము

కంటిలోనికి వ్యాపించియున్న రక్తవాహికలన్నియు కనీనికయొక్క వెలుపటి అంచున ఒక పెద్ద వలయముగా నేర్పడును. ఈ పెద్దవలయమునుండి చీలిన శాఖలు కనీనిక వంకకు వ్యాపించియున్నవి. కనీనికకు మధ్యభాగమున కనుపాప ఉన్నది. కనుపాపకు చేరకమునుపే ఆ రక్తవాహికలన్నియు తిరిగి ఒక చిన్న వలయముగా నేర్పడును. ఆ చిన్న వలయమునుండి బయలుదేరిన కేశనాళికలు, కనుపాప వెలుపటి అంచువరకు వ్యాపించును. అనగా కనీనికయు, కనుపాపయు కలియుచోటు వరకును వ్యాపించును. ఈ సంగతే మూడవ పటములో చూపబడినది.

నాల్గవపొర:-దీనిని మూలాధారధాతువనవచ్చును. ఇది బలమైన సంధాయక ధాతువుతో నిర్మితమైయుండును. ఆధారధాతువనుపొర దీనిమీదనే ఆధారపడి యుండును. దీనిని ఆంగ్లమున Basement membrane అందురు.

ఐదవపొర:-దీనినే త్వచ అని చెప్ప వచ్చును. గోధుమ రంగు కలిగి త్వక్ ధర్మముకల్గిన (చర్మముయొక్క స్వభావము గల) అణువులతో ఈ పొర యేర్పడినది. బయటి వెల్తురు కనుపాపలోనుండి మాత్రమే కంటిలోపలి చీకటిగుహలోనికి ప్రసరించును. కనీనికలోని మిగిలిన భాగమును ఈ అయిదవ పొర కప్పియుంచును. అందువలన కనుపాపనుండి మాత్రమే కంటియొక్క లోపలి చీకటి గుహలోనికి వెల్తురు పోవుచు. ఈ పొరను ఆంగ్లమున Pigment layer అందురు.

---



BLOOD SUPPLY TO IRIS

కనీనికలోని రక్త ప్రసరణ

పుట 34

5-వ బొమ్మ

# అ ధ్యా య ము 4



## రో గ ము

ఇంత విచిత్రమైన శాస్త్రము, శాస్త్రసమ్మతముగా లేకపోవుట బాగుగా లేదు. ఈ నిదానము శాస్త్రసమ్మతముగా నున్నయెడల సామాన్య జనులకును దీనియందు అభిరుచి మెండగును. ఈనిదానంలో పరిశోధనలు జరుపుటకు యువకులకు ఉత్సాహము కలుగును. శాస్త్రసమ్మతముగా లేనియెడల యివన్నీ పుక్కిటిపురాణములనియు ఈ పుక్కిటి పురాణములకును శాస్త్రమునకును యేమియు సంబంధం లేదనియు సామాన్యులందఱు అనుకొంటారు. పైపై మెరుగులచూచి మోసపడు నవనాగరికులందఱును మందు వైద్యము ఒక్కటే శాస్త్రసమ్మతముగా నున్నదనియు మందుల సేవించియే రోగముల నయము చేసుకొనవలెననియు భ్రమ పడుదురు. ఈ అవాంతరములన్నియు తొలగిపోగలందులకు యీనిదాన శాస్త్రమును శాస్త్రసమ్మతముగా వ్రాస్తున్నాను. రోగములు తరుణరోగములని, కాలికరోగములని రెండురకములు. తరుణ రోగములలో రెండుదశలు కలవు. కాలికరోగములలో కూడ రెండు దశలు గలవు.

రోగపదార్థము దేహములో చేరి అంతరవయవముల బాధించుట మొదటిదశ. రోగపదార్థము చేరినది మొదలుకొని మనల బాధించుచునే యుండును. మనకా బాధ తెలియునంత వరకును రోగపదార్థము మొదటి దశలోనే అనగా అంతర్గత

దశలోనే ఉన్నదని చెప్పదుము. రెండవదశను బహిర్గతమందునా రోగ పదార్థము లోపలచేరి బాధించుట మనకు తెలియును.

ప్రకృతిరోగము ముందుగా తరుణరూపములోనే వచ్చును. అందును తరుణ రోగములోని మొదటిదశ ముందుగా కలుగును. తరువాత రెండవదశ వచ్చును. మామూలుగా యేమి జరుగుతుం దంటే- మొదటి దశలో రోగమును నిర్లక్ష్యము చేస్తారు. మొదటిదశ దాటి రెండవదశకు వచ్చునప్పటికి బయటకు బాగుగా వ్యక్తమగును. జ్వరము, పొంగు, మశూచికము మొదలగునవన్నీ యిట్లు బయటకు వచ్చినవే. ఇట్లా బయటకు వచ్చిన తరువాత తరుణ రోగముల నన్నిటిని మందులతో అణచి పెడతాము. ఇవియే కాలికరూపముతో బయటపడుచున్నవి. కాలికరూపముతో యెప్పుడైతే ప్రత్యక్షమైనవో అప్పుడే మొదటి రెండు దశలను దాటి మూడవదశ జొరబడిన దని గ్రహింపవలయును.

మొదటి రెండుదశలలోను అనగా తరుణ రోగములలో రోగపదార్థమును మందులతో అణచిపెట్టక దాని త్రోవన దానిని బయటకు పోనిచ్చిన యెడల రోగపదార్థము పోయి దేహము శుభ్రపడును. మలినము లన్నియు బయటకు పోవును. రోగపదార్థము పోవుటచే ఆరోగ్యము కలుగును. రోగపదార్థమును బయటకుపంపి దేహమునకు ఆరోగ్యమును కలుగచేయు పనిని ప్రకృతియే పూర్తిచేయును. మందులతో అణచిపెట్టక మామూలు త్రోవలన బయటకు పోనిస్తే చాలు.

కాలికరోగములలో మాత్రము ప్రకృతికి శీతలోపచారములతో సహాయము చేయవలెను. సాయము చేసిననే గాని

ప్రకృతి రోగపదార్థమును బయటకు పంపి ఆరోగ్యమును చేకూర్చ లేదు.

అమాంతముగా ఒకేసారి కాలికరోగములు వచ్చిపడవు. అడుగు, అడుగునకు రోగపదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతి ప్రయత్నము చేయుచునే యుండును. స్వాస్థ్యసంకటము లన్నియు రోగపదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతి చేయు ప్రయత్నము లే

పైన చెప్పిన దానిని బట్టి తరుణ రోగములును, కాలిక రోగములును అన్నియు ఒకటే రోగపదార్థమునుండి పుట్టు చున్న వని తెలిసికొను చున్నాము. ఈ రోగములు పుట్టుకకు కారణమైన రోగపదార్థమును బయటకు పంపివేసిన యెడల ఆరోగ్యము కల్గును. ఇదియే కూనే మహాశయుడు చెప్పిన రోగాద్వైతము - చికిత్సాద్వైతము.

రోగపదార్థము యేర్పడుటకు అనుకూలమగు పరిస్థితిని రోగప్రవణత మనెదము. ఈ రోగప్రవణత వంశానుగతముగా వచ్చునా, రాదా? అను విషయమై వాదోపవాదములు ప్రబలినవి. కొందరు రోగములు వంశాను గతముగా రావని వాదించిరి. మరికొందరు రోగములు వంశానుగతముగా వచ్చునని వాదించిరి.

కనీనికానిదానము మాత్రము రోగములు వంశానుగతముగా వచ్చు నని ప్రత్యక్షముగా ఋజువు చేయుచున్నది.

రోగము వంశానుగతముగా వచ్చునదీ, లేనిదీ కనీనికను చూచి చెప్పవచ్చును.

కనీనికరంగునుచూచి ధాతుశక్తి బాగుగానున్నదీ, లేనిదీ చెప్పగలము. కనీనిక రంగునుబట్టి దేహములో రోగపదార్థము యెంత పరిమితిలో నున్నదీ చెప్పగలము. రోగ పదార్థము ఎక్కువగా చేరుటవల్ల అంతరవయవములు యెంతవరకు తూట్లుపడినదీ చెప్పగలము.

కనీనికలో అయిదు పొర లుండునని లోగడనే చదివినాము. ఈ పొరల సాంద్రతను (చిక్కదనమును)బట్టి మొత్తము మీద ఆరోగ్యము యెట్లుండునదీ చెప్పగలము.

కనీనికలో కనుబడు చుక్కలు, మచ్చలు, గీతలవలన వంశానుగతముగా వచ్చిన రోగ ప్రవణత దేహములో యేయే అవయవములలో నున్నదీ చెప్పగలము. ఎట్లాగంటే: గర్భధారణ కాలమునందు శ్వాసాశయములలోని క్షయతో తల్లి బాధపడిన యెడల, ప్రసవించిన తదుపరి శిశువుల కనీనికను చూచిన యెడల ఊపిరితిత్తులను తెలుపు ప్రతినిధి భాగములలో బూడిదరంగు మచ్చలుగాని, గీతలుగాని కనుబడవచ్చును. (రోగములు వచ్చుట అనేక కారణములమీద ఆధారపడును గాన పైన కనబడవచ్చు నని వ్రాసినాము.)

భార్యాభర్త లిద్దరిలో యే ఒకరు రోగిష్టిగా నున్నను యావజ్జీవితమును సంగమ క్రియను నిషేధించవలసిన పని లేదు. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించిన యెడల దేహములోని రోగపదార్థము బయటకు పోవును. రోగపదార్థము వెలువడి పోగానే ఆరోగ్యము కలుగును. భార్యాభర్తలు సంగమ క్రియను జరిపి ఆరోగ్యవంతమైన సంతానమును బడయవచ్చును.

గర్భధారణ కాలమునను, ప్రసవించిన తరువాతను ప్రకృతి సూత్రములకు అనుగుణముగా తల్లి జీవించి, శిశువును కూడ తదనుగుణముగా పెంచినయెడల శిశువు సహజ వికాసముతో అలరారును. రోగములు వంశానుగతముగా రాకుండా మానవకోటికి ప్రకృతి వైద్యము చేయు ఉపకారములలో యిది యొకటి.

రోగిష్ఠులుగా వున్నవారు తమ సంతానము కూడా అనారోగ్యవంతు లగుదురని భయపడ నవసరము లేదు. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా తాము జీవించి, శిశువులను పెంచినయెడల యెటువంటి మొండిరోగములును నాశనమగును. (రోగము మాత్రము నాల్గవదశను పొందరాదు.) అనగా అంతరవయవములలోని పదార్థము లోపించరాదు. అంతరవయవములు తూట్లు పడరాదు. ప్రకృతి సూత్రము లేవో వాటి కనుగుణముగా జీవించుట యననేమో ప్రకృతి వైద్యతత్వములో గలదు.

తరుణరోగములలో ఒకటి రెండు దశలు కలవు. రోగ పదార్థములలో మంటలు పుట్టినప్పటికిని మొదటిదశలో ఆబాధ బయటకు వ్యక్తముకాదు. బాధలేనట్లుగానే భావింతుము. దీనినే తరుణరోగములోని అంతర్గత దశ యని చెప్పవచ్చును. రెండవది బహిర్గత దశ. ఈ దశలో రోగపదార్థమున్నట్లు మనకు బాగా వ్యక్తమగును. కళ్ళుమంటలు, ఒళ్ళునొప్పులు, కాళ్ళతీపు మొదలగునవన్నియు ప్రారంభించును. తనకు రోగము వచ్చినట్లుగా దేహి అప్పుడు భావిస్తాడు. వాస్తవముగా రోగ పదార్థము అంతకుముందే దేహములో

ప్రవేశించి తాను లోపల నున్నట్లు చిహ్నములు కనుపరచి నప్పటికిని దేహి ఆసంగతి గ్రహించలేకపోయినాడు. అందు వలన మొదటి దశను అంతర్గతదశయనియు, రెండవదశను బహిర్గతదశయనియు నామకరణము చేసినారు. రోగ పదార్థము తరుణరోగములోని రెండవ దశలోను, కాలికరోగములోని ఒకటి రెండు దశలలోను ఉండగా కసీనికలో యేమి గుర్తులు కనుపడేదీ తెలిసి కొందాము.

ప్రతి తరుణరోగము రోగపదార్థమును బయటకు నెట్టివేసి దేహమునకు ఆరోగ్యమును చేకూర్చును. కసువు ఊడ్చిన తరువాత ఇల్లు యేరీతిగా శుభ్రముగా ఉండునో రోగము వచ్చిపోయినతరువాతను దేహము అట్లనే ఉండును. పాత మురికంతయు బయటకు వెళ్ళిపోవును. ఈసంగతిని మనసులో పెట్టుకొని రోగము వచ్చినదనగానే గాబరాపడక రోగము మామూలుగా వచ్చిపోయే దైహిక అవస్థయని తెలిసికొని రోగపదార్థమును బయటకు పంపుటకు శైత్యోపచారములతో ప్రకృతికి సాయము చేయవలెను. ఆడవారు బైట చేరినట్లు దైహికధర్మముగా (Physiological necessity) భావించి యెట్లు ఆదుర్దాపడమో అట్లనే రోగము వచ్చినపుడు గాబరా పడవలసిన పనిలేదు.

సన్నిపాత జ్వరములో 105° డిగ్రీల వేడి ఉన్నప్పుడు ఆవేడి తగ్గగలందులకుగాను మందువైద్యులు మంచుగడ్డను రబ్బరు సంచులలోవేసి నుదురుమీద కట్టుతారు. మంటలు ఉన్నచోట్లనూ కట్టుతారు. దేహములోని వేడిని ఒకేపర్యాయముగా తగ్గించుటకుగాను చేసిన అతి శీతల ప్రయోగము

వలన అంతరవయవములలోని ఉష్ణము యెట్లు నిలబడి పోవు నదీ తెలిసికొందాము.

దేహము మీద ప్రయోగించు ప్రతిప్రక్రియ వలనను రెండు ఫలితములు కలుగును. మొదటిది క్రియా ఫలితము. దీనినే (Action) అంటారు. రెండవది ప్రతిక్రియా ఫలితము. దీనిని (Reaction) అంటారు. క్రియాఫలితముగా చలవ కలిగిన, ప్రతిక్రియా ఫలితముగా వేడి కలుగును. క్రియా ఫలితముగా వేడి కలిగిన ప్రతిక్రియా ఫలితముగా చలవకలుగును. క్రియా ఫలితముకన్న ప్రతిక్రియాఫలితము ఎక్కువ కాలము నిలవ యుండును. మంచుగడ్డను రబ్బరుసంచులలోవేసి నుదురుకు కట్టినందువలన క్రియాఫలితముగా చలవ కలుగును. ప్రతి క్రియా ఫలితముగా వేడి కలుగును. క్రియా ఫలితముకన్న ప్రతిక్రియా ఫలితము ఎక్కువ కాలము నిలవ ఉండునుగాన వేడియే యెక్కువ కాలము నిలవ ఉండును. సన్నిపాతజ్వర ములోని వేడిని ఒకే తడవగా తగ్గించుటకుగాను చేసిన అతి శీతలప్రయోగము వలన (మంచుగడ్డను కట్టుట వలన) తాత్కాలికముగా వేడి తగ్గినట్లు (పైకి తగ్గినట్లు) కను పడి నప్పటికిని, అంతరవయవములలోని వేడి అట్లనే నిలబడియుండి, ఆయా అంతరవయవముల దహించు చుండును. రోగపదార మును బయటకు నెట్టుసామర్థ్యము ప్రకృతికి పోవును. అప్పుడు రోగము కాలికస్వరూపమును పొందును.

మందువైద్యులు క్రియాఫలితమునే ప్రధానముగా తీసి కొంటారు. ప్రతిక్రియాఫలితమును ప్రధానముగా భావిం చరు. క్రియాఫలితము, ప్రతిక్రియాఫలితముల సూత్రము

ననుసరించి మందువైద్యులు వాడు మందుల వలన పరోక్షముగా రోగములే వృద్ధి యగుచున్నవి. తరుణరోగములు ముదిరి కాలిక స్వరూపమును పొందుచున్నవి. ఎట్లాగంటే రోగపదార్థమును బయటకు నెట్టివేయు సామర్థ్యమును ప్రకృతి కోలుపోవును గాన రోగము కాలికరూపమును పొందును.

ఆమాశయములో పుట్టిన మంటలను తగ్గించుటకు శస్త్రవైద్యులు ఆమాశయమునే తీసివేతురు పైన చెప్పిన మంచుగడ్డ కట్టుటవలనను, మందులు వాడుటవలనను, అంతరవయవములలోని మంటలు నిలవ యుండి ఆయా అవయవములు చచ్చుపడి పోవును. శస్త్రవైద్యులన్ననో అవయవమును నామరూపములు లేకుండా పూర్తిగా తీసివేతురు. ఇది మరీ దారుణము. సృష్టికర్త యీపనికిమాలిన అవయవమును పెట్టి మనకు అపకారమును చేసినాడని భావించి అవయవమును తీసివేతురు. గడియారములోని చిన్న ఇనుపముక్కకైనా విలువ ఉన్నదిగాని దేహములోని క్రిమికకు విలువ లేదు. క్రిమికవలన జరుగు ఉపకార మేమంటే ఊర్ధ్వ ముఖాంత్రమునకు క్రిందిభాగమున ఆమాశయ మున్నది. దీనినే క్రిమిక యందురు. జీర్ణముకాక మిగిలిపోయిన పదార్థమంతా ఊర్ధ్వ ముఖాంత్రములో చేరును. దీనినే మలమందుము. ఈ మలము ఊర్ధ్వగతిగా (పైకి) నడవవలయును. ఊర్ధ్వగతిగా నడచుటకు ఆమాశయములో ఊరిన రసము తోడ్పడును. ఆమాశయమును తీసివేయుటవలన అందులో ఊరవలసిన రసము ఊరదు. రసము ఊరదుగాన మలము ఊర్ధ్వగతిగా నడవదు, గాన నిలవఉండును. మురుగును. మురుగునుండి మంటలు

పుట్టును. ఈ మంటలే యెక్కువకాలము నిలిచిపోయిన అంత రవయవముల దహించి వేయును. రోగము కాలికముగా మారి పోవును.

మామూలుగా అందరకును జలుబు చేయును గాన యీ జలుబునుగూర్చి తెలుసుకొందాము. దేహములో నిలవ ఉన్న రాసాయనికములగు అంతా శ్వాసాశయముల ద్వారా బయటకు వచ్చుచుండును. ఇట్లు రోగపదార్థ మును బయటకు రాకుండ నల్లమందుతో తయారు చేసిన మందులను యిస్తారు ఆలోపతీవైద్యులు. ఈ మందులవలన యేమి అపకారము జరుగుతుందంటే, దేహములోని సూక్ష్మాతి సూక్ష్మమైన భాగమునకు కణమని పేరు. కణములు కొన్ని జీర్ణక్రియను జరుపును. మరికొన్ని బహిష్కరణక్రియను జరుపును. కణము పరమాణువుల సమూహము. మానవ దేహము నకు మూడు ప్రధాన లక్షణములు గలవు. 1. ప్రాణవాయువును (ఆహారమును) స్వీకరించుట; 2. మాలిన్యముల బయటకు నెట్టివేయుట; 3. పునః సృష్టిచేయుట. ఈ మూడు లక్షణ ములు ప్రతిపరమాణువునకును గలవు. జలుబు రాకుండా చేయు మందులలోని నల్లమందు బహిష్కరణను చేయు పరమాణువు లలోని బహిష్కరణక్రియను స్తంభింపచేయును. ఇట్లు స్తంభింప చేయుట వలన బహిష్కరణక్రియ తాత్కాలికముగా ఆపుచేయ బడును. ఈ మందుల వాడుట వలన చచ్చుపడిపోయిన బహి ష్కార్యావయవములు (పరమాణువుల సమూహము) తమ పనిని చేయలేవు. చచ్చుపడిపోవును. రోగపదార్థమును బయ టకు పంపు ప్రకృతిధర్మమునకు వైవిధముగా అభ్యంతరములు

కల్గును. దేహములో తయారగు రాసాయనిక మురుగు బయటకు పోక లోపలనే నిలిచిపోవును. నిలిచిపోవుటచే పరమాణువుల (అవయవముల) కదలికకు అభ్యంతరము కలుగును. ఈ విధముగా ప్రధాన కార్యకలాపమంతా ఆగిపోవును.

తరుణరోగము అంతర్గత దశనుదాటి బహిర్గతదశను పొందునప్పటికే అంతరవయవము లన్నియు చచ్చుపడిపోవును. అణువులన్నియు తమ విద్యుచ్ఛక్తిధర్మములను నిర్వర్తించ లేవు. దేహములో మూలమూలలనున్న ప్రతిచిన్న అవయవమునకు కనీనికలో ప్రతినిధిస్థాన ముండుటచే అంతరవయవములోని ప్రతిచిన్నమార్పు ప్రతినిధి స్థానములో ప్రతిబింబించును. అంతరవయవములు చచ్చుపడిపోయిన కనీనికలోని ప్రతినిధి స్థానములోని సూక్ష్మాతిసూక్ష్మమైన నాడులును చచ్చుపడి పోవును. అంతవరకు ఉన్న కనీనికయొక్క లేతనీలపురంగు, లేతగోధుమరంగు లోపించి చచ్చుపడిపోయిన నాడులకు బూడిదరంగు వచ్చును. ఇంతవరకును తరుణరోగముయొక్క రెండుదశలలోను కనీనికలో కనుపడు గుర్తులనుగూర్చి తెలిసికొన్నాము. ఇకను రోగము కాలిక రూపమును పొందినపుడు కనీనికలో కనుపడు గుర్తులను గూర్చి తెలుసుకొందాము. దేహములో తయారైన రాసాయనిక మురుగు నాసికారంధ్రములు ద్వారా బయటకు వెళ్లునప్పుడు ఊపిరితిత్తులు చెడిపోవునని నల్లమందుతో తయారుచేసిన మందుల నిస్తారు. ఈ మందులు రాసాయనిక మురుగును బయటకు పంపు పరమాణువులను స్తంభింప చేయును. అంతటితో పరమాణువులు చచ్చుపడిపోవును. మురుగును బయటకు పంపలేవు. ఇట్లు

చచ్చుపడిపోయి మూరుగును బయటకు పంపలేక పోవుటను మందు వైద్యులు రోగము నయముగుటగా చెప్పుతారు. రోగ పదార్థమునుండి అసంఖ్యాకమైన రోగములు పుట్టుచున్నవి. ఈ రోగపదార్థమే మొదటి విషము. మందులతో రోగపదార్థము బయటకు రాకుండా (మందు వైద్యులు)ఆపుచున్నారు. మందు లలోని విషము మొదటివిషమునకు తోడగు చున్నది. ఈ రెంటిసంయోగమువలన మూడవ విషముపుట్టుచున్నది. పర్యవ సానముగా యేమి తేలుచున్నదంటే - రోగపదార్థములోని విషము, మందులలోని విషము, ఈ రెంటి సంయోగమువలన పుట్టిన విషము మొత్తము మూడు విషము లగుచున్నవి. సూక్ష్మముగా చెప్పవలెనంటే కాలిలో విరిగిన ముల్లును కత్తితో తీసినట్లున్నది. పోనీ ఒకవిషమునకు రెండు విషములు తోడైనాయి. రోగపదార్థము బయటకు పోయినదా అంటే అదీలేదు. బాధ యేమైనా తగ్గినదా అంటే అంతకన్నా లేదు. ఈ సందర్భములో ఒక చిన్నకథను (జరిగినసంగతిని) చెప్పుట అప్రస్తుతము కాదనుకొంటాను.

1943 మేలో కృష్ణలంకలో జరిగిన 11 వ ప్రకృతి శిక్షా శిబిరమునకు చికిత్సకై మందడం నుండి ఒక పెద్దమనిషి (ఆయన పేరు) కోటయ్య వచ్చినాడు. తన కథను యిట్లా చెప్పాడు: "అయ్యా సంవత్సరమునుండి అతిమాత్రముతో బాధపడు చున్నాను. చేతిమీద పుండు లేచినది. ఎముకక్షయ యని గుంటూరువైద్యులు తొమ్మిది నెలల వ్రణము, దండచేయివరకు తీసివేశారు. ఇంతవరకు రు 1200లు వదలినాయి. అప్పటినుండి యిప్పటివరకు లూటీపడి చీము కారుచునే ఉన్నది. 'ఓ' అన్న

నేటికి ఏకవిరామము లేదు. నా బాధ భగవంతునకే యెరుక. చిత్రమేమంటే రు 1200లూ వదలి, చెయ్యాపోయి, తొమ్మిది నెలలనుండి బాధపడుచున్నాను. ఇంతవరకు పుండు మానలేదు."

(చికిత్సము అయినతరువాత) చీము వచ్చుట లేదు. ఎక్రి ప్రారం పడినది. బాధ చాలా తగ్గిపోయినది. తొమ్మిది నెలల నుండి పడని రోగము యీ పదిహేనురోజులలో సగము కుదిరినది. (ఈ పదిహేను రోజులలో యీమెకు చేసిన దల్లా ఆహారనియమము, మట్టిపట్టీలు). ముదుగుబయటకుపోక లోపలనే నిలచిపోవుటగాన నొప్పును. మంటలుపుట్టును. (అసలు సంగతి వదలి చాలా దూరము వచ్చాము. ఇకను కథకు పోదాము). మొదటలో ప్రారంభముగా గొంతునుండి బయటకు వచ్చిన కళ్లె ముక్కుచు పక్కటెముకలు నొప్పి పుట్టినట్లు దగ్గితే గాని బయటకు రాదు. రాత్రి అల్లా గొంతులో నిలబడిపోయిన కళ్లె ఎంతో శ్రమపడితే గాని పొద్దుటిపూట బయటకురాదు. బయటకు పోక లోపలనే నిలబడును. గాన ముదుగును, ముదుగుటలో మంటలు పుట్టును. ముదుగుటలో పుట్టిన వేడితో ఊపిరి తిత్తులు చిల్లులు పడును. ఈ గ్రంథమంతా ఒక్క ఊపిరి తిత్తులలోనే జరుగునని తలచరాదు. రోగపదార్థము దేహావయవములో చేరితే అక్కడల్లా యీ గ్రంథము జరుగును. రోగపదార్థము మధుకోశములో చేరితే అక్కడ చిల్లులు పడును. ప్లీహాములో చేరితే అచ్చట చిల్లులు పడును. మూత్రకోశములో నిలవ ఉంటే అచ్చట చిల్లులు పడును. ప్రస్తుతము రోగపదార్థము ఊపిరి తిత్తులలో చేరిన క్షయరోగము. శ్వాసాశయముల ద్వారా బయటకు పోనీక

ఆ మందులతో అభ్యంతర పెట్టబడిన రోగపదార్థము అచ్చటనే నిలిచిపోవును. ముడుగుటలో పుట్టిన వేడికి సూక్ష్మాతి సూక్ష్మమైన నాడులు కాలిపోయి చిల్లులు పడును.

దేహములోని అన్ని అంతరవయవములను కనీనికలో ప్రతినిధి స్థానము లుండుటచేతను, అంతరవయవములోని ప్రతి చిన్నమార్పు ప్రతినిధి స్థానములో కనబడుటచేతను, ఊపిరి తిత్తులలోని చిల్లులు కనీనికాప్రతినిధిస్థానములలో కనుపడును. ముడుగుటలో పుట్టిన వేడికి సూక్ష్మాతి సూక్ష్మనాడులు కాలి పోవుటచే నల్లపడును. వాటిలోని మార్దవము తగ్గిపోవును. ఎండిపోవును. ఉలితో గోకినట్లుగా కనుపడును. తరుణ రోగము యొక్క ఒకటి రెండు దశలను తెలుపు తెలుపురంగు పై విధముగా నల్లగీతలుగా కనబడును. 14 వ బొమ్మలోని మూడవ భాగము చూచినయెడల పైవిషయములు బాగా బోధపడ గలవు. దూరదర్శినీయంత్రముతో చూచినయెడల తెలుపు గీతలకన్న నల్లగీతలు పల్లముగా నున్నట్లు కనుపడును. రోగము ముదిరిన కొలది నల్లగీతలు మరీ పల్లముగా కనుపడును. చిల్లులు పడుటయు కాననగును.

## రోగము - వంశానుగతమా?

రోగములు వంశానుగతముగా వచ్చునా, రావా అను విషయమై అలోపతీ వైద్యులలో వాదోపవాదములు గలవు. కొందరు రోగములు వంశానుగతముగా రావని చెప్పుచున్నారు. మరికొందరు రోగములు వంశానుగతంగా వచ్చునని వాదించు చున్నారు. మూడవ వాదనయు గలదు. వారేమంటారంటే

రోగ నిరోధక శక్తి తగ్గిపోవుటచేతనే రోగము వంశానుగతంగా వచ్చుచున్నదని. ఇంకాకొందరు యేమంటారంటే – తల్లిదండ్రులలో నేః ఒకరిలోనైనను గర్భధారణకాలమునందు అంతరవయవములలో లోపమున్నయెడల కలుగబోవు శిశువులోకూడ అవయవములు లోపములతోనే కనబడును.

ఇంకా వివరముగా చెప్పవలెనంటే- గర్భధారణ కాలమునందు తల్లి ఊపిరితిత్తుల క్షయతో బాధపడిన యెడల కలుగబోవు శిశువులోకూడ ఊపిరితిత్తులు బలహీనముగానే ఉండును.

మిగిలిన వాదనలకన్న యీ వాదన సమంజసముగా నున్నట్లు కనీనికానిదానము స్పష్టము చేస్తుంది.

తల్లివంశము వారుగాని, తండ్రివంశము వారుగాని రోగములతో బాధపడిన యెడల ఆ యా జబ్బులు ఉన్నట్లు వారి పిల్లల కనీనికలను చూచి చెప్పగలము. కనీనికయొక్క సాంద్రత మాత్రము మొదటిరకమగు సాంద్రతగా నుండక 2, 3, 4, రకముల సాంద్రతగా నుండును. రోగపదార్థపు తీవ్రతనుబట్టి కనీనికయొక్క సాంద్రతమారును.

రోగముయొక్క వంశానుగతత్వము కనీనికసాంద్రతను బట్టియేగాక కనీనిక రంగును బట్టియు చెప్పగలము. ఆరోగ్యవంతుల కనీనికలు లేత నీలముగాగాని, లేతగోధుమరంగుగాగాని ఉండునని లోగడనే చెప్పినాము. కనీనిక లేతనీలపురంగుగా నుండక ముదురు నీలముగా నున్నయెడల దేహములో రోగపదార్థము చేరినదని చెప్పుదుము. కనీనిక రంగు చిక్కబడుట అనారోగ్యచిహ్నమేగాని, ఆరోగ్యచిహ్నము మాత్రముకాదు.

లేత గోధుమరంగు, ముదురు గోధుమరంగుకు మారుట అనా రోగ్య చిహ్నముగానే భావించవలయును. ఇంతవరకు కనీనిక యొక్క సాంద్రతను బట్టిన్నీ, కనీనికయొక్క రంగును బట్టిన్నీ రోగముల వంశానుగతత్వమును మొత్తముమీద (General) గా చెప్పినాము. రోగముల వంశానుగతత్వమును మరొకవిధము గాను చెప్పవచ్చును. ప్రతినిధి భాగములలోని చిహ్నములను బట్టియు, రోగముయొక్క వంశానుగతత్వమును చెప్పవచ్చును. ఎట్లాగంటే- కనీనికలో 36 ప్రతినిధిభాగములుండును. 36 ప్రతి నిధిభాగములలో యే ఒకదానిలోగాని రెంటిలోగాని రోగ ప్రవణత, చిహ్నములు కనబడునేమో తెలిసికొందాము. గర్భ ధారణ కాలములో తల్లి ఊపిరితిత్తులక్షయతో బాధపడుచున్న దనుకొందాము. కుడి కనీనికలోని 8, 8ని 9 భాగములు కుడి ఊపిరితిత్తిని తెలుపును. కుడి ఊపిరి తిత్తిలో మూడు అరలుండును. ఎడమఊపిరితిత్తిలో రెండు అరలే ఉండును. దేహములో హృదయము ఎడమ భాగమున ఉండుటచే ఎడమ ఊపిరితిత్తి రెండు భాగములుగానే కనబడును. చూచితిరా! కనీనికానిదానము ఎంతప్రత్యక్షమైన శాస్త్రమో. కుడి ఊపిరితిత్తిలో రోగమున్న యెడల కుడికనీనికలోని మూడు అరలలోగాని, ఒకదానిలోగాని లోపములు కనబడును. ఎడమ ఊపిరితిత్తిలో రోగపదార్థమున్న యెడల యెడమ కనీనికలో 8, 9 భాగములలో రెంటిలోగాని, ఒకదానిలోగాని లోపము కనబడును.

ఊపిరితిత్తుల క్షయతో బాధపడు తల్లిగర్భములో పెరిగిన శిశువులోకూడ ఊపిరితిత్తులను తెలుపు ప్రతినిధిభాగములు

చెడిపోయే యుండును. లోపములు కనబడును. కుడి కనీనికలో లోపములు కనబడవచ్చును. ఎడమ కనీనికలో లోపములు కనబడవచ్చును. ఇంతవరకు తల్లినుండి పిల్లలకుకలుగు వ్యాధులను, ఆవ్యాధులకు కనీనికలో కనబడుగుర్తులను మొత్తముమీదను, ప్రత్యేకంగానున్ను, తెలిసికొన్నాము.

ఇకను, తండ్రినుండి పిల్లలకువచ్చు రోగములనుగూర్చి తెలిసికొందాము. తల్లిగర్భములో పిండము తొమ్మిది నెలలు పెరుగును. కాన తండ్రిరోగములకన్న తల్లిరోగములు పిల్లలకు ఎక్కువగావచ్చును. ఇట్లాగని తండ్రిరోగములు రావనుటకు వీలులేదు. ప్రతిదేహము అనేక కోట్లకణముల సమూహము. ప్రతికణము అనేక అణువుల సమూహము. ఈ అణువులు పరమాణువుల సమూహము. దీనినే ఎలెక్ట్రాన్ Electron) అనవచ్చును మానవ దేహమునకు మూడు ప్రధానలక్షణములు గలవు. (1) మలినపదార్థమును బయటకునెట్టివేయును. (2) ఆహారమును జీర్ణించుకొనును. (3) పునఃసృష్టిచేయును. మానవదేహమునకు యే లక్షణములుగలవో యీకణమునకును ఆలక్షణములుగలవు. కణమునకుగల లక్షణములు అణువునకును, అణువునకుగల లక్షణములు పరమాణువునకును గలవు. భార్యాభర్తలిద్దఱును సంగమక్రియను జరిపినపుడు సూదిమోపినంత పరిమాణము గల శుక్లము అదే పరిమాణముగల శోణితముతో కలియును. మగవానికి యే లక్షణములుగలవో యీశుక్లమునకును ఆ లక్షణములును గలవు. ఆడువారికి యేలక్షణములుగలవో ఆ శోణితమునకును ఆలక్షణములు గలవు. భార్యాభర్తలిద్దఱిలో యేఒకరికి రోగములు కలిగినను ఆ యా శుక్లశోణితములకు ఆరోగలక్ష

ణాములుండును. ఇందువలననే తల్లిదండ్రులిద్దరిలోగల రోగములు బిడ్డలకు వచ్చినవనుట. ఈసందర్భములో ఒకరి కథను చెప్పుట అప్రస్తుతము కాదనుకొంటాను. డాక్టరు హెన్రీ లిండ్లా హార్ గారు సుప్రసిద్ధ ప్రకృతి వైద్యులు. అలోపతీ వైద్యనిపుణులు. చికాగో నగరంలో ప్రకృతి ఆరోగ్య సదనమును ఏర్పాటుచేసి ఇరువది సంవత్సరములపాటు బాధిత మానవ కోటికి సేవ చేసినారు. వీరియొక్కయు, వీరి భార్యయొక్కయు ఆరోగ్యము సరిగా లేని కాలములో వీరికి ప్రథమసంతానము కలిగినది. తలిదండ్రులిద్దరిలోగల అంతరవయవముల లోపములు యీబిడ్డకనీనికలో కనబడినవి.

ఇట్లు తల్లిదండ్రులిద్దరిలోని అంతరవయవములలో లోపములున్నప్పటికిని వీరిసంతతి కూడా యీరోగములతో బాధపడవలెనను నియమము లేదు. ప్రకృతివైద్యము యిందుకు త్రోవచూపుతుంది. పిండము తల్లిగర్భములో నున్నప్పుడును ప్రసవించిన తరువాతను ప్రకృతిసూత్రములకు అనుకూలముగా పెంచబడిన యెడల యీరోగము లేవియు శిశువును బాధించవు. అట్లుగాక ఆహార విహారములలో మార్పు రాని యెడల వీరిసంతతి అంతయు యీ బాధల ననుభవింప వలసినదే. పసిబిడ్డలలో తరుణ రూపములో కనబడిన గీతలు వయస్సు పెరిగినకొలదినీ నల్లబడుటయు, మరీ ముదరి అంతరవయవములలోని పదార్థము లోపించుటయు తటస్థించును.

అంతరవయవములలోని లోపములను మొత్తముమీద తీసికొన్నయెడల కనీనిక సాంద్రతను చెప్పగలము. ధాతుశక్తి బాగా ఉన్నదీ, తగ్గినదీ, చెప్పగలము. కనీనిక సాంద్రత ఒకటి,

రెండు, మూడు, నాల్గు రకములుగా నున్న యెడల ధాతుశక్తి క్రమముగా తగ్గును. ప్రధాన అవయవములు అనగా- హృదయము, ఊపిరితిత్తి చెడిన యెడల ధాతుశక్తి మరింతతగ్గిపోవును.

కనీనికయొక్క రంగునే ప్రధానముగా తీసికొని ధాతుశక్తియొక్క హెచ్చుతగ్గులను నిర్ణయించరాదు. అట్లనే కనీనికా సాంద్రతనే ప్రధానముగా తీసికొని ధాతుశక్తిని నిర్ణయింపరాదు. వంశానుగతముగా వచ్చినరోగచిహ్నములను ప్రధానముగా తీసికొని ధాతుశక్తియొక్క హెచ్చుతగ్గులను నిర్ణయించరాదు. 1. కనీనికరంగును, 2. కనీనికయొక్క సాంద్రతను 3. వంశానుగతముగా వచ్చిన రోగచిహ్నములను మూటినిబట్టి దేహములోని ధాతుశక్తిని నిర్ణయించవలెను.

అంతరవయవములు చెడినకొద్దీ కనీనికరంగు నల్లపడును. అంతరవయవములలో లోపమున్న యెడల కనీనిక సాంద్రత మూడు నాల్గురకములు గలదిగా నుండును. అంతరవయవములలోని లోపముల బట్టియే కనీనిక సాంద్రత మారుచుండును. కనీనికలోని సాంద్రతనుబట్టిమాత్రము అంతరవయవములు చెడవు. కనీనికయొక్క సాంద్రతలో లోపములు కనబడకుండానే అంతరవయవములు చెడుటయుగలదు.

ఎంత దేహపరిశ్రమ చేసినప్పటికినీ చుట్ట, బీడి, సిగరెట్టు పొగాకు, కాఫీ, టీ, కోకో, బ్రాందీ, సారాయిలకు లోబడిన వారు అకాలములో మృత్యువువాత బడుచున్నారు. ఈ సంగతులను ప్రత్యక్షము గాచూచుచునేయున్నాము. పరిశ్రమచేయుచున్నాముగదా, దురభ్యాసములు మనల నేమి చేయలేవనుకొనుట వట్టివెఱ్ఱితనము.

---

# అధ్యాయము 5

## గుర్తులు

దేహములో మారుమూలలనున్న ప్రతి చిన్న అవయవమునకును కనీనికలో ప్రతినిధి భాగముండునని వెనుకటి అధ్యాయమున చదివినాము. ప్రతి చిన్న అవయవమును తన పనిని తాను సంతృప్తికరముగా చేయుచున్నంతవరకును ఆ అవయవమును తెలుపు ప్రతినిధిభాగములో యేమీ మార్పు కానరాదు. ఆ అవయవము తన పనిని సంతృప్తికరముగా చేయలేనియెడల ప్రతినిధిభాగములో మార్పు కనబడును. ఈ మార్పు రెండు విధములుగా కనబడును. ఒకటి ప్రతినిధిభాగములోని రంగు మారవచ్చును. అదివరకల్లా అన్ని ప్రతినిధిభాగములలోను ఒకే రంగు ఉండును. అవయవము సరిగా పనిచేయని ప్రతినిధిభాగములోని రంగు మారిపోవును. అంతవరకు కనీనిక లేతగోధుమరంగుగా నున్నయెడల యిప్పుడు ముదురురంగు కనబడును.

ఇక రెండవ విధ మేమన ప్రతినిధిభాగములోని రంగులో మార్పేమియు రాదు. ప్రతినిధిభాగములో ఒక నల్లటి గీత కనబడును. ఒక అవయవము రెండు మూడు కారణముల వలన స్వధర్మమును నిర్వర్తించలేకపోవును. వంశానుగతముగా వచ్చిన రోగప్రవణతవలన ఒక అవయవము తన ధర్మమును సరిగా నిర్వర్తించలేకపోవును. ఉదాహరణముగా చెప్పవలెనంటే సంగమకాలమునందు తల్లి దండ్రు లిద్దరిలో యే ఒక

నైనను శ్వాసాశయక్షయతో బాధపడుచున్న యెడల కలుగ
బోవు శిశువులోను ఊపిరితిత్తులు బలహీనముగానే ఉండును.
(గర్భధారణ కాలము నందును, ప్రసవించిన తరువాతను
ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించినయెడల యీ
రోగప్రవణత అంతరించును. ఊపిరితిత్తులు బలపడును.)

అనుక్షణమును దేహములో తయారగు, బయటకు పోక
లోపలనే నిలచిపోయిన, ఘన, ద్రవ, వాయురూపమైన మలిన
ములు, దేహములోనే నిలువయుండి అంతరవయవముల కదలి
కకు అడ్డుపడుటచే అంతరవయవములు తమ ధర్మములను నిర్వ
ర్తించలేకపోవును.

తరుణ రోగములను మందులతో అణచిపెట్టుదురు.
ప్రకృతివైద్య ప్రక్రియవలన రెండు ఫలితములు కలుగును.
ఈ రెండు ఫలితములును వ్యతిరేకముగా నుండును. క్రియా
ఫలితముగా చలువ కలిగిన, ప్రతి క్రియా ఫలితముగా వేడి కలు
గును. చన్నీటి కటిస్నానమువలన క్రియాఫలితముగా చలువ
కలుగును. ప్రతిక్రియా ఫలితముగా వేడి కలుగును. ప్రకృతి
వైద్యమువారు ప్రతిక్రియాఫలితమునే ప్రధానముగా తీసికొ
నెదరు. మందువైద్యమువారు క్రియాఫలితమునే ప్రధాన
ముగా తీసికొంటారు. (వివరముల గోరువారు మాచే రచింప
బడిన 'లిండ్లహార్' అను పుస్తకమును చదువవచ్చును.) మం
దులలోని ప్రతిక్రియా ధర్మము ననుసరించి అంతరవయవములు
తమ స్వధర్మమును నిర్వర్తించలేకపోవును. చచ్చుపడిపోవును.

ప్రమాదవశమున కలిగిన దెబ్బల వలననూ అంతరవ
యవములు తమ పనిని తాము నిర్వర్తించ లేక పోవును.

ఏ అవయవము తనస్వధర్మమును నిర్వర్తించదో ఆ అవయవమును తెలుపు కనీనికా ప్రతినిధిభాగములో మార్పు కనబడును.

ఇన్ని వివరములు కనీనికలో కనబడునుగాని ఒక సంగతి మాత్రము కనీనికలో కనబడదు. గర్భము ధరించినప్పుడు ఆడువారి దేహములోని అంతరవయవముల ధర్మములు మారును. ప్రతినెలా బయటకు వెడలిపోవు ఋతురక్తము బయటకుపోక పిండమును పోషించుటకు సహాయపడును. అందులోనే కొంత భాగము పుట్టబోవు బిడ్డకు ఆహారము చేరుటకై తల్లి స్తనములందు చేరి స్థౌల్యమును కలుగ జేయును. గర్భధారణకాలమునందు కలుగు అసంఖ్యాకములగు అంతరయవముల ధర్మముల మార్పులలో నిది ఒకటి. అంతరవయవముల ధర్మములలో మార్పు కల్గినప్పటికినీ కనీకకలో మాత్రము యేమియు మార్పు కానరాదు. గర్భధారణము ఆడువారికి సహజ ధర్మము గాన కనీనికలో మార్పు కానరాదు.

మరొక అవాంతరము కూడ కలదు. క్లోరోఫారము, కొకెయిను మొదలగు మత్తుమందుల నిచ్చి ఆపరేషను చేసినప్పుడు మత్తు ఉన్నంత వరకును కనీనికలో యేమియు మార్పు కానరాదు. మత్తు తెలిసిన తదుపరి తొలగించబడిన అవయవము పోయినట్లుగా కనీనికలో గుర్తుకనబడును. ఆపరేషన్లు దేహమునకు విజాతీయ మైనవి గాన ఆ అవయవముల తెలుపు కనీనికలోని ప్రతినిధిభాగములో ఒక మూల గీత కనబడును. ప్రమాద వశమున అంతరవయవములు విరిగిపోయినయెడల ఆ అవయవ

మును తెలుపు కనీనికా ప్రతినిధిభాగములో నిలువుగీత గానీ, అడ్డగీతగాని కనబడును.

మత్తుమందు నిచ్చినపుడు దేహమంతా చచ్చుపడి పోవును. దేహమునకు కలుగు బాధలను జ్ఞాననాడులు మెదడునకు తెలియచేయలేవు. అందువలన దేహములోని మారుమూలనున్న నాడులలో కలిగిన చలనమునకు కనీనికలోని నాడులలో ప్రతిచలనము కలుగదు. అందువలన మత్తు ఉన్నంతవరకును అవయవములు పోయినట్లు కనీనికా ప్రతినిధి భాగములో గుర్తులు కనబడవు. మత్తు దిగిపోగానే దేహవ్యాపారమంతా మామూలుగా జరుగును. జ్ఞాననాడులు తమపనిని తాము చేయును. అప్పుడుపోయిన అవయవమునకు గుర్తు కనీనికలోని ప్రతినిధిభాగములో మూలగీతలు కనబడును.

దేహములో యిముడు సజాతీయమైనపదార్థము లేవియు కనీనికలో కనబడవు. కూరలలోను, పండ్లలోను ఉండు సేంద్రియ లవణము లన్నియు దేహమునకు సజాతీయమైనవిగాన కనీనికలో కనబడవు. పండ్లు, కూరలు, యెంతయెక్కువగా తినినప్పటికిని కనీనికా ప్రతినిధి భాగములలో యేమియు గుర్తులు కానరావు. భూమినుండి త్రవ్వీన ఇనుము, గంధకము, భాస్వరము మొదలగు లోహము లన్నియు దేహమునకు విజాతీయములు. వీటి స్వభావము వేరు, లక్షణములు వేరు, దేహములోని రక్తముతో యీఖనిజములనుండి తయారుచేసిన మందులు కలియవు. సారూప్యమును పొందవు. కొన్ని ఖనిజములు కొన్ని అవయవములలో చేరుకొనును. ఆ అవయవమును తెలుపు కనీనికలోని ప్రతినిధి భాగములో ఖని

జముల రంగు కనబడును. కనీనికకు సహజముగా నుండవలసిన రంగు (లేతగోధుమ, లేతనీలము) ఉండదు. రంగు మారి పోవును.

దేహములోని అంతరవయవములు యెట్లు ఒక దాని వెంబడి మరియొకటి ఉన్నవో అట్లనే కనీనికలోని ప్రతినిధి భాగములును ఉండును. ఎట్లాగంటే కనుపాప చుట్టూ నుండు యేడు ఆవరణలలోను మొదటి ఆవరణ జీర్ణాశయమును తెలుపును. రెండవ ఆవరణ చిన్నప్రేగులను తెలుపును. కనుపాప చుట్టూ నుండు మూడవ ఆవరణ స్వతంత్ర నాడీమండలమును తెలుపును. కుడికనీనికలో చిన్న ప్రేగులలో సగమును ఊర్ధ్వ ముఖాంత్రమును, సరళాంత్రములో సగమును ఉండును. ఎడమ కనీనికలో చిన్న ప్రేగులలో సగము, సరళాంత్రములో సగము, అధోముఖాంత్రము ఉండును. మామూలుగా చూచిన యెడల కుడికనీనికలో అధోముఖాంత్రము కనబడదు. మామూలుగా చూచిన యెడల ఎడమ కనీనికలో ఊర్ధ్వముఖాంత్రము కనబడదు. చిన్న ప్రేగుల చుట్టునుండు ఆవరణ అనగా మూడవఆవరణ స్వతంత్ర నాడీమండలమును దెలుపును.

మిగిలిన అవయవము లన్నియు స్వతంత్ర నాడీ మండలమునుండి బయలుదేరును. గాన మూడవ ఆవరణ తరువాతి నాల్గు ఆవరణలలోనే మిగిలిన అవయవములన్నియు ఉన్నవి. దేహ వ్యాపారమంతా జీర్ణమండలము మీదనే ఆధార పడి నది. దేహములోని మూగుమూలలనున్న కండరములకును, నాడులకును, సక్రమముగా పనిచేయుటకు యథాక్రమమైన అహారము అవసరము. జీర్ణయంత్రములు బాగుగా పని చేయు

చున్ననేగాని ఆహారము సక్రమముగా అందదు. పనిచేయని యెడల ఎక్కువ తక్కువలుగా అందును. అందువలన ఆ అవయవములు తమ ధర్మమును నిర్వర్తించలేక కుంటుపడును.

స్వతంత్ర నాడీమండలము బాగుగా పనిచేయు చున్ననే గాని దేహములోని మారుమూల నున్న కణమునకును, అవయవములకును ధాతుశక్తి సక్రమముగా అందదు. హృదయము సంకోచము నొందుట, వ్యాకోచము నొందుట, మూత్రపిండములు మూత్రమును వడియ గట్టుట మొదలగు స్వతంత్ర కార్య కలాప మంతా యీ స్వతంత్రనాడీ మండలము యొక్క అదుపులోనే ఉండును. స్వతంత్ర నాడీమండలము నుండియే అనిచ్ఛాపూర్వక కార్యకలాప మంతా బయలు దేరు ననుటకు గుర్తుగా యీ ఆవరణ తరువాతనే మిగిలిన నాల్గు ఆవరణలును గలవు.

దేహములో తల యెట్లు పై భాగమునందుండునో అట్లనే తలను తెలుపు ప్రతినిధిభాగమునూ కనీనికలో పైననే ఉండును. మిగిలిన అవయవము లన్నియు దిగువగనే ఉండును. చేతులను తెలుపు ప్రతినిధి భాగములు ప్రక్కలనే ఉండును. కాళ్ళను తెలుపు ప్రతినిధిభాగములు క్రిందనేయుండును. (అనగా కనీనికలోని క్రింది సగములోని అడుగుననే ఉండును.) కుడిచేతితో లాఘవముగా పనిచేయు వాని తెలివి తేటలన్నియు మెదడులో యెడమవైపున ఉండును. ఎడమచేతితో లాఘవముగా పనిచేయువాని తెలివి తేటలన్నియు మెదడులోని కుడివైపున ఉండును. (ఎందువలన ఇట్లు

వ్యతిరేకముగా నుండునది శరీర శాస్త్రము చదివినవారికి తెలియును.) మెదడు నుండి బయలుదేరిన నాడులు మజ్జాముఖము దగ్గఱ కుడియెడమలకు మారును. కుడివైపునుండి బయలు దేరిన నాడులు యెడమకును, యెడమనుండి వచ్చిన నాడులు కుడికిని పోవును. మెదడునుండి బయలుదేరిన దృజ్ఞాడులు మరల కుడియెడమలకు పోవును. రెండుతడవల (కుడినుండి యెడమకును, యెడమనుండి కుడికిని)మారుటచే అవయవముల లోని లోపము లన్నియు (అనగా కుడిపార్శ్వములోని లోపములు కుడికనీనికలోను, ఎడమపార్శ్వములోని లోపములు ఎడమకనీనికలోను,) కనుపడును. మెదడునుండి బయలుదేరిన దృజ్ఞాడులు ఒకతడవే కుడినుండి యెడమకును, యెడమనుండి కుడికిని వచ్చుటచే కుడిమెదడులోని లోపములు ఎడమకనీనిక లోను, ఎడమమెదడులోని లోపములు కుడికనీనికలోను కనబడును. ముచ్చిలిగుంటకు క్రిందనున్న కుడిప్రక్కన ఉన్న అవయవములలోని లోపములు కుడికనీనికలోను, ఎడమప్రక్కన ఉన్న అవయవములలోని లోపములు యెడమకనీనికలోను కనబడును. ముచ్చిలిగుంటకు పైభాగములోని కుడివైపు అవయవములలోని లోపములు ఎడమ కనీనికలోను, ఎడవైపు అవయవములలోని లోపములు కుడికనీనికలోను కనబడును.

ఇట్లు కుడి, యెడమలందు వ్యతిరేకముగా నున్నప్పటికిని దృజ్ఞాడులు కుడినుండి యెడమకును, యెడమనుండి కుడికిని వచ్చుటచే, కుడిమెదడులోని లోపములు కుడికనీనికలోను యెడమమెదడులోని లోపములు ఎడమ కనీనికలోను కనబడును.

కుడిప్రక్కన ఉన్న అవయవము లన్నియు కుడికనీనికలో కనబడును. కుడి ఊపిరితిత్తి, లివరు కుడికనీనికలో కానవగును. ఎడమప్రక్కన ఉన్న అవయవములు, యెడమకనీనికలో కానవగును. హృదయము, ప్లీహము యెడమభాగమున ఉండుటచే యెడమ కనీనికలో కనబడును.

ఊపిరితిత్తులు, మూత్రపిండములు రెండువుండునుగాన, కుడియెడమ కనీనికలలో రెంటిలోను కనబడును. ముక్కులు, కన్నులు, చెవులు, వృషణములు రెండు కనీనికలలోనూ, కానవగును. మొత్తముమీద చెప్పవలెనంటే నొసటినుండి బొడ్డుమీద తిన్నగా గీతను గీచి దేహమును రెండుభాగములు చేసినయెడల కుడిభాగములోని అవయవములు కుడికనీనికలోను, ఎడమభాగములోని అవయవములు యెడమకనీనికలోను కనబడును.

ఇంత ప్రత్యక్షముగా ఒక ప్రతినిధిభాగమువెంట మరియొక ప్రతినిధిభాగము, దేహములో అంతరవయవములు ఉన్నవరుసను బట్టి ఉండుటచే, యీవిజ్ఞానము ప్రత్యక్ష శాస్త్రములలో నొకటి యగుచున్నది. మందువైద్యము వారి రోగనిర్ణయము ప్రకారము ఊహా శాస్త్రము కాదు.

## తెలుపు—నలుపు

హెన్రీ లిండ్లారుగారు సుప్రసిద్ధ అలోపతీ వైద్యులు. అలోపతీవైద్యములోఅత్యుత్తమపట్టములనుబడసిరి.వీరు ప్రకృతి వైద్యమును శాస్త్రసమ్మతముగా నిర్వచించిరి. ప్రకృతి వైద్య శాస్త్రమును గూర్చి వ్రాయసంకల్పించిన ఆరు పుస్తకములలో

మొదటిపుస్తకము ప్రకృతివైద్యతల్పమును చెప్పను. అయిదు పుస్తకములను మాత్రము వ్రాసిరి. ఆరవపుస్తకము పూర్తికాక మునుపే వీరు పరమపదించిరి.

ఆ మొదటి పుస్తకములో దేహములోని నిర్మాణశక్తిని గూర్చి విపులముగా చెప్పిరి. ప్రకృతివైద్యప్రక్రియలన్నియు దేహములోని నిర్మాణశక్తికి అనుకూలముగానే యుండవలెను. దేహములోని నిర్మాణశక్తికి వ్యతిరేకముగా మాత్రము ఉండరాదు. కనీనికలో కనుపడు తెలుపును నిర్మాణశక్తికి అనుకూలమగు చిహ్నముగా భావించవలయును. కనీనికలో కనపడు నలుపును నిర్మాణశక్తికి ప్రతికూలమగు చిహ్నముగా తెలిసికొనవలయును. తెలుపును దైవముగాను, నలుపును దెయ్యముగను చూడవలయును. తెలుపు యౌవనమునకును, ఆరోగ్యమునకును చిహ్నము, నలుపు ముసలితనమునకును, అనారోగ్యమునకును చిహ్నము. తెలుపు వృద్ధిచిహ్నము. నలుపు నాశనచిహ్నము. తెలుపు, నలుపుల వివరమును బట్టి మనకేమి తేలుచున్నదంటే తరుణరోగములు వచ్చినప్పుడు కనీనికలో తెలుపు కనపడును. తెలుపు ఆరోగ్యమునకు చిహ్నము. కాన తరుణరోగములు వచ్చినప్పుడు దేహమునకు ఆరోగ్యము కలుగుననియే గ్రహించవలయును.

మందు వైద్యులు కొన్ని రోగముల జాబితాను తయారు చేసినారు. ఈ రోగములు వచ్చినవారు జన్మావధి వాటితో బాధపడవలెననే శాసించినారు.

ఇటువంటి రోగములతో బాధపడువారి కనీనికలోని ప్రతినిధిభాగములలో తెలుపు కనుబడిన యెడల రోగము

నయముగుననియే తెలిసికొనవలెను. తెలువు మంచిలక్షణమే గాని చెడులక్షణము మాత్రముకాదు. తరుణరోగము వచ్చినప్పుడు కసీనికలో తెలుపుకనబడును. కాలికరోగములతో బాధపడునపుడు కనీనికాప్రతిబింబ భాగములలో తెలువు కనబడినయెడల రెండు, మూడు వారముల తరువాత స్వాస్థ్యసంకటములు కలుగునని తెలిసికొనవలయును.

వైద్యశాస్త్ర పితామహుడగు హిపోక్రిటీసు 2000 సంవత్సరముల క్రితమే ఈ మాటను చెప్పినాడు. వైద్యుని ధర్మములగూర్చి చెప్పుచూ ఈ మాటలన్నాడు. రోగచర్యలలో రాబోవు మార్పులను వైద్యుడు ముందుగా తెలుసుకొని వాటిని భరించుటకు రోగిని సిద్ధము చేయవలెను. ఈరోగచర్యలు కలుగకుండా యెట్టి అభ్యంతరమును పెట్టరాదు. బయటకు రాకుండా లోపలనే అణచివేయరాదు. రాబోవు సంగతులను వైద్యుడు రోగికి ముందుగనే చెప్పిన యెడల రోగికి వైద్యునియందుగల నమ్మకము వృద్ధియగును. చికిత్సకు సుముఖుడుగ నుండును. వైద్యుడు తన వైద్యశాస్త్రమునందును, భగవంతునియందును. సంపూర్ణ విశ్వాసముతో కనీనికలోచూచిన సంగతులను యథాతథాగా చెప్పవలయును నే గాని యేమియు నెక్కువతక్కువలు చెప్పరాదు. వైద్యశాస్త్రము 2000 సంవత్సరములక్రితము ఇంతవృద్ధికిరాలేదు. బాల్యావస్థలోనున్న వైద్యశాస్త్రమును ఆధారముచేసికొని హిపోక్రిటెసు అతని అనుయాయులు, రోగనిదానముచేసి రాబోవుసంగతులను ముందుగానే చెప్పగలిగినారనుట సంతోషదాయకము.

ముందుగ కలుగబోవు మార్పులను కనీనికను చూచి చెప్పుటకు వీలుకాదని హిపోక్రిటీసుతరువాతవారు వైద్యశాస్త్ర పితామహులని అపహాస్యము చేసినారు. కనీనికను చూచి ముందుగా కలుగబోవు మార్పులను చెప్పుటవలన నిదెట్లు అప్పుడు సాధ్యమైనది యిప్పుడిప్పుడు ధ్రువమగుచున్నది.

ఈనిదానములో నమ్మకము లేనివారీ సంగతులను విని అపహాస్యము చేతురు. ఇదంతా గారడీయని ప్రచారము చేస్తారు. ప్రత్యక్షముగా జరుగు సంగతులనుకూడా వీరు నమ్మలేరు. ఈ సందర్భములో లిండ్లారుతో చికిత్సాలయములో జరిగిన సంగతిని చెప్పుట అప్రస్తుతము కాదనుకొంటాను. మాచికిత్సాలయములో ముందుగ రాబోవు మార్పులను చాలామంది రోగులకు ముందుగానే చెప్పుచుండెడివారము. మేము చెప్పినట్లుగానే యథాతథాగా జరిగెడివి. ఈ విషయములను విన్న మా అలోపతీ వైద్యమిత్రులు చాలామంది నవ్వారు. ప్రకృతి వైద్యము వారియొద్ద ప్రక్రియల ఫలితముగా (అనగా చన్నీటి ప్రయోగము మొదలగు ప్రక్రియల ఫలితముగా) నీఫలితములు కలిగిన వనుచున్నారు.

స్వాస్థ్యసంకటములననేమో వాటివలన కలుగు ఉపయోగములను తెలుసుకొనలేని వైద్యశేఖరుల మాటలు ఇటులనే ఉండును. ఇటువంటి (తెలియని) వైద్యశేఖరులు అధ్యక్షులుగానున్న ఆరోగ్యసదనములనుండి రోగములు కుదరవని బయటకువచ్చిన రోగులు చాలామంది మా వైద్యచికిత్సాలయములో చేరినారు. రోగములు నయమై సుఖముగా నింటికి వెళ్ళినారు. ఆయా అధిపతులకు స్వాస్థ్యసంకటముల స్వభావము

తెలియదుగాన స్వాస్థ్యసంకటములు కలుగగనే గాభరాపడి రోగులను బయటకు పంపివేసినారు. అదిగాకపోతే, రోగము కొంచెము వెనుకడుగు వేయగనే పూర్తిగా నయమైనదని భ్రమపడి బయటకు పంపివేసెడివారు. ఈరోగులు ఇంటికి చేరగనే ఆయారోగములు మరల తల ఎత్తెడివి. ప్రకృతి శాస్త్రములోని మూలసూత్రములను ఆయారోగులకు ఆయా సదనాధిపతులు చెప్పలేదు. చికిత్సాలయములో ఉన్నంతవరకును రోగముయొక్క బహిర్లక్షణములు తగ్గినప్పటికిని రోగస్వరూపము అట్లనే నిలువ ఉన్నది. ఆహార విహారములను మార్చుకొనక, మూలసూత్రములను విస్మరించుటచేత చికిత్సాలయము వదలి యిల్లు చేరగనె మొదటిరోగము బయటపడేది. రోగము బయటపడగనే రోగులు గాబరాపడి మందువైద్యులచెంతకు మరీ త్వరగా పరుగెత్తెడివారు. మందులను, శస్త్రములను నిరాటంకముగా వాడెడివారు. కొన్ని సంవత్సరముల క్రితము మా ఆసుపత్రికి చికిత్సార్థమై ఒకామెవచ్చినది. ఈమె చికిత్సలో ఉండగా నీమెను పరామర్శ చేయుటకీమె అప్ప వచ్చినది. ఆ అప్పచెల్లెళ్ళకును, నాకును, నీక్రింది సంభాషణ జరిగినది.

అప్ప— ఈ వైద్యము మంచిదేగాని అందరకును పట్టదు. కొంతమందికి పట్టుతుంది. కొంతమందికి పట్టదు.

చెల్లెలు— నీకెట్లు తెలిసింది?

అప్ప— నే నీ వైద్యము చేసినాను.

చెల్లెలు— ఏమైనా ఉపయోగించినవా ?

అప్ప— ఉపయోగించలేదు.

నేను— ఏమేమి చేసినారు.

అప్ప— నాకు చాలాకాలమునుండి మలబద్ధకమున్నది. ఈ బాధను తప్పించుటకు మావైద్యుడు ఆమాశయమును తీసివేయాలన్నాడు. ఆపరేషనంటే భయపడి నిరౌషధ నిశ్శస్త్రచికిత్సాలయమని పేరొందిన ప్రకృతి చికిత్సాలయమునకు పోతిని. అక్కడ కొంతకాలమువరకు బాగానే ఉన్నది. రోగము నయమైనదిగదా అని సంతోషపడ్డాను. ఇట్లుండగా ఒకరోజున అమాంతముగా కడుపులో పోట్లు పుట్టినాయి. వెనుకటి బాధలన్నీ మళ్ళా ప్రత్యక్షమైనాయి. ఈ చికిత్స అందరికునూ ఉపయోగించదని తెలుసుకొని చికాగోకు పరుగెత్తి ఆపరేషను చేయించితిని. ఆమాశయముతోబాటు బాధలన్నీ పోయినాయిగదా అని సంతోషపడ్డాను.

నేను— చేతివేళ్ళ కణుపులు లావగుటచూచి, అప్పటినుండే మలబద్ధకము అధికమైనది.

అప్ప— అవును.

నేను—తరువాత సంధివాతము వచ్చినది.

అప్ప—అవును. మీ కెట్లు తెలిసినది.

నేను—చెవుతా వినండి. ఆమాశయముతోబాటు రోగము పోలేదు. ఆమాశయము పోవుటచే అందులో ఊరురసము ఊరలేదు. ఊరకపోవుటచే జీర్ణక్రియ, బహిష్కరణక్రియలు రెండునూ కుంటుపడినవి. ఊర్ధ్వముఖాంత్రములోని మలము పైకి నడవక నిలబడినది. మలబద్ధకము వృద్ధియైనది. మలబద్ధకము పెరుగుటచే సంధివాతము వచ్చినది. ఆ ప్రకృతి

చికిత్సాలయములో నింకా కొంతకాలము ఉండి రోగము పూర్తిగా నయము చేసికొన్న యెడల ఈ బాధలు వచ్చెడివి కావు. మలబద్ధకము పూర్తిగా అంతరించేది, మల మూత్ర స్వేదములు బాగా వెలువడేవి. శ్వాసాశయములు బాగుపడెడివి. సంధివాతము వచ్చేదికాదు.

నేను చెప్పినమాటలను నీమె నమ్మలేదు. మలబద్ధకమునకును, సంధివాతమునకును సంబంధము లేదని వారివైద్యుడు వచ్చి చెప్పాడు. దేనికది వేరని నూరిపోశాడు. చికాగోలోని వాతావరణములోని లోపమువలన సంధివాతము వచ్చినదని నూరిపోశాడు. ఈ మాటలన్నిటిని యీమె 'విస్సన్న చెప్పినది వేదము'ని గట్టిగా నమ్మినది. అందువలన నామాటలు నమ్మలేదు.

ఆ ప్రకృతి సదనాధిపతికి స్వాస్థ్యసంకటము లననేమో తెలిసిఉండి రోగికి వచ్చి చెప్పినయెడల నిబాధలు కలిగెడివికావు. ఆమెయు ఇన్ని బాధల ననుభవించేదికాదు. మా చికిత్సాలయమునకు వచ్చేరోగులలో కాలికరోగులు ముఖ్యులు, తరుణరోగములతో బాధపడువారు తక్కువగనే వచ్చేవారు. ఈ కాలిక రోగులకు కలుగబోవు స్వాస్థ్యసంకటములను కనీని కని చూచి ముందుగనే చెప్పెడివాడను. అందువలన వారికి నామీద నమ్మకము ఎక్కువయ్యేది. చికిత్సకు సుముఖముగా ఉండేవారు. రోగము త్వరగా నయమయ్యేది. సుఖముగా ఇంటికి వెళ్ళేవారు కనీనికానిదానము బాగా ఉపయోగపడింది. ఈ నిదానమే లేకపోతే యిన్ని మొండిరోగముల నింతత్వరగా పూర్తిగా నయము చేసెడివాడనుకాను.

## నాడీ ఉంగరములు
## (Nerve Rings)

రోగపదార్థము బయటకు పోవునపుడు బహిష్కరణ జరుగు అవయవమును తెలుపు కనీనికా ప్రతినిధి భాగములో తెల్లగీతలు కనుపడునని గత అధ్యాయములో చదివినాము. రోగ పదార్థము ఆయా అవయవముల ద్వారా బయటకు పోవుచున్నదని ఒక్క తెల్లగీతలవలననే గాక, మరొక రకమగు చిహ్నముల తోను ప్రకృతి మనకు తెలియచేయును. ఆచిహ్నములే నాడీ ఉంగరములు. ఈ ఉంగరములు చాలా చిన్నవిగాను గుండ్రము గాను ఉండును. (కనుపాపచుట్టూ నుండు కనీనికను ఏడు సమాన భాగములు చేయవలయుననియు ఈ యేడు ఆవరణ లలోను దేహములోని అవయవములన్నియు గలవని కనీనికా నిదానశాస్త్ర సాంప్రదాయము.) ఈ నాడీ ఉంగరములు ఏ అవయవములో ఉన్న ఆ అవయవములో రోగపదార్థము పేరుకొన్నదని తెలిసికొనవలెను. దాని ద్వారానే బహిష్కరణ జరుగుచున్నదనియు తెలిసికొనవలెను. ఈ తెల్ల ఉంగరములు ఒక ఆవరణలోగాని యేడు ఆవరణాలలోగాని ఉండవచ్చును. ఈ ఉంగరములు క్రమముగా పెన్సలుతో గీసినట్లుండునుగాని యెగుడు దిగుడుగా నుండవు. 7 వ బొమ్మను 25 వ బొమ్మను చూచినయెడల నీ విషయము బాగుగా బోధపడగలదు. రోగ పదార్థము కాలికమైన కొలదినీ యీ తెల్ల ఉంగరములు నల్ల పడును. తరుణరోగములోని మొదటి దశలో నీ ఉంగరములు బాగా తెల్లగానుండును. రోగము రెండవదశను పొందు నప్ప టికే యీ ఉంగరములు కొద్దిగా నల్లపడును. కాలిక రోగ

ములో మొదటిదశను పొందునప్పటికే ఈ నాడీ ఉంగరములు మరీ నల్లబడును. కాలికరోగములో రెండవదశను పొందునప్పటికి ఈ ఉంగరములు చాలా బాగా నల్లబడును. రంగుల బొమ్మలోని 6 వ బొమ్మయే యిందుకు నిదర్శనము.

ప్రకృతి వైద్యపద్ధతుల ద్వారా రోగము పూర్తిగా నయమగునప్పటికి ఈ నల్లటి ఉంగరము లన్నియు తెల్ల ఉంగరములుగా మారిపోవును. నాడీఉంగరములు నల్లగా నుండగనే రోగము నయముకాదు.

నాడీఉంగరములు ఎట్లు ఏర్పడునదీ తెలిసికొందాము. కంటిలోని అవయవములగూర్చి బాగా పరిశోధనలు జరిపిన శాస్త్రజ్ఞులు ఏమన్నారంటే, కనీనికలో దేహమునకు సంబంధించిన అన్ని అంతరవయవములనాడులును ఉండును. ఈనాడులు చాలా సూక్ష్మముగా నుండును. తలవెండ్రుకలకన్నను సూక్ష్మముగా నుండును. కనుపాప విరివిని పొందినవుడు కనీనిక సంకోచమును పొందును. అనగా కనీనికలోనుండు సూక్ష్మాతి సూక్ష్మమైన నాడులు సంకోచమును పొందును. ఇట్లు సంకోచమును పొందుటలో సూక్ష్మాతి సూక్ష్మమైన నాడులలో పల్లములు ఏర్పడును. కనుపాప విరివిని పొందినకొలది (అనగా కనీనిక సంకోచమును పొందిన కొలదీ) కనీనికలోని నాడులలోని (అర్థాత్) కనీనికలోని పల్లములు బాగుగా కనబడును.

కనుపాప ఉండవలసిన పరిమాణముకన్న తగ్గిపోయినవుడు కనీనిక విరివిని పొందును (పెద్దదగును). అనేక నాడులు కలియుటచే కనీనికలోని సూక్ష్మనాడులు పెద్దవగును. ఇట్లు నాడులువిరివినిపొందినవుడు నాడులలోని పల్లములు కనుపడవు-

కనుపాప వ్యాకోచమును పొందినపుడు కనీనిక సంకోచమును పొందును. కనుపాప సంకోచమును పొందినపుడు కనీనిక వ్యాకోచమును పొందును. మానసిక ఉద్రేకములు కల్గినపుడు కనీనికలో సంకోచ, వ్యాకోచములు కలుగును. ఇట్లు కలిగిన సంకోచవ్యాకోచములు కొద్దికాలమే నిలచును. అంతర వయవములలో కలిగిన లోపములు కనీనికలో ప్రతిబింబించును. గాన అంతరవయవములలోని లోపములతో కనీనికలో వచ్చిన సంకోచ, వ్యాకోచములు ఎక్కువకాలము నిలువ ఉండును. దేహములో అనుక్షణము తయారగు రసాయనిక మురుగు క్రిమప్రకారముగా బయటకు పోగానే దేహమునకు ఆరోగ్యము కలుగును. అప్పుడు నాడీమండలములోని ఉద్రేకములు తగ్గును. కనీనికలోని సంకోచ, వ్యాకోచములు తగ్గును. ప్రతిరోగము తరుణరూపమును పొందిన తరువాతనే కాలిక రూపమును పొందును. ప్రకృతి వైద్యపద్ధతులద్వారా కాలిక రోగమును నయము చేసినయెడల తరుణరూపమును పొందిగాని నయముకాదు. కనీనికలో కనుపడు తెల్లటిగుర్తులు, నాడీ ఉంగరములు రెండును తరుణరోగ చిహ్నములే. తెల్లగీతలు నల్లబడుట, రోగపదార్థముయొక్క (అర్థాత్ తరుణకాలిక రోగములలోని తీవ్రతను అనగా కాలిక రోగముయొక్క) తీవ్రతను చిహ్నముగాను నాడీఉంగరములు నల్లపడగానే రోగము తీవ్రరూపమును అనగా కాలికమైనదని గుర్తించవలయును.

నాడీ ఉంగరములు తెల్లగా కనబడగనే స్వతంత్ర నాడీ మండలము మొత్తములోగాని కొన్ని భాగములలో గాని

లోపములున్నవని గ్రహించవలయును. ఈ నాడీ ఉంగరములు కనుపాపచుట్టూ నుండు ఏడు ఆవరణలలో నుండక ఒక ఆవరణలోగాని, ఆవరణలోని భాగములో ఉన్న యెడల ఆయా అవయవముల ద్వారా స్వాస్థ్యసంకటములు కలుగుచున్న వని గ్రహించవలయును. కనీనికా నిదానశాస్త్రము చదువునపుడు రెండు రకములగు Classifications గలవను సంగతిని మనస్సు నందుంచు కొనవలెను. మొదటి Classification కనుపాప చుట్టూనుండు నల్లగుడ్డును ఏడు సమాన భాగములు చేయవలెను. కుడిపార్శ్వములోని అవయవములు కుడి కనీనికలోను, ఎడమపార్శ్వములోని అవయవములు ఎడమ కనీనికలోను కనబడును. రెండవ Classification కనుపాప పోను మిగిలిన నల్లగుడ్డును 36 సమాన భాగములు చేయవలెను. ఎడమ పార్శ్వములోని అవయవములన్నీ ఎడమ కనీనికలోని 36 భాగములలోను, కుడిపార్శ్వములోని అవయవములన్నీ కుడి కనీనికలోని 36 భాగములలోను కనబడును. ఈ రెండు Classifications వేరు వేరని భావించక రెంటిని సమన్వయముచేసి రోగ నిదానము చేయవలెను. 7 a బొమ్మను చూడుము.

కుడి కనీనికలోని ఒకటవ ప్రతినిధిభాగము, ఎడమ కనీనిక లోని ఒకటవ ప్రతినిధిభాగము మెదడును తెలుపును. 1 వ ప్రతినిధి భాగములో తెల్లటి నాడీఉంగరములున్న యెడల మెదడులో ఉద్రేకము లున్నవని గ్రహించవలయును. మనస్థిమితము లేదని తెలిసికొనవలెను. ఒక విషయమునుగూర్చి తీవ్రముగా ఆలోచించలేడని ఊహించవలెను. హిస్టీరియా, ఇన్‌సామ్నియా, ఏకాకిగానుండగోరుట, ముకో-

పిగా నుండుట, మొదలగు మానసిక వ్యాధులలో 1 వ ప్రతినిధిభాగములో తెల్లటి నాడీఉంగరము లుండును. ఈ సంగతి 26 వ బొమ్మలోని నాడీఉంగరములవలన బాగా నిశ్చయము కాగలదు.

నాడులలో కలిగిన ఉద్రేకము, మంటలు ఎక్కువ కాలము నిలబడినయెడల నాడులు చచ్చుపడిపోవును. నాడులలోని పాటవము తప్పిపోవును. నాడులలోని పాటవము తగ్గి చచ్చుపడిపోయినపుడు తెల్లటి నాడీఉంగరములు నల్లపడును. పాటవము తగ్గినకొద్దీ నాడీఉంగరములు ఎక్కువగా నల్లపడును. 6 వ బొమ్మలోని 3, 4 భాగములును రంగుల పటములోని 6 వ బొమ్మయు ఈ సంగతిని తెలుపును.

ఈ నాడీఉంగరముల రంగు తెల్లగా నుండక బూడిద రంగుగా నున్నయెడల రోగము మొదటిదశను దాటి రెండవ దశను పొందినదని గ్రహించవలయును. కుడి కనీనికలోని 8, 8 M 9 ప్రతినిధిభాగములు ఊపిరితిత్తులను తెలుపును. 27 28 & 29 ప్రతినిధి భాగములలోని లోపలి సగము (Bronchus) ను తెలుపును. ఊపిరితిత్తులను తెలుపు ప్రతినిధి భాగములలో గాని, Bronchus ను తెలుపు ప్రతినిధి భాగములలోగాని తెల్లటి నాడీఉంగరములు కనుపడినయెడల తరుణ న్యూమోనియా (ఊపిరితిత్తులకు సంబంధించిన తరుణరోగము) వచ్చినదనిగాని, శ్వాసనాళికలకు సంబంధించిన తరుణరోగము వచ్చినదనిగాని, తెలిసికొనవలయును.

మెదడును తెలుపు 1 వ ప్రతినిధి భాగములో తెల్లటి నాడీఉంగరములు ఉన్నయెడల మానసిక వ్యాధులు గలవని

తెలిసికొనవలెను. అనుక్షణము దేహములో తయారై బయ టకు పోక లోపలనే నిలచిపోయిన యెడల మానసిక వ్యాధులు కలుగును. మందులలోని విషమువలనను మానసిక స్థిమితము పోవును. నాడీఉంగరములు నల్లపడినకొలది మతిమరుపు పెరుగును.

ప్రకృతివైద్య పద్ధతులద్వారా రోగపదార్థము బయ టకుపోయి, రోగము నయమైనపుడు నల్లగానున్న నాడీఉంగర ములు తెల్లబడును. ప్రకృతి సూత్రములను అనుసరించినకొల దినీ నల్లఉంగరములు తెలుపుమారుటయు, తెల్లఉంగరములు లోపించుటయు సంభవించును. మానసిక వ్యాధులతో చాలా కాలమునుండి బాధపడిన వారిలో నీ నల్లటి నాడీఉంగరములు విపులముగా కనబడును. ఇటువంటిరోగములను ప్రకృతివైద్య పద్ధతులతో నయముచేసినాము. ఇటువంటివి చాలా కేసులు గలవు.

పందొమ్మిదవ శతాబ్దములోని కనీనికా నిదాన శాస్త్ర జ్ఞులు కనుపాపపోను మిగిలిన నల్లగుడ్డును 5 భాగములుగనే విభజించిరి. అనగా 6 ఆవరణలైనవి. వారి విభజన ప్రకా రము కనుపాపచుట్టూనుండు మొదటి ఆవరణ పెద్దదిగా నుండును. ఈ మొదటిఆవరణ జీర్ణాశయము చిన్నప్రేగులను, తెలుపునని చెప్పిరి. రెండవ అవరణ స్వతంత్ర నాడీమండల మును తెలుపును, 3 వ ఆవరణ బహిష్కార్యావయవములను, 4 వ ఆవరణ జననేంద్రియములను, 5 వ ఆవరణ శోషరస వాహకములను, 6 వ ఆవరణ Scurfrm, ను తెలుపును. తరువాత శాస్త్రజ్ఞులు ఈ 6 వ ఆవరణ చర్మమును తెలుపుననిరి.

20 వ శతాబ్దపు కనీనికా నిదానశాస్త్రజ్ఞులు మొకటి ఆవరణను రెండు భాగములు చేసిరి. అప్పుడు మొత్తము ఆవరణలు 7 అయినవి 'ఇదే సమంజసము.' వీరి విభజన ప్రకారము మొదటి ఆవరణ జీర్ణాశయమును, రెండవఆవరణ చిన్న ప్రేగులను, మూడవ ఆవరణ స్వతంత్రనాడీమండలములను, 4 వ ఆవరణ బహిష్కార్యావయవములను, 5వ ఆవరణ మెదడును, జననేంద్రియములను, 6 వ అవరణ శోషరసవాహికలను, 7వ ఆవరణ చర్మమును తెలుపును. ఇట్లు కుడికనీనికను, ఎడమ కనీనికను, ఏడుభాగములు చేయవలెను. దేహములోని కుడి పార్శ్వము అవయములన్నీ కుడి కనీనికలోని 7 ఆవరణలలో కానవగును. దేహములోని యెడమపార్శ్వములోని అవయవములన్ని యెడమ కనీనికలోని యేడు ఆవరణలలోను కనుబడును. నుదుటిమీదగా ముక్కు, బొడ్డులను సరిచేసి గీతగీచి ఆప్రకారముగా దేహమును రెండుభాగములు చేసినయెడల కుడిపార్శ్వములోని అవయవములు ఈ క్రిందివని తేలును. కన్ను, చెవి, ముక్కు, నోరులో సగము, పళ్ళు, గొంతులోని సగము, చెయ్యి, ఊపిరితిత్తి, జీర్ణాశయములో సగము,లివరు, మూత్రపిండము, ఊర్ధ్వముఖాంత్రము, సరళాంత్రములో సగము, చిన్నప్రేగులోసగము, వృషణము, కాలు, మొదలగు అవయవములన్నీ కుడి కనీనికలో కనబడును. ఈ ఆవయవములన్నీ, యెడమకనీనికలోను కనుబడును. హృదయము దేహములో ఎడమభాగమునందే ఉండును గనుక ఎడమ కనీనిక లో కనుబడును.

## Closed Legions. (క్లోజుడు లీజియన్)

14 వబొమ్మలో 4 భాగములు గలవు. తరుణ రోగములు వచ్చినప్పుడు కనీనికలో యేమిగుర్తులు కనుపడేది మొదటి భాగమును చూచినయెడల విశదమగును. ఈ మొదటిభాగములో యేడుబొమ్మలుగలవు. ఈ 7బొమ్మలు తరుణరోగవు తీవ్రతను క్రమముగా తెలుపును.

రెండవ భాగములోని బొమ్మలు తరుణరోగవు రెండవ దశలో కనీనికలో కనబడు గుర్తులను తెలుపును. మొదటిభాగములో ఫక్తు తెల్లగీతలే గలవు. రెండవభాగములోని బొమ్మలలో నల్లగీతలు అక్కడక్కడ కనబడును. కనీనికలో యీగుర్తులు కనబడు నప్పటికే రోగము ముదిరినదని గ్రహించవలయును. ఇందులోను 7బొమ్మలుగలవు. ఈయేడుబొమ్మలును క్రమముగా రోగము యొక్క తీవ్రతను తెలుపును.

మూడవభాగములోని బొమ్మలలో నలుపుగీతలు బాగా గలవు. రోగము శాలిక రూపమును అందులోనూ మొదటిదశను పొందినపుడు కనీనికలో యీగుర్తులు కనబడును. కనీనికలో యీగుర్తులు కనబడగానే రోగముబాగాముదిరి పోయినదని గ్రహించవలయును. ఈ భాగములో 6 బొమ్మలు గలవు. ఈ 6 బొమ్మలును రోగముయొక్క తీవ్రతను తెలుపును.

నాల్గవభాగములోని బొమ్మలలో నలుపుగీతలు మరీ యెక్కువగా కనబడును. తెల్లగీతలు చాల తక్కువగా కనబడును. కనీనికలో యీ గుర్తులు కనబడగనే రోగము బాగా ముదిరి

పోయినదని గ్రహించవలయును. రోగము మూడవదశ పొందినప్పటికే చాలామందిరోగులు యమదర్శనము చేతురు. చావకుండా బ్రతికినవారు చాలాకొద్దిమంది గలరు. రోగము మూడవదశను పొందునప్పటికే అంతరవయవములన్నియు తూట్లుపడును నాల్గవదశ పొందునప్పటికి యీచిల్లులు మరీ యెక్కువగును. ఇందులో 6 బొమ్మలుగలవు.

14వ బొమ్మలోని 3వ భాగములోని 5, 6 బొమ్మలును, 2వ భాగములోని 7వ బొమ్మను చూచినయెడల యీసంగతి బాగా విశదముకాగలదు.

జగన్మాతయగు ప్రకృతి తనబిడ్డలకు హానికలుగకుండా యెప్పటి కప్పుడు కాపాడుచునే ఉండును. దేహములోని అవయవములలోకెల్లా ఊపిరితిత్తులు ముఖ్యము. ఈఊపిరితిత్తులకు దెబ్బలు తగులకుండా ప్రక్కయెముకల మధ్యన భద్రపరచినది. ఇంకా యేమైనా దెబ్బలు తగులునేమోనని మూడుపొరల సందున దాచియుంచినది.

అంతవరకు యెన్ని అపచారములు చేసినను నిన్నే నమ్మినానని సర్వసమర్పణము చేసినయెడల దయామయి యగు ప్రకృతి యెటువంటిబాధలను పొందనీయక పరమేశ్వరుని యెంతటి కారుణ్యస్వరూపుడో జగన్మాత యగు ప్రకృతియు అంత దయామయి.

Closed Lesion అనియు Open Lesion అనియు రెండు రకములగు బొమ్మలు గలవు. ప్రస్తుతము Closed Lesion అననేమో తెలుసుకొందాము. మధ్యలో నల్లగీతలుండి, చుట్టూ

తెల్లగీతలున్న యెడల Closed lesion అని అందుము. ఈరకముగు బొమ్మలున్న యెడల రోగమునకు నయమగు యోగమున్న దనియు, అనగా రోగపదార్థము త్వరగా బయటకుపోవుటకు సావకాశమున్నదనియు, తెలుసుకొనవలయును. 14 వ బొమ్మ లోని 3వ భాగములోని 3, 6 బొమ్మ లే యిందుకునిదర్శనములు. ఎంత త్వరగా రోగపదార్థము బయటకుపోవుటకు వీలుండునో అంతదట్టముగాను, ఎక్కువగాను తెల్లగీతలు కనుబడును. అంత రవయవములలో లోపములున్న యెడల కనీనికా ప్రతిస్థాన ములలో నల్లగీతలు కనుపడును. ప్రతినిధిస్థానములలో నల్లగీతలు కనుపడగనే అంతరవయవములలో లోపము లున్నవని గ్రహించవలయును. దేహములోని ధాతు శక్తి వృద్ధి అయిన కొలదినీ ఆయాఅవయవములలో పేర్కొన్న రోగపదార్థమును బయటకునెట్టుటకు ప్రకృతి ప్రయత్నముచేయును. అప్పుడు సంకటములు కలుగవచ్చును. ఇట్లు కలిగిన సంకటములు స్వాస్థ్య సంకటములు కావచ్చును. రోగసంకటములునూ కావచ్చును. Closed Lesions ఉన్నప్పుడు మాత్రము (కనీనికా ప్రతినిధి స్థానములలో కనుపడినప్పుడు మాత్రము) స్వాస్థ్యసంకటము లే కలుగును. అందుకుగాను దేహములోని ప్రకృతికిని రోగపదార్థ మునకును పోరాటమెల్లప్పుడును జరుగుచునేఉండును. రోగపదా ర్థమును బయటకుపంపి దేహమునకు ఆరోగ్యము చేకూ ర్చుటకై ప్రకృతి ప్రయత్నము చేయుచునేయుండును. ఈ పోరాటములో నివారణశక్తులది (ప్రకృతి) పైచేయి అయినపుడు యీసంకటములు ఆరోగ్యమునకు సహాయకారు లగును. అనగా - యీసంకటములతో రోగపదార్థము బయ

టకు పోవుటచే ఆరోగ్యము బాగుపడును. రోగపదార్థమునకును ప్రకృతికిని అనగా నివారణశక్తులకును జరుగుపోరాటములో రోగపదార్థముది పైచేయి అయినపుడు రోగము హెచ్చువెరుగును. ఈకలిగిన సంకటములను రోగసంకటము లనినాము.

సంకటములు వచ్చిపోయిన తరువాత ఆరోగ్యముకల్గిన యెడల స్వాస్థ్యసంకటములు కలిగినదందుము.

రోగము నాల్గవ దశను పొందినపుడు కనీనికలో కనుబడు గుర్తులను తెలిసికొందాము.

రోగపదార్థము ప్రధాన అవయవములలో చేరి నాల్గవ దశను పొందినదనగనే రోగము నయముకాదనియే గ్రహించవలయును. అంతవరకు తెల్లగానున్న గీతలు యిప్పుడు నల్లపడును. నిన్నటివరకు తెల్లగానున్న గీతలు (మరురోజుకే) నల్లపడవు. ఇట్లు నల్లపడుటకు కొన్నిరోజులు పట్టును. క్రమేపీ వచ్చును. రోగపదార్థము బయటకుపోక లోపలనే నిలబడిపోయి మురుగుననియు, యీమురుగుటలో మంటలు (వేడి) పుట్టుననియు యీ వేడికి దేహములోని సూక్ష్మాతి సూక్ష్మనాడులు కాలి కమలిపోవుననియు, లోగడనే చదివినాము. అంతరవయవములకు అన్నిటికిని కనీనికలో ప్రతినిధిస్థానములుంచుట చేతను, అంతరవయవములలోని లోపములన్నీ ఆ యా ప్రతినిధి స్థానములలో ప్రతిబింబించుటచేతను, రోగపదార్థము ఊపిరితిత్తులలో నిలవడుండి మురుగుటలో పుట్టినవేడికి సూక్ష్మాతి సూక్ష్మమగు నాడులు కాలిపోవుటచే పడినచిల్లులు కనీనికా ప్రతినిధి స్థానాలలో కనబడును.

ఇకను 14వ బొమ్మలోని నాల్గవభాగములోని బొమ్మలనుగూర్చి విశదముగా తెలిసికొంచాము.

14వ బొమ్మలో నాల్గుభాగములు గలవు. ఈనాలుగు భాగములలోని 1, 2 భాగములు తరుణ రోగముయొక్క రెండు దశలలోను కనీనికా ప్రతినిధి భాగములలో కనబడు చిహ్నములను తెలుపును. అందువలన మొదటి భాగములోని బొమ్మలకన్న రెండవభాగములోనిబొమ్మలు రోగపదార్థము యొక్కతీవ్రతను (అర్థాత్ రోగముయొక్కతీవ్రతను) తెలుపును. 14వ బొమ్మలోని 3, 4, భాగములలోని బొమ్మలు రోగము యొక్క కాలికరూపములోని రెండుదశలను తెలుపును.

మూడవభాగములోని బొమ్మలు కనీనికలో కనపడు నప్పటికే రోగము కాలికరూపమును పొందినదని గ్రహించవలెను. నాల్గవభాగములోని బొమ్మలు కనపడితే అంతరవయువములు తూట్లుపడినవనియు అనగా అంతరవయువములలోని పదార్థమే లోపించినదనియు గ్రహించవలయును. రోగము యీ దశను పొందినట్లు తెలియగనే (కనీనికలో 4వ భాగములోని చిహ్నములు కనబడగనే) రోగము కుదరదని రోగి బంధువులకు నచ్చచెప్పుటమంచిది.

14వ బొమ్మలోని 1వ భాగములో 7 బొమ్మలుగలవు. అందులోని 1, 4, 6 బొమ్మలు తరుణ రోగములోని ఉచ్ఛదశలను తెలుపును. ప్రతి తరుణ రోగములోను అయిదు దశలు ఉండునని లోగడనే చదివినాము. అందులోని 1, 2 దశలు రోగముయొక్క పుట్టుకను తెలుపును. ఈ రెండుదశల ఉత్పత్తి

(incubation) చయము (Aggravation) అందుము. మూడవదశను ప్రకోపము (Destruction) అందుము. ఈ దశలోనే తరుణరోగము ఉచ్ఛదశలోనుండును. నాలుగవదశను ఉపశమము (Abatement) అందుము. ఈ దశలో రోగము తగ్గిపోవును. అయిదవదశను శాంతి (Reconstruction) యందుము. చచ్చుపడిపోయిన కుటికలన్నియు ఈ దశలో బాగుపడును. తరుణరోగమును ప్రకృతి వైద్యపద్ధతులద్వారా నయముచేసినయెడల నాడులలోని ఉద్రేకము తగ్గును. ఉద్రేకముతగ్గగనే విరివిపొంది స్థానచ్యుతిని పొందిన నాడులు మరల స్వస్థానమునకు చేరును. కనీనికా ప్రతినిధి స్థానములో మెరకపల్లములు ఉండవు. 2, 5, 7 బొమ్మలు యీ సంగతిని తెలుపును.

శ్వాసాశయవ్యాధులు కలిగినపుడు ఊపిరితిత్తులలో మంటలుపుట్టును. ఈమంటలు తగ్గించుటకుగాను మంచుగడ్డను రబ్బరుసంచులలోవేసి నుదుటమీదను, ఎదురురొమ్ముమీదను, పెట్టుదురు. అట్లు చేసినయెడల 3 వ బొమ్మమూదిరి బొమ్మలు కనీనికలో కనుపడును. ఊపిరితిత్తులలో కలిగిన మంటలను తగ్గించుటకు మందులవాడినను యిటువంటి బొమ్మలు కనుపడును. ఈబొమ్మలు కనీనికలో కనుపడిన అంతరవయవములలో రోగపదార్థమున్నట్లుగానే భావించవలయును. ఇట్లు పేరొన్న రోగపదార్థమునుండి అంతరవయవములను దహించివేయును. వీటిని రోగసంకటములనవచ్చును.

ఇట్లు పేరొన్న రోగపదార్థము ఆదేహిప్రకృతిసూత్రములకు అనుకూలముగా జీవించినయెడల బయటకు వెలువరింపబడును. దేహమునకు ఆరోగ్యము కలుగును. వీటిని స్వాస్థ్య

సంకటములందును. 2వ భాగములోని 7వ బొమ్మయు 3వ భాగములోని 3, 6 బొమ్మలును కనీనికలో కనుపడగనే రోగము కాలికమైనదని గుర్తించవలయును.

14వ బొమ్మలోని 2వ భాగములోని బొమ్మలు తరుణరోగములోని రెండవదశను అనగా బహిర్గతదశను కనీనికలో కనుపడు చిహ్నములను తెలుపును. ఈదశను తరుణ కాలిక రోగములకు మధ్యదశయని చెప్పవచ్చును. రోగము కాలిక రూపమును పొందునప్పటికన్న తరుణరోగములోని రెండవ దశలో నున్నప్పుడు ప్రకృతివైద్య పద్ధతులద్వారా రోగపదార్థమును బయటకు సాగనంపినయెడల రోగము త్వరగా నయమగును. ఈభాగములో 7 బొమ్మలు గలవు. ఈయేడుబొమ్మలును వరుసగా రోగముయొక్క తీవ్రతను తెలుపును.

మూడవభాగములో 6 బొమ్మలు గలవు. జలుబు చేసినపుడు వచ్చిన దగ్గునుమందులతో అణచిపెట్టుటవలన యెట్లు కాలికరూపమును పొందునదీ యీ బొమ్మలనుబట్టి తెలిసికొనవచ్చును. ఈబొమ్మలలో తెల్లగీతలకన్న నల్లగీతలు యెక్కువగా కలవు. ఈనల్లగీతలు మరీ తీవ్రముగా నుండుటవలన అంతరవయవములలోని పదార్థము లోపించినట్లు తెలిసికొనవలెను.

నాల్గవభాగములో 6 బొమ్మలుగలవు. అందులోని 1, 2, 4, 6 బొమ్మలలో నల్లగీతలు యెక్కువగాగలవు. నల్లగీతలు యింత తీవ్రముగా కనుబడగనే అంతరవయవములోని పదార్థము లోపించినట్లే భావించవలెను. మూడవభాగములోని బొమ్మలు కనీనికలో కనుపడునప్పటికే చాలామంది రోగులు

యమదర్శనము చేస్తారు. ఈబొమ్మలు కనుపడునప్పటికే మృత్యువాతబడనివారు చాలా కొద్దిమంది ఉంటారు.

అంతరవయవములలో అంతర్వ్రణములు లేచినపుడు ఆ యీ ప్రతినిధి భాగములలో 3, 6 బొమ్మలు కనపడును. ఒకామెకు జీర్ణాశయములో అంతర్వ్రణము లేచినది. కను పాపచుట్టూ నుండు మొదటి ఆవరణలో 6 వ బొమ్మ కనుపడి నది. నల్లచుక్క మొదటి ఆవరణలో అనగా లోకనుపాపదగ్గర గనేఉన్నది. తెల్లగీతలు మాత్రము యేడు ఆవరణలలోను కను పడినవి.

మరొక ఆమెకు సరళాంత్రములో అంతర్వ్రణము లేచినది. కనీనిక చుట్టూనుండు రెండవ ఆవరణలో 3 వ బొమ్మకనుపడినది.

## శోషరసమండలము

రోగము మూడు, నాల్గు దశలను పొందగనే కనుపాప చుట్టూనుండు 6 వ ఆవరణలో తెల్లటి స్ఫటికములు కనుపడును. 13 వ బొమ్మలోని 6 వ ఆవరణలో యీస్ఫటికములు బాగా కనపడును. 22 వబొమ్మలోను యీ స్ఫటికములు కానవగును. ఈ ఆరవ ఆవరణ శోషరసమండలమును తెలుపు ననవచ్చును. ఆరవ ఆవరణలో తెల్లటిమేఘములు కనుబడిన యెడల అచ్చటి శోషరసవాహికలు ఉబికి ఉన్నవనిగాని, చచ్చుబడిపోయిన వని గాని తెలుసుకొనవలెను. ఈ అవరణలోని స్ఫటికములు తెల్లగా నుండక మందులరంగులతో నుండుటయుగలదు. ఉబికిన శోష రసవాహికలను చచ్చుపడ గొట్టుటకు వాడిన మందుల రంగు లతో స్ఫటికములు కనబడుటయు కానవగును.

## శోషరసమండలము నకును, పాషాణపుగుర్తులకును గలభేదము

శోషరసమండలము యొక్క రంగునకును పాషాణపు రంగునకును తేడాగలదు. కనీనికానిదాన శాస్త్రములో అత్యద్భుతమైన కృషినిసలిపి తనజీవితమును ధారపోసినవారిలో లైలిక్విస్టుగారు ముఖ్యులు. వీరు స్వీడను దేశపు మతప్రచారకులు. వీరేమన్నారంటే- శోషరసవాహికల రంగునకును పాషాణపు రంగునకును తేడాలేదు. ఈరెండును ఒకటేనని పొరపాటు పడుటకు ఆధారము లేకపోలేదు. ఇనుముజీర్ణాశయములో చేరును అనగా యినుమునకును జీర్ణాశయమునకును అనురాగము గలదన్నమాట. అట్లనే పాషాణమునకును ప్లీహము, శోషరస వాహికలకును అనురాగముగలదు. శోషరసవాహికలను చచ్చుపడ చేయుటకు పాషాణపుమందులను వాడుతారు. పాషాణముతో తయారుచేసిన మందులను వాడుటవలన శోషరస వాహికలుచచ్చుపడవచ్చు. పాషాణపు మందులను వాడినపుడు తెల్లటిమేఘములుగాని, చుక్కలుగాని కనుపడును. ఈ మేఘములు కనీనికలో క్రింద సగములో కానవచ్చును. ఇవియు క్రమప్రకారముగా (వరుసగా) నుండవు. ఆరవఆవరణ శోషరసమండలము గాన యీమండలము వరుసగానే ఉండును.

ఈశోషరసమండలముయొక్క రంగునే సన్నిపాతజ్వర రంగు అనికూడా నామకరణము చేసినాము. సన్నిపాతజ్వరము వచ్చినపుడు అంతరవయవములలో అంటును చిన్నప్రేగులలో మంటలు పుట్టును. ఆమంటలను తగ్గించుటకు గాను మంచు

గడ్డను రబ్బరుసంచులలో భద్రముచేసి నుదుటి మీద పెట్టు దురు. ఇట్లు కట్టినందువలన అంతరవయవములలోని వేడి యెట్లు నిలబడిపోవునదీ గత ప్రకరణములో చదివినాము. సన్నిపాత జ్వరములో గలిగిన వేడిని తగ్గించుటకుగాను మందులను వాడుట యును గలదు. ప్రతిక్రియా సూత్రము ననుసరించి మందులను వాడినందువలన వేడి అట్లనే నిలబడిపోవును. రోగము 5 దశలను పొందనీక రెండుమూడుదశలలోనే (మందు వైద్యులు) ఆరోగమును అణచివేయుచున్నారు. గనుక శోషరసవాహికలన్నియు చచ్చు పడిపోవును. అంతరవయవములలోని మంటలన్నియు అట్లనే నిలబడిపోవును గనుక క్షయ, పాండురోగములుకలుగుచున్నవి. ఇట్లు వచ్చినరోగములతో బాధపడువారు తప్పక మృత్యువాతన బడుదురు. నయముకావు.

సన్నిపాతజ్వరమును అయిదుదశలను పొందనిచ్చిన యెడల యథాక్రమముగా పునర్నిర్మాణము జరుగును. దెబ్బలు తగిలి చెడిపోయిన కుటికలన్నియు బాగుపడును. ప్రకృతివైద్య పద్ధతులద్వారా సన్నిపాతజ్వరమును నయముచేసిన యెడల సన్నిపాతవురంగు కనీనికలో కనుపడదు.

## గమనిక.

సూర్యునికి తెల్లనికిరణములుండును. కనీనికలో తెల్లని కిరణములును, నల్లని కిరణములును ఉండును. చాలామంది కనీ నికలలో కనుపాపనుండి నల్లని కిరణములు బయుటకు వెడలును. ఈ కిరణములు తెల్లగానుండుటయు కలదు. కనుపాపనుండి బయులుదేరిన ఈ కిరణములును యేడవ ఆవరణదాకా వ్యాపించి

యుండును. మరికొందరిలో మూడవ ఆవరణవరకే యుండును. ఈ గుర్తులను ఆరోగ్యచిహ్నములనుగానే భావించవలయును. అనారోగ్య చిహ్నములనుగా భావించరాదు. గోధుమరంగు గల కనీనికలలో ఈ కిరణములు యెక్కువగా కనుపించును. శ్వేతనీలపురంగు కనీనికలలో యీ కిరణములు తక్కువగా నుండును. కనీనికా నిదానశాస్త్రజ్ఞులు యీ విషయమును గూర్చి తమ అభిప్రాయములను చెప్పనేలేదు. మూకీభావము వహించిరి. నా పదునెనిమిది సంవత్సరముల చికిత్సాలయపు అనుభవములోను యీ విషయమై ఒకసంగతి గ్రహించితిని. సామాన్యఆరోగ్యము General Health బాగుపడగనే యీకిరణములు లోపించినట్లు చాలా కేసులలో ప్రత్యక్షముగా చూచినాము. కనీనికయొక్క ముదురురంగు లోపించి, శ్వేతరంగు వచ్చునప్పటికే యీ కిరణములు లోపించినట్లు చూచినాము. 9వ బొమ్మలోను 10వ బొమ్మలోను యీకిరణములు బాగుగా కనుబడును.

మరొక విషయమును కూడా మనము జ్ఞప్తియందుంచుకొనవలెను. శ్వేతగోధుమరంగు, శ్వేత నీలమురంగు ఆరోగ్యచిహ్నములని లోగడ అధ్యాయములలో చదివినాము. శ్వేతగోధుమరంగు గల కనీనికల అడుగున, శ్వేతనీలమురంగు గనుపడును. ఈ శ్వేతనీలపురంగు 36 ప్రతినిధిభాగములలో ఒకదానిలోగాని, రెంటి, మూడింటిలోగాని, అన్నింటిలోగాని కనుపడును. ఇట్లు కనుపడుటను అనారోగ్య చిహ్నముగా భావించక ఆరోగ్యచిహ్నముగానే భావించవలయును.

# అధ్యాయము 6

## కనీనికరంగు

కనీనికరంగునుబట్టి రోగముల వంశానుగతత్వమును చెప్ప వచ్చునని గత అధ్యాయములో చెప్పినాము. వంశానుగతంగా వచ్చినరోగ ప్రవణతలుగల కనీనికరంగులు శీత ఉష్ణదేశముల లోని శీతలత్వమువలనను, ఉష్ణత్వము వలనను యెంతవరకు మారునదీ తెలిసికొనుటకు ముందు యేమియు రోగప్రవణత లేనివారి కనీనికరంగునుగూర్చి చెప్పుట అవసరముగాన ఆ రంగునుగూర్చి ముందుగా తెలిసికొందాము. ప్రకృతి నూత్రముల చాలా తరములనాడే మన తాతతండ్రులు విస్మరించినారు. ప్రకృతిసహజమైన గాలీ వెల్తురులకు దూరమైనారు. కాన యేమియు రోగప్రవణత లేని దేహములు చాలా అరుదుగా కనబడును. ఉన్న వారిలో ఆరోగ్యలక్షణములు గలవారిని యేరి కొని వారి కనీనికల రంగును తెలిసికొందాము.

ఇంతవరకు లభించిన చారిత్రకాధారములబట్టి ఆరోగ్య వంతుల కనీనికలు రెండురకములుగా నుండునట్లు తేలుచున్నది. లేతగోధుమ, లేతనీలము ఆరోగ్యవంతుల కనీనికల రంగులని చెప్పవచ్చును.

కనీనికరంగునుబట్టి జాతియొక్క ఔన్నత్యమును చెప్ప వచ్చును. ఈవిషయమునుగూర్చి ఒకటి రెండుసంగతులను తెలిసి కొందాము. ఇంతవరకు లభించిన చారిత్రకాధారములబట్టి ఆదిమజాతులలో నల్లటి కనీనికలు గలవారు లేనేలేరు. లేత

గోధుమ, లేతనీలము ప్రధానముగా గలదు. ఈ రెండురంగులే తరతమ భేదములతో ఉండెడివి. ఉన్నతజాతులవారు తక్కువ జాతులవారితో సంగమము చేసినపుడు వారికి గలిగిన సంతానముల కనీనికల రంగులు మారిపోయినట్లు డార్విను మొదలగు పదార్థతత్వవేత్తలు ఒప్పుకొనినారు.

ఈ సంకరజాతులవారికి ఉత్తమజాతుల లక్షణములుగాని తక్కువజాతుల లక్షణములుగాని ఉండవు. సోదాహరణముగా చెప్పవలెనంటే హిందూదేశములో పుట్టిన ఆవును ఇంగ్లాండులో పుట్టిన ఆబోతుతో కలిపినామనుకొనుడు. ఈ రెంటికినీ కలిగిన దూడ ఇంగ్లండులోని చలినీ భరించలేదు, హిందూదేశములోని వేడినీ భరించలేదు. రెంటికినీ చెడిన రేవడయగును. మరొక ఉదాహరణమును తీసికొందాము. గాడిదకును, గుఱ్ఱమునకును పుట్టినదానిని కంచరగాడిదయందుము. ఇది బలముగా కనపడినప్పటికినీ పై రెంటి లక్షణములును దీనిలో లోపించును.

ఈ సంకరజాతుల జంతువుల నన్నిటినీ మానవులు సావిళ్ళలో భద్రముచేసి జాగ్రత్తగా కాపాడుచున్నారు. కాబట్టే యింతవరకును బ్రతుకుచున్నవి. ఇట్లుసావిళ్ళలో భద్రము చేయక కాపాడక పోయినయెడల యిదివరకే నశించెడివి.

కనీనికల రంగునకును మానసిక శక్తులకును యేమైనా సంబంధము గలదేమో తెలిసికొందాము.

పూర్వము నీలపు కళ్ళుగలవారును, పసుపు రంగుజుట్టు గలవారును యెక్కువగా నున్నట్లు ప్రాచీనచరిత్ర చెప్పుచున్నది. గ్రీకుకవీశ్వరుడగు హోమరు తననాయకులను నీలపుకళ్ళు

వసుపురంగు జుట్టుగలవారలగానే వర్ణించినాడు. వ్యాయామ నిపుణుల కందరకును యీరెండు లక్షణములు ఉన్నట్లు నిదర్శనములు కనబడుచున్నవి.

పై లక్షణములుగల వారినే సైనికశాఖలోనికి ప్రధానముగా తీసికొనేవారు. దీనికి నిదర్శనములు కావాలంటే - నీలపుకళ్లుగల పిల్లలు వాన కురియుచున్నను బయట ఆడుకొనుటయు, గోధుమరంగు కనీనికలుగల పిల్లలు మూల కూర్చొనుటయు మన మందర మెరిగినవిషయమే లేతగోధుమరంగు కనీనికలు గలవారు చన్నీటిని చూచిన భయపడుదురని హోమోపతీవైద్యము చెప్పును.

ఆహారవిహారములలోని లోపమువలనను, సుఖరోగములతో బాధపడుచుండుట వలనను, మందుల సేవించినందువలనను, టీకాలవలనను, ముందెప్పుడో వచ్చు రోగములు రాకుండా కాపాడుటకు వాడుమందుల వలననూ కనీనికల రంగులు మారుచున్నట్లు కనబడుచున్నది. మొదటిలో లేత నీలముగా నున్న కళ్ళు మందుల సేవించిన తరువాత నల్లబడుట మనము ప్రత్యక్షముగా చూచుచున్నాము. లేత గోధుమరంగు కనీనికలు గలవారికన్న, లేతనీలమురంగు కనీనికలు గలవారు మామూలు పరిస్థితులలో యెక్కువ కాలము బ్రతుకుదురని చెప్పవచ్చును.

పైన చెప్పిన విషయమునకు ఒక అవాంతరము గలదు. లేతనీలము కనీనికలు గలవారు తాము ఆరోగ్యవంతుల మని, దృఢకాయుల మనీ, గర్వించి తమశక్తి నంతనూ దుర్వినియోగము చేసికొని అకాలమృత్యువువాత బడుచున్నారు. లేత

గోధుమరంగు కనీనికలు గల వారు తమ దేహముల యొకటి నుండి జాగ్రత్తగా కాపాడుకొనుటచేత యెక్కువ కాలము బ్రతుకుచున్నారు. వ్యాయామ నిపుణులైనను అకాలములోనే చనిపోవుటకు కారణము నేటికి మనము కనుగొనుచున్నాము.

ఆర్య లందఱకును నీలపు కనీనికలే గలట్లు చరిత్ర చెప్పుచున్నది. క్రిష్టఫరు కొలంబస్ కళ్లు నీలముగా నున్నట్లును పరాసువీరుడగు నెపోలియన్ కళ్ళు నీలముగానే ఉన్నట్లును చరిత్ర ఘోషించుచున్నది.

ఐరోపాఖండములో ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చినయెడల కనీనికరంగు చిక్కపడిన కొలదినీ దైహిక, మానసికశక్తులు తగ్గినట్లును మనము ప్రత్యక్షముగా చూచు చున్నాము. కనీనికరంగు చిక్కబడుటతో పాటు రోగము పెరుగును. రోగనిరోధక శక్తి తగ్గును. కెనడా, ఉత్తరఅమెరి కాలలో నివసించువారు చురుకుగా నుందురు. కెనడా, ఉత్తర అమెరికాలలో నివసించువారికన్న దక్షిణ అమెరికాలో నివ సించువారు మందమతులు. దక్షిణఅమెరికాలో నివసించువారి కన్న మెక్సికోలో నివసించువారు మందబుద్ధులు. మెక్సికోలో నివసించు వారికన్న బ్రెజిలియన్‌లు యింకా మందబుద్ధులు. కనీనికలు నల్లబడు కొలదినీ బుద్ధి మందగించును. దైహిక మానసిక శక్తులునూ కుంటుపడును. ఇంతవరకూ చదువుకొన్న దానిని బట్టి కనీనికరంగు, సాంద్రత, వంశానుగతముగా వచ్చు రోగప్రవణతలను మూడింటెనిబట్టి యెంతకాలము బ్రతుకు నదియు చెప్పగలము. రంగునుబట్టిగాని, వంశానుగతముగా

వచ్చు రోగవ్రిణతను బట్టిగాని, సాంద్రతనుబట్టిగాని, ఒక్క-దానిని బట్టియే యెంతకాలము బ్రతుకునదీ చెప్పలేము.

ఇకను రోగమువలన కనీనికరంగు యేమైనా మారునేమో తెలిసికొందాము.

తక్కువ జాతులవారితో సంగమము చేసినందువలన కనీనికరంగు మారును. ఆహార విహారములలోని లోపముల వలనను, తరుణ కాలికరోగములను రసవిషపాషాణాదులతో అణచిపెట్టుటవలనను కనీనికరంగు మారును. ముదురు నీలపురంగు కనీనికలు కలవారును, ముదురు గోధుమరంగు కనీనికలు గలవారును ఆహారవిహారముల సరిచేసికొని ప్రకృతి చికిత్సను పొందినయెడల ఆయా ముదురు రంగులు పల్చబడి లేతరంగుగా మారుట ప్రత్యేకముగా చూతుము. ప్రకృతి చికిత్స చేయుటవలన ముదురురంగు పల్చబడి లేతరంగుగా మారిపోవును. ఆరోగ్యము కల్గిన కొలదినీ కనీనిక రంగు పల్చనగును.

రోగము ముదిరినకొలదిని, అనగా ఆరోగ్యము తగ్గిన కొలదినీ, కనీనికరంగు చిక్కబడును. ఆరోగ్యము హెచ్చిన కొలదినీ కనీనిక రంగు చిక్కబడదు. అనారోగ్యము(రోగము) హెచ్చిన కొలదినీ కనీనికరంగు పల్చబడదు. ఆరోగ్యము కలిగిన కొలదినీ కనీనిక రంగు పల్చనగును. మనిషిని పలుకరించకనే కనీనికల చూచి ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించునది, లేనిది మనము చెప్పగలము. మా ఆసుపత్రిలో నిత్యమును ఈ పనిని చేయుచుండెడివారము. ఒక కేసులో కూడా పైసిద్ధాంతములకు వ్యతిరేకముగా మేముచూడలేదు.

దేహములో నాల్గు బహిష్కార్యావయవములు గలవు. దేహములో తయారగు రసాయనిక మురుగు అంతయూ యీ నాల్గు దోవలా బయటకు పోవును. (చిన్న పేగులు, మూత్రపిండములు, చర్మము, శ్వాసాశయములు) ఈ నాల్గుత్రోవలలో యేఒకత్రోవనైనా రోగపదార్థముబయటకు పోవుచున్నయెడల ఆ అవయవమును తెలుపు కనీనికా ప్రతినిధిభాగములోని రంగు పల్చగా కానవచ్చును. కనీనికలోని మిగిలిన ప్రతినిధిభాగములలోని రంగులోని చిక్కతనము ఆ బహిష్కార్యావయవమును తెలుపు ప్రతినిధి భాగములోని రంగులో నుండదు. ఈ సంగతినిబట్టి మిగిలిన అవయవములకన్న ఈ అవయవముచాలా ఆరోగ్యముగా నున్నట్లు గ్రహించ గలము.

ఈ సంగతిని విశదముగా తెలియ చెప్పుటకు ఒక కథ చెవుతాను.

ఒక రోజున మా ఆసుపత్రిలోనికి ఒక పెద్దమనిషి వచ్చెను. ఈయన చిన్నప్పటినుండి జబ్బులతో తీసుకొను చున్నాడు. అంతులేని మందుల సేవించాడు. కనీనికలు బాగా నల్లగానున్నాయి. ఊపిరితిత్తులను తెలుపు ప్రతినిధి భాగము లోని రంగుమాత్రము పల్చగా నున్నది. మిగిలిన ప్రతినిధి భాగములోని రంగు చిక్కగా నున్నది. మిగిలిన ప్రతినిధి భాగములలోని రంగు చిక్కగా నుండుటకును ఊపిరితిత్తులను తెలుపు ప్రతినిధి భాగములలోని రంగు పల్చగా నుండుటకును గల తేడాను మా విద్యార్థులను అడిగినాను. వారేమియు సరి

ధైన సమాధానము చెప్ప లేదు. అప్పుడు ఆ పెద్దమనిషికిని నాకును ఈ క్రింది సంభాషణ జరిగినది.

నేను—రెండు మూడు సంవత్సరములనుండి మీకు గొంతులో నొసగా నుంటున్నది.

పెద్దమనిషి:—అవును.

నేను:—కళ్లె పడుచుండును.

పెద్దమనిషి:—అవును

నేను:—మీకు తరచుగా జలుబు చేయుచుండును.

పెద్దమనిషి:—అవును, నొస చాలా రోజులనుండి అసహ్యముగా నున్నది. ఎప్పటికినీ పోవునట్లు లేదు. ఇది పోవు మార్గమును తెలిసి కొనుటకే మీదగ్గఱకు వచ్చినాను.

నేను:—ఆ నొస ఉన్నది కాబట్టే యిన్నిరోజులు మీరు బ్రతుకగలిగినారు. లేకపోతే యిదివఱకే యాత్రకు పోయే వాడివి. మిగిలిన మూడు బహిష్కార్యవయవములును రోగ పదార్థముతో నిండి ఉన్నవి. దేహములో తయారగు మురుగును బయటకు పంపలేకున్నవి. శ్వాసాశయములు మాత్రము బాగుగాపనిచేయుచున్నవి. మూత్ర పిండములుబాగుగ చెడి పోయినవి.

జీర్ణావయవములు, శ్వాసాశయములు మూత్రపిండములను మరీ చెడకుండా కాపాడినవి.

ఈ కేసులో ఒక విచిత్రము గలదు. ఈరోగి హోమోపతీ మందులనే సేవించాడు. ఆ హోమోపతీ మందువలననే ఆ శ్వాసాశయములు యింతవరకును పనిచేయుచున్నవి.

హోమోపతీ మందులు రోగపదార్థ బహిష్కరణకే తోడుపడు నుగాని రోగపదార్థమును అణచి వేయవు. అలోపతీ మందుల సేవించిన యెడల ఆ అవయవము యిదివరకే స్తంభించిపోయె డిది. ఎట్లాగంటే-చురుకుగా నున్న అవయవము పనిచేసి చెడి పోవు నని అలోపతీ వైద్యులు ఆ అవయవమును మందులతో స్తంభింపచేస్తారు. వారు వాడుమందులవలన ఆ అవయవము చచ్చుపడిపోవును. అలోపతీవారు యిచ్చు క్వినైను, నల్లమందు కలసిన మందులన్ని దేహ వ్యాపారము స్తంభించి పోవుటకును, క్రొత్తరోగములు వచ్చుటకును సాయపడెడివి. ఈ మందుల ఫలితముగా చావుకూడా వచ్చెడిది. చావక బ్రతికినయెడల ఊపిరితిత్తులు చిల్లులు పడిపోయెడివి. కనీనికలోని ప్రతినిధి భాగములలో నల్లగీతలును చుక్కలును కనుపడెడివి

కనీనికరంగు- శీతోష్ణము:—

కనీనికరంగునకును శీతోష్ణములకును ఏమైనా సంబంధము గలదేమో విచారింతము. శీతోష్ణములవలన కనీనికరంగు మారునేమో తెలిసికొందాము. ఉష్ణదేశములోని వేడివలనను చలిదేశములోని చలివలనను కనీనికరంగు, జుట్టురంగు మారు నేమో చూతాము.

హిందూదేశము మొదలగు ఉష్ణదేశములలోని వేడివలన కనీనికలు నల్లబడుననియు, జుట్టునల్లబడుననియు మామూలుగా అనుకొంటారు. కానీ ఈ మాటలు యుక్తముగా కనుబడుట లేదు. వేడిదేశములలో నల్లజాతులు యెక్కువగా నుండుట వలన యీ అపవాదము ప్రబలిపోయినది.

శీతోష్ణములవలన కనీనికలరంగునూ, జుట్టురంగు కొద్దిగా నేమారును. ఈ మార్పుకూడా కొద్దికాలమే నిలుచును. ఎల్లకాలము నిలువదు. ఉష్ణదేశమగు ఆఫ్రికాఖండములో నివశించు డచ్చివారి కనీనికలు నీలముగానేఉండును. రష్యా మొదలగు ఉష్ణదేశములలో నివసించువారి కనీనికలు లేతగోధుమరంగుగానే ఉండును. ఉత్తమజాతులకు కలిగినసంతానము యెంత వేడి దేశములో నున్నప్పటికిని వారికనీనికలు లేతనీలముగాగాని, లేత గోధుమరంగుగాగాని ఉండును.

---

## అధ్యాయము 7

## సాంద్రిత

కనీనికయొక్క (1) రంగు (2) సాంద్రిత (3) రోగ పరిణతల చిహ్నములు - యీ మూడింటినిబట్టి దేహారోగ్యమును చెప్పవచ్చునని గత అధ్యాయములో చదివినాము. ఈ అధ్యాయములో స్వాంద్రిత యననేమో, యెన్నిరకములగు సాంద్రితలుండునో తెలుసుకొందాము.

రక్తము మలినములతో నిండిపోయినప్పుడు కనీనికరంగు చిక్కగా నుండును. రక్తములో మలినములు లేక నిర్మలముగా నున్నప్పుడు కనీనికరంగు పల్చగా నుండును. రక్తము మలినములతో నిండిపోయినపుడు కనీనికలో ముదురురంగు కనబడును. మలినములు లేనప్పుడు లేతరంగు కానవగును.

కనీనికయొక్క రంగు రక్తములోని మాలిన్యముల తెలుపునట్లుగా, కనీనికయొక్క సాంద్రిత దేహములోని ధాతు శక్తిని, రోగనిరోధక శక్తిని తెలుపును. కనీనిక సాంద్రిత యన నేమో తెలిసికొనుటకుముందు కనీనికయొక్క స్వభావమును తెలుసుకొందాము. కనీనికలో అయిదు పొరలుండును. దేహము లోని కండరములలోను, నరములలోను, నాడులలోను మలిన ములు లేనియెడల ఈ అయిదు పొరలును ఒకదాని వెంబడి మరొకటి యుండును. అప్పుడు కనీనిక నిర్మలముగా, ముత్యము లోని పెంకుమాదిరిగా నుండును. దేహములో అనుక్షణమూ తయారగు మలినములు బయటకుపోక లోపలనే నిలచిపోయిన యెడల ఈ అయిదు పొరలు క్రమముగా ఒకదాని వెంబడి మరొకటి ఉండక మెరక పల్లములుగా కానవగును.

స్వేచ్ఛగా తిరుగు జంతువుల కనీనికలను చూచిన యెడల మొదటి రకమగు సాంద్రిత కనబడును. స్వేచ్ఛగా తిరుగు జంతువులు మనకు కనుబడవు. అందువలన మొదటి రకమగు సాంద్రిత గల కనీనికలను మనము చూడము. మొదటి రకమగు సాంద్రిత కాస్తకూస్త లోపముతో పిల్లల కనీనిక లలో చూడగలము. కుక్కల కళ్లలో మాత్రము మొదటి రకము సాంద్రితగల కనీనికలు కనబడవు. యజమానుల మాదిరి కుక్కలుకూడా అసహజమైన ఆహారములకు లోనై నానావిధమైన రోగములకు గురియగుచున్నవి. అంతర్గ్రంథి ముల పుట్టు పూర్వోత్తరముల గూర్చి పెక్కు పరిశోధనలు చేసిన బర్టన్ హీన్ డ్రిక్కుగారు యేమన్నారంటే - యజమా




6-వ బొమ్మ

వివరణ— కనీనికలలోనుండు వివిధమగు సాందృతలు యిందులో చూపబడుచున్నవి.

1. ఈ రకములో చాలా సన్నని గీతలు గలవు. పసిపిల్లల కనీనికలు యీ రకముగా ఉంటాయి. కొండలమీద తిరుగువారి కనీనికలును, నావికుల కనీనికలును యీ రకముగానే ఉంటాయి. రోజువారీగా యీ రకమగు సాందృతగల కనీనికలు గలవారు చాలా అరుదుగా ఉంటారు.
2. సర్వసామాన్యముగా అందరి కనీనికలును యీరకమగు సాందృతలోనే వుంటాయి. తెల్లగీతలు ఎక్కువగాను నల్లగీతలు తక్కువగాను ఉంటాయి.
3. లోపభూయిష్టమైన సాందృతలో తెల్లగీతలు, నల్లగీతలు దాదాపు సమానముగా ఉంటాయి. వీరు యెల్లకాలము మందుల సేవిస్తూనే వుంటారు. ఒకప్పుడును రోగవిముక్తులు కారు.
4. నల్లగీతలు చాలా యెక్కువగా ఉంటాయి. మృత్యువుకు చాల సన్నిహితంగా నుంటారు.

నులలో మాదిరిగనే కుక్కలలోనున్నా అంతర్వ్రణములు యెక్కువగుచున్నవని సెలవిచ్చారు.

## లోపభూయిష్ఠమైన సాంద్రత

దేహమంతా రోగపదార్థముతో నిండిపోయినపుడు కనీనికలోని సాంద్రతలో లోపములు కనుబడును. రోగపదార్థపు తీవ్రతనుబట్టి కనీనికా నిదానశాస్త్రజ్ఞులు నాల్గురకము లగు సాంద్రతలను పేర్కొన్నారు. ( బొమ్మ 6 )

రోగపదార్థములోని తీవ్రతనుబట్టి కనీనికలోని 5 పొరలు ఒకదానివెంట మరొకటి క్రమప్రకారమునుండక మెరక పల్లములుగ నుండును. కనీనికలో నల్లగీతలు కనబడును. నల్లటిచుక్కలును కానవగును. కుటికలు లోపించిననేగాని యిటువంటి నల్లటిగీతలు, చుక్కలు కనబడవు. అవయవములు లోపించినపుడు ఈ గీతలు మరింత తీవ్రముగా కనుబడును. గుడ్డగూబ కనీనికలో ఇట్లు కనబడిన నల్లగీతయే, వాన్ పెల్ జెలీకి యీ నిదానమును కనుగొన ప్రోత్సహించినది. దేహము రోగపదార్థముతో నిండిపోయినపుడే తక్కువ రకమగు సాంద్రతలు కనుబడును. ధాతుశక్తి తగ్గినకొలదినీ, కనీనికసాంద్రత తగ్గును. అనగా తక్కువ రకపు సాంద్రత కలదగును. సాంద్రతయొక్క తర, తమ భేదముల చెప్పుటకు మందుల రంగులను, సోరామచ్చలను, కనీనిక యేడవ ఆవరణలోని రంగును ఆధారముగా తీసికొనరాదు.

కనీనికలోని సాంద్రత, బొమ్మలోని 1 వ భాగములో

ఉన్నట్లు ఉన్నయెడల, దేహములో రోగపదార్థము కొద్దిగా నున్నదని చెప్పుదుము. కసీనికలోని సాంద్రిత బొమ్మలో 2 వ భాగములో ఉన్నట్లు ఉన్నయెడల రోగపదార్థము మొదటి భాగములో కన్న ఎక్కువగా నున్నదనే చెప్పుదుము. కసీనిక లోని సాంద్రితబొమ్మలో 3 వ భాగములో ఉన్నమాది రిగా ఉన్నయెడల, రోగపదార్థము రెండవభాగములోకన్న ఎక్కువగా చేరినదందుము. కసీనికలోని సాంద్రిత బొమ్మలో 4 వ భాగములో ఉన్నట్టు ఉన్నయెడల, రోగపదార్థము మరింత హెచ్చినదనియు చెప్పగలము.

మానవకోటి ప్రకృతి సూత్రములను చాలా తరముల నాడే విస్మరించారు. విస్మరించుట చేతను, ఆహారవిహారము లలో మార్పువచ్చుటచేతను రోగపదార్థము ఎక్కువగాచేరుట మొదలు పెట్టినది. ఈ రోగపదార్థమునుండే అసంఖ్యాకము లగు రోగములు పుట్టుచున్నవి. రోగపదార్థములు దేహము నకు విజాతీయమైనవి గాన, నిలువచేరినంత, దేహమునకు హాని చేయును. దేహమునకు హాని కలుగకుండులాగున దేహము లోని ప్రకృతి రోగపదార్థమును ఎప్పటికప్పుడు బయటకుపంపు టకు ప్రయత్నము చేయుచుండును. గజ్జి, తీట, చీడ, చుండు, కర్పాణి మొదలగు చర్మరోగములును, గ్రహణి, అతిసారము, కలరా, జ్వరము, మశూచికము, సన్నిపాతము మొదలగు తరుణరోగములును రోగపదార్థమును బయటకు పంపుటకు ప్రకృతి చేయు ప్రయత్నములే.

రోగపదార్థము పిత్రియముగాను రావచ్చును. స్వార్జిత ముగాను రావచ్చును. తల్లిదండ్రుల ఆహారవిహారములలోని



7-వ బొమ్మ

వివరణ—సన్నని నాడీవుంగరములు యీ బొమ్మలో చూపబడినవి.

లోపమువలన శిశువు భూపతనము కాకపూర్వమే రోగపదార్థ ముతో నిండియుండును. ఇట్లు పితృక్రియముగా సంక్రమించిన రోగపదార్థము శిశువుయొక్క ఆహారవిహారములలోని లోప ములతో మఱింత వృద్ధియగును. ఇట్లా పేరుకొన్న రోగపదార్థ మును జగన్మాతయగు ప్రకృతి యెప్పటికప్పుడు బయటకు నెట్టుటకు ప్రయత్నము చేయుచుండును. చిన్నపిల్లలకు తరచుగావచ్చు గవదబిళ్ళలు, పొంగు, ఆటలమ్మ, జలుబు మొదలగునవన్నీ యిందుకు వచ్చినవేను.

ఈ జబ్బులన్నీ ఒకటి రెండు తడవలు మనయందఱకు వచ్చిపోయినవే. రానివారు లేనేలేరని చెప్పవచ్చును. మనందఱకు పుట్టినప్పటినుండీ ఒకటి రెండు తడవలు ఈ జబ్బులు వచ్చుటను బట్టి మన మొక సంగతిని గ్రహించవచ్చును. దేహములో నేమూల నున్న రోగపదార్థమునైనను ఎప్పుడో ఒకప్పుడు బయటకు పంపి దేహమునకు ఆరోగ్యము చేకూర్చుటకుగాను జగన్మాతయగు ప్రకృతి ఎల్లప్పుడును ప్రయత్నము చేయుచుండును. ఇట్లు బయటకువచ్చు రోగపదార్థమును మందులతో అణచిపెట్టరాదు. మామూలు శైత్యోపచారముల తోనే రోగపదార్థబహిష్కరణకు ప్రకృతికి సాయము చేయవలెను. రోగపదార్థ బహిష్కరణ జరుగుచున్నప్పుడు మళ్ళీ పిండిపదార్థమును లోపలకు పంపరాదు. అట్లు లోనికి పంపిన యెడల ప్రకృతి పాత, క్రొత్త సరుకులను రెంటినీ బయటకు పంపవలసివచ్చును.

రోగపదార్థము దేహములో నేమూలనైనను చేరవచ్చును. ఒకేమూల చేరవలెనను నియామకము లేదు. తల్లి

దండు1ైల అనారోగ్యమునుబట్టి కొందరిలో రోగపదార్థము ముందుభాగములో చేరును. అనగా చిన్న పే1్రగులలో చేరును. దీనిని పురోభారమందుము. మరికొందఱకు కుడిపార్శ్వములో చేరవచ్చును. మరికొందఱకు ఎడమపార్శ్వములో చేరవచ్చును. ఇంకా కొందఱకు దేహములో వెనుకభాగములో చేరవచ్చును. దీనిని పృష్ఠభారమందుము.

రోగపదార్థము ముందుభాగములో చేరినయెడల త్వరగా బహిర్గత మగును. త్వరగా బహిర్గతమగునుగాన పురోభారము వలన వచ్చిన రోగములు త్వరగా కుదురును (నయమగును). కుడిపార్శ్వభాగమువలన వచ్చిన రోగములు ఇంకా ఆలశ్యముగా కుదురును. ఎడమపార్శ్వములో ప్రధాన అవయవములు ఉండుటచేత వామపార్శ్వభారముతో వచ్చిన రోగములు ఎక్కువ కాలమునకుగాని కుదరవు. దేహమునకు వెనుకభాగము నందు నాడీమండలముండును. పృష్ఠభారములో యీనాడీమండలము చెడును. ఈ నాడీమండలము చెడుటచే కల్గిన రోగములు చాలాకాలమునకుగాని కుదరవు. షుమారుగా చెప్పవలెనంటే పురోభారమువలన వచ్చిన రోగములు మూడు నెలలలో నయమైనయెడల కుడిపార్శ్వభారమువలన వచ్చిన రోగములు ఆరు నెలలలోగాని కుదరవు. వామపార్శ్వభారము వలన వచ్చినరోగములు సంవత్సరమునకుగాని కుదరవు. పృష్ఠభారమువలన వచ్చిన రోగములు కుదురుటకు రెండు సంవత్సరముల కాలము పట్టును. భారములో తేడావుండుటచే కొందరి రోగములు తొందరగాను కొందరి రోగములు ఆలశ్యముగాను కుదురును.

పైనచెప్పిన నాల్గురకములగు భారము లేగాక మరొకరక మగు భారము కూడా గలదు. దీనిని సార్వత్రిక భారమందుము. దేహములో రోగపదార్థము అన్నివైపులా వ్యాపించియుండును. మొత్తమంతటా ఆవరించును. ఈ భారమువలన వచ్చిన రోగ ములు కుదురుటకు మరీ యెక్కువకాలము పట్టును.

దేహములోని రోగనిరోధకశక్తిని బట్టిపిన్నిరోగములు త్వరగాను, ఆలస్యముగాను కుదురును. దేహములో ధాతుశక్తి బాగుండి, రోగమును నిరోధించగల సామర్థ్యము బాగా ఉన్న యెడల ఏభారమువలన వచ్చిన రోగమైనను త్వరగానే కుదు రును ధాతుశక్తి తగ్గిపోయి, రోగనిరోధకశక్తి కుంటుపడిపో యిన యెడల పురోభారముతో వచ్చిన రోగమైనను ఆలస్య ముగా,గాని నయముగాదు. పుట్టినది మొదలుకొని ఆరు సంవ త్సరములు వచ్చేవరకు పసిపిల్లలకు జబ్బులు వచ్చుచునే ఉండును. మొదటి అయిదు సంవత్సరములలో రోగములు రాకపోయినప్పటికిని ఆరవ సంవత్సరములో నైనను తప్ప కుండా వచ్చును. దేహములో నాల్గు బహిష్కార్యవయవములు గలవు.

అవేవన:— (1) మలకోశము (2)మూత్రపిండములు (3) ఊపిరితిత్తులు (4) చర్మము. ఈ నాల్గు బహిష్కా ర్యవయవములు తృప్తికరముగా పనిచేయుచున్నంతవరకును ఏమియు రోగమురాదు. ఈ నాలుగు అవయవములలో నేఒక టైనను పనిచేయలేనియెడల దానిపని మిగిలిన మూడును చేయును. మలకోశము సరిగా పనిచేయనియెడల మూత్రము ఎక్కువ అగును. ఇట్లనే మిగిలినవీని. నాల్గు బహిష్కా

ర్యవయవములలో యే ఒకదాని ద్వారానైనను రోగపదార్థము వెడలుచున్నప్పుడు ఆ అవయవమును తెలుపు ప్రతినిధి భాగములో తెలుపుగీత కనుబడును. 10-వ బొమ్మను చూచినయెడల ఈ విషయము బాగుగా బోధపడును. మిగిలిన ప్రతినిధిభాగములోని రంగులో మాత్రము యేమియు మార్పురాదు. సోదాహరణముగా చెప్పవలెనంటే మూత్రి మెక్కువ యగుచున్న యెడల 19-వ ప్రతినిధిభాగములోని రంగులో మార్పు కలుగును. మిగిలినప్రతినిధిభాగముల రంగులలో యేమియు మార్పురాదు.

గ్రహణి,అతిసారములతో బాధపడుచున్నయెడల ఎడమ కనీనికలోని 21 వ ప్రతినిధిభాగములో రంగులో మార్పు కలుగును. జలుబు చేసినగాని, గొంతుకలో నొప్పి యున్నగాని 28 వ ప్రతినిధిభాగములోని రంగులోను మార్పు కనబడును. గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి మొదలగుచర్మ రోగములతో బాధపడుచున్నయెడల కనీనికలోని యేడవ ఆవరణలోని రంగులో మార్పుకలుగును.

రోగపదార్థము బయటకుపోయి ఆరోగ్యము కలిగినకొలదీ కనీనికయొక్క ముదురురంగు పోయి, లేతరంగు వచ్చును. దీనినే కనీనిక యొక్క అసలురంగు అనవచ్చును. లేత నీలముగాని, లేత గోధుమగాని రావచ్చును.

దేహములోని రోగపదార్థమును ప్రకృతి బయటకు నెట్టివేయునని మనము లోగడనే చదువుకొన్నాము. గజ్జి, తీట చీడ, చుండు మొదలగు చర్మరోగములద్వారా బయటకు వచ్చు

రోగపదార్థమును బయటకు రానీక మందులతో అణచివేసిన యెడల కనీనికలోని ఏడవ ఆవరణరంగులోని రంగు మరింత నల్లపడును. కనీనికలోని ఏడవ ఆవరణరంగు నల్లపడి, చర్మము తనస్వధర్మమును నిర్వర్తించ లేదని తెలియగానే రోగము కాలికమైనదని గ్రహించవలయును.

రోగపదార్థ బహిష్కరణ జరుగు ప్రదేశములను తెలుపు ప్రతినిధిభాగములలో తెలుపు రంగు కనబడునని లోగడనే తెలుసుకొన్నాము. మిగిలిన ప్రతినిధిభాగములలోని రంగునకు బహిష్కరణ జరుగు ప్రతినిధిభాగములోని రంగునకును తేడా కనపడును. మిగిలిన ప్రతినిధిభాగములలోని రంగు కన్న ఈ ప్రతినిధిభాగములోని రంగు లేతగానుండును. అంత ముదురు రంగుగా నుండదు. ఈ రంగుల తేడా కనీనికలో ఎట్లు ప్రతిబింబించినదో తెలిసికొందాము.

దేహములో ఎన్ని అవయవములున్నవో కనీనికలో అన్ని ప్రతినిధిభాగములు గలవు. అంతరవయవములలో ఒకదానిలో నైనను ఉద్రేకము కలిగినయెడల ఆ అవయవమును తెలుపు ప్రతినిధిభాగములో తెల్లటి చుక్కలుగాని, తెల్లటి గీతలుగాని, తెల్లటి మేఘములుగాని కనుబడును. దేహములోని అంతరవయవములలో ఒకటి, రెంటిలోనేగాక అన్నిటిలోను ఉద్రేకము కల్గినయెడల కనీనిక అంతటిలోను తెలుపురంగు కానవగును. హిస్టీరియా, మానోమానియా, సింఘోమానియా మొదలగు నాడీవ్యాధులతో బాధ పడువారి కనీనికలును, జ్వరము, మశూచికము, సన్నిపాతము మొదలగు తరుణరోగ

ములతో బాధపడువారి కనీనికలును మెరుస్తూనే తెల్లగానే యుండును.

ప్రతి తరుణవ్యాధియు దేహమును శుభ్రపరచుటకే వచ్చును. తరుణరోగము నయమైపోగానే వెనుకటికన్న ఆరోగ్యముకల్గును. అవయవములలోని ఉద్రేకముతగ్గి స్వాస్థ్యము కలుగగానే కనీనికలోని తెలువు తగ్గును. కనీనికయొక్క మామూలురంగు వచ్చును.

రోగమునకు అయిదు దశలు గలవు. మొదటి రెండు దశలును రోగముయొక్క పుట్టుకను తెలువును. ఈ రెండు దశలను ఉత్పత్తి, చయము అని చెప్పవచ్చును. మూడవ దశను ప్రకోపము అందుము. ఈ దశలో రోగము బాగా ఉచ్ఛస్థితిలో నుండును. నాల్గవదశను ఉపశమనము అందుము. ఈదశలో జ్వరము, మంటలు పూర్తిగా తగ్గిపోవును. అయిదవదశను శాంతియందుము. ఈ దశనే పునర్నిర్మాణ దశ యనియు చెప్పవచ్చును. ఈదశలో దెబ్బలు తగిలి చెడిపోయిన కుటీకలన్నియు బాగుపడును. మొదటి నాలుగు దశలకన్న నిది చాలా ప్రమాదమైన దశయని చెప్పవచ్చును. తరువాత జీవితమంతయు దీనిమీదనే ఆధారపడును. పునర్నిర్మాణము చేయుటలో ప్రకృతికి సాయము చేయవలయును. నిర్మాణము పూర్తియగు నప్పటికి కనీనికలోని తెలువురంగు లోపించును.

అస్థి నిర్మాణము ననుసరించి కనీనికలోని పొరలలోని తెలువురంగు ఎట్లు ఏర్పడునదీ తెలుసుకొందాము. లండను రాజసభలో వివిధ దేశాధిపతులకు ఎటులు ప్రత్యేకస్థానములు

గలవో అట్లనే దేహములోని ప్రతిచిన్న అవయువమునకును కనీనికలో ప్రత్యేక ప్రతినిధిస్థానము గలదు. ఆ అవయువములో కలిగిన ప్రతిచిన్నమార్పు ఆ ప్రతినిధిస్థానములో కన్పడును. ఆ అవయువములోని మంటలు తగ్గిపోగానే కనీనికలోని ప్రతినిధిభాగములోని మార్పునూ లోపించును. జల్లెడగా అల్లుకొని పోయిన సూక్ష్మాతి సూక్ష్మమైన నరములలో ఒక దానికైనను సంకోచము రాగానే దానిప్రక్కన ఉన్ననరము స్వస్థానమును వదలి జారిపోవును. జారి పోయినప్పుడు పల్లముగా కనబడును. క్రింది నరములలో సంకోచము కల్గిన పైనరములు క్రిందకు జారును. అప్పుడునూ పల్లముగానే ఉండును.

అంతరవయువములలోని లోపములు పోగానే ప్రతినిధి భాగములలోని నరములును వాటిస్వస్థానమునకు పోవును. జారిపోయిన నరములన్నియు స్వస్థానమునకు చేరును. మెరక పల్లములు ఉండవు. కనీనిక రంగంతయు ఒకటిగానే ఉండును.

ఆపరేషను చేసినప్పుడు అంతరవయువములు లోపించును. అంతరవయువములు లోపించినపుడు కనీనికలోని ప్రతినిధిభాగములో మూలగీతలు కనుబడును. అంతరవయువములలో మంటలు పుట్టినప్పుడు నూటెగీతలు కనుబడును. 18 వ బొమ్మలోని 18 వ ప్రతినిధి భాగములోని మూలగీతల వలన ఈసంగతి బాగా విశదముకాగలదు. 28 వ బొమ్మలోని ఎడమకనీనికలోని 18 వ ప్రతినిధి భాగములోని మూల గీతల వలననూ బాగా విశదము కాగలదు.

# అధ్యాయము 8



## బహిష్కార్యావయవములు

మన తాతతండ్రులు చాలాకాలమునాడే ప్రకృతి సూత్రముల విస్మరించుటచే జీవితమునకు ప్రాణాధారమైన గాలీ,ఎండలు చుట్టపుచూపులైపోయినాయి. ప్రతిక్షణము ఇట్లనే జరుగుచుండుటచే ప్రకృతిలోని సూక్ష్మశక్తులకు దూరమై పోతున్నాము. ఎంతదూరమై పోయినామంటే మామూలుగా భరించగలిగిన గాలి యెండలలోనికి పోతే ప్రాణాపాయము కలుగుతుందేమో ననుభయ మేర్పడినది.

చాలా తరములనుండి యిట్లు జరుగుచుండుట చేత సామాన్యముగా అందరిలోను కనీనిక యొక్క వెలుపటి ఆవరణ నల్లగానే ఉండును. ఈ వెలుపటి ఆవరణను వాన్ పెక్ జెలే లహాన్ మొదలగు కనీనికా నిదాన శాస్త్రజ్ఞులు Scurf - rim అని నామకరణము చేసినారు. Scurf - rim అనగా అంచు. వీరేమని అభిప్రాయపడినారంటే గజ్జి, చీడ మొదలగు వంశానుగతముగా వచ్చిన రోగపదార్థమును అణచిపెట్టుట చే నిది యేర్పడినది. కనీనికా నిదానశాస్త్రము చిఱుత ప్రాయ ములోనే అప్పటికి ఉండుటచేతను, నెక్కువగా విస్తృతము కాకపోవుటచేతను, అంతకన్న నెక్కువగా వారు చెప్పలేక పోయినారు.

ఈ నిదానశాస్త్రములో పరిశోధనలు జరిపి, తమ జీవితముల ఆ పరిశోధనలకే వినియోగపరచినతరువాత శాస్త్రజ్ఞ

లందఱును కనీనికలోని వెలుపటి ఆవరణను మఱొకవిధముగా నామకరణము చేసిరి. వారేమన్నారంటే కనీనికలోని వెలుపటి ఆవరణ చర్మమును తెలుపును. వెనుకటివారు ఏప్రదేశమును (Scurf rim) అనిరో తరువాత వారు ఆప్రదేశమునే చర్మమునకు ప్రతినిధి భాగమనినారు.

నవీనశాస్త్రజ్ఞులు కనీనికలో ఏడు ఆవరణలు గలవనియు నీయేడు ఆవరణలలోను, దేహము మొత్తములోని అవయవములు గలవనియు, లోపలనుండి వెలుపలకు లెక్కించుకొంటూ వచ్చినయెడల, నేడవ ఆవరణ చర్మమును తెలుపుననియు, నిర్ధారణ చేసిరి.

చర్మమునకు స్పర్శజ్ఞానము గలదు. ఇంతేకాక ఇంకా రెండు ప్రధానలక్షణములు గలవు. ఒకటి దేహములో రాసాయనికముగా తయారగు ఘన, ద్రవ, వాయురూపమైన మలినములను బయటకు పంపుట. ఇంకా విశదముగా చెప్పవలెనంటే దేహములో నాల్గు బహిష్కార్యావయవములు గలవు. వానిలోని మలకోశముద్వారా ఘనరూపమైన మలినములే బయటకు వచ్చును. అరగక మిగిలిపోయినట్టిన్నీ, అరుగుదలకు రానట్టిన్నీ పదార్థములన్నీ యీ కోటిలోనికి చేరును.

మూత్రపిండములద్వారా ద్రవరూపమైన మలినములు బయటకు వచ్చును.

ఊపిరితిత్తులద్వారా దేహములో తయారగు వాయురూపమయిన మలినములు బయటకు వచ్చును.

చర్మముద్వారానన్ననో, ఘన, ద్రవ, వాయురూపములగు మలినములన్నీ బయటకు వచ్చును.

పైనచెప్పిన నాలుగు బహిష్కార్యావయవములలో చర్మము చాలా ప్రధానమైన అవయవము. మలకోశము, మూత్రకోశము, ఊపిరితిత్తులలో, నే ఒకటి చెడిపోయినప్పటికినీ చెడిపోయినదాని పనిని చర్మము తేలికగా పూర్తిచేయును. చర్మము చచ్చుపడితే మాత్రము, మిగిలిన అవయవములు కష్టములోనే ఆపనిని పూర్తి చేయును.

పైన చెప్పిన విషయము ఈ క్రింది విధమున బాగా ధృవము కాగలదు. గతయుద్ధములో ఒక సైనికునకు పొట్ట మీద దెబ్బ తగిలినది. మరి కుడిమూత్రపిండమునకు దెబ్బ తగులుటచే ఆమూత్రపిండమును వైద్యులు తీసివేసినారు. దానిని తీసివేసిన తరువాత ఆ సైనికుడు పది సంవత్సరములు జీవించినాడు. ఎట్లు బ్రతక గలిగినాడని విచారించగా మూత్రపిండపుపనిని చర్మము చేసినదనియు, చెమట మూత్రపు కంపుతో వచ్చినదనియు తెలిసినది. ఈ విషయమును డా॥ విక్టర్ లిండ్లాహార్ తమ రేడియేట్ హెల్తు మెసింజర్ పత్రికలో ప్రచురించిరి.

చర్మమునకు మరొక లక్షణముకూడా గలదు. వాతావరణముయొక్క ఉష్ణధర్మముతో నిమిత్తము లేకుండా దేహము లోని ఉష్ణమును క్రమపద్ధకారముగా ఉంచును. సామాన్య ఆరోగ్యవంతుని ఉష్ణధర్మము 984 డిగ్రీలుండును. వేసవి కాలములోని వాతావరణముయొక్క వేడివలన, దేహము యొక్క ఉష్ణధర్మము, 98. 4° డిగ్రీలకన్న పెరిగిపోకుండాను, చలికాలములోని వాతావరణముయొక్క చల్లదనము వలన

దేహముయొక్క ఉష్ణధర్మము 98-4° డిగ్రీలకన్న తగ్గిపోకుండాను చర్మము కాపాడును. ఊపిరితిత్తులుకూడా యిందులకు కొంతవరకు ఉపయోగపడును. మనము ఉత్తరధ్రువములో ఉన్నప్పటికినీ దక్షిణధ్రువములో ఉన్నప్పటికినీ, మానవ దేహముయొక్క ఉష్ణధర్మము ఎక్కువగా పెరుగకుండాను, ఎక్కువగా తరగకుండాను, రమారమి 98-4° డిగ్రీలుండును. ఈ ఉష్ణధర్మము ఇట్లుండుటకు చర్మము చాలా సాయపడును.

పైన చెప్పిన ధర్మములను చర్మము సరిగా నిర్వహించుచున్నంతవరకు కనీనికయొక్క వెలుపటి ఆవరణరంగులో నేమియు తేడా కనుపడదు. మిగిలిన కనీనికరంగు మాదిరిగనే యీ ఆవరణరంగూ ఉండును.

చర్మము తన స్వధర్మమును రెండు మూడు కారణములచేత నిర్వహింపలేకపోవచ్చును. రోగపదార్థమును బయటకు పంపి దేహమునకు ఆపదరాకుండా ప్రకృతి వేయిగళ్లకని పెట్టి ఉండును. స్వార్జితమైనట్టిన్ని, పిత్రార్జితమైనట్టిన్ని, రోగపదార్థమును బయటకు పంపి దేహమునకు ఆపద రాకుండా కాపాడును. ఇట్లు బయటకు పంపినపుడు రోగపదార్థపు స్వభావమునుబట్టిన్ని, దేహములోని ధాతుశక్తినిబట్టిన్ని, దేహములోని అవయవముల పటుత్వమును బట్టిన్ని, బహిష్కార్యావయవములలో ఒకదాని ద్వారాగాని, అన్నింటి ద్వారాగాని, బయటకు పంపును. ఇట్లా బయటకు పంపుటలో చర్మము ద్వారా యెక్కువగా పంపును. మనమనుకొను గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి మొదలగునవన్నీ యిట్లా బయటకు

వచ్చినవేను. రోగపదార్థము చర్మముద్వారా బయటకు పోయి దేహము శుద్ధిఅగుచున్నది గదా! అను విశ్వాసము లేక తలి దండ్రులు బయటకు వచ్చు మురుగునంతను మందులతో అణచి పెడతారు. మురుగు బయటకు రాకుండా మందులతో పూస్తారు. లోపలకు నెట్టి వేయబడిన మురుగంతా, యీ రక్తముతో కలిసి ప్రవహించుచుండును. ఇట్లు తిరుగుచు బల హీనమైన అవయవముల దరిని చేరుచుండును. మొదటలో అణచివేయబడిన రోగపదార్థము ఊపిరితిత్తులలో చేరి, నిలవ ఉండి, మురిగి, శ్వాసాశయ వ్యాధులకు కారణమగుచున్నది. ఇదెట్లు జరిగేదీ, కనీనికలోని యే ఆవరణలో నేమి మార్పులు కనబడేదీ ముందు అధ్యాయములలో తెలుసుకుందాము.

ఈ వెలుపటి ఆవరణ అంతా నల్లగా నుండవచ్చును. కొన్ని భాగములలో మాత్రమే నల్లగా నుండవచ్చును. వెలు పటి ఆవరణలోని క్రింది సగము నల్లగా నుండవచ్చును. వెలు పటి ఆవరణలోని పైసగము నల్లగా నుండక కనీనికలోని మిగిలిన ఆవరణలలోని రంగుమాదిరిగనే ఉండవచ్చును. వెలు పటి ఆవరణలోని పైసగము నల్లగానుండి, క్రింది సగము మాత్రము కనీనికలోని మిగిలిన ఆవరణలలోని రంగు మాదిరి గనే ఉండవచ్చును.

మానవదేహములో ముందు, వెనుకలని రెండుభాగ ములుండును. కనీనికయొక్క వెలుపటి ఆవరణలోని క్రింది సగము దేహముయొక్క ముందుభాగములోని చర్మమునకు ప్రతినిధిభాగము అనగా చర్మముయొక్క స్వభావమును తెలు

వును. దేహములోని ముందు వెనుక చర్మములు తమధర్మ మును సరిగా నిర్వర్తించుచున్నంతవరకు కనీనిక యొక్క వెలుపటి ఆవరణ క్రింది సగభాగములలోని రంగులలో నేమియు తేడా ఉండదు.

కనీనికయొక్క వెనుకటి ఆవరణలోని పై సగము మానవదేహములోని వెనుకభాగపు చర్మమునకు, ప్రతినిధి భాగము. దేహములోని వెనుకభాగపు చర్మము తనధర్మ మును సరిగా నిర్ణయించుచున్నంతవరకు నీ ప్రదేశములోని రంగులో నేమియు తేడారాదు. మిగిలిన అన్నిభాగములలోని రంగువలెనే యీ ప్రదేశములోని రంగూ ఉండును. ఇట్లనే పైసగభాగము రంగు. మరొకవిషయముకూడా గలదు. కనీనిక దేహములోని వెలుపటి ఆవరణలోని క్రిందిసగము, దేహము లోని ముందుభాగపు చర్మమును తెలుపునని కొందరును, దేహముయొక్క వెనుకభాగపు చర్మమును తెలుపునని కొం దరును, అభిప్రాయ పడినారు. కాని మా అనుభవమునుబట్టి చూడగా కనీనికలోని వెలుపటి ఆవరణలోని క్రిందిసగమే, దేహములోని ముందుభాగపు చర్మమునకు ప్రతినిధి భాగమని నిశ్చయ పరచుకొన్నాము. కనీనికలోని వెలుపటిఆవరణలోని పై సగము దేహములోని వెనుకభాగపు చర్మమును ప్రతినిధి భాగమని నిశ్చయ పరచుకొన్నాము.

చర్మము తన స్వధర్మమును రెండు కారణములచేత నిర్వహింప లేక పోవచ్చునని వెనుక చెప్పినాము. అదెట్లు జరుగునదీ యిప్పుడు నిరూపిస్తాము. ప్రతీయముగా సంక్రీ

మించిన రోగపదార్థమువలన చర్మము చచ్చుపడును. అదె ట్లంటే – మానవదేహము కణముల సమూహము. కణము అణువుల సమూహము. అణువునకు ఏలక్షణములుగలవో కణములకును ఆలక్షణములుండును. కణమునకును ఏలక్షణము లుండునో మానవ దేహమునకును ఆ లక్షణములుండును. ఈ న్యాయము స్త్రీ పురుష దేహముల రెంటికినీ సమాన ముగనే వర్తించును. పురుషునినుండి వచ్చిన శుక్లము, స్త్రీ నుండి వచ్చినశోణితముతో కలిసి బిందువేర్పడుచున్నది. ఈ బిందువే నవమాసములు మాతృగర్భమునందుండి కరచరణా దుల ధరించుచున్నది. తరువాత భూపతన మగుచున్నది.

స్త్రీ లక్షణములన్నీ శోణితాణువునకును, పురుషుని లక్షణములన్నీ శుక్లాణువునకును, ఉండుటచేత మాతాపితరుల రోగ ములన్నీ శోణితాణువునకును శుక్లాణువునకును వచ్చును. ఆయా అణువులతో తయారైన బిందువునకును, బిందువునుండి వచ్చిన శిశువునకును వచ్చును. ఇట్లనే తాత ముత్తాతల రోగ ములన్నీ తల్లిదండ్రులకును, తల్లిదండ్రుల రోగములన్నీ వారి శిశువులకును, సంక్రమించును. ఇట్లనే వంశ పారంపర్యముగా వచ్చును. తల్లిదండ్రులు సంపాదించిన స్థిర చరాస్తులు ప్రభుత్వముువారి ఆగ్రహ అనుగ్రహముల బట్టి తమ సంతతికి రాకపోవుటయు, వచ్చుటయు సంభవించును. తల్లిదండ్రులు సంపాదించుకొన్న రోగములు మాత్రము వారి సంతానమునకు తప్పకుండా వచ్చును.

ఇకను స్వార్జితముగా సంపాదించుకొన్న రోగపదార్థము వలన చచ్చుపడిపోయిన చర్మము:-చర్మము ఎంతప్రధానమైన

బహిష్కార్యావయవమో వెనుకనే చెప్పినాము. చర్మమును నీటితో శుభ్రిపరచుకొననందువలన నెంత నసహ్యముగా నుండు నదీ వేరుగా చెప్పపని లేదు. అందువలననే దినమునకు రెండు తూరులైనను స్నానముచేసి చర్మముమీద మలినములను కడగి వేయవలెను. అట్లు కడగని యెడల దుర్గంధము బయలు దేరును.

విహారములోని లోపమువలన చర్మము చచ్చువడి పోయి తన స్వధర్మమును నిర్వహింప లేకపోవచ్చును. యుక్తమైన వ్యాయామముచేసి దేహములో తయారగు రాసాయనిక మురుగును నిర్వహింప లేకపోవచ్చును. యుక్తమైన వ్యాయామముచేసి దేహములో తయారగు రాసాయనిక మురుగును చర్మముద్వారా బయటకు పంపవలెను. అట్లుపంపనియెడల ఆ మురుగు రక్తములో కలసి తిరుగుచు చర్మముదరిని చేరును. ఇట్లు చేరినదానిని బయటకు పంపనిదే తరువాతవచ్చు దానికి అభ్యంతర మేర్పడును. నిలవచేరినది చర్మమును దహించి వేయును.

గాలి యెండలలో తిరగక పోవుటవలనను చర్మము పాలిపోవును. పసిపిల్లలుగా నున్నప్పుడు ఒంటికి రాచిన ఫేస్ పౌడర్లు స్నోల వలన చర్మములోని మార్దవము పోవును. ఎక్కువ వేడి నీటిలో స్నానము చేయుటవలన చర్మములోని మృదుత్వము లోపించును. మరీచన్నీటిలో స్నానము చేయుటవలన చర్మము బిరుసెక్కును.

మనము తినుపదార్థములు అనుక్షణము మార్పులుచెందుచుండును. అప్పుడు దేహములో ఒక కొలిమివంటిది, రాసాయనికముగా మురుగు తయారగుచుండును. ఈ మురుగు తయారైన మరుక్షణముననే బయటకు వెడలిపోవుచుండవలెను. అట్లుపోక లోపలనే నిలిచిపోయినయెడల ప్రమాదము సంభవించును. ఈమురుగు బయటకు వెడలుటకు నాలుగుత్రోవలు గలవు. అవే వన (1) మూత్రపిండములు (2) ఊపిరితిత్తులు (3) చర్మము (4) పేగులు. ఈనాలుగు త్రోవలా యేపదార్థము యెట్లు వెడలునో, యీక్రింది పట్టికవలన తెలియగలదు.

సృష్టిలోని పదార్థమంతయు 3 రూపములతో నున్నది. ఘనపదార్థము-మంచుగడ్డ; ద్రవపదార్థము-నీరు; వాయుపదార్థము-ఆవిరి.

| మూత్రపిండములు | ఊపిరి తిత్తులు | చర్మము | ప్రేగులు |
|---|---|---|---|
| మూత్రపిండముల ద్వారా ద్రవరూపమైన మురుగు బయటకు పోవును, ఈనీటితో బాటు మూత్రి క్షామ్లము బయటకు వచ్చును. దేహములో తయారగు లవణములు యీనీటిలో కరిగి బయటకు వచ్చును. మిగిలిన వాటికన్న నీటిద్వారా యెక్కువ నీరు బయటకు వచ్చును. | వాయు రూపమును పొందిన మలములు నీటి ద్వారా బయటపడును. బొగ్గుపులుసు గాలి ప్రధానముగా వచ్చును. ఈ గాలితో కలిసి లవణములు కూడా చాలా కొద్దిగావచ్చును. నీరు కూడా కొద్దిగావచ్చును. మూత్రి క్షామ్లము మాత్రము నీటిద్వారా బయటకు రాదు. | చర్మము ద్వారా ఘన, ద్రవ, వాయురూపమైన అన్నిరకములగు మలినములు బయటకువచ్చును. బొగ్గుపులుసు గాలి కొద్దిగానే వచ్చును. చెమట ద్వారా వచ్చు నీటిలో లవణములు కలిసి ఉండును. మూత్రముద్వారా వచ్చు లవణముల లోని మూడవవంతుమాత్రమే చర్మముద్వారా వచ్చును నీటిభాగము మాత్రము ఎక్కువగానే ఉండును. మూత్రపిండముల ద్వారా వచ్చు నీరు మాత్రము చర్మముద్వారా రాదు. | ఘనరూపమైన మలము తే ప్రధానముగా వచ్చును. అరుగుటకు వీలుతేనట్టిన్నీ అరుగుదలకు రానట్టిన్నీ పదార్థమంతయు నీటి ద్వారా బయటకు వచ్చును. |

చర్మము చాలా ప్రధానమైన బహిష్కార్యావయవమని యిదివరకే చదివినాము.

ప్రమాదముచేత మంటలోపడి చర్మము కాలిపోయిన యెడల దేహములో తయారగు రాసాయినిక మురుగు ఆ ప్రదేశమునుండి బయటకురాదు. అందువలన ప్రాణాపాయము సంభవించును.

భరింపరానిచలి దేహమునకు తగులుటవలన చర్మరంధ్రములు ముడుచుకొని పోవును. చర్మము బిగుసెక్కును. చర్మముద్వారా బయటకు రావలసిన మురుగు బయటకురాదు. చర్మము పనిని మిగిలిన అవయవములు చేయవలసి వస్తుంది. అప్పుడు జలుబు చేస్తుంది. దగ్గువస్తుంది.

కనీనికలోని వెలుపటి ఆవరణరంగు నల్లుపడగానేచర్మము తన ధర్మమును నిర్వర్తించుట లేదని చెప్పవచ్చును. చర్మములోని రక్తప్రసరణము సరిగా లేదనియు దేహములో తయారగు రాసాయినిక మురుగు సరిగా బయటకు పోవుటలేదనియు చెప్పగలము. రోగము తరుణ రూపములోని రెండు దశలను దాటిపోయినదనియు, కాలికరూపమును పొందుచున్నదనియు చెప్పవచ్చును. గాలి, యెండలను ఒంటికి తగలనీయక, వ్యాయామమును తీసికొనక అహార విహారములలో మార్పులు చేయనిది రోగము నయము కాదనియు, క్షయరోగము సన్నిహితమైనదనియు చెప్పవచ్చును.

చర్మమునకు మందులు పూయుటవలననేగాక దుస్తులలోని లోపము వలనను చర్మముచచ్చుపడిపోవును. చచ్చుపడి

పోవుటచే చర్మము తన ధర్మమును నిర్వహింపలేదు. చర్మము ద్వారా రావలసిన మురుగు బయటకురాదు. బనీను, షర్టు, వేస్టుకోటు, కోటు మొదలగు నాలుగు పొరలనుదాటి ఆదుర్వాయువు బయటకు రాలేదు. గాలిలోకలియదు. లోపలనే నిలిచి పోవును. చర్మముమీదనే పొరగా యేర్పడును. ఎల్లప్పుడునూ యీ పొరలు అన్నిగాని, కొన్నిగాని, ఉండుటచేత చర్మమునకు సూర్యకిరణములు తగలవు. చర్మమిట్లు చచ్చుపడుటచే మిగిలిన వన్నియు చర్మముపనిని చేసి అవియు చచ్చుపడును. వీరికెప్పుడును జలుబు చేయుచునే ఉండును. రోగపదార్థమును బయటకునెట్టి దేహమును ఆరోగ్యవంతముగానుంచుటకే ప్రకృతి సదా ప్రయత్నము చేయుచుండును. సున్నితమైన ప్రదేశము నుండి యీ రోగపదార్థము మరింత త్వరగా బయటపడును. దేహములో యేభాగమునైనను దుస్తులతో కప్పుదుముగాని ముఖమును మాత్రము కప్పము. ఘోషా పద్ధతిలో ముఖమును కూడా కప్పుదురు. గాలి, యెండలు తగులుటచే ముఖమును కప్పిన చర్మము సున్నితమై రోగపదార్థ మంతయు కాయలుగాను, కురుపులుగాను, గడ్డలుగాను బయటపడును. దేహమంతయు ఆరోగ్యముగానున్న ముఖముమీద కురుపులు లేచినవనుట కిదియే సమాధానము.

కసీనికలోని యేడు ఆవరణలలోని రంగూ ఒకటిగానే ఉండవలయును. తెలుపటి ఆవరణ అంతలోగాని కొంతగాని వేరు రంగుగా నున్నయెడల చర్మము అంతగాని, కొంతగాని, చచ్చుపడినదని తెలుసుకొనగలము. అక్కడక్కడ మాత్రమే చిక్కగానున్న ఆయా ప్రదేశములలో రోగపదార్థముచేరినట్లు




8-వ బొమ్మ

<u>వివరణ</u>—మొదటి వర్గీకరణప్రకారము దేహములో గల వివిధ అవయవములును కనీనికలోని వివిధ ఆవరణలోను చూపబడినవి.

గ్రహించవలయును. కనీనిక వెలుపటి ఆవరణలోని పైసగములో అచ్చటచ్చట గుట్టలున్న యెడల చర్మములోని రక్త ప్రసరణము తృప్తికరముగా లేదనియు, కాళ్ళుచేతులు చల్లగానుండుననియు పర్యవసానముగా హృదయము, ఊపిరితిత్తులు, మెదడు రక్తపు పోటు అధికముగా నున్నదని గ్రహించెదము.

చచ్చుపడిపోయి, స్వధర్మమును నిర్వర్తించలేని చర్మమును బాగుచేయుటకు జలచికిత్సాప్రక్రియలు, సూర్యకిరణ చికిత్సాప్రక్రియలు, మర్దన చికిత్సాప్రక్రియలు, ఆతపస్నానములు, సాయపడును.

ఆహారములోని మార్పులు యిందుకు బాగాతోడ్పడును. ఈ చికిత్సాప్రక్రియలు జరిపినపుడు కనీనికయొక్క వెలుపటి ఆవరణయొక్క రంగులోని చిక్కదనము తగ్గును. పలుచబడి పోవును. ఈ ఆవరణలోనే వేరు ప్రదేశములోనున్న చిక్కని రంగుకూడా పలుచబడిపోవును. మొత్తమంతటిరంగూ క్రమేపి పలుచబడిపోవును. మిగిలిన ఆవరణలలోని రంగుతో ఈఆవరణలోని రంగూ కలిసిపోవును. చికిత్సాకాలము పూర్తియగు నప్పటికి, కనీనికయంతయు ఒకటే రంగుగా నుండును. అప్పుడు దేహములోని బహిష్కరణక్రియ తృప్తికరముగా నున్నదనియు దేహారోగ్యము బాగుపడినదనియు గ్రహింపగలము.

# అధ్యాయము 9

## గజ్జిమచ్చలు

సముద్రతీరములలో నివసించువారు మత్స్యములను యెక్కువగా తింటారు. వీరు చర్మరోగములతో యెక్కువగా బాధపడతారు. మధ్యధరా సముద్రతీరములలో నివసించు వారును గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి మొదలగు చర్మ వ్యాధులతో యెక్కువగా బాధపడుతూ ఉంటారు. వారీచర్మ రోగములకు, రసవిషపాషాణములతో తయారుకాబడిన మందు లను వ్రాసెదరు. బయటకు కనబడకుండా యీ మలినము లన్నీ రక్తముతో కలిసి తిరుగుచునే ఉంటవి. వారి కనీనికలలో నల్లటి గోధుమవన్నె మచ్చలు యెక్కువగా కనపడును. ఈ మచ్చలు సూదిమొన మొదలుకొని కుంకుడుగింజంత పరిమా ణమువరకును ఉండును. కనీనికానిదాన శాస్త్రములో యీ మచ్చలు గజ్జిమచ్చలని వ్యవహరింపబడును.

చర్మరోగముల మందులతో అణచిపెట్టుటవలన కనీనిక చుట్టూ నుండు వెలుపటి ఆవరణ నల్లపడును. మందముగా నుండును. ఈ సంగతిని మా ఆసుపత్రికి వచ్చిన కేసులలో ప్రత్యక్షముగా చూచినాము.

హోమోపతీ వైద్యశాస్త్ర పితామహుడగు హానమన్ వంశానుగతముగా వచ్చు చర్మరోగముల నన్నటికిని 'సోరా' యని నామకరణము చేసినాడు. కనీనికానిదానము యీ




9-వ బొమ్మ

వివరణ—ఈ కనీనికలో సోరామచ్చలు కానవగును. గజ్జిని వివిధమగు మందులతో అణచిపెట్టిన ఈ సోరా మచ్చలు ఆ మందుల రంగులలో కనబడును. తెల్లని నాడీవుంగరములుకూడా కానవగును.

సోరానుగూర్చి యేమైనా చెప్పునేమో తెలుసుకొందాము. ఈ సోరానుగూర్చి మందువైద్యములో వాదోపవాదములుగలవు.

సమానలక్షణములుగల మందుల వాడినయెడల రోగములు కుదురుననుటయే హోమోపతీ వైద్యశాస్త్రమునకు మూలము. ఈ సిద్ధాంతమును వినగానే అలోపతీ వైద్యులందరును అపహాస్యము చేసిరి. ఈ సిద్ధాంతమును పూర్తిగానమ్మలేక హానిమను అనుయాయులే ఉపేక్ష వహించిరి. ఈసిద్ధాంతము పుట్టిన తరువాత అనేక విపరీత సిద్ధాంతములు పుట్టి రూపుమాసిపోయినాయి. ఇట్లా పుట్టి రూపుమాసిపోయినవాటిలో టీకాల సిద్ధాంతము మొదటిది. ఈ టీకాలవలన చాలా చాలా లాభాలు ఉన్నాయని మొదట్లో ప్రచారము చేసినారు టీకాల వలన ఉపకారముకన్న అపకారము యెక్కువగుచున్నదని కాలమే నిర్ధారణ చేసినది. సర్పిసిద్ధాంతము రెండవది. గొంతులోమంట కనబడగనే ముందెపుడో సర్పి కలుగుతుందని రోగమురాకుండా ఉండగలందులకు మందుల వాడమన్నారు. ఈమందులు చాలా ఉపయోగము చేస్తవని చాలాకాలమువరకు ప్రచారము చేసినారు. కొన్నిసంవత్సరములు గడచినవో లేవో సర్పిరాకుండా వాడినమందులవలననే సర్పివచ్చుచున్నదని కాలమే నిర్ధారణ చేసినది. అప్పటినుండీ సర్పిమందుల వాడవద్దన్నారు అలోపతీ వైద్యులు.

ఈ వింతవాదములన్నీ త్వరలోనే రూపుమాసిపోయినాయి. సమాన లక్షణములుగల మందులవాడితే రోగము నయమగునను హోమోపతీ వైద్య సింద్ధాతము మాత్రము చెక్కుచెదరకుండా అట్లనే నిలబడి యున్నది.

హార్ మర్ అభిప్రాయమిది:— గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి మొదలగు చర్మరోగములను పాదరసము, గంధకము లతో తయారుచేసిన మందులతో అణచిపెట్టినారు. ఇన్ని రోగములను బయటకు రాకుండా తరతరములనుండీ అణచి పెట్టుచూ (నయముచేయుచూ) వచ్చినారు. గనుకనే నేడు ప్రతిమనుజుని దేహములోను రోగప్రవణత, రోగము పుట్టు టకు అనుకూలమగు పరిస్థితి ఉన్నది. ఈరోగప్రవణత లేని వారి శరీరము లేదనే చెప్పాలి. ఈరోగప్రవణత నుండియే కుష్టు, పిచ్చి, ఉన్మాదము, క్షయ, పక్షవాతము, మధు మేహము, మొ॥ కాలికరోగములన్నీ కలుగుచున్నవి. వీటి చివరదశయే నంజు. చిన్నపిల్లలకువచ్చు గజ్జి, చీడ, మొదలగున వన్నియు యీరోగప్రవణతయొక్క తరుణ స్వరూపములే.

చాలాతరములనుండీ ప్రకృతినూత్రములకు దూరమగు చునే వచ్చినాము. అందువలన అందరి కనీనికలునూ కొద్ది గనో, గొప్పగనో, నల్లగానే ఉండును. హార్ మర్ చెప్పినట్లు వంశానుగతముగా వచ్చిన రోగప్రవణతవల్లనే కనీనిక చుట్టు నుండు వెలుపటి యావరణ నల్లబడును. ఈ రోగప్రవణతనే సోరా అన్నాడు. అప్పుడే పుట్టిన శిశువుల కనీనికలను చూచిన వారి కనీనికలు కొద్దిగానే నల్లగానున్నట్లు తెలుసుకొంటాము. అప్పటికి ఉన్న రోగప్రవణతవలన యీశిశువులకు చర్మవ్యాధులు కనబడును. కొద్దిగా కనబడిన యీచర్మరోగములను మందు లతో నయముచేస్తారు (అణచిపెట్టుతారు). కనీనిక చుట్టూ నుండు వెలుపటి ఆవరణ మరీనల్లపడును. నిత్యమునూ అపరి మితమగు వేడినీటితో స్నానముచేసిననూ వెలుపటి ఆవరణ




10-వ బొమ్మ

వివరణ— బయటికి వచ్చు గజ్జిని అణచివేసినందువలన కనీనికయొక్క మొత్తపు రంగు చిక్కబడినట్లు చూడగలము. గ్రహణి, అతిసారములతో కూడిన మందుల వలన కనీనిక చుట్టు నుండు ఒకటి రెండు ఆవరణాములలో ఉద్రేకము కలుగును. తెల్లబడును. తరువాత నల్లబడును. రోగము యెట్లు కాలికరూపమును పొందింపబడినది 11, 12 బొమ్మలలో చూపబడినది.

నల్ల పడును. నిరంతరము ఆవిరిస్నానము చేసినను యీ ఆవరణ నల్లపడుట గలదు.

నీలవు రంగు కనీనికలను అందులో సోరామచ్చలుగల తల్లిదండ్రులకు కలుగు సంతానముయొక్క కనీనికలు గోధుమ వర్ణముతో ఉండును. వీరి కనీనికలచుట్టూనుండు వెలుపటి ఆవరణ నల్లబడి ఉండును. నేడు మనము ప్రత్యక్షముగా యీ విషయముల చూచుచున్నాము. తల్లిదండ్రులకు కలిగిన తరుణరూపములగు చర్మవ్యాధులను మందులతో అణచిపెట్టుటచేతనే వారికి కలిగిన సంతానములో కాలికరోగములకు బీజము లేర్పడుచున్నవని, కొన్నివందల సంవత్సరముల క్రితమే హానిమన్ చెప్పెను. కనీనికానిదానము ఈ విషయమునే ధ్రువపరచుచున్నది. గ్రంథవిషయమును చెప్పుటకు ముందు హానిమన్ సోరా అను శబ్దమును యెందుకు వాడెనో ఈ సోరాను అణచిపెట్టినందువలన యేరోగములు కలుగునని అభిప్రాయపడెనో తెలిసికొనుటకుగాను వాడు వ్రాసిన 'కాలికరోగములు' అను గ్రంథములోని భాగములనే యెత్తివ్రాయుదును. కనీనికానిదానమువలన మనము ప్రత్యక్షముగా చూచిన విషయములను యీ మహానుభావుడు కొన్నివందల సంవత్సరములనాడే సహజస్ఫురణ వలననే కనుగొనెను. ఈ ఒక్కవిషయమునేగాక పెక్కువిషయములనుకూడా తన సహజజ్ఞానమువలననే యీ విజ్ఞానఖని కనుగొనెను. ఇప్పుడిప్పుడు యీ పండితుని ప్రభావమును తెలిసికొన గలుగుచున్నాము.

"వంశానుగతంగా వచ్చిన రోగప్రవణతవలన గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులు వచ్చుచున్నవి. ఈచర్మవ్యాధుల

ద్వారా బయటకువచ్చు రోగపదార్థమును రసము, గంధకము, తుత్తునాగము మొదలగు లోహములతో తయారుచేసిన మందులతోను, ద్రావకములతోను, బయటకు రాకుండా పూసివేయుచున్నారు. బయటకు వచ్చుత్రోవలను మందులతో పూసివేయుటచేతనే రోగపదార్థము కాలికరూపముతో వచ్చుచున్నది. గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులన్ని కుడిచికూర్చొను మధ్యతరగతి వారిలోనే యెక్కువగా నున్నవి. బీదలలో యివి లేనేలేవు. ఇట్లా అణచి పెట్టుచూ గజ్జి యొక్క పుట్టుపూర్వోత్తరములు మాకేమీ తెలయవని మందు వైద్యులు ఘోషిస్తున్నారు.

"గజ్జిని మందులతో నయముచేయుచున్నాము. పూడ్చి పెట్టుచున్నాము. బయటకు కనుబడుటలేదులే అని మనమేమియు సంతోషింపరాదు. ఎందువల్లనంటే ఇట్లాఅణచి పెట్టబడినచో రోగపదార్థమే కాలిక రోగరూపముతో బయటబడుచున్నది.నాడీవ్యాధులు,మానసిక వ్యాధులు, క్షయ, పక్షవాతము మొదలగు కాలికరోగములన్నీ యిట్లా బయటకు వచ్చినవే.

"మందు వైద్యులు మందులతో మానవకోటికి యెంత అపకారము చేయుచున్నదీ వేరుగా చెప్పవనిలేదు. ఈ మందులవలననే యీ కాలికవ్యాధులన్నీ వచ్చుచున్నవి. మందు వైద్యగ్రంథములన్నీ గజ్జినిగూర్చి యీ క్రింది విధముగా చెప్పుచున్నవి. చర్మవ్యాధులకును దేహమునకును యేమియు సంబంధములేదు. మీదు మిక్కిలి చర్మవ్యాధులను త్వరలో రూపుమాపకపోతే దేహమునకు హానికల్గును. గాన త్వరగా

వాటిని (చర్మవ్యాధులను) నాశనము చేయవలెను. గంధకము, తగరము, తుత్తునాగము మొదలగు లోహములతో తయారు చేసిన యేమందులనుగాని, ద్రావకములనుగాని, వాడ వచ్చును. పాదరసముతో తయారుచేసిన మందులు చర్మరోగ ముల త్వరగా కుదుర్చునుగాన నిరభ్యంతరముగా వాడ వచ్చును. చర్మవ్యాధులను ఒకతడవ రూపుమాపితే దేహ తత్వము బాగుపడును. ఈ చర్మవ్యాధులను రూపుమాపక పోతే అట్లనే పెరగనిచ్చిన యెడల దేహమంతటా వ్యాపించి రక్తములో కలిసిపోవును. దేహమంతా చెడిపోవును".

పైవిధముగా మందువైద్య గ్రంథములన్నీ ప్రచారము చేయుటయేగాక ప్రత్యక్షముగా మందులతో మానవకోటికి హాని కలుగజేయుచున్నారు. పెద్దఆసుపత్రిలలోనేమి, చిన్న ఆసుపత్రిలలోనేమి, స్పెషలిస్టులేమి, సామాన్యులేమి, గజ్జి మందులను నిరాఘాటముగా అందరకును యిచ్చుచున్నారు. ఎంతత్వరగా చర్మరోగముల అణచివేసిన యెడల అంతమంచి దని వీరందరును అభిప్రాయపడుచున్నారు. రోగులు, వైద్యులు ఉభయులును రోగము రూపుమాసిపోయినదని పూర్తిగా నమ్ముచున్నారు. తరువాత కొద్దికాలముననే అగుపడు తరు వాత రోగములకును ఏమియును సంబంధము లేదని తలంతురు. తరువాత రోగములను మందులతో మళ్ళీ అణచిపెట్టుతారు. వైద్యులందరును తమ ఊహాశాస్త్రమునకు ప్రాధాన్యమిచ్చి అంతులేనన్ని మందులకనుగొని రోగముల అణచివేయు చున్నారు. ఇన్నిమందుల కనుగొని నప్పటికినీ రోగుల బాధ

లేమియు తగ్గుటలేదు. పెరిగి పోవుచున్నవి. చివరకు చావే రోగులబాధలను తగ్గించి వేయుచున్నది.

హోమియోపతీవైద్యశాస్త్రపితామహుని అభిప్రాయములను తెలుసుకొనిన మా చదువరులకు గజ్జికిని కాలిక రోగములకును గల సంబంధము తెలిసియే యుండవచ్చును.

## గజ్జి: దేహము

బయటనుండివచ్చు సూక్ష్మజీవుల వలన గజ్జి పుట్టునదీ లేక దేహములోని మురుగు వలన గజ్జిపుట్టునదీ, తెలుసుకొందాము. ఆలోపతీ వైద్యము చెప్పతుందిగదా - బయటనుండి వచ్చిన సూక్ష్మజీవుల వలననే గజ్జి పుట్టుచున్నది. మైక్రోస్కోపుతో చూచినపుడు గజ్జిలో కూడ సూక్ష్మజీవులు కనబడినవి. అంతవరకూ సూక్ష్మజీవులవలననే గజ్జి మొదలగు సర్వ చర్మవ్యాధులు వచ్చుచున్నవని చెప్పిన మందువైద్యము వారికి మరింత సావకాశము దొరకినది. ఈ సావకాశమును తీసికొని దేహములోని మురుగువలన గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులు పుట్టుట లేదని ప్రచారము చేసినారు. దేహములోని మురుగువలననే చర్మవ్యాధులన్నీ పుట్టుచున్నవను హానిమన్ సిద్ధాంతము తలక్రిందైపోయినదని మందువైద్యులందరు వికటాట్టహాసము చేసినారు. మైక్రోస్కోపుతో చూచినయెడల గజ్జిలోని సూక్ష్మజీవులు తాబేలంత పెద్దవిగా కనబడునవి. సాలీడు కాళ్ళమాదిరి కాళ్ళు ఈ సూక్ష్మజీవికి గలవు. ఈ సూక్ష్మజీవికి కళ్ళు ఉండవు. నాడీమండలము ఉండదు. నోరు, పళ్ళు, జీర్ణాశయము ఉండును. మగ పురుగు




11-వ బొమ్మ

వివరణ— కుడికనీనికలో లివరును తెల్పు 12, 13 ఏరియాలలో నల్లగీతలు, తెల్లగీతలు గలవు. మందులవలన నాడీమండలములో ఉద్రేకము కలిగినది.

కన్న ఆడపురుగు పెద్దది. మగపురుగు చర్మముయొక్క మీది పొరలలోనే నివాసము చేయును. ఆడపురుగు మాత్రము అడుగు పొరలలోనికి కూడా చొచ్చుకొనిపోయి అచ్చటనే కాపురముండును.

సూక్ష్మజీవులు లేనిది గజ్జి, తీట, చీడ మొదలగు చర్మ వ్యాధులు రావని అలోపతీ వైద్యము గట్టిగానమ్మినది. అందు వలననే తమ తెలివితేటల నన్నిటిని ఈ సూక్ష్మజీవుల చంపు టకే వినియోగించు చున్నారు. అన్ని రోగములు ఈ సూక్ష్మ జీవులవలననే వచ్చునని వాదించుచున్నారు.

కనీనికానిదానశాస్త్రము హానిమన్ సిద్ధాంతములే నిజమనియు అలోపతీసిద్ధాంతము తప్పనియు ఋజువుచేయు చున్నది. ఎట్లాగంటే ఒకరోగికి గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులు కనబడినపుడు కనీనికయొక్క వెలుపటి ఆవరణ రంగును చూడవలయును. కనీనికయొక్క వెలుపటి ఆవరణ చర్మమును తెలుపునని మా చదువరులు జ్ఞప్తియందుంచు కొనవలయును. కనీనికలోని మిగిలిన ఆరుఆవరణాల రంగున కును ఈ 7 వ ఆవరణ రంగునకును కొద్దితేడా యుండును. ఇట్లావచ్చి చర్మరోగములను బయటకు పంపుటకు ప్రకృతి వైద్యపద్ధతుల ద్వారా ప్రకృతికి సాయముచేసి ప్రకృతివైద్య చికిత్సా పద్ధతులతో నయముచేసిన తరువాత కనీనికలోని వెలు పటి ఆవరణారంగును చూడవలయును. మిగిలిన ఆరు ఆవరణాల రంగు మాదిరిగనే ఈ ఆవరణరంగూ ఉండును. ఏమియు తేడా ఉండదు.

అట్లుగాక, చర్మవ్యాధులను రస, విష, పాషాణాదులతో తయారుచేసిన మందులను రాసి పూసివేసిన యెడల కనీనికయొక్క వెలుపటి ఆవరణరంగు మరింత నల్లపడును. అప్పటివరకు లేతగాఉన్నరంగు ముదురురంగుగా మారిపోవును.

దీనినిబట్టి యేమి తెలుసుకొన్నామంటే - చర్మరోగములకు తామరమందులు రాసి అణచివేయక రోగపదార్థము బయటకు వెడలుటకు ప్రకృతివైద్య చికిత్సా పద్ధతులద్వారా ప్రకృతికి సాయముచేసిన యెడల రోగపదార్థము త్వరగా పోవును. చర్మరోగములు కనపడకుండా పోవును. దేహము శుభ్రపడును. దీనికిగుర్తు ఎట్లాగంటే కనీనికయొక్క వెలుపటి ఆవరణరంగు పల్చబడును. మిగిలిన ఆవరణలలోని రంగుతో కలిసిపోవును.

దేహములోని మురుగునుండియే పుట్టక బయటనుండి వచ్చు సూక్ష్మజీవులవలననే చర్మవ్యాధులు వచ్చిన యెడల కనీనికలోని 7 వ ఆవరణరంగు పలచనై మిగిలిన ఆవరణలలోని రంగుతో కలిసిపోవుటకు వీలు లేదుగదా! దేహము శుభ్రపడుటకును వీలు లేదు.

మరొకవిషయము కూడా గలదు. చర్మవ్యాధులద్వారా రోగపదార్థమును బయటకు రానివ్వక లోపలనే అణచివేసిన యెడల రోగపదార్థము బయటకు పోవుటకు వీలు లేక బలహీనముగానున్న అవయవములలో చేరును. కనీనికలోని ప్రతినిధి భాగములో మచ్చ లేర్పడును. కనీనికాప్రతినిధి భాగములోని మచ్చనుబట్టి యీ రోగపదార్థము యే అవయవములో చేరినదీ చెప్పగలము. కనీనికలోని యేడవ ఆవరణలో కనుపడు

గోధుమరంగు మచ్చలకును చర్మవ్యాధులకును సంబంధ మేమిటని మమ్ములను చాలామంది ప్రశ్నిస్తారు. దీనికి మేము చెప్పుసమాధానమేమంటే ప్రకృతి వైద్యము చేసినప్పుడు స్వాస్థ్యసంకటములు జరుగును. ఒళ్ళంతా గజ్జి పగలవేయును. చికిత్సప్రారంభించుటకు పూర్వము ఉన్న 7 వ ఆవరణలోని గోధుమరంగు మచ్చలు గజ్జి నయమైన వెంటనే పోవును.

ఈ విషయము మా ఆసుపత్రిలో ప్రత్యక్షముగా ప్రతి రోజును మేము చూచువిషయమేగాని యిందులో యేమియు అతిశయోక్తి లేదు. నిదర్శనపూర్వకముగా చెప్పుటకు మా ఆసుపత్రికివచ్చి నయము చేయించుకొని వెడలిన ఒకామె చరిత్రను చెప్పుట అప్రస్తుతము కాదనుకుంటాను.

ఒకపిల్లకు ఒంటినిండా గజ్జిలేచినది. గంధకము కలిపిన మందులతో ఆ గజ్జిని ఆపివేశారు ఇట్లు ఆపి ఒక సంవత్సరము గడచినదో లేదో కనీనికచుట్టూనుండు మొదటి ఆవరణలో (మొదటిఆవరణ జీర్ణాశయమును తెలుపును) ముదురుగోధుమ రంగు మచ్చలు కనబడెను. అప్పటినుండి ఆపిల్ల జీర్ణాశయ రోగముతో బాధపడినది. తరువాత జీర్ణాశయములో పుండ్లు పుట్టినవి.

తలనిండా కురుపులు లేచినవి. రోజురోజూ యీ కురుపులు పెరిగిపోయినవి. అసహ్యమైన చీడపోయేటందుకు చాలా మందులు రాసినారు. రసము, పాషాణములతో తయారు చేసిన మందులు వాడినారు. చితచితలాడేకురుపులన్నీ మూడు పూటలలో మాయమై పోయినాయి. బయటకు మాత్రము

కనబడకుండా పోయినాయిగాని స్థావరమేమీ వదలలేదు. తల నుండి బయటకు వచ్చే పెక్కు త్రోవలను మూసివేసినారు. ఈ పెక్కుత్రోవలా బయటకు వచ్చు రోగపదార్థమంతా ఒకముఖముగా బలహీనమైన అవయవములో చేరుకుంటూంది. ఆ అవయవమును విపరీతముగా బాధపెట్టుతుంది. కాలికముగా నుండు తలనొప్పి, మూర్ఛలు, ఉబ్బసము. నాడీవ్యాధులు, సంగమక్రియయందు అయిష్టము, మొదలగునవన్నీ యిట్లా వచ్చినవేను.

కొన్ని సంవత్సరముల క్రితము మా ఆసుపత్రికి పరీక్షార్థమై ఒకామె వచ్చింది. ఎడమకనీనికను చూడగనే పెద్దమెదడును తెలుపు ప్రతినిధి భాగములో లేతగోధుమరంగు మచ్చ కనుబడినది. ఆమెకును నాకును యీ క్రింది సంభాషణ జరిగింది.

నేను:—నీవు చాలారోజులనుండీ తలనొప్పితో బాధపడుచున్నావు. నాడులలో చిమ చిమ ఉన్నది. తల దిమ్ముగా ఉంటుంది. కాళ్లూ చేతులు పైకి పీకికొని పోవుచుండును.

ఆమె:-మీరు చెప్పినవన్నీ నిజమేను. ఈ బాధలకు కారణమేమిటి?

నేను:—చిన్నప్పుడు అనగా బడికిపోయే రోజులలో గజ్జి లేచినది. మామూలుగా రాచే మందులన్నీ మీ అమ్మ రాచింది. ఆ గజ్జి రూపుమాసిపోయింది.

ఆమె:— ఒకతడవకాదు. చాలా తడవలు అట్లా గజ్జిలేచింది. గజ్జి లేచినప్పుడల్లా మందురాచింది. అణగిపోయినాయి. గజ్జి

లేచుటకును, మందులు రాయుటకును ఈ బాధలకును సంబంధమేమిటి?

నేను:—దేహములో అనుక్షణమూ తయారై బయటకుపోక లోపలనే నిలచిపోయిన మురుగువలననే ఈ రోగాలన్నీ వచ్చినాయి. తలమీద లేచిన కురుపులను మందులతో అణచి పెట్టకపోతే. ఈ రోగాలేమీ వచ్చేవి కావు. బయటకువచ్చు దోవలను మూసినారు గనుక బయటకువచ్చు త్రోవలు లేక ఈ రోగపదార్థము బలహీనమైన అవయవములలో చేరి దానిని బాధపెట్టినది. ప్రకృతి సూత్రములకు అను గుణముగా జీవించి ప్రకృతి వైద్యము చేసినయెడల ఆ కురుపులన్నీ మళ్లీ ప్రత్యక్షమగును. (ప్రకృతిచికిత్స మొదలు పెట్టినది. మూడు నెలలు గడచినవి.)

ఆమె—డాక్టరుగారూ! తలనిండా కురుపులు లేచుచున్నాయి. చాలా బాధగానున్నది.

నేను—(ఆమె కసీనికను చూచితిని. వెనుకచూచిన మచ్చ మీద తెల్లగీతలు ఉన్నాయి) మీపాత స్నేహితు(ప్రియులు) లందరూ వస్తారు.

ఆమె—పాత స్నేహితులంటే మీ అభిప్రాయమేమిటి.

నేను—పాతికసంవత్సరాల క్రితము మీతల్లి సాగనంపిన పాత స్నేహితులు మళ్లీ వచ్చిపోతాయి.

ఆమె—(వారము రోజుల తరువాత ఆశ్చర్యముతో) డాక్టరు గారూ ఒకళ్లూ యిద్దరూకారు. కొన్నికోట్ల ముంది స్నేహితులు వచ్చారు.

నేను—రావటము మంచిదేగా! వచ్చారు కాబట్టి రోగము తప్పకుండా నయమగుచున్నది. చన్నీళ్లు, దువ్వెనతోనే వానిని మర్యాదచేయి. మందులను మాత్రము రాయబోకు.

ఆమె—డాక్టరుగారూ! మీకు బాగా తెలుసునండీ. పాత స్నేహితులు వస్తారని ముందుగానే చెప్పారు. ముందుగా చెప్పారు కాబట్టి నిలబడి చికిత్సచేశాను గాని లేకపోతే మందులకోసము పరుగెత్తేదానను.

పాతస్నేహితులు రెండువారాలపాటు ఉండిపోయినారు. అప్పటినుండీ తలనొప్పి, నరములలోని చిమచిమలు అన్నీ తగ్గిపోయినాయి. ఇప్పుడే కనుక (ఈ పాతస్నేహితుల)బయటకు పంపకపోతే ఆమెకు కొద్ది రోజులలోనే పిచ్చి పుట్టేది.

ఈ సూక్ష్మజీవులు బయటనుండి వచ్చినాయనుకొనుటకు వీలులేదు. అంటురోగాలతో రాలేదు. ఎందుకంటే ఆమె శుభ్రమైన గాలీ వెల్తురులు ధారాళముగా వచ్చు ప్రదేశములోనే కాపురమున్నది. ఈమె చేసిన చికిత్స ఏమిటంటే- మూడు నెలల పాటు రోజూ తలకు చన్నీళ్ళు రాచి దువ్వేది. ఇంతకన్న మరేమీ చేసేది కాదు.

"ఈ పేలు దేహమునుండి వచ్చినాయనుని మీరు నమ్ముదుగదా? మరి యెక్కడనుండి పుట్టినాయంటారు?" అని మా స్నేహితులు అడుగుతూ ఉంటారు. నిజం చెప్పాలంటే యీ పురుగులు యెక్కడనుండి వచ్చేది నాకు తెలియదు. వంశానుగతముగా వచ్చు రోగవ్రిణతలను ప్రకృతి బయటకు పంపి

వేయునపుడు మాత్రము యిటువంటి స్వాస్థ్యసంకటములు కలుగుచుండుట మా ఆసుపత్రిలో ప్రత్యక్షముగా చూచున్నాము. కుళ్ళిన మాంసములో పురుగులు యెట్లు కలుగునో అట్లనే రోగ ప్రవణతలోనే సూక్ష్మజీవులు కలుగును.

(ఈ సంగతి నేనునూ పదేళ్లక్రితము 'ప్రకృతి' పత్రికకు వ్రాశాను. ఆ వ్యాసములోని భాగమునే యేమీ మార్పు లేకుండానే యిప్పుడు యెత్తి వ్రాస్తున్నాను.) రోగపదార్థములోనే సూక్ష్మజీవులు పుట్టునని ప్రొఫెసరు బిఛాంపు 19 వ శతాబ్దములోనే వ్రాసిన 'మైక్రోజిమీ' సిద్ధాంతమును నేను చదువువరకు రోగపదార్థములోనే రోగజీవులు కలుగునను సంగతి మాత్రము నాకు తెలియదు. ఎక్కడపడితే అక్కడే ఈ సూక్ష్మజీవులు పుట్టునని నేను వాదిస్తూ వచ్చాను.

మా మిత్రులకు మరొక సందేహముకూడా తోచవచ్చు. ఈ సూక్ష్మజీవులు బయటకు వచ్చునప్పుడు ఇన్ని బాధలు కలుగుచున్నవి గదా. ఇన్ని బాధలు కలుగచేయు సూక్ష్మజీవులను యెందుకు రెచ్చగొట్టాలి. ఏ మూల ఉన్న వాటిని ఆమూలనే ఉంచనీయరాదా అంటారు. చిన్నతనములోనే వీటిని బయటకు పంపకపోతే కాలముగడచిన కొలదినీ ఈ రోగపదార్థమే బయటకుపోదు. మొక్కగా నున్నప్పుడే వంచలేకపోతే మ్రాను అయిన తరువాత అసలే వంచలేము. యావజ్జీవితము అంతర్వ్రణము, క్షయతో బాధపడుటకన్న ఒకటిరెండు వారాలతో తేలిపోయే స్వాస్థ్యసంకటములు నయముగదా.

'సోరా'లోనే అంతర్వ్రణములు పుట్టుచున్నవి.

వంశానుగతముగా వచ్చు రోగప్రవణతల నన్నింటినీ

హానెమన్ 'సోరా' యని వాడినారు. ఈశబ్దమును ఈ అర్థములోనే మేమున్నూ వాడుతాము. కనీనికలో కనబడు సోరా మచ్చలవలననే అంతర్వ్రణముల పుట్టుపూర్వోత్తరముల తెలుసుకొనగల్గుచున్నాము. క్షయము రోగములకు కారణములను కూడా తెలిసికొనుచున్నాము.

దేహములోని యే భాగములో గజ్జిలేచి మందులతో అణచిపెట్టబడినా కనీనికలోని ప్రతినిధి భాగములో మచ్చలు కనబడును. అట్లు అణచిపెట్టబడిన భాగములో అంతర్వ్రణము క్షయము (Sarcoma) పుట్టవచ్చును మా ఆసుపత్రిలో నయముచేసిన అంతర్వ్రణ కేసులన్నిటిలోను చికిత్సాకాలంలో గజ్జిలేచినది. రెండు కేసులలో మాత్రము గజ్జి లేవలేదు గాని యీ రెండు కేసులలోను ఒంటినిండా దద్దులు లేచినాయి. ఈ పదునెనిమిది సంవత్సరముల అనుభవములోను ప్రతికేసులో కూడా చికిత్సాకాలములో గజ్జిలేచుటవలన ఒక్క సంగతి మాత్రము మనము మరవరాదు. వంశానుగతముగా వచ్చు రోగ ప్రవణత వలననే అంతర్వ్రణములు పుట్టుచున్నవని హానెమన్ చెప్పినసిద్ధాంతములకు నేటికి నిదర్శనములు కనబడుచున్నవి. రెండు వందల సంవత్సరముల క్రితమే హానెమన్ యీ అభిప్రాయమును చెప్పినప్పటికినీ మందు వైద్యులు అపహాస్యము చేసినారు. ఆ సిద్ధాంతములోని సత్యమును యిప్పుడిప్పుడు తెలుసుకొనగల్గుచున్నాము. ప్రకృతి వైద్యముచేసి గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధుల ద్వారా రోగప్రవణతను బయటకు పంపుటేమంచిదో, లేక రోగపదార్థమును అట్లనే నిలవడుంచుకొని తరువాత క్షయ, అంతర్వ్రణము మొద




12-వ బొమ్మ

వివరణ→ కనీనిక మొత్తమంతా మచ్చలు గలవు. లివరు, మూత్రపిండములు, చిన్న ప్రేగులు, తెలుపు ప్రదేశములలో మచ్చలు గలవు. అయోడిన్ మెరుపురంగుగాను, పాషాణము తెల్లముద్దలుగాను, పాదరసము అంతటా మెరమెరలాడుతునూ కనబడును. కుడికనీనికలోని 8, 8 M, 9 ఏరియాలలో నల్లగీతలు, తెల్లగీతలు కనబడును. 13-వ బొమ్మలో యీ నల్లగీతలే యెక్కువ కానగును.

లగు దుర్భరరోగములతో యావజ్జీవితము బాధపడుట మంచిదో బుద్ధిమంతులగు మా చదువరులే గ్రహింతురుగాక.

"మందు వైద్యము వారి లెక్కల ప్రకారము గత యేబది సంవత్సరములలోను మిగిలిన అన్ని రోగములవలన కల్గు చావులకన్న, అంతర్వ్రణములతో రెట్టింపు మంది చచ్చారు. మిగిలిన రోగములన్నిటి చావులకన్న ఈ వ్రణములతో 400 రెట్లు చచ్చారు ఈ లెక్కలుకూడా వెనుకనుండీ మేము చెప్పుచూ వచ్చిన సిద్ధాంతమునే బలపరచుచున్నవి. మందు వైద్యమువారు క్రొత్తమందులు కనుగొని తీవ్ర రోగముల అణచిపెట్టుచున్న కొలదిని కాలికరోగములు ఎక్కువగుచున్నవి. ఈ కాలికరోగములతో చావు లెక్కువగుచున్నవి. గజ్జి, చీడ, తీట మొదలగు చర్మవ్యాధులను అణచి వేయుటవలన కాలికరోగములు యెట్లువచ్చేదీ ప్రకృతిచికిత్స అవలంబించినపుడు మరల గజ్జి యెట్లు ప్రత్యక్షమైనదీ తెలియ చెప్పుటకు ఒకపెద్దమనిషి కథ చెప్పుతాను. ఇది నా అనుభవములో ప్రత్యక్షముగా జరిగినదేగాని కల్పితముకాదు.

ఈ పెద్దమనిషిది చికాగో. చిన్నప్పటినుండీ జబ్బులతో తీసుకొనుచున్నాడు. అన్నిరకాలమందులూ సేవించాడు. రోగమేమీ కుదురలేదు. డాక్టర్లందరూ ఆశలు వదిలారు. కదలకుండా యింటివద్దనే ఉండమనిసలహాచెప్పారు. తన రోగమును గూర్చి తెలుసుకొందామని ప్రకృతిచికిత్సకుని వద్దకు వచ్చినాడు. ప్రకృతిచికిత్సమనిషికిని రోగికిని ఈ క్రిందిసంభాషణజరిగినది.

ప్ర—చి :- నీకు చిన్నప్పుడు రెండుతడవలు గజ్జిలేచినది.

రోగి :— అవును.

ప్రి—చి:- ఆ గజ్జిని మందులతో నయము చేసినారు (అణచి పెట్టినారు.)

రోగి:—అవును.

ప్రి—చి:- ఆ మందులు చిన్న ప్రేగులలో నిలవయున్నవి. అందువలన అజీర్ణముగా ఉంటుంది. అప్పుడప్పుడు అజీర్తి విరేచనములు వెడలుచుండును. నీవు త్వరగా అజీర్ణమును ప్రకృతిచికిత్సతో నయముచేసికొనకపోతే చిన్న ప్రేగులలో అంతర్వ్రణము పుట్టును.

రోగి:—మీరుచెప్పినవన్నీ నిజమే. డాక్టర్లుమాత్రము నారోగము జీర్ణాశయవ్యాధియని చెప్పుచున్నారు గాని నాకేమియు నమ్మకము లేదు. నాకు రెండు తడవలు గజ్జిలేచినది. గంధకము పాదరసములతో తయారుచేసిన మందులతో అణచివేసినారు.

ఒక సంవత్సరము ప్రకృతి చికిత్సచేసినాడు. రోగము సగము నయమైనది. ఈ సంవత్సరములో రెండు మూడు పర్యాయములు స్వాస్థ్యసంకటములు కలిగినవి. గజ్జిలేవలేదు. కనీనికలోని మచ్చలు కొద్దిగా తగ్గినవి గాని పూర్తిగా లోపించలేదు, అంతవరకు హోమోపతీ మందులను వాడలేదు. అప్పుడు హోమోపతీ మందును యిచ్చినాను. ఇచ్చిన వారమురోజులకు ఒంటినిండా గజ్జి లేచినది. విరేచనములు మొదలుపెట్టినాయి.

రెండు వారాలపాటు ఉండిపోయినాయి. ఈ రెండు వారాలపాటు, ఉపవాసమన్నాడు. జలచికిత్స మాత్రము చేసినాడు. తరువాత బాగా ఆరోగ్యముగా ఉన్నాడు."

ఆరు నెలలు గడచినతరువాత మరల హోమోపతీ మందునే యిచ్చినాను. ఒంటినిండా దద్దురులులేచినవి. విరేచ




13-వ బొమ్మ

వివరణ—క్వయినా, అయోడిన్‌లు వాడినందువలన నాడీ వ్యాధులు పెరుగును. నాడీఉంగరము నల్లబడును. కుడి కనీనికలోని **13, 19** ఏరియాలలో గీతలు నల్లబడును. 8, 8M, 9 ఏరియాలలోను గీతలు నల్లబడును.

నములు మొదలు పెట్టినవి. ఇవి రెండు వారాల పాటుండి అంతరించినాయి. ఈ మూడు వారాలు ఉపవాసమున్నాడు. జలచికిత్స మాత్రము చేసినాడు. ఇప్పటికి చిన్న వేళ్ళగుల లోని 'సోరా' మచ్చలు లోపించినాయి.

అయితే హోమోపతి వైద్యులు అపహాస్యము చేయవచ్చు. "ప్రకృతి చికిత్సగొడవ యెందులకు? హోమోపతీ మందులతోనే రోగము నయమగునుగదా?" అని అడుగవచ్చును. ప్రకృతి చికిత్సతో దేహమును శుద్ధిచేసినగాని హోమోపతీ మందు పని చేయ లేదు. దేహమంతా రోగపదార్థముతో నిండిపోయి ధాతు శక్తి తగ్గిపోయినపుడు హోమోపతీమందు లేవియు పని చేయ లేవు. దేహము సున్నితమైనపుడే హోమోపతీమందులు పనిచేయును. రోగపదార్థము బయటకు వెడలిపోవును. దేహములోని నిర్మాణ శక్తికి వ్యతిరేకము కానంతవరకు అన్ని వైద్యములలోని ఉత్తమ చికిత్సల సమన్వయమే ప్రకృతివైద్యము. దేహములోని నిర్మాణ శక్తికి వ్యతిరేకము కాని మిగిలిన వైద్యప్రక్రియలతో నయము చేయుటయు ప్రకృతి వైద్యములోనికే వచ్చును. మూలసూత్రములకు వ్యతిరేకము కాని వైద్యప్రక్రియలను ఉపయోగించక పోవుట, నాల్గు గుర్రములు అందికలో నుండగా, నాల్గుగుర్రములు కట్టవలసిన భర్తీబండికి మూడుగుర్రములుకట్టినట్లుండును

గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులను మందులతో అణచి పెట్టినందువలననే కసినికలో మచ్చలు కనుబడును మా ఆసుపత్రికి పరీక్షార్థమై వచ్చినవారందరిలోను యీ మచ్చలు చూచుచుండెడివారము గ్రంథ విస్తరభీతిచే వాని కథలను యిచ్చుట యేకరువు పెట్టలేదు.

## అధ్యాయము 10

# మందుల రంగులు

మామూలు జనసమూహమునకంతకును ఒక సందేహము తోస్తుంది. ఏమిటంటే మీరు దేహమునకు సజాతీయమని, దేహమునకు విజాతీయమని పదేపదే వాడుతుంటారు. దేహమునకు సజాతీయ మేమిటి? దేహమునకు విజాతీయ మేమిటి? ఏ పదార్థములు దేహమునకు సజాతీయములు? ఏపదార్థములు దేహమునకు విజాతీయములు? విజాతీయ పదార్థమును గుర్తించుటెట్లు?

ఇది చాలా క్లిష్టమైన ప్రశ్నయే. ఇదియేగాక యిటువంటి ప్రశ్నల నన్నింటికిని కనీనికయే సమాధానము చెప్పుతుంది. దేహములోని రక్తముతో త్వరగా కలిసిపోయి సారూప్యమును పొందు వస్తువు లేవియు కనీనికలో కనుపడవు. దేహములోని రక్తముతో సారూప్యమును పొందని కలసిపోని పదార్థము లన్నియు దేహములోని అంతరవయవములలో యేదో ఒక దానిలో చిక్కుకొనును. నిలబడిపోవును. దేహములోని ప్రతిచిన్న అవయవమునకు కనీనికలో ప్రతినిధి స్థానము గలదు. అట్లు నిలబడి పోయిన మందులన్నియు వాటివాటి రంగులతో కనీనికా ప్రతినిధి స్థానములలో కానవగును. క్లోరోఫారము, కొకెయిను మొదలగు మత్తుమందులనిచ్చి అవయవముల తొలగించిన యెడల ఆయా అవయవముల తెలుపు ప్రతినిధి భాగములలో మూలగీతలు ( X ) కనబడును.

వందలకొలది సంవత్సరముల నుండి అన్నిరకములగు మందువైద్యులలోను వాదోపవాదములు ప్రబలిపోవుచున్నవి. ఆహారపదార్థములలోగాని మందులలోగాని భూమి నుండి త్రవ్విన లోహముల వాడవచ్చునా వాడరాదా అను విషయమై యెవరికితోచిన అభిప్రాయములువారు చెప్పుచూ వచ్చిరి. భూమినుండి త్రవ్విన ఖనిజములతో తయారు చేసిన మందులను మానవకోటియొక్క బాధలను తగ్గించుటకు వాడవచ్చునని వాదించువారుగాని వాడరాదని వాదించువారుగాని యెవరికితోచిన అభిప్రాయములువారు చెప్పిరేగాని యిరు పక్షముల వారును సమంజసమైన కారణముల చూపించలేరు. హోమియోపతీ వైద్యులు మంత్రశాస్త్రజ్ఞులు తక్కువ మోతాదులతో మందులను వాడుతారు. అలోపతీమందు వైద్యులు వాడు మందులలో ఖనిజముల పరిమితి యెక్కువగా నుండును.

ఈ విషయములో మాత్రము తక్కువ మందులను వాడు హోమియోపతీ వైద్యులకును మానసిక చికిత్సకులకును మందువైద్యులతో కుదురుదుకలేదు.

ప్రకృతి వైద్యమువారికి అటు మందువైద్యులతోను యిటు మానసికచికిత్సకులతోను కుదరదు. వీరు చెప్పేదేమంటే దేహపోషణకు అవసరమైన వస్తువులుగల పదార్థములనే తినవలయును. సేంద్రియ లోహలవణములు గల కాయగూరలనే తినవలయును, జంతువుల పాలను, వెన్నను, మీగడను, నెయ్యిని కొంతవరకును వాడవచ్చును.

ఇనుము, సున్నము, సోడియము, పొటాషియము, మెగ్నీషియము, గంధకము, భాస్వరము మొదలగు లోహము

లన్నియు దేహపోషణకు అవసరములు. ధాతుశక్తి యెక్కువ తక్కువలు గాకుండా సరిగా ఉండవలెనంటే యివన్నియు సరియైన పాళ్ళలో ఉండవలయును. దేహ పోషణకు ఈ లోహములు అవసరముగదా అని భూమినుండి త్రవ్విన లోహములను మందుల రూపముగా మానవ దేహములలోనికి ప్రవేశపెట్టరాదు. ఈ లోహములును అణువుల సమూహములే. ఈ లోహములోని అణువుల స్వభావమునకును, గమనమునకును మానవదేహములోని రక్తములో అణువుల గమనమునకును, స్వభావమునకును తేడా గలదు. అందువలన భూమినుండి త్రవ్విన ఖనిజములతో తయారుచేసిన మందులు మానవదేహములోని రక్తముతో సారూప్యమును పొందవు. కలిసిపోవు. దేహములోని చిన్న అవయవములలో పేరుకొని దేహమునకు అపకారము చేయును. కాలికరోగములుగా బయటకు వచ్చును.

ఈ మందులు దేహములోని అంతరవయవములలో పేరుకొన్నట్లు కనీనికనుచూచి చెప్పగలము. ఆయా మందులు వాటి రంగులతో వాటికి అనురాగమున్న అవయవములలో చేరినట్లు కనీనికలోని ప్రతినిధి స్థానములనుబట్టి చెప్పగలము.

## మం దు ల రం గు లు
## Color Plate

ఏ మందులు యే అవయవములో చేరినదీ యే రంగులతో కనబడునదీ తెలుసుకొనుటకు ముందు ఆరోగ్యవంతుని కనీనిక యే రంగుతో ఉండునదీ తెలుసుకొనుట అవసరము,

ఇంతవరకు దొరకిన చరిత్రకాధారముబట్టి అదిమవాసుల కనీనికలు రెండు రకములుగా ఉన్నట్లు మనకు తెలియవచ్చుచున్నది. వారి కనీనికలు లేతనీలమురంగుగాగాని, లేతగోధుమ రంగుగాగాని ఉన్నట్లు మనకు తెలియవచ్చుచున్నది. లేత నీలమురంగునకును, లేతగోధుమరంగునకును భిన్నమైన రంగులు గల కనీనికలన్నియు రోగపదార్థములతో నిండినవనియే తెలుసుకొనవలెను. కనీనికానిదానశాస్త్రజ్ఞులు కనీనికరంగులలోని తర తమ బేధము లన్నిటిని సూక్ష్మముగా విచారించి యేమందువలన యేరంగువచ్చినదీ చెప్పవలెను. శాస్త్రము అపారముగాన యీ విచిత్రశాస్త్రమునుగూర్చి పెక్కు పరిశోధనలు జరుగవలయును. ఎప్పటికప్పుడు విచిత్రవిషయములు కనబడుచునే ఉండును.

ఏమందు, యే అవయువములో చేరితే, యేరంగు కనుబడేదీ, కనీనికలో ఆ రంగు కనుబడునపుడు, యే అంతరవయువములో యేమి మార్పు కనబడేదీ, తరువాతి పాఠములలో తెలుసుకొందాము. మందులో వాడు లోహపురంగునకును కనీనికలో కనుపడు రంగునకును చాలా దగ్గర సంబంధముండును.

ఈ కలరు ప్లేటులోని బొమ్మలన్నియు కుడి కనీనికలను తెలుపును.

1 వ బొమ్మ :— ఈ కనీనికయొక్క పుటికరంగు లేతనీలము. మందుల సేవించుటవలన పటములో కనుపడు రంగు వచ్చినది. కనుపాప చుట్టూ తెల్లని ఉంగరము కనబడుచున్నది. బొగ్గునుండియు, తారునుండియు, తయారుచేయు

బడిన మందుల వాడుటవలన చుట్టూ తెల్లటి ఉంగరము కనబడు చున్నది. కనీనిక పైభాగమున అర్ధచంద్రాకారములు రెండున్నవి. ధాతుశక్తి తగ్గిపోయినపుడు యిటువంటి అర్ధచంద్రాకారములు కనుబడును. కనీనికలోని మిగిలిన భాగములలో కూడా యీ అర్ధచంద్రాకారములు కనబడవచ్చును. ఈ అర్ధచంద్రాకారములు కనీనికలోని పై భాగములోనే ఉండవలెనను నియామకము లేదు. పై భాగములోనే గాక కనీనికలోని యేభాగములోనైనా ఉన్నయెడల శోషరసవాహికలును, శోషరసగ్రంధులున్నూ బాగా పనిచేయుటలేదని తెలుసుకొనవలయును. ఈ ధాతుశక్తి తక్కువగానున్నదనియు వెంటనే తెలుసుకొనవలెను. ఈ అర్ధచంద్రాకారములు యెచ్చటనున్నను మందుల సేవించుటవలననే యీ అర్ధచంద్రాకారములు యేర్పడినవని మాత్రము భ్రమపడరాదు.

మొదటి బొమ్మలోని పైభాగమునందు రెండు అర్ధచంద్రాకారములు కనబడుచున్నవి. అందులో ఒకటి పైనను, మరొకటి క్రిందను ఉన్నవి. పైనఉన్న అర్ధచంద్రాకారములో క్రింది అంచున పసుపుపచ్చరంగు కనబడుచున్నది. క్వయినాను సేవించుటవలన యీ రంగు కనబడును. పొటాషియము, బ్రోమిన్‌లు కలిపిన మందులను సేవించుటవలన పై అర్ధచంద్రాకారములు యేర్పడును. బ్రోమిన్ రంగు, కలపబడిన మందు రంగునుబట్టి మారుచుండును. మందులరంగులబట్టి యీ అర్ధచంద్రాకారపురంగు కూడా మారుచుండును. బ్రోమిన్ మందులను సేవించుటవలన యీ అర్ధచంద్రాకారములు కనీనిక వెలుపటి ఆవరణచుట్టూ ఉండుటయు గలదు. ఈ

బొమ్మలో వెలుపటి అంచున ఉన్న తెల్లటి ఉంగరము సోడియముతో తయారుకాబడిన మందులను యెక్కువగా సేవించుటవలన యేర్పడినది.

ఈ బొమ్మలో అర్ధచంద్రాకారము పైభాగముననే గలదు. ఒక పైభాగములోనే ఉండక కనీనిక వెలుపటి ఆవరణ అంతయూ ఉండుట కూడా గలదు. అప్పుడు సోడియము ఉంగరము మాదిరి ఉంగరమే ఉండును.

కనీనిక చుట్టూ నుండు తెల్లటి ఉంగరము సోడియము కలిపిన మందులను సేవించుటవలన వచ్చినది. సోడియముతో తయారుకాబడు మందులు - సోడియము, బైకార్బొనేటు, సోడియము సల్ఫేటు, సోడియము బోరిమేటు, సోడియము సలై సిలేటులు—ఇంతేగాక సున్నము, పొటాషియము, మెగ్నీషియములు గల లవణములు సేవించినను యీ తెల్లటి ఉంగరములు కనబడును.

ఈ ఉంగరము వెలుపటి ఆవరణలో యేర్పడుటవలన మనము మరొక విషయముకూడా గ్రహించుచున్నాము. సోడియము లవణములు, మెగ్నీషియము లవణములు, పొటాషియము లవణములు, సున్నపు లవణములను సేవించిన యెడల యీ లవణములు దేహము వెలుపల అనగా చర్మములో చేరుకొనును. ఈ లవణములు మెదడులో కూడా చేరవచ్చును. ఈ లవణములు చేరినందువలన మెదడులో జరుగవలసిన పని క్రమముగా జరుగదు. మతిమరపు పుట్టవచ్చును.

కనుపాపను బింబమని కూడా అందుము. కనుపాపకు

చుట్టూ నుండు మొదటి ఆవరణ జీర్ణాశయమును తెలుపును. మొదటి బొమ్మలో యీ ఆవరణలో తెల్లటి ఉంగరమున్నది. ఈ ఉంగరములో చిన్న చిన్న గీతలు గలవు. స్ట్రిచినిన్‌ను సేవించిన యీ ఉంగరము యీ గీతలతో కనుబడును. ఈ ఉంగరములోని తెల్లగీతలు నల్లపడుటయు గలదు. 6 వ బొమ్మలో నల్లటి ఉంగరము గలదు. ఈ తెల్లఉంగరము, అందులోని తెల్లగీతలు మొదటి ఆవరణలో ఉన్నవి గాన స్ట్రిచినిన్ మొదటి ఆవరణలో చేరినదని మనము తెలుసుకొనవలెను. ఈ ఉంగరము, అందులోని సన్నని గీతలు తెల్లగానే ఉండుట చేత రోగము కాలికరూపమును పొందలేదని గ్రహించవలయును. రోగము కాలికరూపమును పొందినయెడల యీ గీతలును, ఉంగరము నల్లపడెడిది. 6వ బొమ్మలో యీ గీతలును, ఉంగరము నల్లబడినవి. జీర్ణాశయము చచ్చుపడినది. చచ్చుపడిన జీర్ణాశయముల స్ట్రిచినిన్ కప్పివేయుటచే 6 వ బొమ్మలోని మొదటి రెండు ఆవరణములు కలిసిపోయినాయి. వివరముగా కనబడుట లేదు.

కనుపాప చుట్టూనుండు రెండవ ఆవరణ అనగా జీర్ణాశయమునకు వెలుపటి ఆవరణ చిన్నప్రేగులను తెలుపును. ఈ ఆవరణలో తుప్పురంగు కనుబడుచున్నది. ఈ తుప్పురంగు రెండవ ఆవణలోని ఒక భాగములోనే గాక మొత్తమంతటా కనబడును. చాలా కేసులలో యీ తుప్పురంగు రెండవ ఆవరణ అంతటా కనుబడును. భూమినుండి త్రవ్విన యినుము నరములను చచ్చుపడ గొట్టును. ఈ ఇనుము చేరగనే జీర్ణావయవములు క్రిమేపీ చచ్చుపడిపోవును ఇనుపగొట్టము నుండి

వచ్చిన నీరును సంవత్సరముల కొలదీ త్రాగుట వలనను కనీనికలోని రెండవ ఆవరణలో ఈ తుప్పురంగు కనుబడును.

కనీనికయొక్క క్రింది సగములో కనబడు అయిదు మచ్చలునూ సోరామచ్చలు. ఇవి గోధుమరంగుగా నున్నవి. ఈ మచ్చలను గజ్జిమచ్చలని కూడా పిలువవచ్చును. గజ్జి, తీట, చీడ, చుండు మొదలగు చర్మవ్యాధులకు ఖనిజములతో తయారు చేయుబడిన మందుల రాచి అణచిపెట్టుట వలన ఈ మచ్చలు కనుబడును. మొదటలో ఈ మచ్చలు గోధుమ రంగుగా నుండును. గజ్జిని అణచిపెట్టి సంవత్సరములు గడచిన కొలదినీ ఈ గోధుమరంగు మచ్చ లే నల్లపడును.

2 వ బొమ్మ :— ఈ కనీనికయు పులుకలో లేత నీలమురంగుగానే ఉన్నది. మందుల సేవించుట వలననే బొమ్మలో కనుపడు రంగువచ్చినది. కనీనికక్రింది భాగములోను ప్రక్కలను కనుపడినవి అయోడిన్ మచ్చలు. ఈ మచ్చలు బాగా యెర్రగా నుండును. నాగరికుల మనుకొను అందరి కనీనికలలోను ఈ యెరుపు మచ్చలు కనుపడును. గజ్జిమచ్చల కన్న ఈ అయోడిన్ మచ్చలు బాగా యెర్రగాను పెద్దవిగాను ఉండును.

కనీనికక్రింది భాగములో తెల్లటి మచ్చలున్నవి. వీటిని మేఘములని కూడా చెప్పవచ్చును. పాషాణముతో తయారు చేసిన మందులను తినుటవలన ఈ మచ్చలు కనుపడును. ఈ మచ్చలు ప్లీహము లో యెక్కువగా కానవచ్చును. పాషాణము ప్లీహములో ప్రధానముగా చేరును. ప్లీహము

అందువలన పెద్దదగును. పెద్దదగుటయే గాక యితర జబ్బులను కలుగును. కనీనికలో యేడు ఆవరణలు గలవని మా చదువరులు గత అధ్యాయములో చదివియే ఉన్నారు. కనీనికలోని 6 వ ఆవరణ శోషరసవాహికలను శోషరసగ్రంధులను తెలుపును శోషరసవాహికలలోని లోపములను తెలుపు మచ్చలకును పాషాణమును తెలుపు తెల్లమచ్చలకును యేమియు సంబంధము లేదు. వేటి క్రియలు వాటిదిగానే ఉండును. శోషరస మండలములోని లోపముల తెలుపు గుర్తులు (మచ్చలు) కనీనిక వెలుపటి అంచునకు దగ్గరగా నుండును. ఈ మచ్చలును ఒకటి వెంట మరొకటి క్రమముగా ఉండును గాని అల్లరిచిల్లరగా నుండవు. 6 వ ఆవరణను దాటి 5 వ అవరణలోనికి గాని 7 వ ఆవరణలోనికిగాని ఈ మచ్చలు రావు. పాషాణమును తెలుపు మచ్చలన్ననో అటులగాదు. ఈ మచ్చలు కనీనిక యొక్క క్రింది సగములోగాని మీది సగములోగాని రెంటిలోగాని ఉండవచ్చును. కనీనిక యొక్క వెలుపటి ఆవరణ అంతా ఒకే రకమైన నల్లగా ఉండును. కొన్ని కేసులలో క్రిందిసగములోని 7 వ ఆవరణ రంగునకును మీది సగములోని 7 వ ఆవరణ రంగునకును తేడాయుండును. వెలుపటి ఆవరణ అంతయు ఒకేరకమైన రంగుగలదిగా నుండవచ్చును. ఉండకపోవచ్చును. కనీనిక చుట్టు అంతా ఒకటే రకమైన నల్లగా ఉన్న యెడల రోగపదార్థము వంశానుగతముగా (పితార్జితముగా) సంక్రమించినదని తెలుసుకొనవలయును. కనీనిక యొక్క 7 వ ఆవరణలోని నలుపు కొన్ని భాగములలో మాత్రమే ఉన్న

యొకల రోగపదార్థము స్వార్జితముగా వచ్చినదని తెలుసు కొనవలయును

కనీనికలో 36 ప్రతినిధి భాగములు గలవు. అందులోని 1 వ ప్రతినిధి భాగము మెదడును తెలుపును. దేహములో తల అందులో మెదడు యొటుల పైభాగమున ఉండునో అట్లనే కనీనికలోని పైనఉన్న 1 వ భాగము మెదడునే తెలుపును. బొమ్మలో కనుపడినట్లుగా కనీనికలోని 1 వ ప్రతినిధి భాగములో తెలుపురంగు కనుపడినయొడల మెదడులో పాదరసము చేరినదని గ్రహించవలయును. బొగ్గు నుండియు తారునుండియు తయారుచేసినమందుల సేవించుట వలననూ మెదడును తెలుపు 1 వ ప్రతినిధి భాగములో తెలుపురంగు కనుబడును. సున్నము కొట్టినట్లుగా తెల్లగా నుండును. బ్రోమిరాన్ కలసిన లవణములు మిగిలిన లోహాలవణముల వలన ఈ తెలుపురంగు మరీవృద్ధి యగును. మూర్ఛలు, అపస్మారము, ఉన్మాదము, పిచ్చితో బాధపడువారి కనీనికలు ఈరీగతినే ఉండును.

రెండవ బొమ్మలోని ఒకటి రెండు ఆవరణలలో purple రంగు కనబడుచున్నది. సీసముతో (Lead) తయారు చేసినమందుల తినుట వలన ఈ రంగు జీర్ణావయవములలో కానగును. ముద్రాక్షరశాలలో పనిచేయువారి కనీనికలలోను చిత్రకారుల కనీనికలలోను ఈ purple రంగు యెక్కువగా కానగును. కనుపాప నుండి 1 వ ప్రతినిధి భాగము వైపుకు పోవు తెల్లగీతలు గలవు. మత్తును గలిగించు నల్లమందు కొకెయిన్ కలసినమందుల సేవించుటవలన ఈగీతలుయేర్పడినవి.

ఈ మందులను యెక్కువగా సేవించినవారి కనీనికలలో యీ గీతలు చాలా యెక్కువగా నుండును. కొన్ని కేసులలో ఈ తెల్లగీతలు కనుపాపనుండి బయలు దేరును. మరికొందరి కనీనికలలో ఈ తెల్లగీతలు స్వతంత్రి నాడీమండలమును తెలుపు మూడవ ఆవరణనుండి బయలుదేరును.

నల్లమందు కలిసిన మందులవల్లను బొగ్గు తారులనుండి తయారు చేసిన మందులవల్లను స్వతంత్రి నాడీమండలము తెల్లబడును. కొన్ని కేసులలో క్వయినా స్వతంత్రి నాడీమండలములో కనుబడును. అయోడిన్ రంగుకూడా ఈ మూడవ ఆవరణలో కనుబడును.

3 వ బొమ్మ.— ఈ కనీనికరంగు కూడా పుటుకలో నీలముగానే ఉన్నది. దీనిపై సగములో క్వయినా చేరినది. ఈ క్వయినా 1 వ ప్రతినిధి భాగములో చేరినది. ఈకనీనికలో పసుపుపచ్చరంగు కనుబడుచున్నది. స్వతంత్రి నాడీమండలమును తెలుపు మూడవఆవరణలో కూడా పసుపుపచ్చరంగు కనుబడుచున్నది. మధుకోశమును తెలుపు 13 వ ప్రతినిధి భాగములో కూడా పసుపుపచ్చరంగు కనుబడుచున్నది. నీలపురంగుమీద పసుపుపచ్చరంగు కనుపడుటచే ఆకుపచ్చరంగు కనుబడుచున్నది. ఇది ఆకుపచ్చరంగని మాత్రము మనము భ్రమపడరాదు. క్వయినా ముఖ్యముగా మెదడును తెలుపు 1 వ ప్రతినిధి భాగములోను స్వతంత్రినాడీ మండలమును తెలుపు 3 వ ఆవరణలోను కనుబడును. క్వయినాకును ఈ మండలమునకును అనురాగమున్నదని తెలుసుకోవలెను.

క్కైయినా అప్పుడప్పుడు జీర్ణావయవములలోను, చిన్న ప్రేగుల లోను, మధుకోశములోను, ప్లీహాములను తెలుపు ప్రతినిధి భాగములలోను కనబడు చుండును.

ఈ కనీనిక వెలుపటి ఆవరణలో ఆకుపచ్చరంగు కను బడుచున్నది. ఈ రంగు పాదరసమును తెలుపును. ఈ రంగును కనుగొనుట చాలా కష్టము. చాలా సంవత్సరముల పరిశోధన మున గాని కనుగొన లేము. కనీనికలోని పై భాగములో కుడిప్రక్క ఒక అర్ధచంద్రాకారమున్నది. దీనినిబట్టి పాదరసము మెదడులో చేరినదనియు మెదడులోని కుటికలను పాడుచేయుచున్నదనియు మనము తెలుసుకొన గలము. ఈ అర్ధచంద్రాకారములు యెక్కువగా నున్నవారు తీవ్రమైన మనోవేదనలను పొందుతూ ఉంటారు. మరణము కూడా దగ్గరలోనే ఉన్నదని మనము గ్రహించవచ్చును.

విభాజకము తెలుపు 14 వ ప్రతినిధి భాగములోను జననేంద్రియముల తెలుపు 20, 31 వ ప్రతినిధి భాగములలోను ergot యొక్క గోధుమరంగు కనబడు చున్నది. చిన్నప్పుడు యీ మెకు (hemorrhage) రక్తాభిష్యందము కలిగినది. దానిని నయము చేయుటకు ergot ను వాడినారు. రెండవ ఆవరణ చిన్న ప్రేగులను తెలుపును. ఈ ఆవరణలోనే 13 వ ప్రతినిధి భాగమునకు నూటిగా ఉండు భాగము pancreas ను తెలుపును ఈ రోగిని తెలుపు భాగములో సోరామచ్చ గలదు. Pancreas ను తెలుపు భాగములో సోరామచ్చ ఉన్న యెడల రోగి అతి మూత్రముతో బాధపడుతూ చివరదశలో నున్నాడని తెలుసు కొనవలెను. 23 వ ప్రతినిధి భాగములో అయోడిన్ మచ్చ

గలదు. ఈ అయోడిన్ మచ్చచుట్టూ తెల్లగీతలు గలవు. ఈ తెల్లగీతలు అయోడిన్ మచ్చచుట్టూగాని ఒకప్రక్కగాని ఉన్నట్లయితే అయోడిన్ బయటకు పోవుచున్నదని గ్రహించవలయును. స్వాస్థ్య సంకటములు కలిగినపుడు గొంతులో అయోడిన్ వాసన తెలియవచ్చును. ఈ కసీనికగల రోగికి వంటినిండా బొబ్బలు లేచినవి. రోగపదార్థము బయటకు పోవుటకు ఈ బొబ్బలు సాయపడినవి.

4 వ బొమ్మ:—ఈ కసీనిక పుటుకలో గోధుమరంగు గలది. ఈ కసీనిక పైభాగమున బూడిదరంగు గలదు. తలనొప్పి, తలదిమ్ము, నరములలోని చిమచిమలు మొదలగు బాధలకు antikamnia ను వాడుదురు. ఈ మందును బొగ్గునుండియు తారునుండియు తయారు చేయుదురు. బొగ్గుతారుల నుండి యీ మందేగాక మరి యితర మందులుకూడా తయారు చేయుదురు. మిగిలిన మందులకన్న యీ మందు చాలా త్వరగా మెదడులో చేరును. మెదడును తెలుపు 1 వ ప్రతినిధి భాగములో యీ రంగు కనుబడును. ఈ మందును సేవించుట వలన 1 వ ప్రతినిధి భాగములో యీ రంగు కనుపడుట వలన బొగ్గు తారులకును మెదడునకును అనురాగ మున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈమందు రంగు ఒకటవ ప్రతినిధి భాగములో చేరుటచే పిచ్చియెత్తినట్లు చాలా కేసులలో చూచినాను.

జీర్ణాశయమును తెలుపు ఒకటవ ఆవరణలోను చిన్న ప్రేగులను తెలుపు రెండవ ఆవరణలోను పసుపుపచ్చరంగు కనుబడుచున్నది. బహుశః చిన్నప్పుడు లేచిన గజ్జి, తీట, చీడ, మొదలగు చర్మవ్యాధులను నయముచేయుటకు (అణచి

వేయుటకు) రాచిన గంధకము తయారు చేసిన మందులలోని గంధకము కావచ్చును. దీనిని చూచి క్వాయినా రంగని భ్రమ పడరాదు. క్వాయినా అయినయెడల చుక్కలుగా గాని మేఘములుగా గాని కనుపడును. క్వాయినాకన్న గంధకము చిక్కని పసుపురంగుతో కనబడును.

రెండవ బొమ్మలోని స్వతంత్రనాడీమండలములోని తెలుపురంగు మాదిరిగనే యీబొమ్మలోకూడా స్వతంత్రనాడీ మండలమును తెలుపు మూడవ ఆవరణలో తెలుపురంగు కనబడుచున్నది. బొగ్గునుండి, తారునుండితయారుచేసినమందులను వాడుటవలన యీ తెలుపురంగు కనబడుచున్నది.

ఈకనీనికలోని యేడవ ఆవరణలోని నలుపురంగు చిక్కగానున్నది. విస్ఫోటకం లేచిన చర్మవ్యాధులకు రాచిన మందులలోని పాదరసము, గంధకముతో యీ నలుపురంగు వచ్చినది.

ఈ కనీనికలోని 19 వ ప్రతినిధి భాగములోను 21 వ ప్రతినిధి భాగములోను, 22 వ ప్రతినిధి భాగములోను బూడిద రంగుగల మేఘములు కనబడుచున్నవి. Turpentine సేవించిన యీరంగు కనబడును. మూత్రపిండములకును యీ మందునకును అనురాగమున్నది. ఈ కనీనికలోని నాడీ ఉంగరములు నల్లబడుచున్నవి. రోగము తరుణ రూపములోని రెండు దశలను దాటి కాలికరూపములోని మొదటిదశను పొందునపుడు యీ నాడీఉంగరములు నల్లబడును. 7వ ఆవరణ ప్రక్కన ఉన్న ఆరవ ఆవరణలోని కొన్నిభాగములలో మాత్రమే శోషరస వాహికలు (తెలుపురంగుగా) కనబడుచున్నవి.

5వ బొమ్మ:—ఈకనీనిక పుటుకలో గోధుమరంగుగలది. ఈ కనీనిక తెలుపుల ఆనగా 7వ ఆవరణలో మూడింట రెండు వంతుల శోడియము ఉంగరమున్నది. మిగిలిన మూడవ వంతు రంగుకూడా గోధుమవన్నెగా లేదు. కనీనికలోని యేడవఆవరణ చక్రమును తెలుపును. కనీనిక మొత్తమునకు స్వత సిద్ధముగా నున్న గోధుమరంగుపోయి మరొకరంగు వచ్చినది. ఈరంగు కనీనికలోని యేడవఆవరణ మొత్తమంతా లేకపోవుటచే రోగ పదార్థము పిత్రీయముగా సంక్రమించలేదనియు, స్వార్జితముగా వచ్చినదనియు తెలుసుకొనవలయును. కనీనికలోని పై సగములో మెదడును తెలుపు 1వ ప్రతినిధిభాగములో అర్ధచంద్రాకారము ఒకటున్నది. కనీనికలోని ఒకటి, రెండు ఆవరణలలో నలుపురంగు కనబడుచున్నది. చిన్నప్పటినుండీ రసభస్మము వాడుటచే జీర్ణావయవములలోని అమత్వాచము చచ్చుపడి పోయినది.

6వ బొమ్మ:—ఈ కనీనికయు పుటుకలో గోధుమరంగు గలదే. ఈ పెద్దమనిషి సేవించిన పాదరసపు మందులోని రసము కనీనికలోని 7 వ ఆవరణలోచేరినది. ఈ రసపుమందులను యీ పెద్దమనిషి చాలాతడవలు చర్మమునకుపూసినాడు. ఈ కనీనికలో పైభాగమున కుడిపైపున ఒక అర్ధచంద్రాకారమున్నది. పాదరసము మెదడులో చేరినదనియు, అందువలన 1 వ ప్రతినిధిభాగములో అర్ధచంద్రాకారము ఒకటి యేర్పడినదనియు మనము తెలుసుకొనవలెను.

కనీనికలో పైభాగములో బూడిదరంగు కనబడుచున్నది. బాగు, తారులనుండి తయారుచేసిన మందుల వాడుటవలన

యీాబూడిదరంగు కనబడుచున్నది. ఒకటి, రెండు ఆవరణలలో నలుపురంగు కనబడుచున్నది. కాన జీర్ణావయవములు చచ్చి పడిపోయినవని తెలుసుకొనగలము. మొదటి ఆవరణలోని లోపలభాగములో స్ట్రిచినిన్ (Strychinin) చక్రము కనబడు చున్నది. పాదరసము యెక్కువవాడుటవలన జీర్ణావయవములు చచ్చుపడినవి. ఈ చచ్చుపడిన జీర్ణావయవములలో చురుకు దనము కల్గించుటకు స్ట్రిచినిన్ వాడినారు. అదియే మొదటి ఆవరణలోని లోపలభాగములో కనబడుచున్నది.

జీర్ణ మండలమును తెలుపు ఒకటిరెండు ఆవరణలనుండి తెల్లకిరణములు పై మండలములకు వచ్చుచున్నవి. ఈయనకు కాళ్లూ, చేతులూ చచ్చుపడియుండును. ఆబాధలను నివారించు టకు నల్లమందు కలిపిన మందులను యిచ్చినారు. జీర్ణమండల మునుండి బయలుదేరిన తెల్లకిరణములు ఆసంగతిని తెలియ జేయును. కనీనికలోని క్రిందిభాగములో రెండు, మూడు ఎర్ర మచ్చలున్నవి. ఈ ఎర్రగుర్తులకు చుట్టూ తెల్లగీత లున్నవి. ఇవి అయోడిన్ మచ్చలు. పాదరసముతో తయారుచేసిన మందులను యెక్కువగా సేవించిన రోగులలో యీ అయో డిన్ మచ్చలు వెన్నుపామును తెలుపు ప్రతినిధి భాగములో కనుపడును. ఈ పెద్దమనిషి చాలారోజులనుండీ పాదరసము మెదడులో చేరుటవలన బాధపడుచున్నాడు. ఈజబ్బుకు మందు వైద్యులు రెండపదశలోని సుఖరోగములందురు. నాడీ ఉంగర ములు నల్లబడినవి. అందువలన నాడీమండలము పూర్తిగాచెడిన దని తెలిసికొనగలము.

ఈ చచ్చుపడిన నాడీమండలమును ఉద్రేకపరచుటకు భాస్వరముతో తయారుచేసినమందులను యిచ్చినారు. 8 వ ప్రతినిధిభాగములు ఊపిరితిత్తులను తెలుపును. ఈ ప్రతినిధి భాగములలో పసుపుపచ్చరంగుగల మేఘములు కనబడు చున్నవి. భాస్వరము ఊపిరి తిత్తులలో చేరుటచే యీపసుపు పచ్చరంగుగల మేఘములు కనబడుచున్నవి.

## ఇనుము.

భూమినుండి త్రవ్విన యినుముతో అనేకమందులను తయారుచేయుచున్నారు. రక్తముతక్కువగానున్నదని చెప్పు పాండువ మొదలగు రక్తక్షీణవ్యాధులలో యినుముతోతయారు చేసినమందులను యెక్కువగా యిస్తారు. ఒంటికి బాగా బలము పట్టుటకు యిచ్చు టానిక్కులలో యినుము ప్రధానముగా నుండును. మందులలోని యినుము జీర్ణాశయములోను, ప్రేగుల లోను చేరును. మనకెట్లు తెలిసినదంటే-కనుపాపచుట్టూనుండు ఒకటి, రెండు ఆవరణలలో తుప్పురంగు కనబడును. ఒకటవ బొమ్మను చూచిన యీ విషయము బాగుగా బోధపడును. ఇనుపగొట్టము నుండివచ్చిన నీటిని చాలాకాలము త్రాగుటవలన కనీనికలో ఒకటి, రెండు ఆవరణలలో యెట్లు త్రుప్పు కనబడునదీ తెలియజెప్పుటకు ఒకామెచరిత్రను చెప్పుట అప్రస్తుతము కాదనుకొంటాను. ఇది ప్రత్యక్షముగా జరిగినకథ.

చాలాసంవత్సరములక్రితము ఒకామె మా ఆసుపత్రికి పరీక్షార్థమై వచ్చినది. కనీనికనుచూచి అంతరవయవములలోని లోపముల చెప్పుమన్నది. కనుపాపచుట్టునుండు ఒకటి, రెండు

ఆవరణలలో తుప్పురంగు బాగాకనపడినది. ఆమెకును నాకును ఈ క్రింది సంభాషణ జరిగింది.

నేను:—రక్తక్షీణవ్యాధులతో మీరిదివరకు బాధపడ్డారు. దానికి గాను భూమినుండి త్రవ్విన యినుముతో తయారుచేసిన మందులను యెక్కువగా తిన్నారు.

ఆమె:—నాకుగుర్తు లేదు.

నేను.—(ఈమె మరచిపోయింది.) ఇనుపగొట్టమునుండి వచ్చిన నీటిని చాలాకాలము త్రాగినారు.

ఆమె:—అన్నట్లు మరచిపోయినాను. మేము అమెరికాలో నున్నప్పుడు యెప్పుడునూ పంపునీటినే వాడెడివారము. ఆపంపు యినుముతో తయారు చేయబడినదే.

నేను:— మీరిప్పుడు పడు బాధలన్నియు యినుము అంతర వయవములలో చేరుటవలన వచ్చినవేను.

ఆమె:— నాబాధల పుటుకనుగూర్చి బాగా చెప్పారు. ఈ బాధలు తగ్గుటకు యేమైనా మార్గముగలదా.

నేను:— లేకనేమి? అంతరవయవములు తూట్లుపడి రోగము నాల్గవదశను పొందనంతవరకు క్రమప్రకారము చేసిన యెడల కుదరని రోగము లేదు.

ఆమె:— అయితే నన్నేమిచేయమంటారు?

నేను:— పండ్లను, కూరలను యెక్కువగా తినవలెను. దేహమునకు చెమట పట్టునంతవరకు వ్యాయామము చేయాలి. కరకరా ఆకలికానిదే ఆహారము తినరాదు. దేహానికి గాలి వెలుతురులు బాగా తగలనీయాలి.

ఆరు నెలల తరువాత,

ఆమె:— డాక్టరుగారూ! మీరు చెప్పిన వైద్య పద్ధతు లన్నియు ఆచరించాను. రోగము నయమైనది.

నేను:— (కసీసికను చూచి) మీ కసీసికలోని తుప్పురంగు లోపించినది. అప్పటినుండీ యీమె ఆరోగ్యము బాగా ఉన్నది. మలమూత్రములు బాగా జారీ అగుచున్నవి.

ఆయుర్వేద యునానీ వైద్యములందు యీ లోహమును యీ క్రిందవిధముగా ఉపయోగింతురని ఇండియన్ మెటీరియా మెడికా 982, 983 పేజిలలో గలదు.

ఇనుమును క్షయరోగులకును, అనుపాన భేదములతో జ్వరములకును యిత్తురు. పాండువ మొదలగు రక్తక్షీణ వ్యాధులకును, గనేరియాకును వాడుదురు. రక్తాభిష్యందములకు వాడుదురు. ప్లీహామునకు సంబంధించిన వ్యాధులందును నంజు వ్యాధులకును వాడుదురు. శ్వేత కుసుమవ్యాధిని కుదుర్చుటకు పెట్టినది పేరు. మూత్రవ్యాధులందు అమోఘముగా పనిచేయును. అగ్ని మాంద్యము రోగలందులకు వాడుదురు. బొబ్బలు, పుండ్లు, కామిల, కుంభకామిలలు రోగలందులకు వాడుదురు. ఈ లోహముతో తయారగు రసములో కొన్ని మనసుర నాద్యలోహము, అర్సారిలోహము, అగ్నిముఖలోహ కండ కాద్యలోహము, సుధానిధి రసము, ఆమలకాద్య లోహము, కల్పమ్, మేహాముద్గర రసము, నిహ్రృత సోమనాథ రసము.

ఇదే గాక పాదరసమును, బంగారమును, వెండిని కలిపి పాళ్ల భేదములతో మందులను తయారు చేతురు. ఈ మందులను అనేక రోగములకు వాడుదురు.

అలోపతీ వైద్యులు వాడువిధము:— ఇనుము, పాషాణముతో తయారుకాబడిన మందులను చర్మవ్యాధులకు ప్రధానముగా వాడుదురు. హృదయవ్యాధులకును, నాడీ వ్యాధులకును, మూత్ర పిండముల దాహమందును వాడుదురు.

ఆగంతుక విషీకరణము:— ఇనుము ప్రధానముగా గల ప్రదేశములలోని నీటిని త్రాగునపుడును యీ లోహము దేహములో చేరును.

రక్తక్షీణవ్యాధులందు యిచ్చే టానిక్కులలోను గలదు. విష చిహ్నములు (లోహము దేహములో ఉండగా బయటకు కనబడు చిహ్నములు) ఇనుము, గంధకములతో తయారు కాబడిన మందులు జీర్ణముకాక మిగిలిన వన్నీ మలముతో బయటకు పోవును. మలము నల్లగా నుండును.

అగ్నిమాంద్యము, కాలికమైన మలబద్ధకము ఉండును. పొట్టలో నొప్పిగా నుండి ఒత్తితే తగ్గిపోవును.

## Sodium (సోడియము)

Sodium అనునది ఒకలోహపుపేరు. ఆంగ్లశబ్దమునకు సరియైన తెల్గుశబ్దము దొరకకపోవుటచే సోడియము అనే తర్జుమా చేసినాము. సోడియము, మెగ్నీషియము, సున్నములతో తయారుకాబడిన లవణముల సేవించిన కనీనికయొక్క వెలుపటి ఆవరణలో తెల్లటి ఉంగరము కనబడును. ప్రకృతి

వైద్యముతో పరిచయముకలుగచేసికొని రోగము నయము చేసుకొనంతవరకు నా కనీనికలో కూడా యీ మందులన్నియు ఉన్నవి. ప్రకృతివైద్యము చదువుటచే నాలోని మందులు కలవని తెలుసుకొని అవి బయటకు పోవుటకు తగురీతిని ప్రయత్నము చేసితిని. పదిహేను సంవత్సరములు గడచిన తదుపరి కనీనికలోని మందులరంగులన్నియు లోపించినవి. కనీనిక చుట్టు ఉన్న తెల్లఉంగరము నామరూపముగా లేకుండా పోయినది.

15 వ బొమ్మ

15 వ బొమ్మను చూచినయెడల కనీనికయొక్క వెలుపటి ఆవరణలో ఒక తెల్ల ఉంగరము కానవగును. కొంచెము లోపలగా అనగా 5 వ ఆవరణలో మరొక చిన్నఉంగరము ఉన్నది. జీర్ణాశయంలో కలిగిన మంటలను (hyper acidity of the stomach) తగ్గించుటకు సోడియముతో తయారుచేసినమందులను యెక్కువగా సేవించాను. అందువల్ల కనీనికలో సోడియము ఉంగరము కనుబడినది. భూమినుండి త్రవ్విన సోడియముతో తయారుచేసిన రంగులను తినుటమాని, ప్రకృతిసూత్రములకు అనుకూలముగా జీవించి ప్రకృతివైద్య పద్ధతులతో నయముచేసుకొనిన తరువాత సోడియము ఉంగరము లోపించినది. 16 వ బొమ్మలోని కనీనకలే యిందుకు నిదర్శనములు.

నాకు చిన్నతనములో గవదబిళ్లలు లేచినవి. శోషరస గ్రంధులు ఉబికినవి. అవి తగ్గిపోవుటకు అయోడిన్ రాచినాను గవదబిళ్ళలు తగ్గిపోయినవి. ఇట్లు అనేక పర్యాయములు లేచినవి. అన్నితడవలూ అయోడిన్ రాచినాను. అయోడిన్‌లోని విషము చర్మముద్వారా లోనికిపోయినది. మధుకోశములోను







15-వ బొమ్మ

వివరణ.— డా. లిండ్లహారు రోగగ్రస్తుడైనపుడు అతని కనీనికలు ఈవిధముగా నున్నవి. x గుర్తులు మూత్రపిండము, లివరును తెలుపు ప్రదేశములో గలవు. చుట్టూ నున్న ఉంగరములు సోడియము ఉంగరమును తెలుపును. లోపలి తెల్లఉంగరము జీర్ణాశయవ్యాధికి తీసికొనిన మందులను తెలుపును.




16-వ బొమ్మ

వివరణ—16 సంవత్సరములు శ్రద్ధగా చికిత్సను పొందిన తదుపరి డా లిం. కనీనికలు. ఇంతకాలము చేసినప్పటికిని మందులగుర్తులు సూక్ష్మముగా లేకపోలేదు. ఎడమ మూత్రపిండము (19) ఎడమ ఊపిరితిత్తి (8, 9) ఎడమశ్వాసనాళికలు—కుడి ఊపిరితిత్తి—(8 M, 9) గాల్ బ్లాడరు— 12, 13 (పై భాగము).

మూత్రపిండములోను చేరినది. అక్కడనే నిలచిపోయినది. అయోడిన్‌లోని విషము ఆయా అవయవములలో చేరుటచే బాధలు మొదలు పెట్టినాయి. ఈ విషమునకు నా జీవిత పంథాలోని లోపములు తోడుపడినాయి. ఈ రెంటి ఫలితముగా నా బాధలు యెక్కువైనాయి. కాలికముగా మారిపోయినవి. ఈ బాధలను తగ్గించుటకై యీ శాస్త్రమును అభ్యసించ మొదలు పెట్టినాను. శాస్త్రమును అభ్యసించి, ఆచరించి, ఫలితములను పొందినాను.

పది హేను సంవత్సరములు ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించి ప్రకృతి వైద్యపద్ధతులతో నయముచేసి కొన్నగాని దేహములోని సోడియము, కనీనికలోని సోడియము గుర్తులు లోపించలేదు. ఆయా అవయవములలోని మచ్చలు కానవచ్చుచున్నవి. ఎడమ మూత్రపిండమును తెలుపు 19వ ప్రతినిధి భాగములోను, ఊపిరితిత్తులను తెలుపు 8, 9 ప్రతినిధి భాగములలోను, శ్వాసనాళికలలోను, కుడి కనీనికలోని 19 వ ప్రతినిధి భాగములోను, గాల్ బ్లాడరును (gall bladder) తెలుపు 13 R ప్రతినిధి భాగములోను, అయోడిన్ మచ్చలుగాను, చుక్కలుగాను కనబడుచున్నది.

బొమ్మ 16

దీనినిబట్టి మన మొకవిషయమును తెలుసుకొనవచ్చును. ఏమిటంటే దేహపోషణకు అవసరమైన 18 ధాతువులలోను సోడియము, ఆయోడిన్ లు ముఖ్యము. దేహపోషణకు యీ ధాతువులు ముఖ్యమైనప్పటికినీ, భూమినుండి త్రవ్వినలోహములతో తయారు కాబడిన మందులు రక్తముతో సారూప్య

మును పొందవు. గాన వాడరాదు. రక్తముతో సారూప్యమును పొందని లోహములు నిలిచిపోవును. ఆలోహములకు అనురాగమున్న చోట్ల పేరుకొనును. ఒక తడవ పేరుకొనిన యెడల యెంత స్వాభావికముగా జీవించి నప్పటికినీ ఆ యీ మందులు వదలిపోవు. కాన ఖనిజములతో తయారుకాబడిన మందుల వాడకుండుటయే మంచిది.

పైన చెప్పిన మా స్వంత విషయమును బట్టి మరొక సంగతికూడా గ్రహించవచ్చును. సోడియము, అయోడిన్‌లు రెంటిలోను సోడియము త్వరగా బయటకు పోవును అయోడిన్ అంతత్వరగా బయటకు పోదు. సోడియము త్వరగా బయటకు పోవును. గనుకనే కనీనికలోని సోడియముడుంగరము లోపించినది అయోడిన్ అంత త్వరగా బయటకు పోలేదుగనుకనే అనురాగముగల ప్రతిసిద్ధి భాగములలో నల్లటి చుక్కలు కనుబడును.

ఎంత కాలమునకు యీమందులు లోపించునను ప్రశ్నకు యీ కథ బాగా సమాధానము చెప్పుచున్నది.

కొన్ని కేసులలో కనీనికలో మందుల రంగు కనబడినప్పటికినీ, దేహములోనుండి ఆ మందులు పోవచ్చును. ఈ విషయము, పది, యిరువది సంవత్సరములు ప్రకృతి సూత్రములకు అనుకూలముగా జీవించిన గాని సంభవించదు. రెండు మూడు నెలలు చికిత్స చేసిన వెంటనే దేహమునుండి మందులు పోయినవనియు కనీనికలో మాత్రము మందుల రంగులు కనబడు చున్నవనియు తలచుట పొరపాటు.

కనీనికలోని మందుల రంగులు లోపించకుండా దేహములోని మందులు వెళ్ళిపోవునని మా చదువరులకు సందేహము తోచవచ్చును. ఇందుకు సమాధానము యీ గ్రంథములోని తరువాత అధ్యాయములో గలదు.

ఇప్పటివరకు మేము చెప్పు సమాధాన మేమంటే ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించుటచేత దేహమంతా శుద్ధి అగును దేహము మొత్తమంతా బాగుపడును. దేహములో నాల్గు బహిష్కారావయవములు ఉన్నవని చర్మితచర్వణముగా చెప్పుచునే ఉన్నాము. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించుటచేత యీ నాలుగు అవయవములు బాగా పనిచేయును. అనుక్షణము దేహములో తయారగు రాసాయనిక మురుగు యీ నాలుగు దోవలా బయటకు పోవును. ఈ నాల్గింటిలో యే ఒకటి సరిగా పనిచేయక పోయినను మిగిలినవి మూడును దాని పనిని పూర్తి చేయును. బహిష్కరణ క్రియలో దేహములో తయారై నిత్యము బయటకు వెళ్ళు రాసాయనిక మురుగుతో బాటు మందులు కూడా వెడలిపోవును.

కనీనికనుండికన్న దేహమునుండి త్వరగా వెడలిపోవుట గలదు. It may also be possible that drug poisons are more readily eliminated from vital organs than from the iris on account of the more active metabolism of the former.

ఇనుము, సోడియము, గంధకము, సున్నము, మెగ్నీషియము మొదలగు లోహములన్నియు దేహపోషణకు అవసరము. అయోడిన్ భాస్వరములు పై కోటిలోనివే.

భాస్వరము, అయోడిన్‌లకన్న ఇనుము, సోడియము, గంధకము సున్నము, మెగ్నీషియములు త్వరగా బయటకు వెడలిపోవును.

భూమినుండి త్రివ్విన లోహములతో తయారు చేసిన మందులు దేహము నుండి చాలా ఆలస్యముగా బయటకు పోవునని మనము తెలుసుకొన్నాము. అందును భాస్వరము, అయోడిన్‌లు మిగిలిన లోహములకన్న యింకా ఆలస్యముగా పోవును. కాన ఖనిజముల లోహములతో చేసిన మందులను వాడరాదని పదేపదే చెప్పుట.

## పొటాషియము, సున్నము, మెగ్నీషియము

భూమినుండి త్రవ్విన సున్నము, మెగ్నీషియము పొటాషియములతో తయారు చేసిన మందులను మందు వైద్యులు అన్ని రోగములకును వాడుదురు. ఈ మందులను సేవించిన యెడల కనీనిక వెలుపటి ఆవరణలో బూడిదరంగు కానవచ్చును. సోడియముతో తయారుచేసిన మందులను సేవించిననూ యిదే రంగు కనీనిక వెలుపటి ఆవరణలో కనుబడును 1 వ బొమ్మలోని సోడియము ఉంగరము కనీనిక వెలుపటి ఆవరణ అంచులోను కనబడును. 5 వ బొమ్మలోని వెలుపటి ఆవరణలోని మూడువంతులలో రెండువంతులున్న బూడిద రంగు పైన చెప్పిన మాటలకు ప్రత్యక్ష నిదర్శనము.

కొద్దిరోజుల క్రిందటనే ఒక పెద్దమనిషి ఆసుపత్రికి పరీక్షార్థమై వచ్చినాడు. ఆయన కనీనిక వెలుపటి ఆవరణలో సోడియము ఉంగరము కనుబడినది. (15 వ బొమ్మ లోని సోడియము ఉంగరము మాదిరి ఉంగరమె కనుబడినది.) ఆయనకును నాకును ఈ క్రిందిసంభాషణ జరిగినది.

నే:—నీకు లోగడ జబ్బుచేసినది వాటికి సోడియము, పొటాషియము తోతయారుచేసిన మందులను వాడినారు. (కనీనిక లోని వెలుపటి ఆవరణలో సోడియము ఉంగరముకనబడినది.)

ఆయన:— లేదు.

నే.—మీరు తాగినసీటిలో సోడియము, పొటాషియము, సున్నములు యెక్కువగా ఉండాలి.

ఆయన.— అవును, మా డాక్టర్ కూడా అదేమాటను చెప్పుచుండేవారు. అయితే, లోపల చేరినమందులు యెట్లా వెళ్లిపోవునంటారు.

నే:—పండ్లనూ కూరలనూ యెక్కువగా తినవలయును దేహములో చేరిన రోగపదార్థమును, బయటకు పంపుటకు అనుకూలమైన ఆహారమునే తినవలయును. దేహమునకుగాలీ వెలుతురుల బాగాతగలనీయవలెను.

ప్రపంచములో దేనివలనను జరుగనిఅపకారము మందుల వలన జరుగుచున్నది. నోరూవాయీలేని పిల్లలకు రసము పాషాణములతో తయారుచేసిన మందులను పోయుట మహా పాపము. సోడావుప్పునగాని, మామూలు ఉప్పునుగానివేసిన పచ్చళ్ళను, కూరలను, అవగాయలను పిల్లలకు వేయరాదు. ఎందుకంటే ఈ ఖనిజాలు దేహములోని అంతరవయవములలో పేరుకొనును. ఆయా అవయవములలో పేరుకొనినట్లు కనీనికనుచూచి చెప్పగలము, పండ్లలోను కూరలలోను గల లవణములు సేంద్రియ రూపములో నున్నవి. ఇవన్నియు దేహములోని రక్తముతో తేలికగాకలియును. అందువలన దేహములోని అంతరవయువము లలో నిలవవు. కృత్రిమముగా తయారుచేసిన ఆహారపదార్థములలో

కన్న ఆవుపాలలోను పండ్లలోను జీవసత్తులుయెక్కువ గలవు. పిల్లలును, పెద్దలును కృత్రిమ పదార్థములవాడుటకన్న ఆవుపాలను పండ్లను, వాడుట శ్రేయోదాయకము.

దేహపోషణకు కూరలలోను, పండ్లలోనుగల సేంద్రియ లోహలవణము లైనప్పటికిని కొంతవరకె అవసరము. అవసరమునకు మీరి తినిన సేంద్రియ లోహలవణము లన్నియు, మలకోశము, మూత్రకోశము, చర్మము శ్వాసాశయముల ద్వారాబయటకు పోవును. లోపల నిలవవు.

భూమినుండి త్రవ్విన లోహములతో తయారుచేసిన మందులు కనీనికలోకనుబడుటయు, యీ లోహములు సేంద్రియ రూపములోగల కూరలను యెక్కువగా తినినప్పటికిని కనీనికలో గుర్తులు కనబడకపోవుట వలన మనయొక గుణపాఠమును తెలుసుకొనవచ్చును. మానవ దేహములోని అంతరవయవములు యీ ఖనిజముల బయటకు పంపుటకు సృష్టింపబడలేదు. అందువల్ల ఖనిజములు బయటకు పంపలేవు. ఏ అవయవములో పేరుకొన్నదీ కనీనికను చూచి చెప్పగలము ఇన్ని మందులు వాటివాటిరంగులతో కనబడునుగాని ఉప్పుమాత్రము యేరంగులోనూ కనబడదు ఎందువలనకనుబడనిదీ (ఇంతవరకును చెప్పలేము) ఎందుకంటె సోడియము క్లోరైడు (ఉప్పు) మూత్ర పిండముల ద్వారానే వడియకట్టబడి మూత్రముతో కరిగి బయటకు పోవును.

అందువలన లోపల నిలవదు. సోడియము కార్బొనేటు సోడియము నత్రేటులు మూత్రపిండములద్వారా బయటకు పోవు.

మానవులు తమకు కావలసిన ఉప్పదనమును కూరలలోను, పండ్లలోను గల ఉప్పదనముతో సరిపెట్టుకొనవచ్చును. ఉప్పదనము కొరకు సోడియముక్లోరైడును వాడనవసరము లేదు.

ఉప్పును ఆహార పదార్థములలో వాడవచ్చునా రాదా? అను విషయమై తరువాతి గ్రంథములో విపులముగా చర్చించుకొందాము.

## గంధకము

గంధకముతో తయారుచేసిన మందులను తినినయెడల కనీనికలో 1, 2 ఆవరణలలో పసుపు పచ్చరంగు కనబడును. కనీనికలోని ఒకటి, రెండు ఆవరణలు జీర్ణాశయమును ప్రేగులను తెలుపును: గంధకముతో తయారు చేసిన మందులను తినినయెడల పైఒకటి, రెండుఆవరణలలో ముదురుపసుపు రంగు కనబడును. కలరు ప్లేటులోని 4 వ బొమ్మ యీ విషయమును బాగా తేలియ చేయును. గంధకముతో తయారు చేసినమందుల తినగానే మొదటలో ఉద్రేకము కలుగును, గాని తరువాత చచ్చుపడిపోవును. క్వాయినాతో తయారు కాబడిన మందుల తినిన లేతపసుపురంగు కనబడును. ఇవి మేఘములుగా కనబడును. వంశానుగతముగావచ్చిన రోగ ప్రవణతలు జీర్ణావయవములలో పేరుకొనిన యీ పసుపురంగులోనే కనబడును. ఈ మూడింటిలోను బేధము కనుగొనుట కష్టము.

## మందుల గుర్తులు

భూమినుండి త్రవ్వీన లోహములను ఖనిజములందురు. ఒక్కొక్క ఖనిజమునుండి అయిదు, ఆరురకముల మందులు

తయారు చేస్తారు. ఒక లోహమునుండి తయారు చేయబడిన మందులు యే అంతరవయవములో చేరినదీ కనీనిక నుచూచి చెప్పగలము. ఏ ఖనిజము, యే రంగులో, యే అంతరవయవములో కనబడునదీ యీ అధ్యాయములో తెలుసుకొందాము. రక్తములో పదునెనిమిది ధాతువులు గలవు. భూమినుండి త్రివ్విన లోహముల లక్షణము వేరు రక్తము లోని లోహముల లక్షణములు వేరు.

కూరలలోని, పండ్లలోని లోహములకును, మానవ దేహములోని రక్తమునకును సామ్యము, సారూప్యము గలదు. అందువల్లనే మానవ దేహములోని రక్తముతో త్వరగా కలిసి పోవును. కనీనికలో ప్రత్యేకమైన రంగులతో కనబడవు.

ఖనిజముల ధర్మము వేరు. దేహములోని రక్తములోని లోహములధర్మము వేరు. రెంటికిని కుదరదు. రక్తముతో కలిసిపోవు. అంతరవయవములలో పేరుకొనును. పేరుకొని నట్లు కనీనికలో కనబడువు.

ఖనిజములతో తయారుచేసిన మందులనుగాని, ఆహారములనుగాని ప్రకృతి జంతు, మానవకోటులకు ఆహారముగా నిర్ణయించిన యెడల వాటినుండి తయారైన మురుగును బయటకు పోవుటకు అనుకూలమైన వసతులను యేర్పరిచెడిది. దేహములో పేరుకొనినట్లు కనీనికలో కనబడకుండా చేసెడిది.

ఒక్కొక్క ఖనిజమునకును ఒక అంతరవయవమునకును అనురాగముండును. వాటికి అనురాగమున్న అవయవములోనే ఆ ఖనిజము పేరుకొనును. కలరుప్లేటులోని బొమ్మలను చూచిన

మొకల యేఖనిజము యేఅంతరవములో చేరినదీ సులభముగా చెప్పగలము.

ఇనుము, పాదరసము, పాషాణములు యే అవయవము లలో చేరినదియు కనీనికలో యేరంగులో కనబడునదీ యీ అధ్యాయములో తెలుసు కొందాము. ఏయేజబ్బులు వచ్చునదీ తెలుసు కొందాము.

## కనీనికా నిదానశాస్త్రజ్ఞుల కష్టములు

కనీనికానిదాన శాస్త్రజ్ఞులకు ఒకకష్టము గలదు. మానవులు సేవించిన మందులన్నియు వాటివాటిరంగులతో కనీనికలో కనబడును. కొద్ది కేసులలో కనబడక పోవుటయు గలదు. కనీనికానిదాన శాస్త్రజ్ఞుడు ఫలానామందురంగు ఫలానా అంతరవయవమును తెలుపు ప్రతినిధి భాగములో కనబడు చున్నది, సేవించినారా? అంటే రోగి తానేమీ మందుల తిన లేదని చెప్తాడు. తినలేదుగాన ఆ మందు తనదేహములో లేదని వాదిస్తాడు. రోగికి ఆమందులు తిన్నట్లేగుర్తు ఉండదు. జ్ఞాపకముండదు గాన తినలేదని వాదిస్తాడు.

చిన్నప్పుడు తిన్నమందు లైననూ పది పదిహేను యిరువది సంవత్సరముల వరకు అంతరవయవములలో నిలుచును. లోపలచేరిన వెంటనే బయటకు సాగనంపితే గాని పోవు. బయటకు సాగనంపని యెడల అంతరవయవములలో చేరి రాబోవు కాలికవ్యాధులకు పునాదులగును.

చిన్నప్పుడువచ్చు శిశువ్యాధులకు చాలా తీవ్రమైన మందులవాడుతారు. ఈ మందులలోని తీవ్రతవలన అంతరవ

యువములకు చాలా గట్టిదెబ్బ తగులును. హృదయము ఊపిరి తిత్తులు మొదలగు ప్రధాన అవయవములకే దెబ్బతగులును. ఈ దెబ్బలవలన ఆ అవయవములు చచ్చుపడిపోవును. స్వధర్మమును నిర్వర్తించలేవు.

ఇనుపగోట్టము నుండి వచ్చిననీరు త్రాగుటచేత కనీనికలోని ఒకటి రెండు ఆవరణాలలో తుప్పురంగు కనబడును. గ్లాసు ఫ్యాక్టరీలలో పనిచేయుట వలనను తుప్పురంగు కనబడును. ప్రెయింట్లలోను అచ్చు ఆఫీసులలో పనిచేయుట వలనను వివిధ రంగులు కనీనికలో కనుపడును. పాదరసపుగనులలో పనిచేయు వారి అంతరవయవములలో పాదరసము చేరును. ఆకుపచ్చ రంగులలో పాషాణము కలుపుదురు. ఈరంగుల సమీపములో నున్నవారి కనీనికలలోను యీ పాషాణపురంగు కనబడును. అన్ని కళలలోను అన్ని చేతివృత్తులలోను యీ పాషాణమును యెక్కువగా వాడుదురు. నిత్యకృత్యములలో వాడు అన్ని పదార్థములలోను యీ పాషాణమును వాడుదురు.

ఆహారపదార్థములలోని లోపములను తెలియ చెప్పుటకుగాను అమెరికన్ ప్రభుత్వమువారు నియమించిన డా. లిల్లీ పండితుడు కూడా యిదే అభిప్రాయము వెలిబుచ్చాడు. 'నిత్యకృత్యములలో వాడువస్తువు లన్నింటిలోను విషములున్నవని తెలియకుండానే జనసామాన్యమంతా విషములను మ్రింగుచున్నారు.

ప్రభుత్వమువారు ఆహారపదార్థములగూర్చి చట్టము నుప్యాసు చేయగనే జనసామాన్యమంతా ఆహారపదార్థములలో

లోపము లేదనుకొంటారు. ఇది శుద్ధపొరపాటు. ప్రభుత్వమువారి శాసనముకూడా యెక్కువ మోతాదులతో విషములను వాడుటనే నిరోధిస్తుందిగాని నిత్యకృత్యములలో వాడు వస్తువులలోని (కొద్దిమోతాదుల) విషములను నివారింపలేదు. నిజము చెప్పవలెనంటే నిత్యకృత్యములలో వాడు వస్తువులలో వాడబడు కొద్దిమోతాదుల విషమువలననే జనసామాన్యమునకు యెక్కువ అపకారము జరుగుచున్నది. ఎట్లాగంటే ఈ చిన్నవస్తువులను ప్రతివారునూ విధి నిషేధములు లేకుండా వస్తువులలో విషములున్నవను అనుమానము కూడా లేకుండా, వాడుతారు. అందువలననే యీ విషములు యెక్కువగా వేసుకొనును.

ఈ సంగతిని విని మన మాశ్చర్య పడనక్కరలేదు. ఎందుకంటే, మందువైద్యులే యీ చట్టముల వ్రాసుచేతురు. ప్రభుత్వము, వారి స్వాధీనములోనే ఉన్నది. మందు వైద్య దృష్టితో చూచియే ప్రభుత్వమువారు యీ చట్టముల వ్రాసు చేతురు. మందు వైద్యము వలన మానవ కోటికి యెంత అపకారము జరుగుచున్నదో, ప్రభుత్వమువారు వ్రాసు చేయు ఆహార విషయిక చట్టముల వలననూ అంత అపకారమూ జరుగుచునే ఉన్నది. ఎప్పుడన్నా పుచ్చుకొను మందులలోని విషముల వలన ఒకవేళ అపకారము జరుగునప్పటికిని, నిత్య కృత్యము వాడు వస్తువులవలన మాత్రము తప్పకుండా అప కారము జరుగుతుంది.

ఎప్పుడూ మందుల వాడక పోయినప్పటికినీ రాగి, యినుప గొట్టముల నుండి వచ్చు నీరును త్రాగుట వలన రాగి రంగు త్రుప్పురంగులు కనీనికలో కనబడును.

మా డాక్టరులు యెక్కువ మోతాదుల నివ్వగని మా దగ్గరకు వచ్చు రోగులు పదే పదే చెప్పుతారు. రోగులు చెప్పు మిగిలిన అన్నిమాటల వలెనే యీ మాటలును నమ్మ తగ్గవికావు.

ఒక రోజున మా ఆసుపత్రికి పరీక్షార్థమై ఒక పెద్ద మనిషి వచ్చాడు ఆయనకు, డాక్టరుకును ఈ క్రింది సంభాషణ జరిగినది.

డా:— మీ కంటిలో చాలా మందుల రంగులు కనబడు చున్నాయి.

ఆయన:— మా డాక్టరుగారు పెద్ద మందుల నివ్వరు. అందు వలన నేను వాటిని సేవించి ఉండను.

డా:— ఆ సంగతి మీకు తెలియక పోవచ్చు రేపు వచ్చే టప్పుడు మీ డాక్టరు గారిచ్చు మందును కొద్దిగా తీసుకు రండి అప్పుడు చెప్పుతాను.

నాలుగు రోజుల తరువరి డాక్టరు చెప్పినట్లే మందుల తెచ్చాడు. ఆ మందుల పరీక్ష చేయగా కనీనికలో కనుబడిన లోహాము లన్నియు యీ మందులలో గలవు. ఈ మందే ఆయన చాలా రోజులనుండీ సేవించుచుండవచ్చు, ఆ మందుల రంగులే కనీనికలోను కనబడవచ్చు.

తిన్న మందులను మనము మరచిపోవచ్చు గాని
కనీనికలో మాత్రము అన్నీ కనబడుతాయి.

చిన్నప్పటినుండీ తిన్న మందులను యేకరువు పెట్టుట నిజముగా కష్టమే. కొన్ని మనము మరచిపోతాము. కనీనికలో

మాత్రము అన్నీ కనబడుతాయి. ఒకటి కూడా బీరుపోదు. దేహములోని ప్రతి చిన్న అవయవమునకును కనీనికలో ప్రతి నిధి స్థానముండుట చేత, దేహమునకంతకును కన్ను ప్రతి బింబ మగుటచేతనూ, అయా అవయవములలో కలుగు ప్రతి చిన్న మార్పు కనీనికలో కనుపడు స్వభావముండుట చేతనూ, అంతరవయవములలో కలుగు ప్రతిచిన్న మార్పు కనీనికా ప్రతినిధి స్థానములలో కనుబడును. సంపూర్ణ పాండిత్యము గల కనీనికానిదాన శాస్త్రజ్ఞుడు చిన్నప్పటినుండి తిన్న మందుల నన్నిటినీ వరుసగా చెప్పగలడు. ఈ విషయము విపులముగా తెలియుటకు ఒక చిన్నకథను చెపుతాను. కొన్నిరోజుల క్రితము మా ఆసుపత్రికి పరీక్షార్థమై ఒకామె వచ్చినది. ఆమెకును డాక్టరుకు యీ క్రింది సంభాషణ జరిగినది.

ఆమె.— డాక్టరుగారూ! నాకంటిని చూచి ఒంట్లో రోగము చెప్పండి.

డా:—సరే (కనీనికలో వెలుపటి సగములో పాషాణ మేఘము లున్నవి. కనీనికలోని మూడవ ప్రతినిధి భాగము (cerebrum) లో అయోడిన్ తెలుపు యెరుపు మచ్చలు గలవు, పాషాణ మేఘములున్నాయి. గనుక పాషాణముతో తయారు చేసిన మందులను సేవించి ఉంటుంది) మీకు ఒళ్ళంతా నొప్పులుండును. ముట్టు కొనుటకు వీలులేనంత బాధగా నుండును.

ఆమె:—నేను చిన్నప్పటినుండీ కీళ్ల వాతముతో బాధపడు చున్నాను.

డా:—(అయోడిన్ మచ్చను చూచి) చాలా రోజులనుండీ యెడమ ప్రక్క తలనొప్పితో మీరు బాధపడుచున్నారు.

ఆమె:— ఆ బాధ వర్ణనాతీతముగా నున్నది. ఇరువది సంవత్సరముల నుండి బాధపడుచున్నాను. ఒక నాటికీ అంతూ పంతూ లేదు. బాధ వచ్చినపుడు, తలపగిలిపోవు నేమో ననుకొంటాను. ఈ బాధకు కారణమే మంటారు?

డా:— పాషాణమ్ము, అయోడిన్ రెండూ దేహములో చేరినవి. అవి పోతేనేగాని మీకీ బాధలు తగ్గవు.

ఆమె:— చిన్నప్పుడు నేను చాలా ఆరోగ్యముగా ఉండే దానను. ఎప్పుడు మందులు తిన లేదు. ఆమందు లెట్లుచేరినా యంటారు? (రెండు వారముల తరువరి)

డా:—మీవృత్తి యేమిటీ?

ఆమె:— నాభర్తకు స్వరశాస్త్రములలో ప్రవేశముగలదు. తీరికగా నున్నప్పుడు జంతువుల చర్మములను సేకరించుట వారికి సరదా. ఆచర్మముల కాపాడుటకు చాలా శ్రద్ధతీసి కొనే వారు.

డా:— చర్మమును పదును చేయుటకు పాషాణము నుపయోగించుతారుగా?

ఆమె.— అవును.

డా:— మీ యింట్లో యీ చర్మాలు చాలా ఉన్నాయిగా?

ఆమె:— ఎక్కడ పడితే అక్కడే ఉన్నాయి.

డా.— (నవ్వి) ఒక సందేహము తీరినది. పాషాణమువలన మీకీ ఒళ్ళు నొప్పులు వచ్చినాయి. అయోడిన్ యెట్లువచ్చిందో జ్ఞప్తికి తెచ్చుకోండి.

ఆమె:—అన్నట్లు జ్ఞప్తికివచ్చింది. ఇరువది సంవత్సరాలనాడు ఒక సంగతి జరిగింది. నేనప్పుడు బెర్లిన్‌లో ఉన్నాను. ఒక రోజున కాలికి పెద్ద దెబ్బ తగిలినది. చాలా బాధపడ్డా. పక్కన ఉన్న దాసీది నాకొక సలహాచెప్పెను. ఆమందు రాగాను. బాధతగ్గింది. విచారించగా, అది అయోడిన్‌తో తయారు కాబడిన మందట. బయట పూతలకేగాని లోపలకు తాగరట.

డా:—అయోడిన్ సంగతికూడా తేలినదిగా!

ఆమె.— అవును.

## భాషా భేషజము

మందువైద్యుల గ్రంధములన్నీ అర్ధముకాని గ్రీకు, లాటిను పేర్లతోనిండి ఉంటాయి. రోగి వైద్యుని వద్దకువచ్చి తన రోగము పేరు చెప్పమనగానే రోగికి అర్ధము కాకుండునట్లు వైద్యుడు యేదో ఒక క్రొత్తపేరుచెపుతాడు. తనరోగమును తాను తెలుసుకొన్నట్లు రోగితృప్తిపడి యింటికి చేరుతాడు. తనకు అర్ధముకాని ఒక క్రొత్తశబ్దమునే తెలిసికొన్నాడుగాని, రోగముపోయే విధానమును తెలుసుకోలేదు. మనవద్దకు వచ్చే రోగులకు మన మీా సంగతిని చెప్పకపోతే వారికి తృప్తికలుగదు ఈ సంగతి విపులముగా తెలియుటకు ఒక చిన్నకథ చెపుతాను.

ఒకరోజునపరీక్షార్ధమై ఒకామె మాఆసుపత్రికివచ్చింది. ఆమెకనీనికలో మెదడును తెలుపు 1వ ప్రతినిధిభాగములోను వెన్నుపామును తెలుపు 23, 24, ప్రతినిధిభాగములలోను, ఆకుపచ్చరంగు కనుబడినది. పైరెండుభాగములలోను పాదరసము

చేరినయెడల ఆకుపచ్చరంగు కనుబడును. కనీనికచుట్టూనుండు జీర్ణాశయమును, చిన్న పేగులను తెలుపు ఒకటి, రెండు భాగములలో, ముదురగోధుమరంగు గలదు. కుడికనీనికలోని వృక్కమును తెలుపు 13వ ప్రతినిధిభాగములోను, ఈముదురు గోధుమ రంగుగలదు. ఆమెకును డాక్టరుకును ఈ క్రింది సంభాషణ జరిగినది.

ఆమె:—డాక్టరుగారూ! నాకంటెనిచూచి నాలోని రోగాన్ని చెప్పండి.

డా:—సరే చాలారోజులనుండీ (కనీనికనుచూచి) మలబద్ధకముతో బాధపడుచున్నారు. మధుకోశము బాగా పనిచేయుటలేదు. ఈ బాధలను తప్పుకొనుటకు రసభస్మమును వాడినారు. అదీ యెక్కువగావాడారు.

ఆమె:—రసభస్మము వాడితేగాని తిన్నఅన్నము జీర్ణముకాదు. మలము బయటకుపోదు.

డా.:—కొన్నిసంవత్సరములనుండీ మీారు వెన్నెముకలోని పోట్లతో బాధపడుతున్నారు. పొట్టలోని నరములు, కండరములు బిగదీసినట్లుండును. మీారు సేవించినరసభస్మములోని పాదరసము వెన్నుపాములో చేరి మంటలను కలుగచేయుచున్నది.

ఆమె:—మీారు చెప్పినవన్నీ నిజమే.

డాక్టరుచెప్పినవన్నీ నిజమేనని వప్పుకొన్నదిగాని చికిత్సించుకొనుటకుమాత్రము సుముఖముగా లేదు. విచారించగా, కొద్ది రోజులు గడచినతరువాత ఆమె స్నేహితులు యిలా చెప్పారు.

'నారోగము కీళ్లవాత (rheumatism) మని అందరుడాక్టర్లు(మందు వైద్యులు) చెప్పారు. కంటినిచూచి చెప్పినవారు మాత్రము అసంగతిని చెప్పలేదు. గాన వారిమాటలలో నాకు నమ్మకము లేదు. అందువలన చికిత్సను పొందలేదు.

పాదరసము చేరిన కొద్దిరోజులకే దానిని బయటకు సాగనంపకపోతే కాళ్లనూ, చేతులనూచచ్చుపడవేస్తుంది పైకేసు లోని రోగినిపూర్తి అయిదునెలలు గడచిన తరువాత విచారిస్తే కాళ్లూ, చేతులూ చచ్చుపడుటచే బాధపడినదని తెలియ వచ్చుచున్నది.

దేహములోని ప్రతిచిన్నమార్పు కనీనికలో కనపడకపోవచ్చు

దేహము మొత్తమునకును, కనీనికకును వైశాల్యములో యెట్టి పోలికయు లేదు. కనీనికకన్న దేహముకొన్ని వేలరెట్లు పెద్దది. అట్లగుటవలన దేహములోని అంతరవయవములలోని ప్రతి చిన్నమార్పు కనీనికలో కనబడకపోవచ్చు. ప్రతిచిన్నమార్పు కనీనికలో కనబడదుగాన యీ శాస్త్రము తప్పని చెప్పుటకు వీలు లేదు. ఇంతవరకు లభించిన నిదర్శనముల బట్టి అన్ని కేసులలోను మేము చెప్పిన మాటలు నిజమగుచునే ఉన్నవి. ఈ శాస్త్రము క్రొత్తగా వెలువడుటవలన నూతన పరిశోధనలు జరుగ వలసి ఉన్నది.

మరొక విషయము కూడా గలదు. దేహతత్వమునుబట్టి కొందరికి కొద్ది మందుగల చిన్న మోతాదులే పనిచేయును. కొంతమందికి పెద్ద మోతాదులుగాని పనిచేయవు. కొందరిలో మందులు ధాతుశక్తినిబట్టి లోపల నిలవచేరును. మరికొందరిలో మందులు త్వరగా బయటకు పోవును.

## పరివర్తక ఔషధములు (Alteratives)

మందు వైద్యమువారి సంచికట్టులో పాదరసము అయోడిన్ పాషాణములతో తయారుచేసిన మందులే మిగిలిన ఖనిజములతో తయారుచేసిన మందులకన్న హెచ్చుగా నుండును. ఈమూటిలోను ప్రతి ఒకదానినుండి అసంఖ్యాకము లగు మందుల తయారు చేస్తారు. ఉదాహరణగా చెప్పవలె నంటే పాదరసమును క్లోరిన్‌తో కలుపుతారు. పాదరసమును ప్రాణవాయువుతో కలుపుతారు. పాదరసమును అయోడిన్‌తో కలుపుతారు. పాదరసమును గంధకముతో కలుపుతారు. పాదరసమును నత్రజనితో కలుపుతారు. ఇంతేగాక పాదరసముతో లవణములను తయారు చేస్తారు. క్లోరినుయొక్క భాగములనుబట్టి మూడు నాల్గు రకములగు మందులు తయారగును. పాదరసమును అయోడిన్‌తో కలిపినపుడు వచ్చిన మందుయొక్క రంగునుబట్టి నాలుగు ఆయిదు రకములుగ తయారగును. ఇట్లనే మిగిలినవన్నీ. ఒకపాదరసము నుండియే దాదాపుగా నూరు రకములగు మందుల తయారుచేస్తారు.

పాదరసము, అయోడిన్, పాషాణములతో తయారైన అసంఖ్యాకములగు మందులను సుఖరోగములకు వాడుతారు. ఈ రసపు మందులు సుఖరోగముల నెట్లు నయము చేయు నదియు నెవరు చెప్పరు. ఏ డాక్టరునైనా యీ మందులతో రోగములెట్లు నయమగునని మీరు ప్రశ్నించిన యెడలనిజము చెప్పువాడైతే 'నాకు తెలియదని' చెప్పాలి. ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుచూ సేజా యేమన్నాడంటే ఈ మందులు

నాళరహిత గ్రంధులను ఉద్రేకపరచును. అందువలన రోగము కుదురును. వీరుకూడా నాళరహిత గ్రంధులను ఉద్రేకపరచు చున్నాడేగాని యెట్లు ఉద్రేకపరచునదీ చెప్పలేదు. ఈమందులు నాళరహిత గ్రంధులను ఉద్రేకపరచినట్లు నిదర్శనములు చూపలేదు. 'అట్టిరేటివులు' గూర్చి నింఘటువు లేమైనా యెక్కువ చెప్పునేమోనని వాటిని తిరగేస్తే అవీ యిదే అభిప్రాయమును తెలుపును. అట్టరేటివులు ఉపశమన కారులు జీర్ణక్రియను బహిష్కరణక్రియను ఉద్రేకపరచును. పాదరసము సుఖరోగములకు సంబంధించిన పుండ్లను కుదుర్చును. పాషాణము చాలా రోజులనుండీ ఉన్న చర్మరోగములనైనా కుదుర్చును. ఎందువలన కుదిరేదీ అసలే తెలియదు. ఎట్లా కుదిరేది అంతకన్న తెలియదు.

రోగములు యెందుకు వస్తాయి? మందులవాడినందు వలన రోగములు నయమగుతాయా? అను ప్రశ్నకు ప్రకృతి వైద్యము సమాధానము చెప్పింది. ఎట్లాగంటే రోగపదార్ధమును బయటకుపంపి దేహమునకు ఆరోగ్యమును కలుగ చేయుటకు ప్రకృతిచేయు ప్రయత్నమే తరుణవ్యాధి. ఈ మాటను విశదముగా చెప్పవచ్చును. రోగపదార్ధము దేహములో యిమడదు. కాన బయటకు పంపివేయు వలెను. ఈ పనిని ప్రకృతి చేయును. ఈ రోగపదార్ధము బయటకు పోవలసి వచ్చినపుడు పొంగును. మంటలు పుట్టును. ఇవే తరుణ రోగములు. ఈతరుణరోగములలో రోగపదార్ధము నంతను ప్రకృతి ఒక్కుమ్మడిగా బయటకు పంపును.

రోగము వచ్చినదనగానే భయపడి మందులు పోస్తాము. ఈ మందుల వాడినందువలన రోగపదార్థము బయటకువచ్చును. త్రోవలు మూసుకొనిపోవుచున్నవి. కొద్దిరోగపదార్థమే ఉండ కూడదని బయటకు నెట్టిన ప్రకృతి మందులు పోసినపుడు ఊరు కొంటుందా అని మీరడుగవచ్చును. ఊరుకొనదు. దేహము లోని రోగపదార్థమును బయటకు నెట్టు చిన్నపోరాటమును మానుకొని అంతకన్న పెద్దశత్రువగు (పాషాణము, పాదర సములతో తయారుచేసిన) మందులను బయటకు నెట్టుటకు ప్రయత్నించును. దైహిక రోగపదార్థముతోడి పోరాటమును నివారణశక్తులు తాత్కాలికముగా మానుకొనును. దైహిక రోగపదార్థము బయటకుపోక రక్తముతో కలిసి తిరుగును. పైకి కనబడకుండా మందుల పూస్తాముగాన బయటకురాదు. బయటకు కనపడు లక్షణములు కానరావు. గాన రోగము నయమైనదని రోగి భ్రమపడును. The patient Thinks he is cured, but the Doctor knows better because in Medical college: he has been taught 'never gaurantee a cure' రోగము నయముకాలే దని వైద్యునకు బాగా తెలియును. ఎందుకంటే- రోగము నయమైనదని రోగినినమ్మించ వద్దని కళాశాలలో చెపుతారు. రోగము నయముకాలేదని తాను నమ్ముతూ నయమైనదని రోగికి బాగా నచ్చచెప్పతాడు. ఎందుకయ్యా అట్లాఅన్నారంటే అట్లా చెప్పకపోతే రోగి ధనమివ్వడు, నన్నేమిచేయమంటావు, ఉపస్తుండమంటావా' అంటాడు.

రోగపదార్థమును బయటకునెట్టి ఆరోగ్యమును కలుగ జేయుట ప్రకృతిపని గాన ధాతుశక్తి ఒకింత బలపడగనే రోగ

పదార్థమును బయటకు నెట్టుటకు ప్రకృతి మరల ప్రయత్నము చేయును. రోగము తిరగ పెట్టినదందురు. తిరగపెట్టినదే మొదలుగా గాభరాపడి ఘాటైన మందులపోస్తాము. అప్పటి వరకు ప్రకృతి తనపోరాటమును మానుకొంటుంది. మళ్ళీ కొన్నిరోజులకు మరల ప్రయత్నముచేస్తుంది. మందులతో మళ్లీ అణచిపెట్టుతాము. తల యెత్తలేనంతవరకూ మందుల పోస్తాము. ఇకను చచ్చుపడిపోయి వూరుకొంటుంది. రోగపదార్థమును బయటకు నెట్టలేనంత చచ్చుపడిపోవుటకు రెండు మూడేండ్లు పట్టును. ఈ లోపుగా పెండ్లి చేసికొనవచ్చునని మందువైద్యులు సలహాయిస్తారు.

అసలు లోపల జరిగిన గ్రంథ మేమిటి? రోగపదార్థము బయటకు వచ్చుత్రోవల నన్నిటిని మందుతో మూసినాము. మూసినాముగాన బయటకు పోవలసిన రోగపదార్థమంతా బయటకుపోక రక్తముతోపాటు కలసి తిరుగును, బయటకు వచ్చుత్రోవలనుమూసినామేగాని రోగపదార్థపు తయారును తగ్గించలేము. రోగము నయము చేయనూలేము. రోగపదార్థ మును బయటకురాకుండా లోపలనే అణచివేసినామూఅంటే మరింత తీవ్రముగా అంతరవయవములను బాధించును. ప్రధాన అవయవములలోనే చేరును. క్షయ, పిచ్చి, అతిమూత్రము, పాండువ, అంతర్వ్రణము మొదలగుకాలిక రోగములన్నిటికినీ యిదేమూలము.

## పాదరసము

పాదరసమునకు మూడుపేర్లుగలవు.పాదరసము, హైడ్రార్గము, క్విక్ సిల్వరు. పాదరసముతో నూరురకములగు మందుల

తయారుచేస్తారు. అజీర్ణముపోవుటకు రసభస్మమును యెక్కువగా వాడుతారు. సుఖరోగములకు పాదరసముః క్లోరెను కలసిన మందులను, పాదరసము అయోడిన్‌లతో తయారుచేసిన మందులను, యెక్కువగా వాడుతారు. పాదరసమును క్లోరిను, అయోడిన్‌లతో కలుపుటయే గాక అనేక యితరరూపముల తోనూ వాడుతారు.

## పాదరసపు మందులను వాడినందువలన కనీనికలో కనుపడు గుర్తులు.

పాదరసముతో తయారుచేసిన మందులను వాడిన మొదటి సంవత్సరములలో కనీనికలోని పైభాగములో వెల్ల వేసినట్లు తెలుపుగుర్తు కనబడును. ఈ పాదరసపు మందులను సేవించిన అయిదు, ఆరుసంవత్సరములు గడచినతరువాత దీని రంగు వేరుగానుండును. అప్పుడు మెదడును తెలుపు ఒకటవ ప్రతినిధిభాగములో ఆకుపచ్చరంగు గల అర్ధచంద్రాకారములు గనుబడును. లేతనీలమురంగుగల కనీనికలలో ఆకుపచ్చరంగు గల అర్ధచంద్రాకారములు కనుబడును. లేతగోధుమ రంగు గలకనీనికలో నీలప్రరంగుగల అర్ధచంద్రాకారములు కనుబడును. పాదరసముతో తయారుచేసిన మందులను యెక్కువకాలము సేవించిన యెడల ఆకుపచ్చరంగు కనీనికయొక్క వెలుపటి ఆవరణ యంతటిలోను కనుబడును. ఈ పాదరసపు మందులు చర్మమును త్వరగా నాశనముచేయును గాన కనీనిక యొక్క వ ఆవరణఅంతటిలోను యీ ఆకుపచ్చని రంగుకనబడును.

పాదరసపు మందులను వాడిన పది, పదిహేను సంవత్సరములకుగాని, మెదడులో చేరదు. మెదడులో చేరగనే సన్నని నాడులను మిగిలిన భాగములను నాశనముచేయు మొదలు పెట్టును మెదడులో చేరిన తరువాత కష్టముమీదగాని బయటకు పోదు. చేరినతరువాత బయటకు పంపుమార్గములను వెతుకుట కన్న (చేరకుండుట అనగా పాదరసపు మందులను) వాడకుండుటయేమంచిది. కాళ్లు, చేతులూ చచ్చుపడిపోవుట, పక్షవాతము మొదలగునవన్ని యీ పాదరసము మెదడులో చేరుట వలన వచ్చినవేను

సవాయి రోగము మూడు దశలుగా నుండును. మిగిలిన అన్ని రోగముల వలెనే సవాయి రోగము ఒకటి, రెండు దశలలో రోగపదార్థమును బయిటకు నెట్టుటకు ప్రకృతి ప్రయత్నము చేయును. ఇట్లు బయటకు వచ్చు రోగపదార్థమును పాదరసపు మందులతో అణచి వేస్తాము పాదరసము యొక్క ప్రభావము వలననే సవాయిరోగపు మూడవదశ సంభవించుచున్నది. సవాయికి వాడిన మందులలోని పాదరసము, అయోడిన్, పొటాషియము, పాషాణముల వలన ప్రధాన అవయవములకె దెబ్బ తగులు చున్నది.

మందువైద్య మిత్రులు పై మాటలను చూచి కోప పడుదురు. సవాయి రోగపు మూడవ దశ కూడా సవాయిని కలుగ చేసిన సూక్ష్మజీవుల వలననే వచ్చిన దంటారు. పాదరసము వలన సవాయిలోని మూడవ దశ సంభవించ లేదంటారు.

మందులను వాడకనే సుఖరోగముల నయముచేసినాము

కాని యీ రోగములు మూడవ దశను పొందలేదు. హోమోపతీ మందులు కూడా కొంతవరకు రోగపదార్థములను వెలువరించుటకే సాయపడును. అలోపతి మందులంత అపకారమును మాత్రము చేయవు.

ప్రకృతి వైద్య పద్ధతుల ద్వారా సుఖరోగముల నయము చేసిన యెడల ఆ యా రోగులు వెనుకటి కన్న మరింత ఆరోగ్య వంతులుగాను నుందురు. సుఖరోగములకు సంబంధించిన రోగపదార్థమునే దైహిక రోగపరిణతలు కూడా బయటకు పంపివేయును.

కాళ్లూ, చేతులు చచ్చుపడి పోవుట, పక్షవాతము మొదలగు రోగములన్నీ పాదరసముతో తయారు చేసిన మందులను వాడుట వలననే వచ్చినట్లు మేము చాలా కేసులలో చూచినాము. మీరు చెప్పు మాటలన్నియు అసందర్భములు, శాస్త్రసమ్మతములుగావు, అని మా వైద్యమిత్రులు అనవచ్చును. ముందు పుటలను చదివిన మా చదువరులే యెవరి మాటలు శాస్త్రసమ్మతములో చెప్పగలరు.

ఇరువది, ముప్పది సంవత్సరముల నుండీ మా అనుభవములు మేము చెప్పిన మాటలనే ధృవపరచుచున్నవి. మానవ మాతులు ఊహింపరాని బాధలను మందులవలన జరుగుచున్నవని నిర్ధారణ చేయుచున్నవి.

అదివరదాకా బాగా ఉన్నవాళ్ళకు ఒకే తడవగా యీ కాలిక రోగాలన్నీ వస్తున్నాయంటే యెట్లా వస్తున్నా యంటారు. వారి పూర్వీకులలో యెవరిలోనూ యిటువంటి

దుర్భరరోగాలు ఉండుటలేదు. వారిలో లేకపోయినా, వీరిలో యెట్లావస్తున్నా యంటారు.

మా అభిప్రాయము ప్రకారము యివన్నీ మందువైద్యాలు వాడు మందుల వలనవచ్చినవేను. మందువైద్యగ్రంథములన్నీ యేమని చెపుతాయంటే పెద్ద పెద్ద పట్టణములలోను, నగరములలోను నివసించు వారిలో నూటికి యేబది మంది సుఖరోగములతో బాధపడుచున్నారు.

ఒకటి, రెండు యేండ్లయినా నిండని శిశువులకు పాండువ, క్షయ, రికెట్సు, సంజు మొదలగు దుర్భర వ్యాధులు వస్తున్నా యంటే యివన్నీ యెట్లావస్తున్నా యంటారు. ఆ యా బిడ్డల పూర్వీకులలోని లోపమైనా ఉండాలి లేక మందులవాడినందు వలన కలిగిన తరువాత ఫలితములైనా కావాలి.

రోజుగడచినకొలదీ వందలకొలదీ కేసులచూస్తున్నాము. మందుల వలన యింత అపకారము జరుగుచున్నది గదా అని తెలుసు కొంటున్నాము. ఈ మందులవలన రోగములు కాలికములగు చున్నవి. ఇవియే వంశానుగతముగా వచ్చుచున్నవి. వంశానుగతముగావచ్చు రోగప్రవణతల కన్నిటికినీ యివియే మూలమగుచున్నవి.

ఇట్లా యేర్పడిన రోగప్రవణతలనన్నిటినీ ప్రకృతితరుణ వ్యాధుల ద్వారా బయటకు పంపుతుంది. రోగము రాగానే గాభరాపడి ఆ యా రోగములను మందులతో అణచిపెట్టుతాము. బయటకువచ్చు తోవలను మూసినాముగాన రోగపదార్థము లోపలనేచేరి అంతరవయవముల బాధించుటచే కాలిక రోగములు వచ్చుచున్నవి.

కాళ్లూ, చేతులూ, చచ్చుబడిపోవుట, పక్షవాతము, మొదలగునవన్నియు స్వయంకృతాపరాధము లే. ఆగంతకముగావచ్చి మననెత్తినపడినవిగావు. ప్రకృతి సూత్రములకు అనుకులముగా జీవించక పోవుటచేతనే మానవకోటి యీ బాధలనన్నిటిని అనుభవిస్తున్నారు. ఈ బాధలను భగవంతుడు తెచ్చి మన నెత్తిన వేసినాడనుటకన్న వెర్రి మరొకటిలేదు. అదంతా కర్మచేతనే వస్తుందిలే మన ప్రయత్నమేమీ లేదులే అని తృప్తిపడుటకన్న మూర్ఖత్వము మరొకటి లేదు.

ఈ వాక్యముల చూచి మా వైద్యమిత్రులు అపహాస్యము చేతురు. వారు కోపింపకుండా ప్రఖ్యాత మందు వైద్యు లేమి చెప్పుచురో తెలుసు కొందాము.

డా. రాన్ డై ఫెన్ డర్ఫు గారు సుప్రసిద్ధమందు వైద్యులు. మానసిక రోగముల గూర్చి అద్భుతమైన పరిశోధనల జరిపిరి. ఎల్ విశ్వవిద్యాలయములో అధ్యాపకులు పెక్కు వైద్యసంఘములలో సభ్యులు. వీరు వ్రాసిన గ్రంథ రాజములు అమెరికా లోని అన్ని విద్యాలయములలోను పాఠ్యగ్రంథము లే. సవాయిని గూర్చి వీరేమనిరో తెలుసు కొందాము. క్లినికల్ సైకియాట్రీ (Clinical Psychiatry) అను తమ గ్రంథములో 6వ అధ్యాయము 276 వ పేజీలో యీ గ్రంథకర్తగారు యీ క్రిందివిధముగా చెప్పారు. సవాయి ఆదిమ జాతులలో లేదు. నాగరికులమని భ్రమపడు నవీనులలోనే యిది యెక్కువగా గలదు. అమెరికా లోని పిచ్చిఆసుపత్రులకువచ్చువా రందరిలోను పదునాల్గు మందికి ఒకరు దాప్పున సవాయితో బాధపడుచున్నారు. నాగరికతకు పేరొందిన బెర్లిను, మ్యూనిక్ నగరములలో నివసించు

వారిలో ముగ్గురిలో ఒకరుగాని అయిదుగురిలో యిద్దరుగాని యీసవాయితో బాధపడువారే. కూలినాలి చేసుకొను వారిలో యీ రోగము లేనే లేదు. పెద్దపెద్ద నగరములలో నివసించు ధనవంతులలోనే యీ వ్యాధి యెక్కువగా లేదు. అనాగరికులు సవాయి మొదలగు సుఖరోగములను పాదరసపు మందులతో నయము చేయరు. అందువలన వారిలో కాళ్లు చేతులు చచ్చుపడిపోవుట మొదలగు కాలికరోగములు లేవు. మందులపాపులు యెక్కువగా నున్న చోట్ల యీ పక్షవాతరోగములు యెక్కువగా గలవు. సవాయి మొదలగు సుఖరోగములు యెక్కువగా నున్నచోట్లనే (అనగా యీరోగమును పాదరసపు మందులతో నయముచేయు ప్రదేశములందే యీ పక్షవాతరోగములు యెక్కుగలవు.)

ఈ గ్రంథకర్తయే 277 వ పేజీలో యీవిధముగా చెప్పినాడు. ఆఫ్రికాలోని నీగ్రోలలో యీరోగాలు లేవు. నాగరిక దేశములలోని నీగ్రోలలో మాత్రము యీ సుఖరోగములున్నవి.

ఈ ఒక్కమాటయే చాలును. ఆఫ్రికాలోని నీగ్రోలలో లేక నాగరిక దేశములోని నీగ్రోలలో ఉన్నదంటే నాగరికతా ఫలితమనుటకన్న యేమనాలో మాచదువరులే ఊహింతురుగాక. సుఖరోగములు సాధారణముగా యిరువది సంవత్సరములు దాటినవారికిని, ముప్పది సంవత్సరములు లోపు వారికిని వచ్చును. పాదరసము వాడిన పది, యిరువది సంవత్సరములకుగాని దానిపనిని నాశనము చేయుటను మొదలుపెట్టదు. విశదముగా చెప్పవలెనంటే ఒకటి, రెండు సంవత్సరములు

వయస్సుగల పిల్లలకు పాదరసము కలిపిన మందులను వ్రాసిన యెడల ఆపిల్లలకు 21, 22 సంవత్సరముల వరకును పాదరసపు ఫలితములతో బాధపడుదురు. పాదరసపుఫలితము లేమంటే మెదడులో చేరితే పిచ్చి, ఉన్మాదము పుట్టిస్తుంది. నరము లలో చేరితే చిడుచిడులు, మంటలు పుట్టుతాయి.

చిన్నపిల్లలు గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి, ఏనుగ గజ్జి మొదలగు చర్మరోగములతో బాధపడుతుంటే వంశాను గతముగా వచ్చిన సుఖరోగముల విషయము, వారి దేహములో గలదని మందువైద్యులు రెండు, మూడు యేండ్లదాకా పాద రసపు మందులను వాడుదురు. ఆసుపత్రిలలోనికి యిటువంటి కేసులు చాలా వచ్చుచుండును. చర్మ రోగములతో బాధ పడుచుండు పిల్లవానిని తల్లి యెత్తుకొని రాగానే, పిల్లవాని రోగముల చూచి మందు వైద్యులు, తల కొకవిధముగ నిర్ణ యింతురు. వారి వంశములో సుఖరోగములు యేమియు లేవని తల్లి యెంత మొత్తుకొనినను వైద్యులు నమ్మరు. సుఖ రోగులు అబద్ధము లాడుదురని పరిహాసిస్తారు. ఆరు నెలల పాటు పాదరసపు మందులు రాస్తే చర్మరోగములన్నీ తుప్పు రాలిపోయినట్లు రాలిపోవును అంటారు.

ఇట్లాగే, సుఖరోగములతో తల్లి దండ్రి లిద్దరును బాధ పడకపోయినప్పటికినీ పిల్లలకు మాత్రము విధిగా పాద రసపు మందులను వాడుచున్నారు. ఇట్లు వాడినందువలన వారి జీవితములో బాధలు యెక్కువగుచున్నవే గాని ఏమియు తగ్గుట లేదు.

పాదరసపు మందులను సుఖరోగములకే వాడుట లేదు. అజీర్ణవ్యాధులకును పాదరసముతో తయారు చేయుబడిన రస భస్మమును వాడుచున్నారు. ఆకలి అగుటకును, సుఖవిరేచన మగుటకును యిచ్చు టానిక్కు లన్నిటిలోను పాదరసమున్నది.

278-వ పేజీలో డైఫెండర్ఫు గారేమన్నారంటే

పెండ్లి అయినవారిలోకన్న పెండ్లి కానివారిలో సుఖ రోగములు యెక్కువగా వుండును. ఆడవారిలో వ్యభిచారి ణులలోను సుఖరోగములు యెక్కువగా గలవు. తల్లి వంశ ములో యేడుతరముల వారును, తండ్రి వంశములో యేడు తరములవారును సుఖరోగములతో బాధపడనప్పటికిన్నీ, పిల్లలకు మాత్రము యీ సుఖరోగములు వచ్చుచున్నవి. మిగిలినవారిలోకన్న పాదరసపు గనులలోగాని, ఫ్యాక్టరీలలో గాని పనిచేయువారిలో యీ సుఖరోగములు యెక్కువగా వచ్చుచున్నవి. పాదరసము సేవించిన యిరువది సంవత్సరము లకుగాని నాశనము మొదలు పెట్టదు అంత కాలము పట్టుట చేతను యీలోగా యే యితర జబ్బులన్నా వచ్చుట చేతను ఒక్క పాదరసము నుండియే యీ దుష్ఫలితములు వచ్చినవను నమ్మక మేమని మందువైద్యులు వాదిస్తున్నారు. (కనీని కయే యిందుకు సరియైన సమాధానము చెప్పగలదు.)

ప్రొఫెసర్. ఇ. ఎ. ఫారింగ్టన్ గారు ఫిలడెల్ఫియా నివాసులు. సుప్రసిద్ధ హోమోపతి వైద్యులు. గత శతా బ్దములోని సుప్రసిద్ధ హోమోపతి వైద్యులలో వీరొకరు. తమ వైద్య నిఘంటువు 558-559 పేజీలలో పాదరసము యొక్క గుణముల గూర్చి వీరేమని సెలవిచ్చిరో చూతము.

'పాదరసము వలన కలుగు అసంఖ్యాకములగు దుర్గుణములలో యీ క్రింద చెప్పబడినవి ముఖ్యములు. పాదరసము వలన జ్వరము వచ్చును. ఆ జ్వరమే జీర్ణించి పోవును. వరములలో నొప్పులు పుట్టును. కాలము మార్పులో విపరీతమైన జలుబు చేయును. ఉదయము లేవబోవు నప్పటికి చలిచలిగా నుండును. చర్మమునకు గోధుమరంగు వచ్చును. కాళ్లమీద పుండ్లు పడును. అవి మానవు. నిద్ర పట్టదు. రాత్రిపూట ఆసనముద్వారా రక్తము స్రవించును. ఎప్పటికప్పుడు ఉద్రేకముగానే ఉండును. ఏవిషయమును గూర్చియైనను శాంతముగా విచారించలేము. ఒంటికి చెమట పట్టును గాని, చెమట పట్టినందువలన నేమియు విశ్రాంతి కలుగదు.

దేహము మొత్తమంతా చెడిపోవును. ఎప్పటికప్పుడు ఉద్రేకములతో బాధపడుచుండునుగాని శాంతముగా నుండదు. అందలి విషయముల గూర్చి యెప్పుడునూ ఆలోచించుచునే ఉండును. కాళ్లూ, చేతులు, బిరుసైన బిగదీసుకొని పోవును. రోగి యెప్పుడునూ భద్రనాట్యము చేయుచుండును. కాళ్ళూ చేతులు ఒణకిపోవుట గలదు. దేహము మొత్తమంతా ఒణకి పోవుటయు గలదు.

చివరకు ప్రతి యవయవము స్తంభించి పోవును. కదల్చుటకు వీలుగాకుండును. మూలగూర్చొని నవ్వుచూ, యేడ్చుచుండును. పిచ్చివాడగును.

ఇన్ని గుణములు కలుగును గాన పాదరసమును జాగ్రత్తగా వాడండి. రోగమును నయముకావలెనని కోరినయెడల

యీపాదరసమును వాడకండి. ఈ మందులవలన రోగము తాత్కాలికముగా తగ్గునుగాని రూపుమాసిపోవు.

వియన్నా నగరములోని ప్రఖ్యాతవైద్యులలో డాక్టర్ హెర్‌మన్‌గారు ముఖ్యులు. వీరు అనేక ఉద్గ్రంథముల రచించిరి. వీరి గ్రంథములను వైద్య విశ్వ విద్యాలయములవారు ప్రమాణగ్రంథములనుగా స్వీకరిస్తారు. సవాయి దేహతత్వమునకు సంబంధించిన (constitutional) జబ్బు కాదని నిరూపించారు. ఆరోగ్యసూత్రముల అనుసరించినయెడల యీరోగము సమసిపోవునని తెలియచెప్పారు. ఏమియు అభ్యంతరపెట్టక మామూలుతోవల పోనిచ్చినయెడల యెట్టి దుష్ఫలితములు కలుగవు.

డా. హెర్‌మన్‌గారికన్న ప్రామాణికులు దొరకరు. సుఖరోగములకు సంబంధించిన ఆసుపత్రులు ప్రపంచములో కల్లా వియన్నాలో గలవు. వియన్నానగరములోని పెద్ద ఆసుపత్రులలో వీరు ప్రధాన అధ్యాపకులు. ఆ ఆసుపత్రిలో వీరు ముప్పదిసంవత్సరములపాటు అధ్యాపకులుగా నున్నారు. ఈ ముప్పది సంవత్సరములలోను వీరు 60000 మందికి సుఖరోగములను కుదిర్చారు. వీరిలో ఒక్కరికికూడ పాదరసమును వాడలేదు. పాదరసము వాడనందువలన ఒక్క కేసులోకూడా తెరువాతి దుష్ఫలితములు కలుగలేదు. ఈ సుఖరోగములు వంశానుగతముగా వచ్చునను విషయమును ఒక్క కేసులో కూడా చూడలేదు. సుఖరోగులకు వీరిచ్చు మందులను ప్రధానమందువైద్యులు యెప్పటికప్పుడు తనిఖీ చూచుచుండెడివారు. ఈ మందులలో ఒకప్పుడు కూడా వారు పాదరస

మును చూడలేదు. వీరి గ్రంథమునుండియే యీక్రిందిభాగ మును యెత్తివ్రాయుచున్నాను పురాతన మందువైద్యు లందరును రోగస్వభావమును తెలుసుకోని ఆహార మార్పు తో రోగమును నయముచేసిరి. డా. హెర్ మన్ గారు చెప్పిన వాక్యములకును 20 సంవత్సరములపాటు మాచికిత్సాలయ అనుభవమునకును సరిపోయినది. ఈయిరువది సంవత్సరముల నుండి కొన్నివేల కేసులను నయముచేసినాము. ఒక్క కేసులో కూడా యీరోగమువలన కలుగు భవిష్యత్తు దుష్ఫలితములను చూడలేదు. రోగముయొక్క వంశానుగతత్వమునుచూడలేదు. ప్రకృతిమార్గముల ద్వారా రోగము నయముచేయుటవలన దేహము శుద్ధఅగును. రోగపదార్థము బయటకు పోవును. ప్రకృతి సహజమైన గాలి వెలుతురులతో రోగము నయముచేసినయెడల యీ రోగముయొక్క విషమేగాక, పితీ్రయమైనటువంటిన్ని, స్వార్జితమై నటువం టిన్ని రోగపదార్థముకూడా బయటకు పోవును. ఇంతేగాక 47-వ పేజీలో డా॥ హెర్ మన్గా రేమన్నా రంటే- చాలా రోగ ములను దేహతత్వమునకు సంబధించిన సవాయి రోగమని మందు వైద్యులు నిర్ణయించుచున్నారు. ఈ నిర్ణయము తప్పు త్రోవల బట్టినది. దేహతత్వమునకు సంబంధించిన సవాయి మాత్రము కాదు. పాదరసపు మందులను వాడినందువలన కలిగిన ఫలితము కావచ్చును. చాలాకాలమునుండి దేహ ములో నిలవయున్న రోగ పదార్థపు ఫలితము కావచ్చును. రోగ స్వభావమునుబట్టి యీ విషయమును చెప్పుదుము. కసీ నికలోని పాదరసపు రంగునుబట్టిన్ని యీ సంగతిని చెప

వచ్చును. పాదరసము దేహమును జీర్ణించి పోవును. పాదరస ముతో తయారుచేసిన మందును సేవించినయెడల వేళ్ళ చివరలు నల్లబడి పోవును.

48-వ పేజీలో డాక్టరు హెర్మన్‌గా రేమన్నారంటే అల్లోపతీ వైద్యమునకు వియన్నానగరము ప్రధానకేంద్రము. ఆ వియన్నానగరములోని పెద్ద ఆసుపత్రిలో ముప్పది సంవత్సరముల నుండి పని చేయుచున్నాను. ఈ ముప్పది సంవత్సరములలో అనేకవేల సుఖరోగముల కుదిర్చినాను. ఒక్క కేసులోకూడా పాదరసముతో తయారు చేసిన మందులను వాడలేదు. ఒక్క కేసులోకూడా తరువాతి దుష్ఫలితములు కలుగలేదు.

సుఖరోగములతో బాధపడి ముక్కులను పోగొట్టుకొన్నవారు, నోటిని పోగొట్టుకొన్నవారు మా చికిత్సాలయమునకు వచ్చుచుండేవారు. వీరి చరిత్రలను పరిశీలిస్తే వీరంతరును పాదరసపు మందులను తినినవారే. నరములలోని మంటలతో బాధపడువారును వచ్చేడివారే; వీరును కొద్దిగనో గొప్పగనో పాదరసపు మందును వాడియే ఉంటారు. రోగము యొక్క చరిత్రలోని విషయము లన్నిటినీ, మూత్ర పరీక్ష, కళ్లె పరీక్ష, రక్త పరీక్షలు ధృవ పరచును. చాల కొద్దికేసులలో మాత్రము వంశానుగతముగావచ్చు రోగప్రవణతలు కారణమైనాయి.

ఈ పరిశోధన ఫలితముగా నే నేమని నిశ్చయ పరచుకొన్నానంటే- దేహాతత్వ సంబంధమైన సుఖరోగ లక్షణములని

మనము నిర్ణయించు రోగములన్నియు పాదరసపు మందులను వాడినందువలన కల్గిన ఫలితము లే.'

వారి పూర్వీకులలో యెవరును సుఖ రోగములతో బాధపడక పోయినప్పటికినీ, ఇడ్రియాలోని పాదరసపుగనులలో పని చేసినందువలన కూలీలు, సుఖ రోగములతో బాధ పడిరి. మూత్రమును, రక్తమును పరీక్ష చేయుగా పాదరసము కనుబడినది. జాతి, మత విచక్షణాలు లేకుండా అందరిలోను పాదరసము కొద్దిగనో, గొప్పగనో ఉంటునే ఉన్నది. అద్దములు తయారుచేయు వారిలోను, ధర్మామీటరులు తయారు చేయువారిలోను, బరామీటరులను తయారు చేయు వారిలోను, యీ పాదరసము ప్రత్యక్షముగా కనుబడును.

పాదరసపు మందులను వాడిన అందరిలోను యీ దుష్ఫలితములు కలుగుచునే ఉన్నవి. ఉత్తర సముద్రము, మధ్యధరా సముద్రప్రాంతములలో నివసించువారిలో యీ రోగములు యెక్కువగా కలవు. ఈ ప్రాంతవాసులలో కల సుఖ రోగములు పాదరసముతో తయారుచేసిన మందులతో అణచి వేయుబడుచున్నవి. తలయెత్తినప్పుడల్లా యీ సుఖరోగములు అణచి వేయుబడుటచే పాదరసమువలన కల్గిన దుష్ఫలితములతో (అనగా యీ కాలిక రోగములతో) వీరి జీవితమల్లా బాధ పడుచున్నారు.

పాదరసమువలన యిన్ని దుష్ఫలితములు కనబడుచున్నవని సోదాహరణముగా నిరూపింపబడినను (మందు వైద్యులు) నాసిద్ధాంతముల ఒప్పుకొనకపోవుట విచిత్రము. ఎందుచేత నాసిద్ధాంతముల ఒప్పుకొనలేదో అందరకును తెలిసి

చేయున్నది. పాత మందువైద్యమంతా అతుకులబొంత. దానికి త్రోవా, డొంకా లేదు. పిచ్చినమ్మకముల కంతటికిని అది పునాది ఈ మందువైద్యపాఠశాలలన్నీ అనాదినుండి వచ్చుచున్న యీ తప్పులతడికనే గుడ్డిగా నమ్ముచున్నవి. తమకు యెంతనమ్మకము లేకపోయినప్పటికినీ, పాతమందువైద్య సిద్ధాంతములనే నేటి నవీనవైద్యులును, యధాతథాగా ఆమోదించుచున్నారు. శాస్త్రసమ్మతముగా జరిగిన పరిశోధనలను ఒప్పుకొనలేకున్నవి. పాదరసపు మందులవలన దుష్ఫలితములు కలుగుచున్నవని చెప్పు నవీన పరిశోధనలన్నియూ పాత మందువైద్య సిద్ధాంతములు తారుమారు చేయుచున్నవి. పాతమందువైద్యమునకు మూలసూత్రములైన మూఢనమ్మకములను సామాన్యప్రజ ఒక్కుమ్మడిగా త్రోసివేయలేకున్నారు. ప్రజాసామాన్యము యీ సంగతిని తెలుసుకొనుటకు యింకా కొంతకాలము పట్టును. అంతవరకును మనము వేచియుండవలసినదే.

నేను చెప్పిన సూత్రములు శాస్త్రసమ్మతమగుచున్నవను అసహనముచేత నాశత్రువులు లీడను ఆసుపత్రినుండి నన్ను తొలగించుటకు ప్రయత్నము చేసినారు. వీరిప్రయత్నముల ఫలితముగా ప్రభుత్వమువారు నాసిద్ధాంతముల పరిశీలించుటకు విచారణసంఘమును యేర్పాటు చేసినారు. ఆవిచారణ సంఘమునకు అధ్యక్షులగు డాక్టరు హెబ్రా తమ నివేదికలో యేమన్నారంటే- డా. హెర్మన్‌గారి సూత్రముల ఆమోదించకపోవుటకన్న ఆసుపత్రిని తగులపెట్టుట మంచిది. సుఖరోగములకు పాదరసమును వాడకపోయినందువలన యేమియూ నష్టము కలుగదు. సుగుణమే కలిగినది. లీడను ఆసుపత్రిలో

యీవిషయము ప్రత్యక్ష నిదర్శనములతో ధృవపరచబడినది.
(మందువైద్యము వారి మూఢనమ్మకములను యీ క్రిందివిధ
ముగా సమర్ధించాడు. పాదరసమును వాడినందువలన సుఖ
రోగములు త్వరగా నయమగుచున్నవిగాన పాదరసమును
వాడుచున్నారు.)

ఇంతేగాక 83 వ పేజీలో డా. హెర్మన్ గారేమన్నా
రంటే ముప్పది సంవత్సరముల నుండి నేను ఆచరణలో పెట్టిన
మాత్రములను నేనువదలివచ్చిన తదుపరి యింకాకొన్ని సంవత్సర
ములపాటైనా ఆచరణలోఉంచుతారేమోననుకొన్నాను. కాని
అట్లుజరుగలేదు. లీడను ఆసుపత్రిలో నాజీవితమంతయు గడపి
తిని. పాదరసమును వాడకుండా సుఖరోగముల కుదిర్చితిని. నేను
తొలగిన మరుక్షణమునుండీ ఆలీడను ఆసుపత్రిలోనే సుఖరోగము
లకై పాదరసమును విరివిగా వాడుట మొదలుపెట్టినారు.
ఆరోగ్యమును కాపాడి జనసామాన్యమునకు మేలు చేయు
చున్నామని మందువైద్యులు వేనోళ్ళ డంబములు పలుకు
దురు గాక. సుఖరోగములు మాత్రము తలెత్తకమానవు.
పాదరసపు మందులతో అణచిపెట్టకమానరు. నోరూ, వాయీ
లేని సామాన్యజనమంతా యీ బాధలకు గురిగాకమానరు.
నిజమును తెలుసుకొన్నతరువాత జనసామాన్యమంతా మందు
వైద్యము మీద దండెత్తకమానరు. జనసామాన్యములో ప్రబో
ధము కలిగి యీపాదరసపుమందులను తొలగించవలెగాని ప్రభు
త్వము యేమియు శ్రద్ధతీసుకొనునట్లులేదు. పాదరసపు మందుల
వలన ఒక్కరికేగాక సంఘము మొత్తమునకింతకు భాధలుకలుగు
చున్నవి. సంఘసభ్యుల కందరకును యీ పాదరసమును వాడు

టచేత వీరికి పుట్టి రాబోవు తరములవారికినీ యీ బాధలు యెక్కువగా వచ్చును. ఈ బాధలుతప్పించుట ప్రభుత్వము వారిధర్మముగాన పాదరసము వాడకుంటకు ప్రభుత్వమువారు శ్రద్ధ తీసికొందురుగాక.

ఈ వాక్యములన్నియు అప్రయోజకుడు చెప్పినవి కావు. సుప్రసిద్ధ అలోపతీ వైద్యపరుడు, విశ్వవిద్యాలయ పట్టభద్రుని నోటనుండివచ్చినవేను. వీరి వాక్యములన్నియు అరణ్యరోదనము లగుచున్నవి. ఎందుకంటే ప్రభుత్వమువారుగాని, జనసామాన్యముగాని పాదరసమును నిరోధించుటలేదు. కొన్ని సంవత్సములకే పిచ్చిఆసుపత్రులన్నియు యీ బాధితులతో నిండి పోవును. అప్పటికైనా గ్రహించకపోరు. అప్పటికి గ్రహించి ఉపయోగముండదు.

మందులన్నియు నాడులను ఉద్రేకపరచును. మెదడును రెచ్చగొట్టును. ఈరోగములకన్నిటికినీ పారాయియే కారణమంటారు మందువైద్యులు. తీవ్రముగా విచారిస్తే, ఈ రోగములకన్నిటికినీ పారాయియే కారణముగా కనబడుటలేదు. రోగపదార్ధమే కారణముగా కనబడుచున్నది.

కనీనికను చూస్తే యే రోగము యెట్లు వృద్ధిపొందినదీ విశదముగా చెప్పవచ్చును.

సుఖరోగములు వంశాను గతముగా వచ్చునవికావు. వంశాను గతముగావచ్చు పారామాదిరిగనే యీ సుఖ రోగములు కూడా వచ్చునెడల కనీనికలో ప్రత్యేకమైన రంగులతో కనబడేదే. సుఖ రోగములతో బాధపడువారి కనీనికలను చూచిన యెడల అటువంటి రంగేమియు కానరాదు. తెరుణ

రోగములు వచ్చినపుడును, కాలిక రోగములు వచ్చినపుడును కనీనికలో యేమి గుర్తులు కనబడునో సుఖరోగములతో బాధపడువారి కనీనికలలోనూ యీ గుర్తులే కనబడును.

రెండు, మూడుదశల సవాయిరోగములని మందువైద్యులు నిర్ణయించురోగములన్నియు పాదరసము, అయోడిన్, పాషాణము, పొటాషియములు వాడినందువలన వచ్చినవేను.

Salvarsan పాషాణముతో తయారుచేయబడినది. గనేరియాను కుదుర్చుటకు దీనిని విరివిగా వాడుతారు. మొదటగా యీ మందు వెలువడినపుడు మందువైద్యులు, వైద్యపత్రికలు కూడా దానిగుణములను వేనోళ్ల పొగడినారు. సుఖరోగములు అంతటితో రూపుమాసిపోవునని చెప్పినారు. నాలుగు, ఐదు సంవత్సరములు గడచునప్పటికి ఈ మందు బ్రతుకు బయటపడ మొదలుపెట్టినది. వెనుకటివ్రాతలన్నీ తప్పులని తెలుసుకొన్నారు. పాషాణము నాశనము చేసినంత త్వరగా పాదరసము నాశనము చేయదు. ఈరెంటివలనా ఉపయోగమేమీ కలుగదు.

ఒక కథ.—కొన్ని యేండ్ల క్రితము ఆసుపత్రికి పరీక్షార్థమై ఒక పెద్ద మనిషి వచ్చాడు. నలుబది సంవత్సరముల వయస్సు ఉంటుంది. కాళ్ళూ, చేతులూ చచ్చుపడిపోయినాయి. చాలమంది మందువైద్యుల వద్దకు పోయివచ్చాడు. సవాయిరోగములోని మూడవ దశయని ప్రతి వారునూ నిర్ణయించారు అన్ని పరీక్షలుచేసి రోగమును నిర్ణయించిరి. సుఖరోగములు యెప్పుడూ తనకు తగలలేదని ఆ పెద్దమనిషి వాదిస్తాడు. చుట్టాలు పక్కాలు అదేమాట అంటారు. కనీనికమాత్రము కలరు ప్లేటులోని 6-వ బొమ్మ మాదిరిగా ఉన్నది.

'చిన్నప్పుడు రస భస్మమును తరచుగా వాడుచుండే వాడ'నని తల్లి చెప్పింది. ఈ రస భస్మమును వాడినందు వలననే యీరోగము వచ్చినదనుటలో నాకెట్టి నమ్మకము లేదు.

కొద్ది రోజులు జరిగిన తరువాత ఒక రోజున ఆయన భార్య వచ్చి యిట్లు చెప్పినది.

'డాక్టరుగారూ! నా పెనిమిటి దేహములోనికి పాదరసము యెట్లు ప్రవేశించినదీ నాకప్పటికి గుర్తు లేదు. ఇప్పుడు తెలియ వచ్చినది. పదునాల్గు సంవత్సరముల ప్రాయములో ఈయన మోటారు కారుల తయారుచేసే కర్మాగారములో ఉద్యోగము చేశాడు. అద్దముల తయారుచేసే శాఖలో పని చేశాడు. రెండు సంవత్సరాలపాటు ఆ ఉద్యోగము చేశాడు'.

ఆమె చెప్పినదానిని బట్టి నేనీక్రింది విషయములను నిర్ధారణ చేసికొన్నాను. అద్దముల తయారు చేయుటలో పాదరసమును యెక్కువగా వాడుతారు. పాదరసము కలిసిన గాలిని లోనికి పీల్చుట వలనను, ఆ గాలియే చర్మమునకు తగులుట వలనను, లోనికి ప్రవేశించినది. ప్రవేశించిన పదకొండు సంవత్సరాల తరువాత అనగా 25 సంవత్సరాల వయస్సప్పుడు పాదరసము అంతరవయవములను నాశనము చేయుటను మొదలు పెట్టినది. నలభై సంవత్సరాలు వచ్చునప్పటికి కాళ్లూ, చేతులూ చచ్చుపడి పోయినాయి.

నిగూఛీ, వాసర్‌మన్ పరీక్షలవలనకూడా యీ సంగతి బయట పడ లేదు. సుఖరోగముల వలన కాళ్లూ, చేతులూ చచ్చు పడినదీ మందుల వలన (పాదరసము మొదలగు, లోహముల

వాడుటవలన) కళ్లూ, చేతలూ చచ్చుపడిపోయినదీ మందు వైద్యులు తెలుసుకొనలేకపోయినారు. విచక్షణ చేయలేక, సుఖరోగములు కలిగినవని నిర్ధారణ చేసినారు. ఇటువంటి అసందర్భపు రోగనిర్ణయము వలన రోగుల పరువు నష్టమగుచున్నది. భార్యా భర్తలు విడాకులు పుచ్చుకొనుచున్నారు. మందు వైద్యమువారి తప్పుడు రోగనిర్ణయమువలన జనసామాన్యము యొక్క ఆరోగ్యము చెడిపోవుటయేగాక నైతిక గౌరవము (Moral Reputation) కూడా పోవుచున్నది.

## పాదరసముల తొలగించుట

పాదరసముతో షుమారు నూరురకములగు మందులను తయారు చేస్తారు. ఈ మందులన్నిటినీ నిరాక్షేపణగా రోగులకు అందచేస్తారు. పాదరసము రక్తముతో కలిసి తిరుగుటయు గలదు. సంధులలో చేరి నిలవ ఉండుటయు గలదు. పాదరసము రక్తముతో బాటు తిరుగుచున్నప్పుడు త్వరగా బహిర్గతమగును. సంధులలో చేరినపుడు మాత్రము అంత త్వరగా బయటకు పోదు. మెదడులోను, వెన్నెముకలోను, చేరినయెడల చాలా కష్టము మీదగాని బయటకు పోదు. రంగుల పటము (కలరు ప్లేటు) లోని 5, 6 బొమ్మలు పాదరసము మెదడులోను, వెన్నెముకలోను, సంధులలోను చేరిన సంగతిని బాగా తెలియచేయును. పాదరసము సంధులలోచేరిన కాళ్లూ, చేతులూ, చచ్చుపడి పోవును. ఆహారములో మార్పును కలుగచేసి, జలచికిత్స ప్రక్రియలును కాంత చికిత్సా ప్రక్రియలును ప్రయోగించుట చేతనూ చాలాకాలమునుండీ ఉన్న సంధివాత రోగములు కుదిరినవి. ప్రత్యక్షముగా జరిగిన ఒకరికథను చెపుతాను.

ఒక పెద్దమనిషికి కాళ్ళూ చేతులూ చచ్చుపడిపోయి నాయి. ఆరేండ్లనుండీ బాధపడుచున్నాడు. ఈబాధలు తగ్గుటకుగాను రోజుకు యిరువది, ముప్పది తడవలు మందులను వాడుచుండెడివాడు. ఎన్నిమందులను వాడినప్పటికిని యేమియు ఉపయోగము కలుగలేదు. మా ఆసుపత్రికి వచ్చునప్పటికి నడుమునొప్పి మొదలగు బాధలు అట్లాగే ఉన్నాయి. అయిదు నెలలు మా ఆసుపత్రిలో నుండి చికిత్సను పొందిన తరువాత రోగము నయమైనది. ఖులాసాగా యింటికి పోయినాడు.

మరొక పెద్దమనిషి కథను చెపుతాను. ఈ పెద్దమనిషి యేడుయేండ్లనుండి సంధివాతముతో బాధపడుచున్నాడు. బాధల తెలుసుకొనే స్పర్శజ్ఞానముకూడా అంతరించినది. పక్షవాతమువచ్చినది. కర్రలమీద (సహాయముతో) గాని నడవలేడు. మూత్రకోశమును అదుపులోనుంచు కండరములు తమ బిగివిని పోగొట్టుకొన్నవి. ఎంతప్రయత్నము చేసినను ఆ కండరములను అదుపులో నుంచలేకపోయెడివాడు. మలము, మూత్రము అప్రయత్నముగానే వెడలిపోవుచుండెడివి. ఏడు నెలలపాటు మా ఆసుపత్రిలో చికిత్సను పొందినతరువాత రోగము నయమై యింటికి వెడలిపోయినాడు. ఫిడేలును తయారుచేయు కర్మాగారములో వడ్రంగిగా పనిచేయుచున్నాడు. కొన్నిసంవత్సరములు గడచినతరువాత ఒకరోజున నేనతనిని చూచినాను. నాతో యేమన్నాడంటే 'తోడి పనివారు భరించలేని మొండను నేను భరించగలను'.

ఇటువంటి మొండిరోగాలు అన్నిచోట్లా నయముకావు. చికిత్సాలయములో అమలులో నున్న చికిత్సా

పద్ధతులలోని అన్ని ప్రక్రియలను ఉపయోగించినగాని యీ మొండిరోగాలు కుదరవు. జలచికిత్స ప్రక్రియలనేచేసి రోగము నయముకాలేదని చెప్పుటకు వీలులేదు. ఒకరకమగు చికిత్సా ప్రక్రియలనే చేసి రోగము కుదరలేదని వదలివేయుటకు వీలు లేదు.

## వైద్యకళాశాలలో చేయు బోధనలు

వైద్యకళాశాలలోని అధ్యాపకులు చేయు బోధనలు చాలా విచిత్రముగా నుండును. అధ్యాపకులు యేమి చెపుతారంటే మందుల చీటీలమీద రసభస్మము అనుశబ్దమును వాడకండి. రసభస్మమును పాదరసముతో తయారు చేస్తారు. మందులపేర్లను మామూలు జనముకు అర్థమయ్యే భాషలో వ్రాయకండి, మనము పాదరసమును లోహమును గ్రీకు భాషలో hydrargum (హైడ్రార్గమ్) అందును. దీనినే పొడి అక్షరములలో Hg. అందురు. ఒకేలోహమునకు యీ మూడు పేర్లను మూడుభాషలలోగలవు. పాదరసముపేరు చీటీమీద కనబడగానే రోగిగాని, అతని బంధువులుగాని, పాదరసపు మందులను వాడవద్దని గందరగోళము చేస్తారని భయము.

అసందర్భపు వ్రాతలను యెందువలన వ్రాస్తారని మీరడుగవచ్చును. రోగము త్వరగా నయముకావలెనని కోరుట రోగుల సామాన్యస్వభావమైపోయింది. పాదరసమును వాడితే గాని రోగములు త్వరగా నయముకావు. రోగముల త్వరగా నయముచేయకపోతే వైద్యునివద్ద కెవ్వరును రారు. డబ్బును సంపాదించలేరు. హోమోవతీవైద్యము, ప్రకృతివైద్యము రెండూ రోగములచాలా ఆలస్యముగా కుదుర్చునను భీతిగలదు.

అందువలన యీ వైద్యములకు జనము హెచ్చుగా వచ్చుట లేదు.

ఎంత త్వరగా జ్వరమును తగ్గించగలిగితే అంత ఘన వైద్యుడని ప్రతీతి. క్రిమేపీ జ్వరమును తగ్గించే వైద్యుని వంకనైనా చూడరు. ఈ మందులవలన కలుగు భవిష్యత్ దుష్ఫలితములతో రోగుల కేమీ పని లేదు. బాధల ననుభవించు రోగులకే యీ దుష్ఫలితములతో పని లేకపోయినపుడు, ధనమును సంపాదించుటయే ప్రధానముగా భావించిన వైద్యవరులకు ఆ దుష్ఫలితములతో పనేమిటి? రోగులకును, వైద్యులకును భవిష్యత్ దుష్ఫలితములతో పని లేదు. కాబట్టి ఖనిజరూపమగు లోహముల వాడుక యెప్పటికప్పుడు పెరిగి పోవుచున్నవి. ఈ లోహముల వాడిన ఫలితముగా మానవ కోటి బాధల పొందుచున్నారు.

మరొక తెగవారు కూడా గలరు. వీరూ మందుల వాడుతారు. ఎందుకండీ మందుల వాడటమంటే, బాధల తగ్గించటానికి మందుల వాడుతాము, బాధలు పోగానే మందులవలన అపకారము జరుగకుండా ప్రకృతివైద్యము చేస్తాము. ఇప్పుడు బాధల తగ్గించుదాము. తరువాత మందుల బయటకు పంపుదాము. ఇదెట్లా ఉన్నదంటే - ఈ ఒక్క తడవ తప్ప (యెప్పుడూ అంతే) యెప్పుడూ అబద్ధమాడను అన్నట్లున్నది.

వస్త్రమును శుభ్రముగా ఉతికిన తరువాత యెంత చిన్న మరకైనా యెట్లు కానగునో అట్లనే ప్రకృతివైద్యపద్ధతుల ద్వారా రోగమును నయముచేసుకొన్న తరువాత యెంత చిన్న మోతాదు (మందు) అయినా అపకారమునే చేస్తుంది.

మందులవలన జరుగు అపకారమును ప్రకృతి నిరోధించలేదు. అపకారమువలన రోగము కాలికమైనా కావచ్చును. మృత్యువైనా సంభవించవచ్చును.

రోగము త్వరగా (రెండు మూడు రోజులలోనే) నయము కావలెనను కృత్రిమవాంఛయే మందులను యింతవరకును అమలులోనుంచినది. జనసామాన్యమునకు యీ కృత్రిమ వాంఛయే లేకపోయినయెడల, మందుల పాపులన్నియు యిదివరకే నామరూపములు లేకుండా పోయెడివి.

త్వరగా నయము చేయలేకపోయిన యెడల తమకు ధనము రాదను భయముచేతనే హోమోపతీ వైద్యులునూ అలోపతీ సిద్ధాంతముల అమలులో పెట్టుకొనుచున్నారు.

జరిగిన ఒక కథను చెపుతాను. కొద్దిరోజుల క్రితము ఒక ఆసుపత్రికి వెళ్ళాను. దాని అధ్యక్షుడు సుప్రసిద్ధ హోమోపతీవైద్యుడు. సుఖరోగములతో బాధపడు పెద్ద మనిషి అచటకు వచ్చాడు. రోగమును నిర్ణయించి, ఆ అధ్యక్షుడు తన శిష్యులకు యీ క్రిందివిధముగా సెలవిచ్చారు. ఈ రోగికి పాదరసముతో తయారుచేసిన మందును యివ్వండి. ఈ బాధలన్నీ అంతరించిపోవును.

ఈ నిర్ణయము అయినతరువాత, నాకును, ఆ అధ్యక్షునకును యీ క్రింది విధముగా సంభాషణ జరిగినది.

నేను :- ఆర్యా, మీరు హోమోపతీవైద్యులేగా !

అ :- అవును.

నేను :- హోమోపతీ వైద్యసిద్ధాంతములు యీ మందును ఒప్పుకొనునా ?

అ :- ఒప్పుకోనవు.

నేను :- ఆమందు నెందుకిచ్చినారు ?

అ :- ఏమిచేయుమంటారు ? రోగము త్వరగా నయము కాకపోతే రోగులు రారు. రోగులు రాకపోతే డబ్బురాదు.

నేను :- బాగానే ఉందిలెండి ? వైద్యము వ్యాపారముగా మారిపోయింది.

## అలోపతీ వైద్యుల ప్రకటనలు

మిగిలిన అన్ని లోహాములతోబాటు పాదరసముయొక్క స్వాభావమును, లక్షణములను, దాని ఉపయోగములను గూర్చి అలోపతీ వైద్యవరు లేమిచెవుతారో తెలిసికొందాము. మా చికిత్సాలయములోని ఒక అధ్యాపకుడు యీ విషయమై చాలా పరిశోధనలు జరిపాడు. ఆ పరిశోధనా ఫలితముగా మన కేమి తెలుస్తుందంటే పాదరసపు మందులవలన కలుగు అసంఖ్యాక నష్టములు అలోపతీ వైద్యులకు తెలుసును. మందు వైద్య గ్రంథములన్నియు యీ విషయములను తేటతెల్లముగా చెప్పును.

ఆయుర్వేద, యునానివైద్యులు యీ లోహమును యీ క్రింది విధముగా ఉపయోగింతురని ఇండియన్ మెటీరియా మెడికా 995-1000లలో గలదు. రంగును బట్టి నాలుగు విధములుగా చేశారు. నలుపు, తెలుపు, పసుపు, ఎరుపు. ఈ నాల్గింటిలో నూ గంధకము ఉంటుంది. మిగిలిన లోహాములతో కలిపి దీనిని అన్నిరకములగు జ్వరములకును వాడుతారు. వన్నిపాత జ్వరమునకు మృత్యుంజయ రసమును వాడుతారు.

మలబద్ధకముతో కూడిన జ్వరమునకు జ్వరమురారి రసమును వాడుతారు. త్రిభువనకీర్తి రసము మొదలగు రసములలో కూడా పాదరసము ఉండనే ఉన్నది. గ్రహణి అతిసారములకు వజ్రికపట రసమును వాడుతారు. ఆనంద భైరవ రసమును అగ్ని మాంద్యము, అతిసారము, గ్రహణి రోగములకు వాడు తారు. పంచామృత పర్పటిని అనుపాన భేదములతో యిత్తురు. కలరాకు రసభస్మమును వాడుతారు. చాలకాలము నుండీ ఉంటూ ఉన్న గ్రహణి అతిసారములకు మహాగంధి రసమును వాడుతారు. మధు కోశమునకు సంబంధించిన వ్యాధులకు నిరభ్యంతరముగా వాడుతారు. కాలికమైన జీర్ణా శయ వ్యాధులకు పదవసల్ రసమును వాడుతారు. కామిల, కుంభ కామిలలకు పాండుసుదన రసమును అనుపాన భేద ములతో వాడుతారు. లోకనాథ రసమును నంజు, కామిల, మధుకోశ వ్యాధులకు వాడుతారు. ఊపిరి తిత్తుల మీాద పని చేయుటకు పాదరసమును అనేక లోహములతో కలిపి వాడు తారు. రసేంద్రగుటికలను ముఖ్యముగా వాడుతారు. రాజ మృగాంక రసమును దగ్గు, శ్వాస నాళికా వ్యాధులకును వాడుతారు. స్వర్ణ భస్మము అభ్రక భస్మము, గౌరీ భస్మము లలో పాదరసము ఉంటుంది.

పాదరసమును ఇనుము, బంగారములతో కలిపి తయా రు చేయబడినమందులనునాడీవ్యాధులకు వాడుదురు. చతుర్ముఖ రసము, చింతామణి చతుర్ముఖము, యోగేంద్ర రసము లలో పాదరసము బాగానే ఉంటుంది. పిచ్చి, ఉన్మాదము, చెవుడు, ఋతురోగములకు పై మందులను వాడుతారు. అగ్ని

మాంద్యము అజీర్ణములకు వాడు అగ్నితుండి వీటిలో కూడా పాదరసము ఉండనే ఉన్నది. ఉబ్బసము మొదలగు వ్యాధులకు శ్వాస భైరవ రసమును, శ్వాసకుఠార రసమును వాడుతారు. ఇచ్ఛాబేధి రసాన్ని మలబద్ధకానికి వాడుతారు. రససింధూరమును, స్వర్ణ సింధూరమును అనేక వ్యాధులకు వాడుతారు. సంక్షిప్త రసమును అన్ని రకములగు దైహిక, మానసిక వ్యాధులకును వాడుతారు. కాలిక రోగములకు త్రివిక్రమ రసమును వాడుతారు. మశూచికమునకు కస్తూరి భూషణమును వాడుతారు.

మొదటి దశలోని సవాయిని కుదుర్చుటకు సప్తశాలి వటిని వాడుతారు. చంద్రోదయ రసమును సవాయి, గనేరియాలకును బొల్లి, కామెలలకును వాడుతారు. సంధివాతమునకు వటరక్తాంత రసమును వాడుతారు. ఇవే గాక యిటువంటి వనేక రసములను అనేక రోగములకు వాడుతారు.

పాదరసమును గూర్చి వస్తుగుణదీపికయం దిట్లున్నది.

'శుద్ధిచేసిన పాదరసము త్రిదోషములను, సమస్త వాత రోగములను, కుష్ఠురోగమును, ధాతుగతరోగములను, విషములను హరించును. ఆమ వికారమును, క్రిమిరోగమును, సవాయి రోగమును, పోగొట్టును. జఠరదీప్తి నిచ్చును. వీర్య వృద్ధి, దేహపుష్టి, బలమును చేసును. ఆయురారోగ్యముల నిచ్చును, పుంస్త్వమును హెచ్చించును. చక్షురింద్రియములకు బలమును, ప్రకాశతను యిచ్చును. స్మృతిని రూపమును యిచ్చును. ముదమిని పోగొట్టును. తత్వమును శీఘ్రముగా

మంచికిమార్చును. అనుపాన విశేషములచేత సమస్తరోగము లను కుదుర్చును. దీనితో చేసిన పళ్ళాస్త్రి వేసిన మొండి వ్రణ ములు, కురుపులు, సవాయి వ్రణములు నివారణగును' 427 పే.

మందువైద్యులు ఉపయోగించు విధములు:— సవాయి సంబంధమైన కాయలు, కంతులు, బొబ్బలు మాడ్చుటకు ఉప యోగింతురు. పుండ్లకు, వ్రణములకు పూతినాశకముగాను వాడుదురు. తామర మొదలగు పరాన్నభుక్కుల వలన కలుగు వ్యాధులకును వాడుదురు.

సవాయి సంబంధిమై నట్టియు, ఇతర సంబంధమైన వ్యాధులందును వాడుదురు.

పరివర్తన ఔషధములలోను వాడుదురు.

రస భస్మముగా వాడుతారు.

ఆగంతుక విషీకరణము:—పాదరసపుగనుల పనివాండ్ర లోను, థర్మామీటరులు బరామీటరులు తయారుచేయువారి లోను, అద్దములు తయారుచేయు వారిలోను చేరబడును.

పుండ్లు మానుటకు వాడే నీలపు రంగుగల మందులో గలదు. మలబద్ధకము రోగలందులకు వాడే నీలపురంగు గల బేధిక ఔషధములలోను గలదు.

దంతములు కట్టుటకువాడు మందులను నూరువాళ్ళ లోను యీలోహము లోనికి ప్రవేశించును.

విషచిహ్నములు:— విషము లోపల ఉన్నట్లు కనపడు చిహ్నములు, రక్తకణములను, అందలి ద్రవపదార్థమును చెఱు చును. దేహములో చేరిన తరువాత రక్తమును వదలి యే

కండరములలో చేరితే నిలబడుటకు వీలుండో అట్టి చల్లని చోట జేరును.

నోటిలో నీళ్లుఊరును. పళ్లచిగుళ్లు వాయును. పళ్లుకదలి పెండల కడనే ఊడిపోవును. అట్టి చిగుళ్లలో పుండ్లు పుట్టును.

పితిత్రియమైన సవాయి సంక్రమించుటచేత చిన్నపిల్లల పళ్లు, దంతములు ఊడిపోవుచున్నాయని మందువైద్యులు అభిప్రాయపడుచున్నారు. పాదరసమును వాడుట చేతనే యీ బాధలు కలుగుచున్నాయని కనీనికానిదానము చెప్పుచున్నది.

అగ్నిమాంద్యము, అతిసారము, మలబద్ధకము వెంట వెంటనే ఉంటాయి. మలముతో ఈ మందులు వెళ్లిపోతాయి.

పాదరసమునకు సంబంధించిన యేనుగుగజ్జి లేస్తుంది.

చర్మముమీదను లోపలను పుండ్లు యేర్పడుతాయి.

ఎముకలు మెత్తపడిపోవును. నొప్పులు పుట్టును.

కాళ్లూ చేతులూ చచ్చుపడి పోవుట మొదలగు వ్యాధులు కలుగును.

## స్వాస్థ్య సంకటములలో యీ చిహ్నములు కనుబడును

చర్మవ్యాధులుగాను, బొబ్బలు, పుండ్లు, కాయలు, కంతులు, రక్తాభిష్యందముగాను నోటిలోనీరు యెక్కువగా ఊరుటయు, పాదరసపు వాసన నీటిలో తెలియబడుటయు గలదు.

తలదిమ్ము, మానసికస్తబ్ధత ఉండును.

కనీనికలో కనుపడు గుర్తులు:—పాదరసముతో నూరు రకములగు మందులను తయారుచేస్తారు. పాదరసముయొక్క ప్రభావము 15, 20 సంవత్సరములకుగాని కనుబడదు. పాద

రసపు మందులను సేవించినతరువాత మొదటి సంవత్సరములో రక్తముతోబాటు తిరుగుచుండును. అప్పుడు కనీకలోని పైసగభాగములో తెల్లగా వెల్లవేసినట్లుండును. పాదరసపు మందులను సేవించి అయిదు సంవత్సరములు గడచినతరువాత ఆకుపచ్చ రంగుగల అర్ధచంద్రాకారములు కనుపడును. నీలవురంగుగల కనీనికలో ఆకుపచ్చరంగు అర్ధ చంద్రాకారములు కనుబడును. (కలరుప్లేటులోని 3-వ బొమ్మ) గోధుమ రంగుగల కనీనికలో నీలవురంగు అర్ధ చంద్రాకారములు కనుపడును. రోగముకాలికమైనకొలది నీ కనీనికలోని 7-వ ఆ ఆవరణ అంతయు ముదురు రంగుగా నుండును. అంత వరకూఉన్న లేతరంగు లోపించును. నల్పురంగు బాగా వెడల్పుగా కానవచ్చును.

## దంతవైద్యుల దేహములోనికి పాదరసము ప్రవేశించుట.

కొన్నిరోజులక్రితము ఒకరోగిని చూచినాను. ఆరోగి కనీనికలోని 7 వ ఆవరణ అంతా తెల్లగాను, నల్లగాను ఉన్నది. ఈ తెలుపూ, నలుపూ, రంగులమీాద నీలపువర్ణమున్నది. పెదదను తెలుపు ప్రదేశములో కూడా పాదరసముచేరినట్లు తెలియవచ్చినది. రోగి, పాదరసమును యెప్పుడునూ తినలేదంటాడు. చాలా ప్రశ్నలు వేయుగా చివరకు యీాక్రింది విధముగా చెప్పినాడు. నేను వైద్యులవద్ద పనిచేసినాను. వారు దంతవైద్యమును ప్రధానముగా చేసెడివారు. పళ్లకు కావలసిన మందులను యిరువది అయిదు సంవత్సరములపాటు విడిచేతులతో నూరినాను. Paresis తో బాధపడుచున్నాను. ఈరోగ

ము వచ్చి చాలా సంవత్సరాలైనది. యీరోగముతో ఒక
ప్పుడు భార్యను చంపుటకు కూడ ప్రయత్నము చేసినాను.

ఇంతవరకు పాదరసముచుండి అల్లోపతి వైద్యులు
తయారుచేయు మందులనుగూర్చి తెలుసుకొన్నాము. ఈమం
దులతో కుమరు (నని మందు వైద్యులుచెప్పు) అసంఖ్యాక
రోగములగూర్చి తెలుసు కొన్నాము. వీటినుండి వచ్చు
అసంఖ్యాకములగు తరువాతి రోగముల గూర్చి మందువైద్యు
లేమియు నోరెత్తరు. మేము చెప్పేదేమంటే-పాదరసము,
పాషాణము మొదలగు ఖనిజరూపమగు లోహములను మందు
లనుగా ఉపయోగించుటచేతనే మానవకోటి అంతయూ
యిన్ని బాధలను పొందుచున్నారు. కనీనికచూచి విశదముగా
చెప్పగలము. కనీనికా నిదానము యిందుకు సాయపడుతుంది.

---

# అధ్యాయము 13

## క్వయినా

క్వైనైను అను ఆంగ్లపదమునకు క్వయినా తెనుగు తర్జుమా. క్వయినాను చెట్టుబెరడునుండి తయారుచేస్తారు. దీనిని రోగమునకు మందుగా మొదటగా 1820 వ సంవత్సరములో ఐరోపా ఖండములో ప్రారంభించారు. అప్పటినుండి మిగిలిన దేశములవారు కూడా క్వయినాను తయారుచేయుట మొదలుపెట్టారు. మందుగా వాడుచున్నారు. క్వయినాను తయారుచేయు ఫ్యాక్టరీలు జావాలో నెక్కువగా కలవు.

మందుగా క్వయినా బాగా వాడుకలోనున్నది. మారుమూల గ్రామాలలో కూడా క్వయినామాత్రలు ఉండవలసినదే. ప్రతిచిన్న పోస్టాఫీసులో కూడా యీమాత్రలు దొరకును. క్వయినా యెరుగని జానపదులు లేనేలేరని చెప్పవచ్చును. చలిజ్వరము వచ్చిందనగానే క్వయినా వాడకపోయినావా అంటారు. మూడుపూటలతో తగ్గిపోతుందంటారు. క్వయినాను సంవత్సరము పొడుగునా సేవించు కుటుంబములును లేకపోలేదు. పోపుదినుసులతోపాటు యిదికూడ ఒకటైపోయిందంటే విచిత్రమేమీలేదు.

క్వయినా తీవ్రాతి తీవ్రమైన విషమనుట నిజమైనప్పటికినీ జనసామాన్యము ఆమాటను ఒప్పుకోరు. చాలా కొద్ది మోతాదులగానే తింటున్నామంటారు. కొద్దిగానైనా రోజూ తింటే చాలాతీవ్రమైన అపకారమును చేస్తుంది. కాలిక రోగా

లన్నీ యీ క్వైనావలన వస్తున్నాయి. క్వైనాను వాడుట వలన కలుగువ్యాధులలో యీదిగువ చెప్పినవి ముఖ్యములు :- అజీర్ణము, మలబద్ధకము, సంధివాతము,నరములలో మంటలు, చెవుడు, గుడ్డి, చికాకు, పిచ్చి, తలదిమ్ము, నరములబలహీనత. వైద్యులు మాత్రము క్వైనా చాలామంచిదనియు, చలిజ్వరమును మూడు పూటలలో తగ్గించుననియు యేమేమో చెప్తారు.

విచక్షణాజ్ఞానము లేని సామాన్యజనమంతా 'శంఖములో నుండి వచ్చింది తీర్థమను' మాదిరిగా ఆమాటలను యథాతథాగా నమ్ముతారు. వైద్యాలయాలు వైద్యగ్రంథములును యీవిషయమును ఒకటిగానే చెప్పును. వైద్యులు మాత్రము యీ సత్యమును రోగులకు చెప్పరు. మరుగు పెట్టుదురు.

పాదరసము పాషాణములమాదిరిగనే క్వైనాకూడా నిరపాయకరమైనదని మందు వైద్యులు విచక్షణాజానము లేని సామాన్యజనమునకు చెప్పుదురు. వీరందరుయీవిషయములను యథాతథాగా ఒప్పుకొంటారు. వైద్యవరుల మాటలే నిజమో గ్రంథములలోని వ్రాతలేనిజమో యీ గ్రంథమును చదివిన మాచదువరులే తెలుసుకొందురుగాక.

దేహమునకు విజాతీయమైన పదార్థములన్నీ దేహములో చేరుకొనును. యే మందు యేఅవయవములో చేరుకొన్నదీ కనీనికను చూచి చెప్పగలము. దేహమునుండి ఆయా విషములు బయటకు పోగానే కనీనికలోని ఆయారంగులు లోపించును. దేహములోని విషములు బయటకు పోవు

నపుడు గడబిడలు చేయును. పాతరోగములన్నీ బయటపడును. మందులతో అణచివేయబడినరోగములన్నీ వెలుపలకువచ్చును.

దేహములోమందులు ఉన్నంతవరకు కనీనికలోమందుల రంగులుఉండుటవలనను, దేహమునుండి ఆ మందులు బయటకి పోగానే కనీనికలోనిరంగులు లోపించుటవలనను, రోగములతో బాటు రోగములకు వాడిన మందులు కూడా బయటికిపోవునను అలోపతీ వైద్యవరుల వాదములు నిరర్ధకములగుచున్నవి. రోగములు నయమైన తరువాత (మందులతో అణచివేయబడిన తరువాత)కనీనికలో ఆ యా మందుల రంగులు ప్రత్యక్షముగా గనబడుచున్నవి.

దేహములో అయొడోఫారము ఉన్నదీ లేనిదీ కనీనికను జూచి తేలికగానే చెప్పుదుము. దేహములో క్వైనైను వున్నదీ లేనిదీ తేలికగానే చెప్పవచ్చును. క్వాయినా పసుపుపచ్చని మేఘముల మాదిరిగా కనబడును. క్వాయినాను మిగిలినమందులతో కలుపుదురు. కలుపబడిన ఆ యామందుల ననుసరించి క్వాయినా రంగుకూడా మారును. ఆ కనీనికలో కనుపడురంగు కూడా వచ్చునరంగును బట్టి ఉండును. కొన్ని మందులతో క్వాయినా కలుపబడినపుడు తెలుపురంగు వచ్చును. ఈమందుల సేవించిన కనీనికలో యీ తెలుపురంగు కానవగును. ఇంకా కొన్ని లోహములతో కలుపబడినపుడు క్వాయినాకు ఎరుపు రంగుగల గోధుమరంగువచ్చును. ఈ మందుల సేవించినపుడు కనీనికలో యీ రంగుతోనే కనబడుటయుగలదు.

క్వాయినాను యేమందులతోను కలుపక ప్రత్యేకముగా సేవించినయెడల మెదడునుతెలుపు యేరియాలోను, కళ్లను,

చెవులను తెలుపు భాగములలోను జీర్ణాశయమును, చిన్న ప్రేగులను తెలుపు భాగములలోను ముఖ్యముగా కనబడును. వార్షికముగా చలిజ్వరముతో బాధపడువారు నిత్యమునూ క్వయినాను సేవిస్తారు. ఈ రోగులకనీనికలలో లివరు, స్ప్లీనుల తెలుపు భాగములలో యీ క్వయినా రంగు కనబడును. రంగుల పటములోని 3వ బొమ్మ యీసంగతిని విశదముచేయును.

మందువైద్యగ్రంథములు క్వయినాను సేవించిన కలుగు నని చెప్పు లక్షణములు, చలిజ్వరపు రోగులందరిలోను కనబడు చునేఉండును. మందువైద్య గ్రంథము లేమి చెప్పు చున్నవో తెలుసుకొందాము. క్వయినా వలన నాడీమండలము కంపించును. మతిచాంచల్యము పుట్టును. చెవులుగింగురుమనును. దృష్టిదోష మువచ్చును. తలనొప్పి, తలదిమ్ము కలుగును. రక్తప్రసరణము తగ్గును.

జ్వరమువచ్చినపుడు చర్మము పెళుసుగా నుండును. చర్మతలమున ఉన్న సన్నని కేశనాళికలన్నియు ముణుచుకొని పోవును. చర్మముద్వారా రావలసిన మలినములు బయటకు రావు. జల చికిత్సా ప్రక్రియలును, తడికట్లను వేసిన యెడల చర్మము మెత్తబడును. చర్మరంధ్రములు వికసించుకొనును. రక్తములోని మలినము లన్నియు యీ రంధ్రముల ద్వారా బయటకు వచ్చును. ఈ విషయములను నారిస్ పండితుడు వివర ముగా తన గ్రంథములో చెప్పినాడు. (వివరములు గోరు వారు ప్రకృతి వైద్యతత్వములో చదువగలరు). చిన్న మోతా దులుగానైననూ నిత్యము సేవించిన పెద్ద మోతాదులగును.

ఆయా మందులు వాటికి అనురాగమున్నచోట్ల చేరుకొనును. చేరినతరువాత అవయవముల పాడుచేయుటను మొదలుపెట్టును.

క్వయినా దేహావ్యాపారము నంతను స్తంభింపచేయును. రక్తకణములను చంపివేయును. హృదయగమనమును స్తంభింప చేయును. రక్తప్రసరణమును ఆపుచేయును. దగ్గును తగ్గించును జలుబును తీసివేయును. శోషరస గ్రంధులలోని చిన్నకణము లను స్తంభింప చేయును. ఆమత్వచములోని తడిని యిగర వేయును. ప్రకృతి యీ మార్గముల ద్వారా రోగపదార్థమును బయటికి పంపుటకు ప్రయత్నము చేయును. క్వయినా యీ స్రోవను మూసివేయును.

వైద్య కళాశాలలోని అధ్యాపకులు విద్యార్థులకు యీ క్రింది విధముగా చెవుతారు. రైల్వేలో పనిచేయు కూలీల రోగములకు క్వయినాను వాడకండి. అట్లా వాడారా గుడ్డి, చెవుడు వస్తుంది. ఈ రెండు లోపముల వలన ప్రయాణీకులకు ప్రమాదము సంభవిస్తుంది. గుడ్డితనము వచ్చుట చేత వారు దూరాన ఉన్న సిగ్నల్ చెక్కల రంగును నిర్ణయించలేరు. సిగ్నల్ సరిగా యీయని యెడల రైళ్లు ఢీకొని ప్రమాదములు సంభవించును. రైలు కట్టలమీద పని చేయు కూలీలకును, స్టేషన్‌లో పనిచేయు వాచ్‌మన్‌లకును యీ క్వయినాను వాడవద్దని చెప్పిరేగాని మిగిలిన వారిజోలికి పోలేదు. మిగిలిన జనమంతా గ్రుడ్డి వారైననూ, చెవిటి వారైనను వైద్యవరులకు సంబంధము లేనట్లుగా కనబడు చున్నది.

ఒక కథ చెవుతాను. కొద్ది రోజుల క్రితము మా ఆసుపత్రికి పరీక్షార్థమై ఒకామె వచ్చింది. నలుబది సంవత్సర

ముల వయస్సు ఉంటుంది. కుడికనీనికలోను, యెడమ కనీనిక లోను పసుపు పచ్చరంగు కనుబడుచున్నది. గొంతు, ఊపిరి తిత్తులు, శ్వాస నాళికలను తెలుపు భాగములలో నల్లటి గుర్తులు కనుబడుచున్నవి. ఈ నల్ల గుర్తుల వలన రోగము కాలికమైనట్లు తెలుసు కొన్నాము. నాకును ఆమెకును యీ క్రింది సంభాషణ జరిగినది.

నేను:— మీరు చాలా రోజుల నుండీ చలిజ్వరముతో బాధ పడుచున్నారు.

ఆమె:— అవును.

నేను:— దగ్గుకూడా ఉన్నది.

ఆమె:— అవును.

నేను:— చాలా క్వయినా తిన్నారు.

ఆమె:— అవును.

నేను:— క్వయినా ఫలితముగా క్షయరోగము ప్రారంభించింది.

ఆమె:— అవును. డాక్టర్లందరు అదేమాటన్నారు. ఒక సంవత్సరమునుండీ దగ్గుతో బాధపడుచున్నాను. రెండు సంవత్సరములకు పూర్వము చాలా ఆరోగ్యముగా ఉండే దానను. మగవారి మాదిరిగా చాలా దృఢముగా ఉండే దానను. నా భర్త క్షయరోగముతో బాధపడిచనిపోయినాడు. ఆయననుండి నాకుకూడా క్షయరోగము సంక్రమించిన దేమోనని భయపడితిని. వైద్యగ్రంథములు చదివితిని. ఆ ప్రకారమే నిత్యమూ క్వయినాను సేవించితిని. అప్పటివరకు నాకు క్షయ రోగము లేదు. ముందు రాకుండా క్వయినాను సేవించితిని. క్వయినా తినగా, తినగా ఒకరోజున స్పృహతప్పిపడి

పోతిని. ప్రక్కన ఉన్న మా బంధుగులు వైద్యుని పిలిపించి నా కథనంతనూ చెప్పిరి. క్వాయినా యెక్కువగా తినుటచే స్పృహ తప్పిపడిపోతినని డాక్టరుగారు సెలవిచ్చారు. అప్పటి నుండీ దగ్గు ప్రారంభమైనది. ఇప్పటివరకూ అంతూ పొంతూ లేదు.

నేను:— క్షయరోగము రాకుండా కాపాడగలందులకు గాను మీరు సేవించిన క్వాయినా వలననే క్షయరోగమువచ్చినది.

మందు వైద్యము వారి సిద్ధాంతము ప్రకారము రోగములన్నియు రోగ జీవులవలననే కలుగును. ఈ రోగజీవులను చంపుటకు మందులను వెతకవలయును. ఎక్కువ వేడిదేశములకును, చలిదేశములకును, పోవు ఉత్తర దేశీయులకు యీ చలిజ్వరము హెచ్చుగా వచ్చుచుండును. దీనిని బట్టి మన మేమి తెలుసుకొంటామంటే అత్యుష్ణములోను, అతి శీతలములోను యీ సూక్ష్మజీవులు పుట్టును. ఇది మందు వైద్యమువారి వాదన.

కసీనికానిదాన మేమిచెప్పతుందంటే చాలామందిలో పిత్రీయమైనటువంటిన్నీ, స్వార్జితమైనటువంటిన్నీ రోగ పదార్థము ఉండును. శీతలదేశములలో ఉండువారు వాతావరణములోని శీతలత్వమును భరించుటకుగాను మదమాంసములను, కోడిగుడ్లను, కాఫీ, టీ, కోకోలను, బ్రాందీ, విస్కీలను యెక్కువగా సేవిస్తారు. వీరు పండ్లను తిననే తినరు. రోగపదార్థమును బయటకు పంపుటకు సాయపడు పండ్లను అసలే తినరు గాన రోగపదార్థము బయటకురాదు. లోపలనే చేరుకొంటుంది. వాతావరణములోని శీతలత్వము యిందుకు

సాయపడుతుంది. రోగపదార్థము లోపలనె నిలవఉండిపోతుంది. ఇటువంటివారు వాతావరణములోని కొద్ది తేడాలను కూడా భరించలేరు. వీరు ఉష్ణదేశములకు పోగానే సూక్ష్మజీవులు ఉద్రేకమును పొంది బయటపడును. ఇవియే చలిజ్వరములు.

ఐరోపాఖండములో చాలామంది శాకాహారులు గలరు. వీరందరును పైవిషయములను యేకగ్రీవముగా ఒప్పుకొన్నారు. ఈ శాకాహారులు అత్యుష్ణప్రదేశములలో జీవించినప్పటికిని, అతిశీతలప్రదేశములలో జీవించినప్పటికిని జ్వరములతో బాధపడుట లేదు. ఉష్ణప్రదేశములనుండి శీతలప్రదేశములకు పోయినప్పటికిని వీరు బాధపడరు.

## మందు వైద్యుల అభిప్రాయము.

నేను వైద్యశాలలో చదువుకొనుచున్నప్పుడు మా ప్రొఫెసరు యిట్లు చెప్పేవారు. ఆయన చాలా వృద్ధుడు. సుప్రసిద్ధ అలోపతీవైద్యులు. ఇంత అనుభవమున్నప్పటికిని ఒక రోజున కూడా, ఒక రోగికి కూడా చలిజ్వరమును క్వయినాతో నయముచేసి యెరుగనని చెప్పేవాడు. ఎందుచేత అట్లు చేయనిది తెలుసుకొనుటకు యీ క్రింది కథను చెప్పేవాడు. "వైద్యశాస్త్రమును చదువుటకు పూర్వము, పరిశోధక సంఘముతోబాటు నేను కూడా దక్షిణ అమెరికా, మెక్సికో దేశములకు పోవలసివచ్చింది. అక్కడ నివసించు వారిలో ఒకరితో నాకు పరిచయము కలిగినది. చలిజ్వరము రాకుండా కాపాడుకోగలిగేటందుకు ఆయన ఒక చిట్కా చెప్పాడు. ఏమన్నాడంటే, "మదమాంసములను వదలండి. పొట్టలను

భర్తీచేయుకండి. పండ్లను యెక్కువగా తినండి. చలిగాలి కొట్టకుండా దుప్పట్లను కప్పుకోండి.” ఆయన చెప్పినట్లుగా నేను చేసినాను. పండ్లనే యెక్కువగా తినేవాడను. రాత్రి పూట దుప్పటి కప్పుకొని పడుకొనేవాడను. చిరుచెమట పోసేది. అప్పటికి నాకు చలిజ్వరము రానలేదు. ఇప్పటివరకు ఒకరోజున కూడా ఆ బాధపడి యెరగను. ఒక్కపూట కూడా క్వయినా వాడియెరగను. నాతోడివారందరు దుస్తులు యేమీ లేకుండా ఆకుబయట పడుకొనేవారు. వారికి చెమటపట్టేది కాదు”.

ఈ కథవలన మనకేమి తెలుస్తుందంటే, చలిజ్వరమును కలుగచేయునను సూక్ష్మజీవులు రోగపదార్థములోనే పుట్టును. చర్మమును సుస్నితముగా ఉంచుకొని, పేగులను (నిత్యమును) శుభ్రపరచుకొనినయెడల, సూక్ష్మజీవులకు ఆహారముదొరకదు. ఆహారము లేకపోవుటచేత బ్రతుకవు. వైద్యవృత్తిని అవలంబించినది మొదలుకొని నాదగ్గఱకు వచ్చిన రోగులకందరకును యిదే సలహాచెప్పుచున్నాను. నిజము యిట్లా ఉన్నప్పటికినీ వైద్యకళాశాలనుండి క్రొత్తగా వచ్చిన మందు వైద్యులు, పిల్లలకు చలిజ్వరము వచ్చినదనగానే, క్వయినా వాడుతారు.

దీనికి మరొక ప్రతివాదము కూడా గలదు. చలిజ్వరమును కలుగజేయు సూక్ష్మ జీవులు రాత్రిపూటనే ఉండును. దుప్పట్లు కప్పుకొని పరుండిన యెడల లోపలకు చొరబడలేవు.

ఈ వాదనకూడా అంత సమంజసముగా కనుబడుట లేదు. ఎందుకంటే చలిజ్వరమును కలిగించునను సూక్ష్మ

జ్వరము సాయంకాలము, ఉదయము సమానమైన వ్యాప్తిలో ఉండును. అన్ని వేళలా సమానముగానే బాధించును.

క్షయినావలన నాడీ వ్యాధులు వచ్చుచున్నవి.

కొన్ని సంవత్సరముల క్రితము నేనొక ఆసుపత్రికి వెళ్లినాను. అచ్చటకు పరీక్షార్థమై ఒక రోగివచ్చాడు. 30 సంవత్సరముల వయస్సుంటుంది. సిగరెట్లను తయారుచేస్తూ ఉంటాడు. ఆయనకు నాడీ వ్యాధికలదని అచట చేరిన మంచి వైద్యులందరును నిర్ణయించిరి. అధ్యక్షుడు, నాడీవ్యాధి లక్షణముల చెప్పమని విద్యార్థుల నడిగెను. వారు చెప్పిన లక్షణములతో తృప్తిపడక తానువైద్య సంఘము యెదుట నాడీ వ్యాధిలక్షణములనుగా చెప్పిన వాక్యములను యేకరువు పెట్టాడు.

'ఒక రోగి నాడులలోని మంటలతో బాధపడుతూ ఉంటాడు. ఆలక్షణము లేవియన- తల (ముందుభాగము) నొప్పి, తల వెనుక భాగమున నొప్పి, తలదిమ్ము, తలబరువు, చికాకు, చెవులు గింగురు మనుట, మానసిక చాంచల్యము వగైరాలు. దేహతత్వము మొత్తము మీద బాగుగానే ఉండును. బైటకు బాగాకనపడి నప్పటికినీ చెప్పవలవిగాని మానసిక బాధ ననుభవిస్తూ ఉంటాడు. ఇవియే నాడీ వ్యాధి లక్షణములు.

అధ్యక్షుడు కోరగా నేనారోగిని పరీక్ష చేసితిని. నాకును అధ్యక్షునకును యీ క్రింది సంభాషణ జరిగెను.

అధ్యక్షుడు:— మీరా రోగిని పరీక్షించితిరా?

నేను:— పరీక్షించితిని.

అధ్యక్షుడు:— రోగమేమని నిర్ణయించితిరి?

నేను:— క్వయినా సేవించుటవలన యీ వ్యాధి సంభవించినది.
అధ్యక్షుడు:— ఎట్లా నిర్ణయించిరి?
నేను:— కనీనికను చూచి చెప్పితిని.
అధ్యక్షుడు:— ఎట్లు ?
నేను:— జీర్ణాశయము, చిన్న ప్రేగులు, లివరు, ప్లీహము మొదలగు అవయవములను తెలుపు ప్రతినిధి భాగములలో పసుపుపచ్చ రంగు కనబడుచున్నది. లివరు, ప్లీహములలో మాత్రము ఉద్రేకము కానవచ్చుచున్నది. క్వయినాను సేవించుట వలన లివరు, ప్లీహములు పెద్దవగును. ఉద్రేకమును పొందును. నేను చెప్పిన లక్షణములు సరిపోవునా లేదో తెలుసుకొనుటకుగాను నాకును ఆరోగికిని యీక్రింది సంభాషణజరిగినది.
నేను:— చలిజ్వరముతో బాధపడితివా?
రోగి:— ఒక రోజూ, రెండురోజులూ కాదు. నాల్గు సంవత్సరములు బాధ పడితిని. ఇది వరకు దక్షిణ దేశములో నివసించితిని. అచ్చట చలిజ్వరము ప్రారంభించినది. ఈ బాధను తగ్గించు కొనుటకుగాను ఉత్తర దేశమునకు పోతిని.
నేను:- క్వయినాను బాగా సేవించినావా ?
రోగి:- నాలుగు సంవత్సరములపాటు ప్రతిరోజు సేవించాను. నాకును అధ్యక్షునకును యీక్రింది సంభాషణ జరిగినది.
నేను:- చూచితిరా! నేను కనీనికను చూచి చెప్పినది రోగి పాతకథకు సరిపోయినది. మీరుచెప్పిన నిర్ణయము తప్పినది. మందు వైద్యనిఘంటువును తెప్పించి చూడండి. నేను చెప్పింది సరిపోతుంది.

**అధ్యక్షుడు**:- మీరు చెప్పినది శాస్త్రసమ్మతముగాదు. మందు వైద్యము మీమాటలను ఒప్పుకొనదు. మేము చెప్పునదే శాస్త్రసమ్మతము.

దీనినిబట్టి తేలిన సారాంశమేమంటే - మందు వైద్య గ్రంథములలోని సంగతులకును, మందులనుగూర్చి వైద్యులు రోగులకు చెప్పు కథలకును యేమియును సంబంధము లేదు.

మందు వైద్యము వారి తప్పుడు నిర్ణయము, నేను చెప్పిన సరినిర్ణయము రోగియెదుటనే జరిగినవి. ఎక్కడో జరిగినట్లయితే ఏమీమాద ముండెడిదికాదు. రోగికి అసలు సంగతి తెలిసిపోయినదని అధ్యక్షునకు నామీద కోపము వచ్చినది.

అనేక వేలమంది రోగులు మందువైద్యమువారి తప్పుడు నిర్ణయముతోనే బాధపడుచున్నారు. ఈతప్పుడు నిర్ణయమునుండే మందువైద్యమువారి చికిత్సాపద్ధతు లన్నియు వెలువడుచున్నవిగాన చికిత్సాపద్ధతులతో మరింత బాధపడు చున్నారు.

మరొక చరిత్ర:—మూడు సంవత్సరముల క్రితము మా ఆసుపత్రికి దంపతులు వచ్చారు. భర్త తనంతతాను నడువ లేడు. కాళ్లూ, చేతులూ చచ్చుపడిపోయినాయి. చికాగో లోని ప్రఖ్యాత వైద్యులందరును యీయనను పరీక్షచేశారు. ఎవరికి తోచినమాటను వారు చెప్పారు. చాకిరి యెక్కువగుట వలన యీరోగము వచ్చినదని నిర్ణయించారు. ఈమాట చెప్పుటకు యీరోగినుండి 50 డాలర్లు (150 × 50= రు 7500) ను తాజేశారు. ఎక్కువగా పనిచేయుటవలనయీ రోగము

వచ్చినదని చెప్పుట వైద్యులకు పరిపాటైపోయినది. రోగుల రోగములను సరిగా నిర్ణయించలేక వైద్యులు యీ సాకును చెప్పి తప్పుకుపోవుచున్నారు. వారి నిర్ణయము యెట్లు తప్పిందీ కనీనికా నిదానమువలన స్పష్టముగా తెలియగలదు.

రోగి భార్యకును, నాకును, యీక్రింది సంభాషణ జరిగినది.

కనీనికను చూడగా మెదడును తెలుపు ఒకటవ యేరియాలో క్వయినా పసుపుపచ్చ రంగులో కనబడినది. మధుకోశము, ప్లీహాములను తెలుపు ప్రతినిధి భాగములలోను యీ పసుపుపచ్చని రంగు కనబడినది. కనుపాప చుట్టునుండు 1, 2, ఆవరణలలోను ఈ పసుపుపచ్చని రంగుకనబడినది.

నేను:- నీ పెనిమిటికి చలిజ్వరమువచ్చినదా ?

ఆమె:- Hay fever (తృణజ్వరము) తో చాలా కాలము బాధపడినాడు.

నేను:- ఆజ్వరము తగ్గుటకు యేమి వాడినారు ?

ఆమె:- క్వయినా సేవించారు.

నేను:- ఎంతకాలము ?

ఆమె:- ఒకరోజూ, రెండురోజులూ కాదు నాలుగు, అయిదు సంవత్సరములు నిత్యము సేవించాడు. మొదటగా యీ రోగము వచ్చినపుడు క్వయినా వాడమని డాక్టరుగారు సెలవిచ్చారు. అప్పటినుండి వీరీమందు వదలలేదు.

నేను.- వీరి తల్లిగాని, అమ్మమ్మగాని యీ చర్మరోగముతో బాధపడిరా ?

ఆమె:- లేదు.

నేను:- తండ్రి వంశములోని వారెవరైనా యీ రోగముతో బాధపడిరా ?

ఆమె.— లేదు

నేను:- వీరి కేమైనా దురభ్యాసములు కలవా ?

ఆమె:- లేవు.

నేను:— వీ రెప్పుడైనా వ్యాయామము చేయుచుండిరా ?

ఆమె:- కాలేజీలలో చదువునపుడు బాగా వ్యాయామము చేసేవారు. పోటీలలో ప్రథమ బహుమతులు చాలా పొందినారు.

నేను:— (Hay fever) వచ్చువరకు వీరేమైనా జబ్బుతో బాధపడిరా ?

ఆమె:- లేదు చిన్నప్పటినుండీ చాలాఆరోగ్యముగా ఉండేవారు.

నేను:- వైద్యులు రోగ మేమని నిర్ణయించారు ?

ఆమె.— ఎవరికి తోచినట్లు వారుచెప్పారు. మీరేమంటారు ?

నేను:— తెలియుట లేదా ? ఆరోగ్యవంతులైన తల్లి దండ్రులకు కలిగి, దురభ్యాసములు లేకుండా, పెరిగిన వారినే క్వయినా యింతగా బాధించినది. అన్ని దురభ్యాసములు ఉన్నవారి గతి చెప్పే దేమున్నది.

ఆమె.- అవును. క్వయినా వలననే ఈ బాధ వచ్చినది.

## క్వయినాను ఉపయోగించు విధము.

క్వయినా గుర్తులు:— క్వయినా యేరంగులో యే అవయవములో కనబడునదీ తెలిసికొందాము. క్వయినాను సేవిం

చగనే ఆ రంగు మెదడును తెలుపు ఒకటవ ప్రతినిధి భాగ ములో కనుబడును. ఎల్లప్పుడునూ పసుపుపచ్చ రంగులోనే కనుబడవలెనను నియామకము లేదు. మందు వైద్యులు క్వాయి నాను స్వస్వరూపములోనే యివ్వక, యింకా అనేక మందు లతో కలిపి యిత్తురు. ఆ మందులకును క్వాయినాకును కల్గిన రాసా యనిక అనురాగమును బట్టి యెరుపుగా మారుచుండును. అను రాగముగల ప్రతినిధి భాగములలో, యెరుపురంగు కనబడును, క్వాయినాను యెక్కువగా సేవించిన యెడల పసుపు పచ్చరంగు లోనే కనబడును. ఈరంగు జీర్ణాశయమును తెలుపునట్టి మొదటి ఆవరణలోను, చిన్న ప్రేగులను తెలుపు రెండవ ఆవరణలోను కనుబడును. మధు కోశములోను, ప్లీహములోను కనుబడును. చలి జ్వరముతో చాలా కాలము బాధ పడుచుండి క్వాయినా సేవించిన యెడల ఈ పసుపుపచ్చరంగు మధుకోశము, ప్లీహ ములలో తప్పకుండా కానగను. కలరు ప్లేటులోని మూడవ బొమ్మను జూచినయెడల ఈ సంగతి బాగా విశదమగును.

ఇండియన్ మెటీరియా మెడికా యందిట్లున్నది.

సింకోనా చెట్టు బెరడునుండి తీసి, గంధక ధృతితో కలిపిన తరువాత క్వాయినా అగుచున్నది. టానిక్కుగా బాగా ఉపయోగపడుతుంది. తుల్యమైనది మరొకటిలేదు. అగి వచ్చే జ్వరములకు అమోఘముగా పనిచేస్తుంది. సన్నిపాతము, మశూచికము, న్యూమోనియా, సంధివాతములకు పెట్టినదిపేరు. కోరింతదగ్గు, శ్వాస నాళికా వ్యాధులకు చాలా చురుకుగా పని చేస్తుంది. ఇంత అమోఘమైన మందులైనప్పటికిని మేజరు

త్తను, చోప్రాలు 'Practical medicine' లో యేమన్నారంటే క్వయినామందులను ఎలుకల కండరములోనికి యింజెక్టుచేసి నపుడు మంటలుపోట్లు పుట్టినాయి. అందువలన కండరములలో ప్రవేశపెట్టక గొంతులో నిరభ్యంతరముగా వేయవచ్చును.

## మందువైద్యులు ఉపయోగించు విధములు

ఆకలి గలుగుటకును, రోగము నయమైనతరువాత పుష్టి కలుగుటకును, పాదరసము, సీసములతో తయారుకాబడిన మందులవలన నీరసము కలుగకుండా కూడా దీనిని వాడుదురు. చలిజ్వరమునకు ప్రధానముగా వాడుదురు. తరుచుగా వాడితె చాలా ఉపయోగము కలుగుతాయుంటారు. ప్లీహము చెడుటచే కలుగు శ్వేతకుసుమ వ్యాధులందు తరచుగా వాడుతారు.

కోకెయినుకు బదులుగా మత్తును కలిగించుటకు చిన్న ఆపరేషనులకు వాడుతారు.

నులిపురుగుతో బాధపడువిరోచనములలో ఈమందును లోనికి యింజక్టును చేస్తారు.

నాడీవ్యాధులందు వాడుతారు.

ఆగంతుకవిషీకరణము:-చలిజ్వరము ముందురాకుండా కాపాడుటకు వాడుమందులవలనను, ప్రసిద్ధమైన టానిక్కుల లోను, వెంట్రుకలకు రాచుకొను తలనూనెలలోను ఉండును.

అగదచిహ్నములు: — జీర్ణకోశములోనికి పోయిన తరు వాత మిగిలిన మందులతో కలిసిపోవును. ఈ లవణములు రక్తముతో చాలాత్వరగా కలిసిపోవును. తెల్లకణములు

తగ్గించి వేయును. ప్రాణవాయువును హెమోగ్లోబిన్‌తో కలిపివేయును. అందువలన ప్రాణవాయువులంతటా అందదు.

దేహములోని ఉష్ణమును క్వయినా తగ్గించివేయును. బయటకు పోవుటకు సాయపడదు.

ఈ క్రిందిలక్షణములు ప్రధానముగా నుండును.

నుదురుమీద నొప్పిగానుండును.

తలపైభాగములో దిమ్ముగానుండును.

చెవులు గింగురుమనును.

కనుపాప పెద్దదగును. దృష్టి దోషము కలుగును.

జీర్ణాశయములోను, మూత్రపిండములలోను మంటలు పుట్టును.

గజ్జి, చీడ లేచును.

నిద్రపట్టదు. నిద్రపోయినా నీరసముగానే ఉండును.

నాడీవ్యాధులు, పిచ్చి, పుట్టును.

బయటకు వచ్చునపుడు యీలక్షణములు కనబడును. చర్మవ్యాధులుగా రావచ్చును. గవదబిళ్ళలు పుట్టవచ్చును. మూత్రపిండములలోగాని, మూత్రము విడుచునప్పుడుగాని మంటలు కలుగును.

గొంతులో ఆ వాసన ఉండును.

కళ్ళేతో పోవును. రక్తాభిష్యందముగాపోవును.

# అధ్యాయము 14

## అయోడిన్

మందువైద్యమువారు మందులలోకల్లా ముఖ్యమైనవి పాదరసమునుండి తయారుచేయబడు మందులు. పాదరసము తరువాత తుల్యమైన వాడుకలోనున్నది అయోడిన్. అయోడిన్ నుండియు అసంఖ్యాకమగు మందులను తయారుచేస్తారు. సనాతన మందువైద్యమువారు పాదరసము, అయోడిన్‌లను భగవంతుని ప్రతినిధులుగా ఆరాధిస్తున్నారు. నేడు అందరి కనీనికలలోను యీ అయోడిన్ మచ్చలు కనబడుచునే ఉన్నవి. ఈ మచ్చలు లేని కనీనికలు లేనేలేవని చెప్పవచ్చును. ప్రకృతి సూత్రము లను విస్మరించి చాలాకాలమైనది. ఆ యాసూత్రములకు అను కూలముగా జీవించి రోగముల నయముచేసికొనుట చాలాతర ములనాడే విస్మరించినాము. మనతండ్రి తాతలుగాని, మనము గాని యెప్పుడో ఒకప్పుడు ఈ అయోడిన్ మందులనుసేవించిన వారమే. మిగిలిన మచ్చలకన్న ఈ అయోడిన్ మచ్చలు చాలా ప్రధానముగా కనుబడును. అయోడిన్ యెరుపురంగుగా కనబడును. అయోడిన్‌తో తయారుచేయబడు మందులును ఈరంగుతోనే కనబడును. లేతయెరుపురంగుతోగాని, నారింజ రంగుతోగాని ఈ మచ్చలు కనబడును.

ఈ మచ్చలు పారదర్శకముగా నుండును. ఈమచ్చలు ద్వారా కనీనికలోని లోపలభాగములో ఉన్న సన్నని నాడులు బయటకు కనబడుచుండును. మిగిలిన అన్నిలోహములు బయ

టకు వెడలునపుడు ఆయా మచ్చలుచుట్టు తెల్లనిగీతలు యెట్లు కనబడునో, అట్లనే అయోడిన్ బయటకు పోవునపుడు అయోడిన్ మచ్చలచుట్టూ తెల్లటిగీతలు కనబడును. చర్మమునకు రాచిన మందులద్వారా అయోడిన్ లోనికి పోయినయెడల కనీనికలోని ఆయాప్రతినిధిభాగములలో ఎర్రటి మేఘములు కనుబడును. ఈమేఘములు Pink color లో గూడా కనబడ వచ్చును. అయోడిన్ యేఅంతరవయవములో చేరినదో ఆఅంత రవయవమును తెలుపు ప్రతినిధిభాగములో ఎర్రటి మేఘములుగాని, మచ్చలుగాని కనబడవచ్చును. గజ్జి మచ్చలకును, అయోడిన్ మచ్చలకును, యేమీ తేడా లేనట్లుగానే కన బడునుగాని, కొద్దిఅనుభవము గలవారు యీ అయోడిన్ మచ్చను తేలికగానే కనుగొనగలరు.

గజ్జిమచ్చలకన్నను, సోరామచ్చలకన్నను, యీ అయోడిన్ మచ్చలు కాంతిగా నుండును. రోగి చరిత్రనువినిన యెడల ఈ సంగతి బాగుగా తెలియగలదు.

మిగిలిన ఖనిజములు కొన్ని ప్రత్యేక అవయవముల లోనే కనుబడును. అయోడిన్ చుక్కలు అన్నిచోట్లనూ కను బడును. మధుకోశము, మూత్రపిండములు, జీర్ణాశయము, చిన్నప్రేగులు, ఊపిరితిత్తులు, చేదుగట్టు, మెదడులను తెలుపు ప్రతినిధి భాగములలో కనుబడును.

అయోడిన్‌ను గూర్చి మందువైద్య గ్రంథము లేమిచెప్పును?

మిచెల్ బ్రూక్ గారి గ్రంథమునుండి యెత్తివ్రాయు చున్నాము. "ఇదిఘనపదార్థములలో ఒకటి. దీనితో తయారు

చేసిన ద్రావకమును దేహముమీద పూతురు. చర్మముమీంద పూసిన యెడల చర్మరంధ్రములద్వారా లోనికి ప్రవేశించి కణములలోని అణువులలోని మధ్యభాగములకు చేరుకొనును. ఈఅణువులలో నిలవ ఉన్న పదార్థముతో రాసాయనిక సమ్మేళనము పొందును. రక్తములో ప్రవేశించినయెడల రక్తముతో కలిసి దేహమంతట తిరుగుచుండును. సూక్ష్మజీవులు పుట్టకుండా చూచును. బయటనుండి లోనికి ప్రవేశించు సూక్ష్మజీవుల ఆపుచేయును."

దీనినిబట్టి మనకేమి తెలుస్తుందంటే సూక్ష్మజీవులు పుట్టకుండా వాడుమందులును, సూక్ష్మజీవులను చంపుటకు వాడుమందులును దేహములోని మూలశక్తిని చంపును. దేహములో అనేక కణములున్నవి. ఈకణములోని సూక్ష్మాతి సూక్ష్మమైన భాగము అణువు. ఈ అణువులోని సూక్ష్మమైన భాగము ప్రోటాన్. ఇది ఆత్మసంబంధమైన వస్తువు. ఇందుండియే కదలిక కలుగును. సూక్ష్మజీవులు పుట్టకుండాను, వృద్ధిపొందకుండాను వాడు మందులన్నియు ప్రోటానును చంపి వేయును. స్థూలముగా చెప్పవలెనంటే యీమందులన్నియు దేహముయొక్క కదలికకు అవసరమైన మూలశక్తిని చంపి వేయును.

"అయోడిన్‌తో తయారుచేయబడిన మందులు ఉద్రేకము కలుగచేయుటకే ఉపయోగపడును. చాలాకాలమునుండి ఉన్నసంధులలోని వాపులను, కాలికమైన శోషరసగ్రంధులలోని వాపులను తగ్గించుటకు ఉపయోగపడును. ఊపిరితిత్తుల చుట్టునుండు పుప్పుసకుహరములలోని మంటలను తగ్గించుటకును

ఉపయోగపడును. పైనచెప్పిన అవయవముల నన్నిటిని యీ మందులు ఉద్రేకపరచును"

అయోడిన్‌తో తయారుచేయబడిన మందులు దేహము లోని మూలశక్తిని ఉద్రేకపరచును. రెచ్చగొట్టును. దేహమునకు హానిని కలిగించును. ఈ అయోడిన్‌తో తయారు చేయబడిన మందులు లోపలకు ప్రవేశించి దేహమునకు హానిని చేయును. ఈహాని కలుగకుండుటకుగాను దేహములోని కూటికలు, కణములు, అణువులు ఒక్కుమ్మడిగా శత్రువును బయటకు పంపుటకు ప్రయత్నించును. కాని మందుమోతాదు యెక్కువగుటచే ప్రకృతి నోరు మూసుకొనును.

"దేహముమీద ప్రయోగించు ప్రతి ప్రక్రియలోను క్రియాఫలితము, ప్రతిక్రియాఫలితము రెండును ఉండును. వివరముగా చెప్పవలెనంటే చన్నీటి కటిస్నానమువలన క్రియాఫలితముగా వేడికలుగును. ప్రతిక్రియా ఫలితముగా చలువ కలుగును. ప్రకృతి వైద్యమువారు ప్రతిక్రియా ఫలితమునే ప్రధానముగా భావిస్తారు. మందు వైద్యము వారన్ననో క్రియాఫలితమునే ప్రధానముగా భావిస్తారు.

దేహముమీద ప్రయోగింపబడు మందులకును క్రియాఫలితము, ప్రతిక్రియా ఫలితము రెండునూ ఉండును. క్రియాఫలితమునకు, ప్రతిక్రియాఫలితము వ్యతిరేకముగా నుండును. క్రియాఫలితముగా ఉద్రేకముకలిగిన, ప్రతిక్రియాఫలితముగా నిస్సత్తువ కలుగును. క్రియాఫలితముగా నిస్సత్తువగలిగిన, ప్రతిక్రియాఫలితముగా ఉద్రేకము కలుగును. మందువైద్యము వారు క్రియాఫలితమునే ప్రధానముగా భావిస్తారుగాన ఉద్రే

కము కలుగచేయుటకే మందులను యిస్తారు. ఈమందుల వలన క్రియా ఫలితముగా ఉద్రేకము కలుగును. ప్రతిక్రియా ఫలితముగా నీరసముకలుగును.

అయోడిన్‌తో తయారుచేయబడిన మందులను సూదులద్వారా లోనికి యెక్కిస్తారు. గండమాలతో బాధ పడు రోగులకు యీ అయోడిన్ మందులను సూదులద్వారా లోనికి యెక్కిస్తారు. బుడ్డతో బాధపడువారి దేహముల లోనికిని యీసూదిమందులను యెక్కిస్తారు".

దీనివలన జరిగిన ప్రయోజనమేమంటే శోషరసగ్రంథు లన్నియు చచ్చుపడిపోవును. శస్త్రముల నుపయోగించి అవ యవముల తొలగించుటవలన దేహమునకు యెంత అపకారము జరుగునో, అయోడిన్‌తో తయారుచేయబడిన మందులను చర్మముమీద రాచి శోషరస గ్రంథులను యింకింపజేయుట వలన (చచ్చుపడునట్లు చేయుటవలన) అంత అపకారము జరుగును.

అయోడిన్‌తో తయారుచేయబడిన మందులవలన దేహమునకు యింత అపకారము జరుగుచుండగా రోగములను నయము చేయుచున్నామని మందువైద్యులు ప్రచారము చేయుచున్నారు.

అయోడిన్ మందుల వలన కలుగు భవిష్యత్ దుష్ఫలిత ములనుగూర్చి తెలుసుకొందాము

"శ్వాస నాళికలలో కలిగిన దాహమునకు (మంటలకు) అయోడిన్‌ను మిగిలిన మందులతో కలిపి యిస్తారు. ఈమందు

ఆ దాహమును తగ్గించలేదుగాని ఆ శ్వాసనాళికలలోని సూక్ష్మాతిసూక్ష్మ భాగమును చెడగొట్టును. అయోడిన్‌తో తయారుచేయబడిన మందులు జీర్ణాశయములో చేరినయెడల అచ్చట నొప్పికలుగును. పోట్లు పుట్టును. బద్ధకముగా నుండును. అతిసారము కలుగును. రక్తములో ప్రవేశించినయెడల మొదటగా సోడియముతో కలియును. తరువాత అయోడిన్‌నుండి సోడియము విడిపోవును. అయోడిన్ భాగము యెక్కువగానున్నయెడల రక్తకణములు పగిలిపోవును. అయోడిన్‌తో తయారుచేయబడిన మందులను రోగులకు యిచ్చినపుడుమాత్రము శ్రద్ధగా నుండవలయును. హాని కలుగనట్లు చూడవలెను.''

పైన చెప్పిన రోగములకే గాక మరికొన్ని రోగములకును అయోడిన్ మందులను యిస్తారు.

'అయోడిన్‌తో తయారుచేయబడిన మందులను లోనికి యిచ్చిన యెడల శోషరసగ్రంథుల పరిమాణము తగ్గును. శోషరసగ్రంథులకు అయోడిన్ మందులను రాచినప్పుడును, లోనికి యిచ్చినప్పుడును యిదే పని జరుగును.'

లోపల చేరినపుడు ప్రకృతి దానిని బయటకు నెట్టుటకు ప్రయత్నము చేయుచునే ఉండును. జలుబుచేసి, చీమిడిగా బయటకు పంపివేయును. నాలుక చేదుగానుండును. తల నొప్పిగానుండును. చర్మము ద్వారా బయటకు వచ్చునెడల తీట, చీడ, చుండు మొదలగు చర్మవ్యాధులు కలుగును.

స్వాస్థ్యసంకటములు కలిగి రోగపదార్థము బయటకు పోవునపుడు యీ లక్షణములు తప్పక కలుగును. ఈ మం

-ముల వలన కల్గు అసంఖ్యాకములగు చెడులక్షణముల గూర్చి తెలుసుకొందాము. అతిమూత్రము ప్రధానమైనది. జీర్ణాశయములోను, చిన్న ప్రేగులలోను పుండ్లు, వ్రణములు కలుగును. చేదుకట్టుకు సంబంధించిన వ్యాధులు కలుగును. ప్లీహమునకు సంబంధించిన జబ్బులు కలుగును, ఊపిరితిత్తులకు సంబంధించిన రోగములు కూడా రావచ్చును. ఇవేగాక మిగిలిన అవయవములకు సంబంధించిన రుగ్మతలు కూడా రావచ్చును.

## అయోడిన్, పాదరసమును బయటకు పంపునా ?

'పాదరసముతో తయారుకాబడిన మందులు, సీసముతో తయారుకాబడిన మందులు దేహములో నానాహంగామా చేయుచుంటే యీ అయోడిన్ వాటిని బయటకు నెట్టివేయునని అలోపతీ వైద్యగ్రంథములన్నియు చెప్పను. సుఖరోగములను ఆపుచేయుటకు అయోడిన్ మందులను వాడుతారు. సుఖరోగముల కలుగచేయు సూక్ష్మజీవులను యీ అయోడిన్ మందులు చంపివేయును. కొన్ని సుఖరోగములను పాదరసముతో తయారుచేయబడిన మందులు నయముచేయలేవు. అటువంటి రోగముల సహితము అయోడిన్ మందులు కుదుర్చును.

సుఖరోగములని చలామణి యగుచున్న రోగములనన్నిటిని పాదరసముతో తయారుకాబడిన మందులు కుదుర్చును.

అయోడిన్ మందులు యీ పాదరసపు మందులను బయటకు పంపును. ఎట్లాగంటే పాదరసమును విశ్లేషము

నుపొందచేసి బయటకు పంపును. (మిగిలిన లోహములన్నీ యెక్కువ ఉష్ణములోగాని కరుగవు. పాదరసము చాలా తక్కువ వేడిలోనే కరుగును. ఈ తక్కువ వేడిలో కరుగు మరొక లోహము లేదు. అందువలననే మందు వైద్యులు యీ లోహమును యెక్కువగా వాడుతారు). దేహములోని వేడికే పాదరసము కరగిపోవును. కురుపుల ద్వారాను, పుండ్లద్వారాను, అంతర్వ్రణములద్వారాను, బహిర్వ్రణములద్వారాను, ప్రకృతి బయటకు పంపును. ఇట్లు బయటకు వచ్చు రోగపదార్థమును అయోడిన్ మందులు అణచివేయును. పాదరసపు మందులకు అయోడిన్ మందులు తోడై నాశనమును మొదలు పెట్టును. ఈ సంగతిని కసీనికను చూచి చెప్పగలము. ఈ గ్రంథమంతా యెట్లా ఉన్నదంటే కాలులోని ముల్లును తీయుటకు కర్రును ఉపయోగించినట్లున్నది. పాదరసము, అయోడిన్‌ల రెంటినుండియే యీ సుఖరోగములన్నీ పుట్టుచున్నవి.

అయోడిన్ వలన కలుగు భవిష్యత్ దుష్ఫలితముల గూర్చి డాక్టరు ఎ ఫారిన్‌గ్టన్‌గారు తమ వైద్యనిఘంటువు, 477 పేజీలో యీ క్రింది విధముగా వ్రాసిరి.

'గ్రంథులు అయోడిన్‌ను స్వీకరించును. నరములు కణములు అన్నీ కూడా యీ అయోడిన్‌ను స్వీకరించును. నాడీ మండలము కంపించును. ఆడువారికి యీ అయోడిన్ మందులను వాడిన యెడల స్తనములలోనికి వచ్చు క్షీర స్రోతస్సులు యెండిపోవును. గర్భాండములు యెండిపోవుటగలదు. పురుషులకు అయోడిన్ మందులను యిచ్చిన యెడల వృషణ

ములలోని లేపనశక్తి తగ్గిపోవును నపుంసకత్వము రావచ్చును. చర్మమునకు ముదురు పసుపురంగు వచ్చును. కంటిలోని నల్ల గుడ్డులో పసుపుపచ్చ మచ్చలు కనుపడును. దేహమంతటా కనుపడవచ్చును. అపరిమితమైన ఆకలి ఉండును, ఒక పూట అన్నము లేకపోతే కమ్ముట్రదు, మూర్ఛవస్తుంది. ఎక్కువగా అన్నము తిన్నప్పటికినీ అన్నమునుండి రావలసినశక్తి రాదు. నాడీమండలము కంపించిపోతుంది. చికాకు, ముక్కోపము వస్తుంది. ఏకాన్త యెదురువచ్చినా భరించలేరు. కోపపడ తారు. బయటనుండు వచ్చుగాలిని కోరుతూ ఉంటారు. ఇంటిలో కూర్చోలేరు. ఇవేగాక యింకా అనేక దుష్ఫలితాలు కలుగును. కనీనికలోని వివిధ ప్రతినిధి యేరియాలలోని రంగునుబట్టి యేమందు యే అవయవములో చేరినదీ చెప్ప గలము. పరీక్షార్థమై మా ఆసుపత్రికి ఒకామె వచ్చినది. ఆమెకును నాకును ఈ క్రింది సంభాషణ జరిగినది.

నేను:—మీకు కుడికణత నొప్పిగా ఉండునుగదా?

ఆమె:—అవును.

నేను:—తలనొప్పితో బాధపడుదురుగదా?

ఆమె:—అవును. ఆనొప్పికి కారణము చెప్పండి. ఇంతవరకు యెవరును కారణము చెప్పలేదు.

నేను:—అయోడిన్ మందులను చర్మమునకు రాచినారు. ఎడమవైపు ముందు మెదడును తెలుపు ప్రదేశములో మెరసిటి అయోడిన్‌గీత కనుబడుచున్నది. ఈ అయోడిన్ మందును యెప్పుడు యెందుకు తిన్నదీ చెప్పగలవా?

ఆమె:—(కొంచెము ఆలోచించి) ఆ! గుర్తు వచ్చింది. ఆరుయేళ్ళప్పుడు గొంతు వాచినది. ఆ వాపు తగ్గగలందు లకుగాను అయోడిని (పట్టు)ను గొంతుకు పూశారు. ఒకటి రెండు తడవలు కాదు. చాలా తడవలు పూశారు. (కొంచెము ఆలోచించి) అప్పటి నుండి యే ఈ నొప్పి మొదలు పెట్టింది. అప్పటినుండి యిప్పటి వరకును ఒక పూటకూడా విడుపులేకుండా బాధపడుచున్నాను. ఈ తల నొప్పిని తగ్గించుకొనుటకుగాను చాలా బ్రోమిన్ తిన్నాను. బొగ్గు, తారులనుండి తయారగు మందులచాలా తిన్నాను. కానీ ఉపయోగము లేకపోయినవి. నాడీవ్యాధు లకు వాడు మందులనన్నిటినీ వాడినాను. వ్యర్థమై పోయి నాయి. బాధలు పెరిగిపోయినాయి.

డా. లిండ్లరు అనుభవము.

నేను అయోడిన్ మందులను చాలా చిన్నతనములోనే సేవించాను. ఆమందు దేహములో నిలబడిపోయింది. ఆమందును బయటకు పంపివేయుటకు గాను చాలా ప్రయత్నములు చేసి నాను. అలోపతిమందులతో బయటకు పోలేదుగాన ప్రకృతి వైద్యశాస్త్రమును చదవవలసివచ్చింది. ఇరువది సంవత్సరముల క్రితము నా ఆరోగ్యమేమీ బాగావుండేదికాదు. అన్ని మందులు వాడినాను. ఉపయోగమేమీ కనుపడలేదు. రోగ మును నయము చేసికొనుటకుగాను ఐరోపాలోని ప్రకృతి చికిత్సాలయమునకు పోతిని. అచ్చటివైద్యుడు నన్ను చూచుట తోడనే నీమధుకోశము, కడి మూత్రపిండములు అయోడిన్ మందులు వాడుటవలన చెడిపోయినవన్నాడు.

నాకప్పుడు గుర్తువచ్చింది. చాలా చిన్నతనములో మా వైద్యుడు నా దేహములోనికి అయోడిన్ మందులనిచ్చాడు. గొంతుచుట్టూ అయోడిన్ పూతలను రాచినాడు. ఈ అయోడిన్ వలన అతిమూత్రము వెట్లావచ్చిందా అని విచిత్రపడే వాడను. నాకు అప్పుడు ఒంటిమీద బొబ్బలు లేచినాయి. దానితో కొంత రోగపదార్థము బయటకుపోయినది. ఆబొబ్బలకు నేనేమీ మందులను రాయలేదు. వాటిని అట్లనే వదలిపెట్టి నాను. ఇట్లా వదలిపెట్టుట చాలా గుణముగా కనుబడినది. ఎందుకంటె-బొబ్బలు వచ్చిపోయిన తరువాత వెనుకటికన్న చాలా బాగా ఆరోగ్యముగా ఉన్నాను. అంతవరకు జలుబు జ్వరములతో తరచుగా బాధపడుచుండెడివాడను. అప్పటి నుండీ వొకరోజుకూడా తలవాల్చి యెరుగను. అప్పటినుండి ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించుటచేత రోగ పదార్థము చాలా బహిష్కరింపబడినది. కనీనికలో మచ్చలు చాలా వరకు లోపించినవి. పది, పదహారు సంవత్సరముల పాటు ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించినప్పటికినీ కనీనికలోని మచ్చలు పోలేదు. ఈ ఒక్క విషయమును బట్టే భూమినుండి త్రవ్వబడిన ఖనిజములతో తయారుకాబడిన మందులు దేహమునకు యెంత విజాతీయములో బుద్ధిమంతు లగు మాచదువరులే గ్రహింతురు. ఈ విషయమును 16 వ బొమ్మలో ప్రత్యక్షముగా చూడగలరు.

ఒక రోజున మా ఆసుపత్రికి పరీక్షార్థమై ఒకామె వచ్చింది. ఆమెయిట్లుచెప్పింది. "నాకు మొదటగా గలిగినశిశువు నకు పాలుఉన్నవి. తరువాతగలిగిన ముగ్గురకునుపాలు లేకుండా

పోయినవి". కసీనికను పరీక్షచేయగా కుడిఊపిరితిత్తి 10, 11 ప్రతినిధి భాగములలో మెరసిని అయోడిన్ మచ్చ గలదు. కుడి ఊపిరి తిత్తిలోని మూడవ అరలోను, పుప్పుస కుహరములోను closed lesions గలవు. నాకును ఆమెకును యీ క్రింది సంభాషణ జరిగినది.

నేను:- మొదటి శిశువు కలిగిన తరువాత మీకు న్యూమోనియా వచ్చినది.

ఆమె:—అవును. మొదటి పిల్లకు 16 నెలల వయస్సు వచ్చినపుడు నాకు న్యూమోనియా వచ్చినది.

నేను:—ఱొమ్ముమీద అయోడిన్ పట్టువేశారు.

ఆమె:—అవును.

నేను:— చర్మమునకు పూసిన అయోడిన్ చర్మముద్వారా లోనికి యింకినది. ఈ అయోడిన్ వలన క్షీరపోతస్సులు యెండిపోయినవి. అందువలన తరువాత కలిగిన పిల్లలకు పాలు లేకుండా పోయినవి.

నా పదునెనిమిది సంవత్సరముల అనుభవములోను అయోడిన్ వలన చాలా నష్టములు కలిగినట్లు తెలుసుకొన్నాను. అయోడిన్ జననేంద్రియములలో చేరుటవలన లేవనశక్తి తగ్గినట్లును, నపుంసకత్వము సిద్ధించినట్లును తెలిసికొన్నాను.

రోగ పదార్థము బహిష్కరింపబడు నపుడు స్వాస్థ్యసంకటములలో యీ అయోడిన్ వాసన వచ్చినట్లు తెలుస్తుంది. జలుబు చేసినపుడు, చీమిడిద్వారా బయటకు వెడలుతుంది. తలనొప్పివస్తుంది, పళ్ళ చిగుళ్ళువాస్తాయి. నాలుక గరుకుగా

ఉంటుంది. గజ్జి, తీట, చీడ చుండు మొదలగు చర్మవ్యాధులు వస్తాయి. విషముచేరినచోటునుబట్టి రక్తస్రావము కలుగుతుంది.

మందు వైద్యులు వాడు విధము:-పుండ్లకు పురుగులు పుట్టకుండా రాస్తారు.

రెండు రకములగు గండమాలరోగములకును, వరిబీజములకును పరివేశపెట్టుతారు. వీటికి పెట్టినదిపేరు. చాలా కాలమునుండీ ఉండు సంధుల నొప్పులు పోవుటకును, పుప్పుసములోను, ఊపిరి తిత్తులలోను ఉండు మంటలు పోవుటకు వాడుతారు.

దేహములో పేరుకొని పోయిన పాదరసము, సీసమును బయటకు పంపుటకు ఈలోహావు మందులను వాడుతారు.

శ్వాస నాళికలకు సంబంధించిన జలుబుకును, న్యూమోనియా జ్వరముకును వాడుదురు,

క్షీర స్రోతస్సులను యింకింపజేయును.

పితీృయమైన సవాయిని నాశనము చేయుటకు ఉపయోగింతురు.

## ఆగంతుక విషీకరణము

అయోడిన్‌తో పనిచేయువారికిని,

గండమాల రోగములలోను,

## అగదచిహ్నములు

రక్తముతో త్వరగా కలిసిపోవును. ఎర్రకణములను విశ్లేషము నొందించును. అన్ని నరములలోను, ఘటికలలోను చేరును. ఒపి పా్క్ర్యావయవములలో త్వరగా చేరును.

## విషచిహ్నములు

చిగుళ్ళు వాయును. దగ్గుడుండును. కళ్ళెపడును.

చర్మమిూద సన్నని పొక్కులు పుట్టును.

జీర్ణాశయములో నొప్పి పుట్టును. జలుబుగానుండును. అతిసారము పుట్టును.

పురుషులలోని వృషణములు, స్త్రీలలోని గర్భాండములు, క్షీరపోషితస్సులు యెండిపోవును.

పాండువ, నీరసము, విసుగుదల కలుగును.

తరుచుగా జలుబుచేయును. తల నొప్పిగా నుండును. చిగుళ్ళు యెర్రబడి వాయును. నోటిలో ఆ మందు వాసన ఉండును. శ్లేష్మము హెచ్చుగా పడును. అయోడిన్ చేరిన అవయవములబట్టి రోగములు కలుగును.

---

# అధ్యాయము 15

## సీసము

సీసము కనీనిక చుట్టూ నుండు ఒకటి, రెండు ఆవరణలలో తెల్లగాగాని, బూడిదరంగుగాగాని కనుపడును. చిత్రకారుల కనీనికలలోను, ముద్రాక్షరశాలలలో పనిచేయువారి కనీనికలలోను బూడిదరంగు కనుపడును. సీసము పెద్ద ప్రేగుల లోను నిలవచేరవచ్చును. జీర్ణాశయములో సీసము హెచ్చుగా చేరును. గాన కనుపాపచుట్టూనుండు మొదటి ఆవరణలోనే యీ రంగు కానవచ్చును. జీర్ణాశయమునకును, సీసమునకును అనురాగమున్నదని చెప్పవచ్చును. వెన్నుపూసలోని, పై భాగములోని నాడులలో చేరును. పాదరసమునకును సీసమునకును తేడాగలదు. పాదరసము వెన్నుపూసలలో క్రింది భాగములో చేరును. పాదరసము అచ్చట చేరగనే కాళ్ళూ, చేతులూ చచ్చుపడిపోవును. సీసమన్ననో వెన్నుపూసలలో పై భాగములో చేరును. సీసము చేరినట్లు మరికొన్ని నిదర్శనములవలనను చెప్పవచ్చును. కనీనికలోని 30 వ ప్రతినిధి భాగములో నీలపుగీత కనుపడును. చికిత్సాలయమును పెట్టి పదునెనిమిది సంవత్సరములు నడపినాము. ఈ పదునెనిమిది సంవత్సరముల అనుభవములోను చాలా కేసులలో సీసము అంతరవయవములలో చేరినట్లు చూచి చెప్పినాము. ప్రమాదముగా మ్రింగిన మందులలోని సీసమైనను చేరవచ్చును.

లేదా నిత్యమూ సేవించిన మందులలోని సీసమైనను కావచ్చును. ఎట్లాగైతేనేమి అంతరవయవములలో చేరుతుంది.

చాలాసంవత్సరముల క్రితము మాఆసుపత్రికి పరీక్షార్థమై ఒకామె వచ్చింది. ఆమె చాలా సంవత్సరముల నుండీ జీర్ణాశయములో లేచిన పుండ్లతో బాధపడుతున్నది. కసీనికను చూడగనే కనుపాప చుట్టూనుండు మొదటి ఆవరణలోనే మచ్చలు కనుపడినవి. సీసము అచ్చట యెట్లా జేరినదీ. చెప్పలేకపోతిని. విచారించగా ఈమె చాలా సంవత్సరాలపాటు కర్మాగారములో పనిచేసితినని చెప్పినది. అచ్చట ఈమె చేసిన పనేమంటే-యినుపరేకులమీద నుండు పాతరంగును గోకివేయుట. ఈ రంగులను గోకివేయుటలో రంగులోని సీసము (గాలిని లోనికిపీల్చినపుడు) గాలితోకలిసి లోనికి పోయినది. లోపలకుపోయి అంతరవయవములలో చేరినది. తరువాత మాచికిత్సాలయములో నుండి చికిత్సను పొందినది. ప్రకృతి సూత్రములకు అనుగుణముగా జీవించినది. రోగము నయమైనది. సుఖముగా యింటికిపోయినది.

చాలాకాలమునుండీ అజీర్ణముతో బాధపడువారి కసీనికలలోని మొదటి ఆవరణలోను, నాడీవ్యాధులతో బాధపడువారి కసీనికలలోని మొదటి ఆవరణలోను, సంధివాతముతో బాధపడువారి కసీనికలలోని మొదటి ఆవరణలోను, యీసీసము బూడిదరంగుతో కనబడును. మా ఆసుపత్రికి చాలాకాలము క్రితము ఒకపెద్దమనిషి వచ్చాడు. వీరి కసీనికలోని మొదటి ఆవరణలో బూడిదరంగు కనుబడినది. తీరా విచారించగా ఒక సంగతి తేలినది. ఈయనచాలా సంవత్సరాలపాటు సీసపుగను

లలో పనిచేశాడు. సీసము యెక్కువగా దొరకు కొండలలోని సెలయేళ్లలోని నీటిని త్రాగుటవలన ఈయనకు చాలా పెద్ద జబ్బు చేసినదట-ఆసుపత్రికి తీసుకొనివెళ్ళగా డాక్టరులు ఈ క్రిందివిధముగా రోగమును నిర్ధారణచేసిరి-మందును హెచ్చుగా తినుటవలన యీ రోగమువచ్చినది. ఇట్లువచ్చిన తరుణరోగ మును మందులతో అణచిపెట్టినారు. అప్పటినుండి చాలాకాల మువరకు అగ్నిమాంద్యముతోను, నాడీవ్యాధులతోను, సంధి వాతముతోను, బాధపడినాడు. కనీనికను చూచి రోగము యొక్క పుట్టు పూర్వోత్తరములను తూ, చా, తప్పకుండా చెప్ప వచ్చును. ప్రకృతివైద్యము చేయుటతో రోగములన్నియు రూపుమాసిపోయినాయి. సుఖముగా యింటికి పోయినాడు.

సీసము, పాదరసములవలన శాశ్వతమైన మలబద్ధకము యేర్పడుతుంది. ఇట్లు యేర్పడిన మలబద్ధకముతో బాధపడువారి కనీనికలలోని (చిన్నపేగులను తెలుపు) రెండవ ఆవరణ నల్లగా కనుబడును. రంగుల పటములోని 5, 6, బొమ్మలను చూచిన ఈ సంగతి బోధపడగలదు. నల్లబడిన ఆవరణలలోని నలుపుపోయి కనీనికయొక్క అసలు రంగువచ్చుటకు ఆరునెలలు పట్టినది. చచ్చుపడిన అవయవములలో చైతన్యముకలిగినది.

ఆయుర్వేద యునానీ వైద్యములు యీ క్రింది విధముగా వాడుత వని ఇండియన్ మెటీరియా మెడికా చెప్పుచున్నది.

సీసమును ప్రాణవాయువుతోను, మిగిలినవాటితోను కలుపుతారు. ఇట్లాతయారైన మందులు మూత్రవ్యాధులకును, అతిసారము, ఋతువ్యాధులకును, సుఖరోగములకును, వాడు

తారు. నల్లమందుతో కలిపి న్యూమోనియా వ్యాధికి వాడు తారు. చర్మమునకు పూయుటయు గలదు. ఈ మందులను ఇంజెక్టు చేసినందువలన అంతర్వ్రణములు నయమైనట్లు చెప్పు వారును గలరు.

వస్తుగుణదీపిక యం దిట్లున్నది.

సీసము కంతులను హరించును. రేతస్సును గట్టిపర చును. క్రిమిరోగమును, వాతమును పోగొట్టును. దాహము నణచును. బుద్ధివికాసత నిచ్చును పైత్యజ్వరమును, పక్షవాత మును పోగొట్టును.

మందువైద్యులు వాడువిధములు:— మంటలు కలిగిన ప్రదేశములమీద రాయుదురు. చెవినుండివచ్చు చీము పోవుట కును, ఋతు సంబంధమైన రోగములకును వాడుతారు.

గర్భస్రావము కలుగుటకు వాడుతారు.

ఆగంతుక విషీకరణము:— అచ్చు ఆఫీసులలో పని చేయువారిలోను, క్లైవు ఆఫీసులలో పనిచేయు వారిలోను,

సీసపుగొట్టముల నుండివచ్చు నీరు త్రాగువారిలోను,

చాక్లేటు, పంచదార బిళ్ళలు మొదలగు తిను బండారములు మురిగిపోకుండా యెక్కువ కాలము నిలవ ఉండుటకు రంగులు వేస్తారు. ఆరంగులలో ఈ సీసమును వాడుతారు.

జాడీలకువేసే రంగులలో సీసము ఉంటుంది.

వెంట్రుకల వృద్ధికి వాడు మందులలోను, తలనూనెల లోను, అద్దముల పనిచేయువారిలోను.

విషచిహ్నములు:— చర్మము ద్వారా ప్రవేశించి బహిష్కార్యావయవములలోను జీర్ణమండలములోను పేరుకొనును.

రక్తకణముల తగ్గించి వేయును.

అన్ని నరములలోను చేరి బయటకుపోదు.

లోహలక్షణములు:—చిగుళ్ళ ప్రక్కన నీలపు గీతలు కనుబడును.

జీర్ణక్రియ బాగా జరుగదు.

పాండువ ప్రధానముగా కలిగును.

మలబద్ధకము యెక్కువగును.

కండరములలో బాధ ఉండును. సంధివాతము మాత్రము కాదు.

## స్వాస్థ్య సంకటములలో కలుగు చిహ్నములు

జీర్ణాశయవ్యాధులు, రక్తాభిష్యందము, చర్మవ్యాధులు, పుండ్లు, నోటిలో పుండ్లుపుట్టును. పళ్ళ చిగుళ్ళవెంట చీము, నెత్తురు కనుబడును. పాదరసము సేవించినపుడు కలుగు బాధలును నాడీవ్యాధులును.

# అ ధ్యా య ము 16

## పా షా ణ ము

పాషాణముతో తయారుచేసిన మందులను తినుటవలన కలిగిన రోగములగూర్చి వెనుకటి అధ్యాయములలో చదివినాము. పాషాణముతో తయారుకాబడిన మందుల తిన్నందువలన కలిగిన జబ్బులతో బాధపడిన మరొకరి చరిత్రను చెప్పుట అప్రస్తుతము కాదనుకొంటాను.

చాలాకాలముక్రితము మా ఆసుపత్రికి ఒక కర్షకుడు వచ్చాడు. ఈ వ్యక్తి చాలాసంవత్సరములనుండి ప్లీహామునకు సంబంధించిన జబ్బులతో బాధపడుచున్నాడు. అప్పుడప్పుడు సుద్దకట్టుకూడా వడుచుండెడిది. కనీనికలో మాత్రము పాషాణపురంగు బాగాఉన్నది. ఈ పాషాణపురంగు యెట్లు కలిగినదీ తెలుసుకొనలేకపోయినాము. కొన్నివారములపాటు విచారించగా ఆరంగు Paris-green నుండి వచ్చునని ఊహించాను. Paris-green యెప్పుడైనా ఉపయోగించితివా అని అడుగగా తనకథ నిట్లు చెప్పాడు.

"నేను కర్షకుడను. బంగాళాదుంపలను తయారు చేయుచుండువాడను. ఈదుంపలు ఊరగలందులకు పాదులలో మందు నీళ్ళను పోయుచుండువాడను. మంచినీటిలో Paris-greenకలిపి, ఆమందునీళ్ళను పోయుచుండువాడను. ఆమందునీటినుండి వచ్చినపొగ తరచుగా నాముఖమునకు తగిలెడిది. ఆగాలినే పీల్చేవాడను. ఈపని నిత్యము జరుగుచుండెడిది".

మానవదేహమునకు పాదరసముచేసినంత అపకారము మరేలోహము చేయదు. దానితరువాత తుల్యమైన అపకారము చేయు లోహము పాషాణము. ఈపాషాణపుగాలినే యెక్కువగా పీల్చుటచేత అపకారము యెక్కువై పోతుంది. అపకారము జరిగి చాలాకాలమగుటచేత అంతరవయవములన్నియు తూట్లు పడినవి. రోగముమాత్రము నయముకాలేదు.

గోడలకు అంటించు కాగితమును తయారుచేయుటలో Paris-green ను యెక్కువగా వాడేవారు. ఈ Paris-green వలననే రోగాలు వస్తున్నాయని తెలుసుకొన్నారు. అందువలన గోడలకు అంటించు కాగితమును తయారు చేయుటలో Paris-greenను కలుపకూడదని ప్రభుత్వము వారు శాసించారు.

పాషాణముతో చాలామందులను తయారుచేస్తారు. Fowler solutionలోను, '606'లోను పాషాణభాగము చాలా ఉండును. గోడలకు అంటించు కాగితముల తయారుచేయుటకే పాషాణముపనికిరాదని ప్రభుత్వము వారు శాసించి పాషాణముతో తయారు చేసిన మందులను నిరాటంకముగా వాడమనుట ఆశ్చర్యకర ముగనున్నది.

చియ్యబట్టిన (చిక్కిపోయిన) గుర్రములు బలవగలందులకును, ముసలిగుర్రముల పడచువాటివలెనాదిరిగా తోపింప చేయుటకును పాషాణముతో తయారుకాబడిన మందులనిస్తారు. ఎటువంటి ముసలితో క్కైనా యీమందులు తినుటతో చాలా చిన్నపిల్లలుగా కనుబడుతాయి. పడుచుగుర్రములుగదాఅని భ్రమపడి కొనుక్కొనిపోయినవారు యింటికి పోగానే గాబరా

పడుదురు. ఇటువంటి గుర్రములను కొన్నప్పుడు ఉన్న లాఘవము, గాలప్, ఒక నెలరోజులలోనే రూపుమాసిపోతుంది.

పాండువ మొదలగు దీర్ఘరోగములతో బాధపడువారికిని పాషాణపు మందుల నిస్తారు. దీర్ఘరోగులు మొదటలో చాలా చలాకీగాఉంటారు. ఒకటి, రెండు నెలలు గడచునప్పటికి వెనుకటికన్నా మరీ అధోగతికి పోతారు. మందు మానెయ్యగానే వెనుకటి లక్షణములన్నీ ద్విగుణీకృతముగా కనుబడుతాయి. ఈలక్షణములు పోగలందులకు మరింత పెద్దమోతాదుల వాడుతారు. కొంతకాలము జరుగునప్పటికి రోగలక్షణములన్నీ ప్రత్యక్షమగుతాయి. పెద్దపెద్ద మోతాదుల వాడుతారు. కానీ ఉపయోగముండదు. చివరకు మందు వదలలేని స్థితికి వస్తారు.

పాషాణము నుండి తయారుచేయబడు మందులలో Salvarsan ముఖ్యమైనది. సవాయితో బాధపడువారికి యీ Salvarsan "దీన్నే 606 ని అంటారు" వాడుతారు. ఈమందు బయటకు వచ్చినపుడు సుఖరోగములన్నీ అప్పటితో రూపుమాసిపోవునని మందువైద్యులేమేమో అన్నారు. నాలుగు సంవత్సరములు గడచునప్పటికి '606' వలన ఉపయోగములు లేవనియు అపకారమే యెక్కువగా కలుగుచున్నదనియు ఆమందువైద్యులే చెప్పినారు. సవాయిరోగములకు '606' తిని ఆరోగ్యము బొత్తిగా చెడిపోయినవారు చాలామంది మా ఆసుపత్రికి వచ్చారు. ఒకళ్లిద్దరకు కళ్లు పోయినాయి. అంతకుపూర్వము వరకు వీరికేమియు దృష్టిదోషము లేదు. '606' యింజక్షనుల నాల్గింటిని తీసికొన్నారో లేదో కంటిచూపు పోయింది. అసలు

ఒక యింజక్షను తీసికొనేటప్పటికే దృష్టిదోషము కొద్దిగా యేర్పడ్డది. నాలుగూ తీసికొనేటప్పటికి కంటిచూపు పూర్తిగా పోయింది. '606' వలన దృష్టిదోషము కలుగుచున్నదని ప్రభుత్వము వారు గుర్తించేటప్పటికే చాలా మంది కళ్ళు పోయినాయి.

ఇద్దరు మాత్రము ప్రకృతివైద్య సహాయముతో కంటిచూపును బాగుచేసుకొన్నారు.

బొహీమియాలోని క్షురశాలలో పనిచేయు మంగలి వానికి ఒకనికి Salvarsan యింజక్షనుల నిచ్చారు. దానితో కంటిచూపుపోయింది. ఈయన మాఆసుపత్రికి వచ్చినాడు. రోగమునుగూర్చి చెప్పినాము. ప్రకృతివైద్య సిద్ధాంతము లలో నమ్మకము లేక యింటికి వెళ్లిపోయినాడు. ఏమందులు తిన్నప్పటికీ యీ వ్యక్తికి కంటిచూపు మాత్రము రాలేదు.

మరొకరి కథను చెప్పుతాను. ఈ పెద్దమనిషికి సవాయి రోగము తగిలినది. ఈరోగము తగ్గించుటకు '606' యిచ్చి నారు. కొద్ది రోజులకే పిచ్చి పుట్టినది. మందువైద్యులు యీ పిచ్చి నయముకాదని సెలవిచ్చినారు. చిన్నప్పటి సవాయిరోగమువలన యిప్పుడు పిచ్చి పుట్టినదన్నారు. అతని స్నేహితులు నాసలహాతీసికొని మా ఆసుపత్రికి చేర్చారు. చికిత్సను ప్రారంభించినాము. లోగడ అతను తినిన '606' (మందు పేరు) త్వరగా బయటకు వెళ్లిపోయినది. మూడు నెలలు జరుగునప్పటికే రోగము పూర్తిగా నయమై సుఖముగా యింటికిపోయినాడు.

ఈసవాయి రోగములకు చాలామందికి "606"ను వాడినారు. ఈ మందుతో కుదరక చాలమంది మా ఆసుపత్రికి వచ్చిరి. ఆరు నెలలు గడచునప్పటికే రోగములు నయమై యింటికి పోయినారు. ఇటువంటివి అనేక కథలుగలవు. గ్రంథ విస్తరభీతిచే ఆకథలను యేకరువు పెట్టలేదు.

'606'ను ఉపయోగించినందువలన నయమైన సవాయి రోగముల మెరుగను. డా॥ ఎర్లిక్‌గారి పేరునుబట్టి యీ మందుకు యింత ఖ్యాతి వచ్చినది.

## అయుర్వేద యునానీ వైద్యములయందు యీ క్రింద విధముగా వాడుతారని ఇండియన్ మెటీరియా మెడికా, చెప్పుచున్నది

చాలా రోగములకు వాడుతారు. రోగ నిరోధక సామర్థ్యమును వృద్ధి చేయుటకును యీ మందుల వాడుతారు. చలి జ్వరమునకు యీమందుల వాడుట కలదు. అగ్నిమాంద్యమును పోగొట్టునని చెప్పువారును గలరు. ఈ మందులను భోజనమునకు పూర్వము సేవించినయెడల జీర్ణాశయ వ్యాధులు కలుగును గాన భోజనమునకు అనంతరమే సేవించమని చెప్పుచున్నారు. శోష రసవాహికలలోని జబ్బులను చాలా బాగా కుదుర్చును. శ్వేత కుసుమమును, అతిమూత్రమును అమోఘముగా కుదుర్చును. చర్మముమీద రాయుటకును ఉపయోగిస్తారు. అన్ని రకములగు చర్మ వ్యాధులకును రాస్తారు. బొల్లిని చాలా బాగా కుదుర్చును. క్షయ, ఉబ్బసములకేగాక చర్మ సౌందర్యమును కోరువారందరును యీ మందులను నిరాటంకముగా

వాడుతారు. మూర్ఛ, పిచ్చి, ఉన్మాదము, దైహిక వాతము మొదలగు నాడీవ్యాధులకేగాక సుఖరోగములకు పెట్టినది పేరు.

వస్తుగుణ దీపికయందిట్లున్నది

"ఆహిక జ్వరము, చలి జ్వరము, విడువని జ్వరము, శీత పైత్య సన్నిపాత జ్వరములు, ఏనుగుకాలిరోగములు, రుద్రి వాతము, గవదబిళ్ళలు, దారుణమగు వాతరోగము, కుష్టురోగము, మూర్ఛ, అంతర్వ్రణములు, బహిర్వ్రణములు, ఉదర రోగము, మేహ వాతనొప్పులు, వెర్రికుక్క విషాన్ని, పురాణ వాతనొప్పులు, కంతులు మొదలగు అనేక రోగములను జయించును. బలము చేసును. పుంస్త్వమును, వీర్య వృద్ధిని యిచ్చును. మత్తును చేసును. వట్టి పాషాణము విశేషవాడుకతో చేయతగినది. వట్టి పాషాణము యెక్కువతినిన చంపును.

పాషాణ మిశ్రమైన కొన్ని ఔషధముల సేవించిన కొన్ని తత్వములవారికి దేహము ఉబ్బడము మొదలగు దుర్గుణములు పుట్టును. క్షయదగ్గుమీద పాషాణము లోనికి యివ్వజనదు. పైనవేసినపొక్కును, వ్రణములను తినివేయును. అనగా పెద్దపుండును చేయును" 439, 440 పేజి.

## మందు వైద్యులు వాడు విధములు

అయోడిన్‌తో కలిపి చర్మముమీద పూతలకు వాడుతారు. ఇంకిన తరువాతనే అపకారమును చేయును.

గంధకముతో కలిపి కాలికమైన చర్మవ్యాధులకు రాస్తారు.

606, 914 లోనుగలదు. ఈ రెండును సుఖరోగములకు వాడుమందులు. ఉబ్బసవ్యాధికి చాలాయెక్కువగా వాడుతారు.

ఇనుముతో కలిపి శ్వేతకుసుమ మొదలగు ఋతువ్యాధులకును, పాండువకును, క్షయ, చలిజ్వరములకును, కంఠమాల సంధివాతముల పర్యవసానముగా వచ్చే పాండురోగముకును వాడుతారు.

## ఆగంతుక విషీకరణము

మురగకుండాను, పురుగు పుట్టకుండాను వాడు రంగులను తయారుచేయువారికిని,

బట్టలకు వేయు రంగులను తయారుచేయువారిలోను,

వ్రిచురణకు ఉపయోగపడు రంగుకాగితముల తయారుచేయువారిలోను, తోళ్ళను పదునుచేయువారిలోను, తోళ్ళను ఉపయోగించువారిలోను,

అంతర్వ్రణముల నయముచేయుటకును,

చెట్లకు పురుగు పుట్టకుండాను, దుంపలను ఊరుటకు పాషాణముతో తయారుచేసిన మందునీటిని పోస్తారు. ఇట్లు చేయునపుడును,

## విషచిహ్నములు

చాలా త్వరగా రక్తముతో కలిసిపోతుంది.

నాడీమండలము ప్రధానముగా గల అవయవములలో చేరుతుంది.

చర్మముమీదనుండు వెండ్రుకలును, వేళ్ళ చివరనుండు గోళ్ళును త్వరగా ఊడిపోవును.

పాషాణమునకు సంబంధించిన యేనుగు గజ్జి కలుగును.

కనురెప్పలు వాయును.

శ్లేష్మము తరుచుగా వెడలిపోవును.
వెన్నుమీద చలిచలిగా నుండును.
కాళ్లు, చేతులూ చల్లగానుండును.
నాడీ సంబంధమైన వ్యాధులు కలుగును.
కండరములు చచ్చుపడిపోవును.
శోషరసవాహికలు, లివరు, స్ప్లీనులు ఉబుకును.

## స్వాస్థ్యసంకటములలో కనుపడు చిహ్నములు

మూత్రపిండవ్యాధులుగాను, మలకోశము ద్వారాను, మధుకోశములోను మంటలు కలుగును.

ఏనుగుగజ్జి, చుండు, బొబ్బలు లేచును.

## 1917 సంవత్సరము నవంబరు 21-వ తేదీగల "చికాగో డైలీ ట్రిబ్యూన్" దినపత్రికలో యీప్రచురణగలదు

క్రొత్తమందుల కనుగొంటే, వైద్యుల సతోషమునకు అంతు ఉండదు.

"పెనిన్‌సిల్‌వేనియా విశ్వవిద్యాలయములలో సైన్సు పరిషత్తు సభలు జరిగినాయి. అప్పటివరకు కనుగొనబడిన క్రొత్తమందులను యీ పరిషత్తువారు ఆమోదించారు. ఈక్రొత్తమందుపేరు A-189 అలోపతి మందువైద్యము వారు అప్పటివరకును సుఖరోగములకు Salvarsan ను వాడు చున్నారు. ఈ Salvarsan నుకు 606 అనికూడా పేరుగలదు. ఈక్రొత్తమందునుగూర్చి రాక్‌ఫెల్లర్ పరిషత్తువారు చాలాపరిశోధనల జరిపినారు. ఈపరిశోధనల ఫలితముగా వారేమని నిశ్చయపరచుకొన్నారంటే - సుఖరోగములకు యీ మందు

బాగా పనిచేస్తుంది. ఈ మందును తయారు చేయుటకు అవసరమగు దినుసులన్నియు చాలా చవకగానే దొరకును. కాన మందు ఖరీదుకూడ యెక్కువకాదు.

సుఖరోగములు రాకుండా యీమందు కాపాడుతుంది. ఇంతవరకు కనుగొన్నమందులు చేయునంత అపకారము యీమందు చేయదు".

ఈ ప్రచురణ బాగానే ఉన్నది. ప్రచురణలోని చివర పేరాలోని అభిప్రాయమేమంటే - ఇంతవరకు కనుగొన్న మందులు రోగములను అణచివేసి రోగులకు ఉపకారము చేసినాయి. ఈ ఉపకారముతో బాటు అపకారముకూడ చేసినాయి. ఈ క్రొత్త మందు మాత్రము ఉపకారమునే చేస్తుందిగాని యిదివరకు మందులంత అపకారమును మాత్రము చేయదు. ప్రతిక్రొత్తమందునుగూర్చి యిట్లనే వ్రాయుదురు. ఈప్రచురణలలో సత్యమున్నదని మాత్రము మా చదువరు లెవ్వరును భ్రమపడరాదు.

## కనీనికలోని గుర్తులు

పాషాణముతో తయారుచేసిన మందులను తినినయెడల కనీనికలో తెల్లటి మేఘములు కనుబడును. ఈమేఘములు కనీనిక వెలుపటి సగములోనే ఉండును మంచుముద్దల మాదిరిగా తెల్లగానుండును. కోడిగుడ్డు పెంకుల మాదిరిగాకూడా ఉండవచ్చును.

పాషాణమును పరిశ్రమలలోకూడా ఉపయోగించుచున్నారు. యీపరిశ్రమలలో పనిచేయువారు పాషాణము నుండి వచ్చినగాలిని పీల్చుదురు. అందువలనను వారి అంత

రవయవములలో యీ పాషాణము చేరవచ్చును. కనీనికలో ఆగుర్తులు కనుపడును.

---

## అధ్యాయము 17



## బ్రోమిన్

### కలరుప్లేటు 1,5 బొమ్మలు

Bromides అనగా బ్రోమిన్‌తో తయారుచేసిన మందులు. అలోపతి వైద్యము అంతటిలోను రెండురకములగు మందులు గలవు. (1) ఉద్రేకమును కలిగించు మందులు (2) ఉద్రేకమును తగ్గించు మందులు. మానవులకు సహజముగా ఉండవలసిన ఉద్రేకముకన్న యెక్కువ ఉద్రేకమున్న యెడల ఆ ఉద్రేకమును తగ్గించుటకుగాను రెండవ రకమగు మందులు వాడుతారు. మానవులకు సహజముగా ఉండవలసిన ఉద్రేకముకన్న తక్కువ ఉద్రేకమున్న యెడల ఉద్రేకమును కలిగించుటకు మొదటి రకమైన మందుల వాడుతారు.

ఉద్రేకమును తగ్గించుటకు బ్రోమిన్‌తో తయారు చేసిన మందుల వాడుతారు. ఉద్రేకమును కలిగించుటకు స్ట్రిచినిన్‌తో తయారు చేసిన మందులవాడుతారు.

బ్రోమిన్‌ను పొటాషియముతోను, అమ్మోనియము తోను, సోడియముతోను కలుపుదురు. ఈ మందులు ఉద్రేక మును తగ్గించుటకు ఉపయోగపడును. ఈ మందుల వాడి నందువలన నాడీ మండలము స్తంభించిపోవును. హృదయ స్పందనములు తగ్గును. జననేంద్రియములలోని ఉద్రేకము తగ్గును. నపుంసకత్వము కూడా వచ్చుట కలదు.

ఈ మందుల సేవించినపుడు కనీనికలో అర్ధచంద్రా కారములు కనుపడును. ఈ అర్ధచంద్రాకారములు తెలుపుగా నుండ వచ్చును. తెలుపు పసుపురంగు కలిసియు ఉండ వచ్చును. ఈ ఆకారములు మెదడును తెలుపు ప్రతినిధి భాగ ములోనే ప్రధానముగా ఉండును. స్వతంత్ర నాడీమండల మును తెలుపు మూడవ ఆవరణలో కూడా యీ ఆకార ములు ఉండవచ్చును. బ్రోమిన్‌తో మెదడునకు అనురాగము గలదు. బ్రోమిన్‌తో స్వతంత్ర నాడీ మండలమునకును అను రాగము గలదు. ఈ ఆకారముల రంగు యొక్క చిక్కదన మును బట్టి యీ మందును యెంతకాలము నుండి సేవించు చున్నదీ చెప్పగలము.

ఈ మందుల వాడినందు వలన ముఖము మీదగాని, మెడమీదగాని కురుపులు, గడ్డలు లేవవచ్చును. చర్మము మీద పొడలు కలుగవచ్చును. ఆ పొడలు రాగి వర్ణముగా ఉంటవి. (Erythema) ఎరిథెమావస్తుంది. అజీర్ణవ్యాధులతో బాధ పడతారు. మానసికఉద్రేకములతో బాధపడతారు. మెదడులోని రక్త ప్రసరణము తగ్గిపోతుంది. నాడీదౌర్బల్యము కలుగు తుంది. మతి భ్రమణము, పిచ్చి పుట్టుతవి, కాళ్లు తేలిపోతవి.

తన వైద్య నిఘంటువులో జె. మిచెల్ బ్రూస్ కూడా ఇదే అన్నాడు. బ్రోమిన్ వాడినందువలన మెదడులోని ప్రధానమైన కేంద్రములలో దెబ్బ తగులుతుంది. ఉచ్ఛ్వాస-నిశ్వాసలు తగ్గిపోతవి. కోరింత దగ్గు వస్తుంది. హృదయ స్పందనములు తగ్గిపోతాయి. నాడీ మండలమునకు దెబ్బ తగులుతుంది. స్ట్రిచినిన్ వాడినప్పటికిని ఉద్రేకమురాదు.

బ్రోమిన్‌తో తయారు చేయబడిన మందుల వాడి నందున ఉద్రేకము తగ్గును. మగత వస్తుంది. నిద్ర పట్టుతుంది. పిచ్చి, మూర్ఛ, ఉన్మాదము మొదలగు వ్యాధులందు ప్రలాపము ఉండుట గలదు. ఈ ప్రలాపమును తగ్గించి మగత తెప్పించగలందులకై బ్రోమిన్ మందులను యిస్తారు. మూర్ఛలను తగ్గించుటకై బ్రోమిన్ యింజక్షనులను తరచుగా యిస్తూ ఉంటారు. ప్రలాపములను తగ్గించుటకు మందువైద్యములో మరొక ప్రక్రియ లేదు. ఎన్ని తడవలు యిచ్చినప్పటికిని యీ బ్రోమిన్ మందులనే మోతాదు తేడాలతో యిస్తూ ఉంటారు. ఈ మందుల వాడినందువలన ప్రలాపములు తాత్కాలికముగా తగ్గునేగాని రోగ నిర్మూలనము మాత్రము గాదు. ఈ సంగతి వైద్యవరులందరకును తెలుసును. వైద్య శాలలలోని అధ్యాపకులును విద్యార్థులును యీ విషయమును చెప్పకుందురు. రోగులకు చెప్పు మాటలు మాత్రము వేరుగా నుండును.

మెదడులో చాలా కేంద్రములు గలవు. మాటకు అనుకూలపడు కేంద్రములు, వినుటకు అనుకూలపడు కేంద్రములు, చూచుటకు అనుకూలపడు కేంద్రములు. మాటకు

అనుకూలపడు కేంద్రమునకు దెబ్బ తగిలిన యెడల మాటలు సరిగారావు. అట్లనే మిగిలినవన్నియును. మాటకు అనుకూల పడు కేంద్రములలో ఉద్రేకము కలుగుతుంది గనుక ప్రలాపములు వచ్చును. బ్రోమిన్ మందుల వాడినందున ప్రలాపములు తాత్కాలికముగా తగ్గును. ఈ మందులు ఆయా కేంద్రములలోని ఉద్రేకమును తగ్గింప చేయును. ఆయా కేంద్రములోనే యీ మందులు పనిచేయక మెదడులోని మిగిలిన భాగము నంతను కూడా చచ్చుపడ గొట్టును. అందు వలననే మానసికస్తబ్ధత, మతిమరుపు, పిచ్చి పుట్టును.

దేహముమీాద ప్రయోగించిన ప్రతి చికిత్సా ప్రక్రియ వలనను (1) క్రియాఫలితము (2) ప్రతిక్రియా ఫలితము అను రెండు ఫలితములు కలుగును- క్రియాఫలితమునకు ప్రతి క్రియాఫలితము వ్యతిరేకముగా నుండును. క్రియాఫలితముగా ఉద్రేకము కలిగితే ప్రతిక్రియా ఫలితముగా నీరసము కలుగు తుంది. క్రియాఫలితముగా నీరసము కలిగితే ప్రతిక్రియా ఫలితముగా ఉద్రేకము కలుగుతుంది. క్రియాప్రతిక్రియల సూత్రము అన్నివైద్య శాస్త్రములలోనూ ఉన్నది.

బ్రోమిన్ వాడినందు వలన ప్రతిక్రియా ఫలితముగా మతిమరుపు, పిచ్చి వచ్చును. ఇవన్నీ బ్రోమిను వలనవచ్చినవే గాని రోగచర్యగా వచ్చినవి మాత్రము కాదు. మెదడులోని యే కేంద్రమునకు దెబ్బతగులుట వలన పిచ్చిపుట్టునదీ అలోపతీ వైద్యమువారు కనుగొనలేదు. స్వీడను దేశపు మత ప్రచారకుడగు లైజలిక్వెష్టు యీ (యే కేంద్రమునకు దెబ్బతగులుట వలన మూర్ఛలు కలుగునను) విషయమును కనుగొనెను.

ఈ నిదాన శాస్త్రమును వ్యాప్తము చేయుటకే తన జీవితము నంతను వినియోగించెను. ఈ శాస్త్రమును గూర్చి అమూల్యమైన గ్రంథమును కూడా వ్రాసెను.

ఒక యంత్రశాలలో అనేకమంది పనిచేయుచుండిరి. ప్రమాద వశముచేత ఒక యంత్రము విరిగిపోయి చెల్లాచెదరయ్యెను. అందులోని ఒకముక్క ఒకమనిషి యెడమ చెవివెనుక భాగమునకువచ్చి తగిలెను. పుర్రెమీద గట్టిదెబ్బ తగులుటచే ఆ యెముకలలో వత్తిడి తగిలెను. సన్నిహిత దోషముచేత ఆ ఒత్తిడి మెదడులో కూడా తగిలెను. అక్కడనే మాటకు సంబంధించిన కేంద్రముండుటచేత ఆ కేంద్రములో ఒత్తిడి తగిలి మూర్ఛలు మొదలు పెట్టెను. ఈ మనిషి పరీక్షార్థమై లైజలిక్వ్రోష్టు వద్దకు వచ్చెను. క్వ్రోష్టు అతని యెడమ కనీనికను పరీక్ష చేసెను. పరీక్షచేయగా ఎడమ కనీనికలోని మూడవ ప్రతినిధిభాగములోopen lesion కనుబడెను. మిగిలిన కేసులను పరీక్షచేయుగా మూడవ ప్రతినిధి భాగములోనే గుర్తులున్నట్లు తెలియువచ్చినది. వారుసేవించిన బ్రోమిన్ కూడా ఆకేంద్రములోనే చేరినట్లు కనీనికలో కనుబడేది.

ఒక రోజున ఒక పెద్దమనిషి పరీక్షార్థమై నావద్దకు వచ్చెను. కనీనికనుజూచిన తరువాత ఆయనకును నాకును ఈ క్రింది సంభాషణ జరిగినది.

నేను:—చాలారోజుల క్రితము తలమీద చెవికి వెనుకగా దెబ్బ తగిలినది.

**ఆయన:—అవును నాల్గుయేళ్లప్పుడు దెబ్బతగిలినది.**

నేను:—అప్పటనుండీ మీకు మూర్ఛలువచ్చుట ప్రారంభించినాయి.

ఆయన:—ఈ సంగతి తెలుసుకొనుటకే మీవద్దకువచ్చాను.

ఆ కేంద్రము చెవికి చాలా దగ్గరగానుండును. శరీర శాస్త్రముకూడా ఈ సంగతిని చెప్పుతుంది. మెదడులోని యుక్తాయుక్త నిర్ణయ కేంద్రమునకు చెవిలోని అంతరవయువములు తోడుపడతవి. ఆ కేంద్రములకును వాటికి సంబంధించిన కండరములకును దెబ్బతగులుటచేత మూర్ఛలువచ్చును.

ఈ నిదానశాస్త్రము మానవకోటికి చాలా సహాయకారి అయినది. ఇటువంటిరోగములు యెందుకువచ్చేదీ కనీనికను చూచి సులభముగానే చెప్పగలము. ఫలానా కేంద్రములో దెబ్బతగులుట వలన ఫలానా జబ్బువచ్చినదని చెప్పగలము. ఆపరేషను చేస్తేనేగాని కనుపడని సంగతులను కనీనికను చూచి ప్రత్యక్షముగానే చెప్పుచున్నాము. ఆపరేషను చేసిన తరువాతనే ఫలానా కేంద్రము చెడినదని మందువైద్యులు చెప్పెదరు. కొద్దికాలము క్రిందటివరకు మూర్ఛలకు ఆపరేషనులే చేయుచుండెడివారు. ఆపరేషనులు చేయుటకన్న మూర్ఛలకు మరొక మందు లేదని మందువైద్యమువారు ప్రచారము చేసినారు. ఆపరేషను చేసినందువలన మూర్ఛలు తాత్కాలికముగా తగ్గుట నిజమేగాని ప్రతిక్రియా సూత్రమునననుసరించి, ఆపరేషను వలన కలుగు తరువాత బాధలు 'after effects' భరింపరానివి.

పైనచెప్పిన పెద్దమనిషి మూర్ఛలును తొమ్మిది నెలలలోనే తగ్గిపోయినవి. శాస్త్రసమ్మతమైన వైద్య ప్రక్రియలు జరుపు

టచే రోగముమరల తలయెత్తకుండా రూపుమాసిపోయినది. ఆ పెద్దమనిషి సుఖముగా యింటికివెళ్లాడు.

ఈ నిదాన సహాయముతోనే అనేకరోగములకు మూల కారణముల కనుగొన్నాము. ఆహారములోని లోపముల సరి చేయుటవలనను అజీర్ణమును పోగొట్టుటవలన యీ రోగాలన్ని అంతరించినాయి.

అవసరమునకు మీరిన ఆహారమును తినుటచేత జీర్ణాశ యము పెద్దదగును. పెద్దదగుటవలన solar plexus(అనాహతచక్ర మునకు) ఒత్తిడి కలుగును. దీనికిని మెదడునకును సంబంధ ముండుటచేత మెదడులోని వెనుకచెప్పిన కేంద్రమునకు ఒత్తిడితగులును. ఉపవాస ముంచినయెడల జీర్ణాశయము లావె క్కదు. అనాహతచక్రమునకు ఒత్తిడి తగలదు. ఆ కేంద్రమునకును ఒత్తిడితగలదు. మూర్ఛలురావు.

సంధివాతముతో బాటు మూర్ఛలువచ్చునను ప్రతీ తియుగలదు. సంధివాతము పోయినవెంటనే మూర్ఛలు తగ్గు టయు గలదు. ఈ సంధివాతముకూడా అజీర్ణమువలననే వచ్చును. అజీర్ణము తగ్గగనే సంధివాతము తగ్గును. మూర్ఛ లును తగ్గును.

మాంసము, కోడిగుడ్లు, చేపలు మొదలగు పదార్థ ములు తినినందువలనను యివి కలుగును. మానసిక వ్యాధు లతో బాధపడువారికి అజీర్ణరోగము తప్పకుండా ఉండవలసి నదే. ఇటువంటివారికి ఆమ్లముల గలిగించు పప్పుపదార్థముల తగ్గించి పెట్టవలయును, కూరలను, పండ్లను యెక్కువగా పెట్ట వలెను. కూరలలోని పండ్లలోని క్షారసంపదవలన ఆమ్లములు

సమరసపడి లవణములుగా తయారై నీటితో కలిసి బయటకు పోవును. అమ్లములు తగ్గిపోవుటవలన రక్తము శుభ్రపడి దేహారోగ్యము చేకూరును.

పరీక్షార్థమై మా ఆసుపత్రికి ఒకామె తనకుమారుని వెంటబెట్టుకొని వచ్చినది. కుమారుని వయస్సు 22 సంవత్సరములు. కుమారుని కనీనిక చూచితిని. కనీనికరంగు లేత నీలముగా ఉన్నది. కనీనిక వెలుపటి ఆవరణ అంతయూ నల్లగానున్నది. కాన చర్మము చచ్చుపడిపోయినదని వెంటనే తెలియుచున్నది. కాళ్ళను, పాదములను, తెలుపు 18 వ ప్రతినిధి భాగములో "V" వంటి నల్లటిగుర్తులు కనుపడినాయి. ఈ ప్రతినిధి భాగములోనే నాడీవలయములును గలవు. వెలుపటి ఆవరణలోని పైసగములో అర్థచంద్రాకారములు పెక్కుగలవు. ఈఅర్థచంద్రాకారములరంగు బ్రోమిన్ రంగుగానేఉన్నది.

కనీనికచుట్టునుండీ ఒకటి రెండు ఆవరణలలో లేత పసుపురంగు ఉన్నది. రెండవ ఆవరణలో ఉన్న లేత పసుపు రంగును క్వయినా రంగని మనము భ్రమపడరాదు. గంధకము కూడా యిదేరంగుతో ఉండవచ్చును. ఈకేసులో 1, 2 ఆవరణలలో కనుపడిన లేతపసుపురంగుమాత్రము క్వయినారంగూ కాదు; గంధకము రంగూకాదు. ఈకేసులో విచిత్రమేమంటె- చిన్నపేగులద్వారా బహిష్కరణజరిగినది. నాకును ఆయనకును యీాక్రింది సంభాషణ జరిగినది.

నేను— నీకు రక్తప్రసరణము బాగాలేదు. కాళ్ళూ, చేతులూ చల్లగా ఉంటాయి. పాదములకు చెమట పోస్తుంది.

(కనీనిక వెలుపటి ఆవరణరంగు అంతా ఒకటిగా లేదు. తేడాఉన్నది. ఇట్లాఉంటే రక్తప్రసరణము బాగా లేదని కాళ్లూ చేతులూ చల్లగా ఉంటాయని యీ నిదాన సాంప్రదాయము)

ఆయన:-అవును.

నేను:- పాదములకు పోసే చెమట పోయకుండా మందులు రాచారు.

ఆయన :- నిజమే. నాకు ఎడమపాదమునకు బాగా చెమట పోసేది. Foot-Ball ఆడుతుండేవాడను. చెమట పోసిన పాదముతో ఆడుట కష్టముగా ఉండేది. చెమట పోగలందులకుగాను మందు రాచాను. దానితో తగ్గి పోయినది.

నేను :- తరువాత మానసిక స్తబ్ధతవచ్చినది. అప్పటినుండే మూర్ఛలు ప్రారంభించినాయి.

ఆయన :- నిజమేను.

నేను:- ఆ ఫిట్లు తగ్గగలందులకుగాను బ్రోమిన్ యింజక్షన్లు తీసికొన్నావు. దీనితో మరింత పాడైనది. మనసు నిలకడ లేకుండాపోయినది. మతి చాంచల్యము పుట్టినది. అప్పటినుండీ మూర్ఛలు యెక్కువగా వస్తున్నాయి.

తల్లి:- మరీ అధోగతికిపోయినది. పిచ్చి పుట్టినది. ఒకతడవ కారుకిందపడి చచ్చుటకు సిద్ధమైనాడు. ఎట్లనో బ్రతికాడు. మూడుయేండ్లనుండి యీ పుత్రుణ్ణి మెడకు కట్టుకొని తిరుగుచున్నాను. అన్ని బస్తీలు తిరిగివచ్చాను.

వైద్యశేఖరులవద్దకు తీసికొనివెళ్ళాను. మందు లిచ్చారు. ఏమీా ఉపయోగము లేకపోయినది. విసిగిపోయినాను.

నేను:- మందువైద్యములో యీా రోగమునకు బ్రోమిన్ యింజక్షనులు యిచ్చుటకన్న మరొకమార్గము లేదు. ఎంత మంది మందువైద్యుల వద్దకు వెళ్ళినా యిదే మందు యిస్తారు. ఆవైద్యములో యెంత కొమ్ములు తిరిగినవా రైనా సరే యీా మందునే వాడుతారు. ఈ మందు వాడితే యీా రోగము తగ్గును.

తల్లి:- ఇన్ని మందులు తిన్నా నయముకాలేదేమి? ఎందువలన యెక్కువగుతున్నది.

నేను:- మందువైద్యమువారు యీా రోగమునకు బ్రోమిన్ యింజక్షనుల నిస్తారు. బ్రోమిన్ యిచ్చినందువలన మెదడులోని విచక్షణకు ఉపయోగపడు కేంద్రము లేగాక (మెదడులోని అన్ని కేంద్రములూ) మెదడు మొత్తమంతా చచ్చుపడిపోవును. బ్రోమిన్ యింజక్షను యిచ్చినప్పుడు మూర్ఛలు తాత్కాలికముగా తగ్గినప్పటికిని క్రియా, ప్రతి క్రియల సూత్రమునను సరించి తిరిగి యెక్కువగును.

తల్లి:- అయితే ఈ రోగము నయముకాదు. జన్మావధి యిట్లనే బాధపడవలెనంటారా ?

నేను:- బ్రోమిన్‌తో నయము చేసుకోవాలంటే మాత్రము కుదరదు.

తల్లి:- ఏమి చేయాలంటారు ?

నేను:- ఇక్కడవుండి ప్రకృతివైద్యము చేయండి. కుదురుతుంది.

తల్లి:- సరేను. కుమారుని యిచ్చటనే ఉంచిపోదును.

తరువాత రోగితో మాటలాడితిని. రోగము యొక్క వృటకను గూర్చియు, రోగములనలన దేహములో జరుగు మార్పులు, రోగము వలన కలుగు మంచిచెడులను గూర్చి ప్రకృతి వైద్యము యొక్క అభిప్రాయమును ఆయనకు నచ్చ చెప్పితిని. మొదటి అయిదు, ఆరువారములలో గుణము క్రమముగా కనుపడుననియు, తరువాత పాతరోగములన్నీ బయిట పడునని అప్పుడు గాభరాపడి పరుగెత్తక పట్టుదలతో చికిత్స జరుపవలెననియు ముందుగనే చెప్పితిని. రోగియిష్టపడి చికిత్సా విధానమును మొదలు పెట్టెను.

చికిత్సా విధానము నాలుగు రోజులు గడచినదో లేదో రోగి తండ్రివద్ద నుండి రోగికి ఉత్తరము వచ్చినది. "నీవు అవలంబించు విధానమును మీ తల్లివలన తెలిసికొంటిని మన గృహవైద్యునకు యీ మాట చెప్పగనే చాలా ఆశ్చర్య పడినారు. తలా తోకా లేని పిచ్చివైద్యమని చెప్పినాడు. కాన యీ ఉత్తరము చూచిన వెంటనే ఆ వైద్యమును మానివేసి యింటికి రావలెను." ఈ ఉత్తరమునకు మన రోగి వ్రాసిన సమాధానమేమంటే, "ఇంతవరకును అన్ని విషయములలోను నీవు చెప్పినట్లుగనే నడచితిని. ఈ విషయములో మాత్రము నా అభిప్రాయము ప్రకారమే పోదలచినాను. మన గృహ వైద్యుడు అలోపతీ వైద్య శాస్త్రమొక్కటియే చదివినాడు. ఈ వైద్యుడన్ననో అలోపతీ వైద్యముతో బాటు ప్రకృతి వైద్య శాస్త్రమును ఆమూలాగ్రముగా చదివినాడు. ఈ శాస్త్రము మన గృహవైద్యునకు తెలియదు గాన ఆయన మాటలు ఒప్పుకో తగ్గవికావు."

చికిత్సను పట్టుదలతో చేసినాడు. ఆరువారములు జరుగునప్పటికే చాలా గుణమిచ్చినది. సంపూర్ణ ఆరోగ్యము కలుగుతుందను ధైర్యము మాత్రము రోగికి చాలా యెక్కువగా నున్నది. ఇట్లుండగా ఒక పర్యాయము కసీనికను చూచితిని. కసీనికలోని ఒకటి, రెండు ఆవరణాల మీద తెల్లటిపొర యేర్పడి ఉన్నది. దానిని చూచి కొద్దిగంటలలోనే అతిసారము పుటునని చెప్పితిని. ఇరువది నాలుగు గంటలు జరుగునప్పటికి నా మాటలు నిజమైనాయి. ఒకరోజుయుండి యీ విరోచనములు నయమైనాయి.

అప్పుడు హోమోపతీ మందును యిచ్చితిని. వెనుకటి (fits) ఫిట్లు యెక్కువైనాయి. వెనుకటి లక్షణములన్నీ మళ్ళీ ప్రత్యక్షమైనాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఎక్కువైనాయి. నిశ్వాసములు తీపివాసనగా ఉన్నాయి.

ఈ లక్షణాలన్నీ కనబడగానే గాభరాపడినాడు. నిరుత్సాహమును చెందినాడు. నేను యెప్పటికప్పుడు అతనికి నచ్చచెప్పుతూ ఉండేవాడను కాబట్టి విసుగుచెందక పట్టుదలతో చికిత్సా విధానమును నెరవేర్చేవాడు. మొదదులోని నల్లమచ్చలు మీద తెల్లగీతలెట్లు యేర్పడుచున్నదీ తాను ప్రత్యక్షముగా చూసేవాడు. ఈ స్వాస్థ్యసంకటములు, గడచిపోయిన తరువాత అ తెల్లగీతలు, నల్లమచ్చలు యెట్లు లోపించేదీ తాను ప్రత్యక్షముగా చూచుటచే నమ్మకము కలిగి చికిత్సను పట్టుదలతో చేసేవాడు. అయిదు నెలలు గడచునప్పటికి రోగము నయమైనది. సుఖముగా యింటికి వెళ్లాడు.

బ్రోమిన్ మందుల వాడినందున రూపమే మారుతుంది.

చాలామంది దేశముమీద లేచిపోతూ ఉంటారు. ఈ రకమువారు చాలా సంవత్సరములకు గాని యింటికి చేరరు. వీరి రూపములు మారిపోవుటయు గలదు. ఇట్లా మారిపోయిన రూపములు చాలా కొద్దిమందికే తిరిగివచ్చును. చాలామందికి తిరిగిరావు. వీరిలో చాలామందికి బ్రోమిన్ మందుల వాడినందువలననే యీ రూపభేదముకలిగినది ప్రకృతి వైద్యమును శాస్త్రసమ్మతముగా చేసిన యెడల మారురూపముపోయి స్వస్వరూపము కలుగును.

బ్రోమిన్ మందుల వాడినందువలన పిచ్చి, పక్షవాతమువస్తుంది

మానవకోటిలో చాలామంది చిన్నవయస్సులోనే అసాధ్యమైన కాలికవ్యాధులతో బాధపడుచుండుట మనము ప్రత్యక్షముగానే చూచుచున్నాము. అంగవైకల్యములతో భాదపడుచుండుటయు చూచుచున్నాము. వీరందరును జన్మావధిగా యిట్లనే బాధపడవలె కాబోలునని విచారముకలుగుతుంది. వీటికన్నిటికి మూలకారణ మేమని విచారించి వారి కనీనికలను పరీక్షచేయగా మెదడులోను, మరియితరచోట్లనూ బ్రోమిన్ రంగులుగాని, నాడీమండలమును స్తంభింపచేయు యితర మందుల రంగులుగాని కనుపడును.

బ్రోమిన్‌తో అనేక మందులను తయారుచేస్తారు. బ్రోమిన్‌ను విడిగాను, యితరలోహములతోను కలిపి మందుల తయారుచేస్తారు.

బ్రోమిన్‌తో తయారు చేసినమందులను చర్మము మీద పూస్తారు. దేహములోపలకు కూడా మందుగాయిస్తారు.

కొన్నిరకములగు జ్వరములకు యిస్తారు. హిష్టీరియా మొదలగు మానసికవ్యాధులకును, నాడీదౌర్బల్యమునకును, కోరింత దగ్గులకును, అన్నిరోగములు తనకే ఉన్నవను భ్రమపడు రోగమునకును, నపుంసకత్వమునకును, జీర్ణాశయదోషములకును యిస్తారు. మూర్ఛలకు మాత్రము చాలా విరివిగాయిస్తారు.

గాయములమీద రాచిన చాలాత్వరగా రక్తముతో కలియును. సోడియము బ్రోమిన్‌లతో తయారు చేసినమందు రక్తములో కలిసి త్వరగా తిరుగును. ఇచ్చినవెంటనే బయటకు వచ్చివేయును. నిర్మూలమగుటకు చాలా కాలముపట్టును.

బ్రోమిన్ మందుల వాడినందువలన ప్రతిక్రియా ఫలితముగా నీరసమువచ్చును. మెదడులోని అన్ని కేంద్రములకును దెబ్బతగులును. నాడీమండలమంతయు స్తభించిపోవును.

## లక్షణములు

మూర్ఛలను తగ్గించుటకు బ్రోమిన్ మందుల నిస్తారు. బ్రోమిన్ నుండి వచ్చిన నీరసమును తగ్గించుటకు పాషాణమును వాడుతారు. బ్రోమిన్ వాడి నందువలన చర్మముమీద పసుపుపచ్చ మచ్చలు యేర్పడును. దగ్గు తగ్గగలందులకును, నోటిలోవున్న అసంఖ్యాక గ్రంథులనుండి ఊరునీటిని తగ్గించగలందులకును బ్రోమిన్‌ను వాడుతారు. తలనొప్పి, అయోమయముగాను ఉండును.

## మందువైద్యులు వాడువిధము

వెలుపలికి లోపలకు వాడుతారు.

హిష్టీరియా మొదలగు మానసిక వ్యాధులకును,

కోరింత దగ్గుకును, శాపోద్రేకము యెక్కువగా నున్నవారికిని, మూర్ఛలతో బాధపడు వారికిని వాడుతారు.

త్వరగా లోనికి ప్రవేశించును. గాయములకుగాను చర్మముమీద రాస్తే చాలా త్వరగా లోనికి ప్రవేశించును.

చాలా కాలమునకుగాని బయటకుపోదు.

చలననాడులను జ్ఞాననాడులను స్తంభింప చేయును.

మెదడులోని కేంద్రములకు దెబ్బతగులును.

ప్రలాపములు తగ్గగలందులకు వాడుతారు.

## విషచిహ్నములు

చర్మమునకు పసుపుపచ్చరంగు కలుగును.

తలనొప్పి, తలదిమ్మ, నీరసము కలుగును.

జననేంద్రియములలోని పటుత్వము పోవును.

మోచేయి, మోకాలు దిగువన నొప్పులుగా నుండును.

నపుంసకత్వము, పక్షవాతము, పిచ్చి, మతిమరుపు.

## స్వాస్థ్యసంకటములలో కనబడు లక్షణములు

మూత్రపిండములద్వారాబయటకువచ్చును. మూత్రపు పరిమితి హెచ్చును. కళ్లెగా బయటకు వచ్చును. చీమిడిగాను బయటకువచ్చును. చర్మమీద కురుపులు లేచును. ఇదితగ్గగలందులకు పాషాణమును వాడుతారు.

చమట హెచ్చుగాపోవును. ముక్కువెంట నెత్తురు కారును. అతిసారము కూడా కలుగును.

## కనీనికలోని గుర్తులు

మెదడును తెలుపు ఒకటవ ప్రతినిధి భాగములో తెల్లటి అర్ధచంద్రాకారములు కనబడును. కనీనిక వెలుపటి ఆవరణలో తెల్లటి వలయముగా కనుపడును. కలర్ ప్లేటు 1, 5 బొమ్మలలో యీ గుర్తులు బాగా కనబడును.

---

## అధ్యాయము 18

## Coal Tar products

కలర్ ప్లేటు 4, 6 బొమ్మలు

బొగ్గు నుండి, తారునుండి అనేక మందులను తయారు చేస్తారు. ఇట్లు తయారు చేయబడిన మందులలో ఆసిటనిలిడ్ (acetanilid) ,ఆంటిపైరిన్ (antiepyrin), క్రియోసోట్ (Creosote), ఫనాసిటిన్ (phenacetin), ఆంటికామ్నియా (anti kamnia) లు ముఖ్యము. ఈ యింగ్లీషు మందులకు సరియైన తెలుగుపేర్లు లేవుగాన ఆపేర్లను అట్లనేఉంచినాము.

పైన చెప్పిన వాటిలోని Antikamniaను సేవించిన యెడల కనీనికలోని పైభాగములో తెల్లగా వెల్లవేసినట్లుండును. Antifabrin, antipyrin, fanacetin లను సేవించిన యెడల కనీనిక లోని మూడవఆవరణ తరువాత బూడిదరంగు కనబడును. ఒక

బూడిద రంగుగానేగాక లేతపసుపురంగుగా అదే ఆవరణలో కనబడవచ్చును.

ఈ మందులను తలనొప్పిపోగలందులకును నరములలో కలిగిన తీపులు, పోట్లు, మంటలు పోగలందులకును వాడుతారు. ఈమందుల వాడినందువలన ఆ యీపోట్లు తాత్కాలికముగా తగ్గినప్పటికిని రూపుమాసిపోవు. సర్ఫిరాకుండుటకు వాడుమందు లవలనను, క్షయరోగమును నిర్మూలించుటకు వాడు మందుల వలనను, యెంత అపకారము జరుగుచున్నదో ఈ మందుల వలనను అంతఅపకారము జరుగుచున్నది. మురుగులో నుండి సూక్ష్మజీవులను చంపుటకే సర్ఫిమందులు కనిపెట్టబడినవి. క్షయరోగ సూక్ష్మజీవులను చంపుటకే ఆమందులు కనిపెట్ట బడినవి. అలోపతీ వైద్యశాస్త్రము క్షయరోగజీవులనుండే క్షయ రోగము పుట్టుచున్నదని చెప్పుచున్నది. కాన క్షయరోగమును నిరూపించవలెనంటే, క్షయరోగమును కలుగజేసిన జీవులను నాశనము చేయవలెనంటుంది. ప్రకృతి వైద్యమువారి అభిప్రా యమేమంటే సూక్ష్మజీవులవలన రోగము పుట్టుటలేదు. మురుగు నుండి సూక్ష్మజీవులు పుట్టుచున్నవి. ఆమురుగును తీసివేయునిది సూక్ష్మజీవులు పోవు. మురుగు తయారుకాకుండా చూచిన యెడల సూక్ష్మజీవులు పుట్టవు. రోగమురాదు.

సూక్ష్మజీవులవలన రోగములు పుట్టుచున్నవి. సూక్ష్మ జీవులను చంపివేసినయెడల రోగము పోతుంది _ అను పునాది మీాద కట్టబడిన అలోపతి వైద్యశాస్త్రమంతా తప్పుతోవ్రవన బడిపోయినది. రోగజీవులను నాశనముచేయుటకు మందులను కనిపెట్టుటతోనే వారికి సరిపోవుచున్నది.

యూరప్ అంతా మందువైద్యములోని ఆభాసమును కనుగొన్నది. రోగజీవులవలన రోగము కలుగుటలేదని నిజము తెలుసుకొన్నది. ఎంత నిరపాయకరమైన మందులని ప్రభుత్వమువారు ప్రచారము చేసినప్పటికి ప్రజలుమాత్రము మోసపోవుటలేదు. మిగిలిన ఖండములలోని ప్రజలు మాత్రము యీ సత్యమును తెలుసుకొనలేదు. అందువలన తప్పుత్రోవన బడి రోగములతో బాధపడుచునే ఉన్నారు. మందుల సేవించుచునే ఉన్నారు.

ప్రఖ్యాత వైద్య వరులందరును తమ తెలివితేటలను రోగపదార్థమును నిర్మూలించుటకే ఉపయోగించుచున్నారు. ఆహార విహారములను సరిచేసికొనుటతో రోగ పదార్థమును నిర్మూలించుచున్నారు.

ఈ మందులన్నీ బాధలను చాలా త్వరగా నిర్మూలించునని పామర జనములో అర్థశతాబ్దమునుండి ప్రతీతి గలదు. కాని యీ మందులన్నియు నీరసమును కలుగజేయుననియు, బుద్ధిమాంద్యమును కలుగచేయుననియు, పామరజనమే యిప్పుడిప్పుడు తెలిసికొనుచున్నారు. అలోపతీ వైద్యవరులందరును యీమందులను రోగులకు చెప్పకుండానే యిచ్చుచున్నారు. నోరులేని అమాయిక జనమంతా 'ఈ మందులు నిరపాయకరమైనవని' భ్రమపడి మ్రింగుచున్నారు. పర్యవసానముగా పిచ్చి, ఉన్మాదము, పక్షవాతములతో బాధపడుచున్నారు.

ఈ కాలికరోగములన్నీ యెందుకు పుట్టుచున్నవని అడుగగా మందువైద్యవరు లేమంటారంటే - మనసులోని

దిగులు యెక్కువగా నుండుటచే యీరోగాలన్నీ వస్తున్నా యంటారు.

సారా, బ్రాందీ, విస్కీ యెంత నిరపాయకరమైనవని ప్రచారము చేసినప్పటికిని ఉద్రేకము కలిగించు నవేను. ప్రతి క్రియాఫలితముగా నీరసమును కలుగ జేయున వేను.

ఆహార పదార్థములలోని లోపములను కనుగొనుటకు అమెరికన్ ప్రభుత్వమువారు డా. విల్లీ అను రాసాయనిక శాస్త్రవేత్తను నియమించారు. ఆయన చాలా గొప్ప పరిశోధనలుచేసి తన నిర్ణయమును యీ క్రింది విధముగా ప్రచురించారు. "ఆహారపదార్థములను చిల్లరగా అమ్మువారుగాని, టోకుగా అమ్మువారుగాని ధనమునే ప్రధానముగా చూచుకొంటున్నారు. అందుకు అనుకూలపడునట్లు చవక రకమైన పదార్థములతోనే యీ పదార్థములను 'తినుబండారములను' తయారుచేయుచున్నారు. ఈ పదార్థములు యెక్కువ గంటల కాలము నిలవ ఉండగలందులకు గాను వాటికి రంగు వేయుచున్నారు. విషములనుండి తయారుచేసిన రంగులను కూడా యిందుకు ఉపయోగించుచున్నారు. Coal Tar ల నుండి తయారుచేసిన మందులను యీ పనికి హెచ్చుగా వాడుతున్నారు."

Coal Tar నుండి తయారుకాబడుమందులలో antikamnia ఒకటి. ఈమందును వాడినందువలన పిచ్చి, పక్షవాతము కలుగుచున్నది. ఈవిషయమును నిర్ధారణచేయుటకు మాఆసుపత్రిలో జరిగిన ఒకరి కథను చెపుతాను.

టెలిఫోను కబురురాగా ఒక రోగిని పరీక్షచేయుటకు గాను ఒకరింటికి వెళ్లాను. ఆరోగి కుర్చీలో పడుకొన్నది. ఆమె కనీనికలను పరీక్షచేసితిని. నాకును, నన్ను పిలువనంపిన ఆమెకును యీ క్రింది సంభాషణ జరిగినది.

నేను:- (రెండుకనీనికలలోను పైభాగమంతయు వెల్లవేసినట్లుగా ఉన్నది. కోల్ తార్ నుండి తయారుచేసిన antikamnia, creosote లను వాడితే యీరంగు కనీనికలో కనుబడుతుంది.) ఈమె antikamnia, creosote లను తినినది. కాస్తాకూస్తా కాదు. చాలా యెక్కువగానే తిన్నది. అందువలనపిచ్చిపుట్టింది.

ఆమె:- నిజమేను. పిచ్చి ఒకటేకాదు. చెవుడు, మూగ కూడా ఉన్నాయి.

నేను:- ఈమతిభ్రమణము యెప్పటినుండి పుట్టింది?

ఆమె:- చాలారోజులనుండీ ఉన్నాయి. ఇప్పుడు యెక్కువైనాయి.

నేను:- ఎవరికైనా చూపించినారా?

ఆమె:- వైద్యులకు చూపించినాను.

నేను:- వారేమన్నారు?

ఆమె:- (కారణమడుగగా డబ్బుమునిగిపోయినదని చెప్పినాము.) డబ్బు మునిగిపోయిందను దిగులువలననే పిచ్చి పుట్టిందన్నారు.

నేను:- ఏమిచేయమన్నారు?

ఆమె:- పిచ్చిఆసుపత్రిలో చేర్చమన్నారు.

నేను:- బాగానే ఉన్నది.

ఆమె:- రోగము నయమగుతుందా?
నేను:- ప్రకృతివైద్యముచేస్తే రోగము నయమగుతుంది.
ఆమె:— సరే చేస్తాము.

అయిదునెలలపాటు మా ఆసుపత్రిలోనుండి చికిత్సను పొందినది. తొలిరోజులలో కొద్దిగా ఉద్రేకము కలిగినప్పటికీ క్రమేపీ నయమైనది. చెవుడు, మూగ కొద్దిగా నిలబడినప్పటికిని పిచ్చిమాత్రము పూర్తిగా నయమైనది. జీవయాత్రను గడపుకొనుచున్నది. డబ్బుపోయినదను దిగులువలన మతిభ్రమణము కలిగి పిచ్చి పుట్టవచ్చు. మూగ, చెవుడు వచ్చుటకు అవకాశము లేదుగదా!

మందువైద్యుల అభిప్రాయము ప్రకారము పిచ్చిఆసుపత్రిలో చేర్చినట్లయితే జీవితమంతా వ్యర్థమై పొయ్యేది. పిచ్చి మరీ యెక్కువయ్యేది.

ఈమె ఉన్నగదిని పరీక్ష చేయగా దానిలో Antikamnia డబ్బాలు చాలా కనబడ్డాయి. ఆమె తలనొప్పితో బాధపడుతుండేదని ఆబాధ పోవుటకు యీమందును యెక్కువగా తిన్నదని గ్రహించినాము.

వెనుకటి కేసులలో మాదిరిగనే యీ కేసులో కూడా వైద్యవరుల నిదానము తప్పిపోయింది. కనీనికానిదానమే నిజమును చెప్పినది.

మందువైద్యులు యీ మందులను చాలా హెచ్చుగా వాడుతారు. ఎందుకంటే యీ మందులు బాధలను చాలా త్వరగాతగ్గించి వేయును. మందును సేవించిన ఒకగంటకే గుణము కనుపడును. బాధలను తగ్గించుటలో పీటికి పెట్టినది

పేరు. తలనొప్పులను, నరములలోని తీపులను, సంధివాతమును త్వరగా తగ్గించివేయును. కాళ్ళూ, చేతులూ చచ్చుపడి పోవుటను త్వరగా నయముచేయును.

ప్రతిక్రియాఫలితముగా ఈ మందులు తిన్నందు వలన నీరసము కలుగును. మతిభ్రమణము కలుగును. మూత్ర పిండములకు (Renal irritation) పై భాగమునందు తీవ్రమైన బాధకలుగును. నాడీ సంబంధమైన వ్యాధులు అనగా నరములలోని తీపులు, మంటలు, పోట్లు పుట్టును. పక్షు వాతము వచ్చును. పిచ్చిపుట్టును.

ఈ మందులు బయటకు వెడలునపుడు యీ క్రింది లక్షణములు కనుబడును. చమట హెచ్చుగా పోయును: చర్మముమీద మచ్చలు యేర్పడును. జలుబు చేయును. మూత్రము హెచ్చుగా నగును. నాడులలో చిమచిమలు కలుగును. మానసికమైన ఉద్రేకము కలుగును.

మందు వైద్యులు వాడు విధములు

ఈ మందులన్నీ ఒక గంటలోపలనే బాధలను తగ్గించును. నాడీ వ్యాధులకును, కంఠమాల, సంధివాతముల కుదుర్చుటకు పెట్టినది పేరు.

ఆ గ ం తు క వి షీ క ర ణ ము

తలనొప్పి మందులను తయారు చేయువారికి

వి ష చి హ్న ము లు

ఎర్రకణములను, రక్తములోని క్షారసంపదను తగ్గించి వేయును. అన్ని అవయవములకును దెబ్బ తగులును. హృదయము ప్రధానముగా స్తంభించిపోవును.

లక్షణములు

నీరసము త్వరగా కలుగును. మతిమరుపు కలుగును.

మూత్ర పిండములలో మంటలు కలుగును.

నాడీ వ్యాధులు, పక్షవాతము, పిచ్చి

స్వాస్థ్య సంకటములలో కనుబడు చిహ్నములు

చెమట యెక్కువగా పోయును.

శ్లేష్మము యెక్కువగా వెళ్లును.

మూత్రము యెక్కువగును. మనసు అల్లకల్లోలముగా నుండును.

---

అధ్యాయము 19

---

ఇతర మందులు

Salycilic Acid. (సలైసిలిక్ యాసిడ్)

దీనితో తయారు చేసిన మందులను తినిన యెడల కనీనిక వెలుపటి ఆవరణ అంతటిలోను బూడిద రంగుకనుబడును. క్రింది సగములో యీ రంగు అంత ప్రధానముగా మాత్రము ఉండదు. పై సగములోనే బాగాఉండును. సోడియము, మెగ్నీషియము మొదలగు లోహములతో తయారు కాబడిన మందులను సేవించిన యెడల కనీనికలో యే రంగు కనబడునో యీదావకముతో తయారు కాబడిన మందులను సేవించినను కనీనికలో ఆరంగులే కనబడును.

ఈ ద్రావకముతో తయారుచేయుబడిన మందులు జీర్ణాశయములోని ఆమత్వచమును తినివేయును. ఈ మందులనే నిరంతరము సేవించిన లోపలి ఆమత్వచము చచ్చుపడి పోవుటయు గలదు. చిన్న ప్రేగులలోని ఆమత్వచము కూడా చచ్చుపడిపోవుటయు గలదు. కసీనికలోని ఒకటి, రెండు ఆవరణలలో రంగు నల్ల బడును. ఈ మందులను సేవించినవారు అతిమూత్రముతో (యెక్కువమంది) బాధపడతారు.

ఈ మందులనే కొన్ని సంవత్సరాల తరబడిగా సేవించిన యీక్రింది లక్షణములు కనుబడును. బొగ్గుతారులనుండి తయారు కాబడిన మందులను సేవించిన తరువాతి ఫలితములుగా యేలక్షణములు కలుగునో వెనుకటి అధ్యాయములో చదివినాము. ఈ ద్రావకముతో తయారు కాబడిన మందుల సేవించినా ఆలక్షణములే గాక యీ క్రింది లక్షణములు కూడా కనుబడును.

చెవుడు వచ్చును. దృష్టి మాంధ్యము కలుగును. గొంతులో నొసగానుండును. విరేచనములు, మలబద్ధకము కలుగును.

స్ట్రిచినిన్ (Strychinin):—తెనుగులో సరియైన పేరు దొరకనందున యింగ్లీషు పేరే ఉంచినాము. ఉద్రేకమును కలిగించుటకు అలోపతీ వైద్యమువారు వాడు ప్రథమాయుధము. ఉద్రేకము కలగాలంటే స్ట్రిచినిన్ను యెత్తుకొంటారు. ఈ మందు జీర్ణాశయములో ప్రధానముగా చేరును. కసీనికను చూచుటతోడనే చెప్పగలము. బింబము చుట్టూనుండు మొదటి ఆవరణలో అడ్డగీతలుగల చక్రము ఉండును. కలర్ ప్లేటులోని

మొదటి బొమ్మను చూచిన యీ సంగతి బాగా విశదము కాగలదు. ఈ మందు సేవించుటతో జీర్ణాశయములో ఉద్రేకము కలుగును. క్రియా, ప్రతిక్రియల సూత్రము ననుసరించి ఆ అవయవములోని చైతన్యము తగ్గును. హృదయములో మొదట కలిగిన ఉద్రేకము తగ్గిపోయి నీరసము కలుగును. క్రియా ఫలితమునే ప్రధానముగా భావిస్తారుగాన, మందు వైద్యమువారి అభిప్రాయము ప్రకారము హృదయ స్పందనల వృద్ధి చేయుటకు యిది చాలా ఉపయోగకరమైన మందు.

ఈ మందును హెచ్చుగా సేవించిన కనీనికలోని మొదటి ఆవరణలో తెల్లగీతలకు బదులుగా నల్లగీతలు కనుపడును. మొదటి ఆవరణగాని, రెండవ ఆవరణగాని, రెండు ఆవరణలూగాని నల్లపడిపోవుట గలదు. కలరు ప్లేటులోని ఆరవబొమ్మలోని ఒకటి రెండు ఆవరణలు యిందుకు నిదర్శనములు.

భాస్వరము :—

ఈలోహముతోను చాలా మందుల తయారుచేస్తారు. వీటిని సేవించిన కనీనిక ఒకటి, రెండు ఆవరణలలో తెల్లటి మేఘములు కనుబడును. మెదడును తెలుపు ప్రతినిధి భాగములోను, కాళ్లను చేతులను తెలుపు ప్రతినిధి భాగములలోను తెల్లగుర్తులుగాని, పసుపుపచ్చ మేఘములుగాని కనుబడును. గతశతాబ్దములో, మందు వైద్యులు యీ లోహమునుండి తయారు చేసిన మందులను హెచ్చుగా వాడినారు. అంత విరివిగా యిప్పుడు వాడుట లేదు.

జననేంద్రియములలో పటుత్వము లేని వారికిని, అన్నిరకములగు నాడీవ్యాధులతో బాధ పడినవారికిని యీ మందును

విరివిగా అలోపతీ వైద్యులు వాడినట్లు తెలియ వచ్చుచున్నది. ఈ మందును సేవించిన మొదటి సంవత్సరములో రోగులు విరో చనములతో బాధ పడినట్లు తెలియ వచ్చుచున్నది. తరువాత సంవత్సరములలో మలబద్ధకముతో హెచ్చుగా బాధ పడుతారు.

నిప్పుపుల్లల తయారుచేయు యంత్రాగారములలో పని చేయువారి కనీనికలలోను, రాసాయనిక శాలలలో పనిచేయు వారి కనీనికలలోను యీ మందు రంగు హెచ్చుగా చూచు చున్నాము. పాదరసము తనను ముట్టుకొన్న ప్రతివారి దేహము లోనికి యెట్లు ప్రవేశించునో అట్లనే భాస్వరము కూడాను.

ఇంతవరకును ఉద్రేకము కలుగచేయు మందులను గూర్చి చదువుకొన్నాము. ఇకను మత్తును కలుగచేయు మందుల గూర్చి తెలుసుకొందాము.

మత్తును కలుగజేయు మందులలో నల్లమందు ప్రధాన మైనది. నల్లమందునుండి అనేక విధములుగా మందుల తయారు చేస్తారు. అందులో మార్ఫిన్, కోకెయినులు ప్రధాన మైనవి ఈ మందుల సేవించినయెడల కనీనికలో తెల్లటి సూర్యకిరణములు కనుబడును. ఈ కిరణములు పై సగములో ప్రధానముగా ఉండును. కలర్ ప్లేటులోని 2, 4, 5 బొమ్మల చూచిన యెడల యీ సంగతి బోధ పడగలదు.

అలోపతీ వైద్యులు యీ మందులను ప్రధానముగా వాడుతారు. కాబట్టి అందరి కనీనికలలోను యీరంగు ప్రధా నముగా ఉండనే ఉంటున్నది. ఈమందులను హెచ్చుగా సేవిం

చిన యెడల కనీనికలోని ఒకటి, రెండు ఆవరణలలో యీ తెలుపు గీతలు ప్రధానముగా ఉండును. ఈ మందులకును జీర్ణాశయమునకును, ప్రేగులకును, స్వతంత్ర నాడీమండలము నకును అనురాగమున్నట్లు తెలియువచ్చుచున్నది. ఈ మందులు సేవించిన తరువాత మలబద్ధక మేర్పడుతుంది. పసిపిల్లలుగా నున్నప్పుడు వాడిన Parogoric వలన మలబద్ధకము యెక్కువగు తుంది. నల్లమందుతో తయారుకాబడు మందులలో లాడినమ్ (Laudanum), పారాగారిక్ (Parogoric), మార్ఫిన్ (Morphln), కొకెయిన్ (Cocain) లు ముఖ్యములు.

మా ర్ఫి న్ (Morphin) :— తెలుగు భాషలో సరియైన పేరు దొరకనందున యింగ్లీషుపేరే-ఉంచినాము. నల్లమందు నుండి తయారు చేయుబడు మందులలోకల్లా అతి ముఖ్యమైనది మార్ఫిన్. మందులలోని నల్లమందు 'పరిమితి' తేడాతో యిన్నిమందులు తయారైనాయి. నల్లమందుతోనే మార్ఫిన్ తయారుచేయుబడి నప్పటికినీ కనీనికలోమాత్రము యీ రెంటి గుర్తులు ఒకటిగా నుండవు. ఈ రెండు మందులను సేవించి నప్పటికినీ కనీనికలో తెల్లటి కిరణములే కనుబడును. రెంటిలోను కనీనికలో పై సగములోనే యీ కిరణములు ప్రధానముగా నుండును. నల్లమందు సేవించిన యెడల యీ తెల్ల కిరణ ములు మూడవ ఆవరణ తరువాత కనుబడును. మార్ఫిన్ సేవించిన యెడల యీ తెల్ల కిరణములు కనుపాప నుండి అనగా ఒకటి, రెండు ఆవరణలలోకూడా నుండును. నల్ల మందు కన్న మార్ఫిన్‌ను మందువైద్యులు యెక్కువగా వాడుతారు. ఉబ్బసము, దగ్గు మొదలగు రోగములకు యీ

మార్ఫిన్ బాగాపనిచేస్తుంది. మార్ఫిన్ యింజక్షన్ చాలా త్వరగా గుణమును యిస్తుంది. ఇంతత్వరగా బాధలను తగ్గించి నప్పటికినీ క్రియా, ప్రతిక్రియల సూత్రము ననుసరించి తరువాత కలుగు బాధలు చెప్పవలవికాదు. నీరసము ప్రధానముగా నుండును. ఈ నీరసము తగ్గగలందులకు మార్ఫిన్‌ను యెక్కువ మోతాదులతో సేవిస్తారు. సేవించిన తరువాత నీరసము వస్తుంది. ఇట్లనే అలవాటుపడి జీవితము నంతనూ యీ మందుల సేవించుటతోనే సరిపోతుంది.

కోకెయిన్ - (Cocain):—

ఆంధ్రమున సరియైన పేరు దొరకనందున ఇంగ్లీషు పేరునే ఉంచినాము. అపరేషను చేయుటకు ముందు క్లోరో ఫారము అను మత్తుమందును యిస్తారు, ఈ మత్తు మందును యిచ్చినందువలన బాధ తెలియకుండా పోతుంది. స్పృహ తప్పిపోతుంది. కోకెయిన్ యిస్తే మాత్రము స్పృహ తెలిసియే ఉంటుంది. తెలిసిఉండగానే ఆపరేషన్ చేయువచ్చు. ఈ మందును యిచ్చినందు వలన స్పర్శజ్ఞానము చచ్చిపోతుంది. అందువలన చూస్తుండగనే ఆపరేషన్ చేయువచ్చు. కోకెయిన్‌ను చెట్ల ఆకులనుండి తయారుచేస్తారు. ఈ ఆకులను నములుతారు. ఈ మందులను సేవించినందువలన ప్రతిక్రియా ఫలితముగా నీరసము కలుగును. మెదడులో చేరితే మతిభ్రమణము కలుగును. వెన్నెముకలో చేరితే చిమ చిమలు కలుగును.

గత పదునెనిమిది సంవత్సరముల చికిత్సాలయానుభవములోను నల్లమందు వాడినందువలన కలిగిన దుష్ఫలితము

లతో బాధపడినవారిని చాలామందిని చూచినాను. వీరందరును బాధోపశమనము కొరకు యీ మందును సేవించినవారే గాని రోగము నిర్మూలింప బడునను ఆశతో నల్లమందును సేవించినవారు ఒక్కరును లేరు. వీరందరును ఈ దుష్ఫలితముల ననుభవించిన వారే గాని తప్పుకు పోయినవారు ఒకరును లేరు.

ఎవరికళ్లనైనా కప్పగలముగాని ప్రకృతి యొక్క కళ్లను మాత్రము కప్పలేము. చివరకు సూర్యచంద్రుల కళ్లనైనా కప్ప గలముగాని ప్రకృతి దేవత యొక్క కళ్లను మాత్రము కప్పలేము. ఈ రోజున బాధతగ్గుచున్నది గదా అని యీనల్ల మందును సేవించుటయే గాని, రోగనిర్మూలనమునకు సేవించుట లేదు. ఈబాధ యెట్లా తగ్గిపోవుచున్నదను ఆలోచన మొదటిలోనే పోతోంది. దేహములోని ధాతుశక్తిని వ్యయముచేసియే బాధ తగ్గింపచేయబడు చున్నదను విషయము మాత్రము గ్రహింపలేరు.

ఈ నల్లమందు భౌతికమైన దేహమునే గాకుండా, మానసిక, నైతిక జీవితములను గూడా నాశనము చేస్తుంది. ఈ సంగతివిశదము కాగలందులకు జరిగిన ఒక కథను చెప్పుతాను.

ఒక పురుషునికి అరువది సంవత్సరముల వయస్సు ఉంటుంది. ఆయనకు పదిహేను సంవత్సరముల ప్రాయముగల భార్యగలదు. ఈయన చాలా ధనమును సంపాదించాడు. ఈ ధనమును పరులను హింసించి సంపాదించాడు. వీరిద్దరకును సంతానముకలుగ లేదు. తనభర్తగతించిన తదుపరి యీధనము యెవరికి పోతుందోనని యీమెకు అనుమానముకలిగినది. ఈ

విషయమై ప్లీడర్లను సలహాఅడిగినది. వారేమన్నారంటే—యే వీలునామానైనను వ్రాసినయెడల యీఆస్థి వివాదాస్పద మగుతుంది. వివాదములు కలుగకుండా ఉండాలంటే వీలునామా లేకుండా ఉండుటయే ఉత్తమమైన మార్గము.

ఈయనను పెందలకడనే యమదర్శనమునకు పంపుదామని ఆమెకు అభిప్రాయము కలిగినది. అందుకు అనుకూలమైన మందియ్యమని నన్ను అడిగినది. ప్రాణములను ఉంచగలందులకే నేను మందివ్వ నిశ్చయించుకొన్నాను గాని ప్రాణములు తీసివేయుటకు మందివ్వనంటిని. ఆమె చెప్పినట్లు నేను చేయలేదు కాబట్టి ఆమె మరొక మందు వైద్యుని పిలిపించుకొని తన అభిప్రాయమునకు అనుకూలమైన మందును తీసుకొన్నది. అతను నిరభ్యంతరముగా యిచ్చినాడు.

అంతవరకును యమబాధల ననుభవించినాడు. తన బాధలు తగ్గిపోగలందులకు (చావుకు) విషతుల్యమైన మందు నిచ్చుటకు వైద్యుడు సిద్ధముగా నున్నాడని అతని మనస్సుకు తెలియగానే మందివ్వమని (భార్యనుగాని, వైద్యుణ్ణిగాని) అతనుకోరలేదు. బాధఉన్నదని కూడా బయటకిచెప్ప లేదు. ఇట్లు జరిగిన యిరువదినాలుగు గంటలకే మృతిజెందినాడు. చచ్చుటకు యిరువది నాలుగు గంటలు ముందుగా ఆయున తెలుసుకొన్నాడు—మార్ఫిన్ యింజక్షను తప్ప తనబాధను మరొకమందు తగ్గించలేదనీ, మార్ఫిన్ తనబాధను తాత్కాలికముగా తగ్గించినప్పటికినీ వెంటనే నీరసము వస్తుందనీ, మృత్యు సన్నిధికిపోవుటకు మార్గమేర్పడుతున్నదని - ఇట్లా వితర్కించుకొని బాధను భరించుటకైనా యిష్టపడ్డాడు కాని

మార్ఫిన్ యింజక్షన్ తీసికొని బాధను తాత్కాలికముగా తగ్గించుకొని, త్వరగా మృత్యుసన్నిధికి పోవుటకుయిష్టపడ లేదు.

అన్నిటికన్న ప్రియమైనది దేహము. ఎవరిజీవితము వారికే యెక్కువ. ప్రతిజీవియు యెక్కువకాలము బ్రతుకుదామనిచూచే చూస్తూఉంటాడుగాని త్వరగాచచ్చుటకు యెవరును కోరు కోరు. అదీగాక, చేతనైతే, కాస్తోకూస్తో సహాయము చేయాలిగాని, ప్రాణముతీసివేయుటకు మనకేమి అధికార మున్నది? ప్రాణమునుతీసి బాధల తగ్గించివేయుటకు మన మెవరము? బాధను చూడలేమంటే తొలగి వెళ్లిపోవాలిగాని బాధపడుతున్నారని ప్రాణాలను తీసివేస్తామా ?

## అ ధ్యా య ము 20



## ప్రధాన అవయవముల రోగములు

## కనీనికలో కనుపడు గుర్తులు

బొ మ్మ 17

బింబము చుట్టూనుండు మొదటి ఆవరణ జీర్ణాశయమును తెలుపుననియు, రెండవ ఆవరణ ప్రేగులను తెలుపుననియు, మూడవ ఆవరణ స్వతంత్రనాడీమండలమును తెలుపుననియు, లోగడనే చదివినాము.

దేహములో ప్రధానావయవము లేవను సందేహము మా చదువరులకు కలుగవచ్చును. దేహమును ఒక ఇంజనుకు పోల్చవచ్చును. ఇంజనుకు బాయిలర్ యెటువంటిదో, దేహమునకు జీర్ణాశయము అటువంటిది. బాయిలర్ లేనిది యింజన్ నడవదు. అట్లనే జీర్ణాశయము లేనిది దేహము పనిచేయదు.

జీర్ణ క్రియకు హైడ్రోక్లోరిక్ (Hydrochloric) ఆమ్లము బాగుగా సాయపడును. ఈ ఆమ్లము తక్కువగా తయారైనపుడు జీర్ణక్రియ కుంటుపడును. ఎక్కువగా తయారైనపుడును జీర్ణ క్రియ మందగించును. ఈ ఆమ్లము యెక్కువగా తయారగుచున్నదీ, తక్కువగా తయారగుచున్నదీ తెలుసుకొనుటకు మందువైద్యులకు ఒక మార్గము గలదు. ఎట్లాగంటే జీర్ణాశయములోనికి రబ్బరుగొట్టముల పంపి అందులోని పదార్థమును బయటకు తీయుదురు. ఇట్లు బయటకు తీసిన పదార్థమును రాసాయని




17-వ బొమ్మ

వివరణ— రోగము తరుణరూపములో నున్నపుడు ఆయా అవయవములలో కనుబడు తెల్లగీతలు యిందులో చూపబడినవి. 1, 2, 3, ఆవరణలలోను గలవు. ఈగుర్తులు కనబడినపుడు హైడ్రోక్లోరికామ్లము యెక్కువగా తయారగును. మూత్రికామ్లము యెక్కువగా తయారగును.

కముగా పరీక్షచేసి, హైడ్రోక్లోరికామ్లము యెక్కువగా తయారగుచున్నదీ, తక్కువగా తయారగుచున్నదీ తెలుసుకొందురు.

కనీనికానిదాన శాస్త్రమును తెలుసుకొన్నవారు యీ సంగతిని తేలికగానే చెప్పవచ్చును. కనుపాపచుట్టూనుండు మొదటి ఆవరణ తెల్లగానున్న యెడల హైడ్రోక్లోరికామ్లము తక్కువగా తయారైనదని తెలుసుకొనవలెను. 18 వ బొమ్మలో ఉన్నట్లుగా ఒకటి, రెండు ఆవరణలు నల్లగానున్న యెడల హైడ్రోక్లోరికామ్లము యెక్కువగా తయారగుచున్నదని గ్రహించవలయును.

నోటిలో ఉంచిన ఆహారపదార్థమును నమలిన తరువాత మ్రింగుదుము. ఈ పదార్థము అన్నవాహికద్వారా జీర్ణాశయము లోనికిచేరును. అవసరమునకు మీరి తినిన ఆహారము జీర్ణాశయములోనేనిలవవుండిపోవును. ప్రతిరోజూ యిట్లనేయెక్కువగా తినుచుండిన జీర్ణకోశము పెరిగి లావగును. బహిష్కరణకు తోడుపడు చిన్న ప్రేగులు, పెద్దప్రేగు, మలాశయము, ఆసనము పెచ్చుపెరుగును. ఉండవలసిన పరిమితికన్న యెక్కువగును. కనీనికనుచూచినయెడల, ఆయా అవయవములు, వాటికి నిర్దేశింపబడిన స్థానములలో ఉండక, యెక్కువ స్థలము నాక్రమించుకొనినట్లు మనము చూడగలము.

## జీర్ణాశయములోని మందులు

అవసరమునకు మిగిలి తినిన పదార్థము జీర్ణాశయములో నిలవవుండి మురుగుననియు, మంటలు పుట్టుననియు చదివినాము. బయటకు పోక ప్రేగులలోపలనే నిలవ ఉండుట

వలన మురిగి మంటలు పుట్టును. జీర్ణాశయములో చేరిన మందు లన్నియు, చిన్న ప్రేగులలో చేరును. స్ట్రిచినిన్ మాత్రము చిన్న ప్రేగులలో చేరదు. కొన్ని కేసులలో జీర్ణాశయమును తెలుపు మొదటిఆవరణ తెల్లగానుండుటయు, రెండవ ఆవరణ నల్లగా నుండుటయు చూచుదుము. అటువంటపుడు మనమీ క్రిందివిధ ముగా అర్థము చెప్పుకొనవలెను. జీర్ణాశయము తృప్తిగా పని చేయుచున్నదనియు, ప్రేగులుమాత్రము చచ్చుపడినవనియు తెలుసుకొనవలెను. 19 వ బొమ్మ యీసంగతిని తేటతెల్ల ముగా చెప్పుతుంది. పాదరసముతో తయారుకాబడిన మందు లను సేవించినయెడల చిన్న ప్రేగులలోని ఆమత్వచము చచ్చు పడిపోవును. కనుపాప చుట్టూనుండు రెండవ ఆవరణ నల్ల పడును. ఆపరిస్థితులలో లివరును తెలుపు 13వ ప్రతినిధిభాగ ములో నల్లగీతలు కనుబడును.

క్వయినా, యినుము, గంధకము, నల్లమందు వాటి వాటి రంగులతో కనుపాపచుట్టూనుండు రెండవ ఆవరణలో కనుపడును. అయోడిన్ కూడా లేత యెరుపుమచ్చలతో కను పడును. ఇన్ని కనుబడునుగాని స్ట్రిచినిన్ మాత్రము ప్రేగులలో చేరదు. కాన కనబడదు.

గజ్జిమచ్చలు యీ రెండు ఆవరణలలోను కనుబడును. వీటినుండియే అంతరవయవములలో పుండుగాని, వ్రణములు గాని లేచును- అంతరవయవములలో యెచ్చటనన్నా వ్రణ ములు లేచినయెడల ఆయా అవయవమునకు సంబంధించిన ప్రతినిధి భాగములో నల్లమచ్చలు కనుబడును. ఆ మచ్చల మీద తెల్లగీతలుండును.




18-వ బొమ్మ

వివరణ— 1-వ ఆవర్తంలో నల్లగీతలు కనుబడుచున్నవి. హైడ్రోక్లోరికామ్లము తక్కువగా ఊరుచున్నది. రోగము కాలికరూపమును పొందినది. నాడీఉంగరములు నల్లబడినవి.







19-వ బొమ్మ

వివరణ:— 1-వ ఆవరణ తెల్లబడుటయు, 2-వ ఆవరణ నల్లబడుటయు కానవగును.







20-వ బొమ్మ

వివరణ— రెండవ ఆవరణలో సోరామచ్చలు గలవు. ఈ మచ్చలనుబట్టి అంతర్వ్రణము పుట్టుతుందని ఆరు సంవత్సరముల క్రితమే తెలుసుకొనుటకు వీలుపడినది.




21వ బొమ్మ

వివరణ— ఎడమ కనీనికలో 10, 11 వరియాల మధ్య నల్ల గీతలు గలవు. దీనిని చూచి 3 సంవత్సరముల పూర్వమే అంతర్వ్రణము పుట్టుతుందని చెప్పుటకువీలుపడినది. చిన్నప్పుడు లేచిన గజ్జిని అణచివేయుటకు వాడిన మందులలోని పాషాణము తెల్లటి మొద్దలుగా ఎడమ, కుడి కనీనికల రెంటిలోనూ అంతటను కనబడుచున్నవి.

బొమ్మ 20

మా ఆసుపత్రికి పరీక్షార్థమైవచ్చిన ఒకామె కథను చెప్పతాను. ఈ కనీనికలు ఆమెవి. ఈమె ఆరుసంవత్సరముల క్రితము పరీక్షార్థమై మా ఆసుపత్రికి వచ్చినది. కనీనికచుట్టూ నుండు రెండవ ఆవరణలో నల్లటి మచ్చలున్నవి. ఈ నల్ల మచ్చలు గజ్జిమచ్చలనియు వీటివలన ఆప్రదేశములలో అంత ర్వ్రణములు కలుగవచ్చుననియు చెప్పితిని. ఇప్పటినుండీ మొదలుపెట్టిన యీమచ్చలు త్వరలోనే పోవునని కూడా చెప్పితిని. నామాటలలో ఆమెభర్తకు విశ్వాసము అప్పటికి లేకపోయినది. నాలుగు సంవత్సరములు గడిచిన తరువాత ఆమెను తీసికొని ఆయనయే వచ్చినాడు. అప్పటికి రోగము బాగా ముదిరిపోయినది. చివరకు ఆమె ఆవ్రణముతోనే అంతరించినది.

బొమ్మ 21

ఆరోజులలోనే మరొకామె పరీక్షార్థమై మా ఆసుపత్రికి వచ్చినది. ఆమె చనుమొన వాచినది. కనీనికను పరీక్ష చేయగా ఎడమకనీనికలోని 10, 11 ప్రతినిధి భాగములలో నల్లటి మచ్చ కనుబడినది. ఇది గజ్జిమచ్చగానే కనబడినది. దానిని చూచి ఆమెకు కూడా వెనుకటిఆమెతోచెప్పినట్లే చెప్పితిని. ఆమె రెండునెలలపాటు మా ఆసుపత్రిలోఉండి చికిత్సను పొందినది. అప్పటికి నయముకాలేదు. ఆమె పెనిమిటికి యీ ప్రకృతి వైద్యశాస్త్రములో నమ్మకము లేదు. కాన నయముకాక పూర్వమే తీసికొనివెళ్లినాడు. రోగము ముదిరిపోయినది. మూడు సంవత్సరములు జరిగినతరువాత పరీక్షార్థమై మళ్లీతీసికొనివచ్చి

నాడు. బొమ్మలోని యెడమ భాగమున అంతర్వ్రణము లేచినది. అదియు నాలుగవ దశను పొందినది. వెనుక కనబడిన కుడికనీనిక లోని 10, 11 ప్రతినిధి భాగములలోనే గాక, ఎడమ కనీనిక లోని 17 వ ప్రతినిధి భాగములోను, కుడికనీనికలోని 13 వ ప్రతినిధి భాగములోను గజ్జిమచ్చలు కనుబడినవి. విచారించగా ఆమెకు చిన్నతనములో, నాలుగు, అయిదు పర్యాయములు గజ్జి లేచినదనియు, దానిని మందులతో అణచిపెట్టినారనియు తేలినది.

గజ్జి యొక్క పుట్టు పూర్వోత్తరములను వీరి తల్లిదండ్రులు తెలుసుకొని, దానిని మందులతో అణచిపెట్టకుండా ఉన్న యెడల యీ అంతర్వ్రణములు లేచెడివికావు. నేను చెప్పినపుడే వైద్యమును ప్రారంభించిన యెడల వ్రణములు నయమయ్యెడివి. సుఖముగా నుండెడివారు.

## లివరు, ప్లీహముల జబ్బులు

## Dieases of the Liver and Spleen.

దేహములో లివరు కుడిప్రక్కను, ప్లీహము యెడమ ప్రక్కన ఉండును. ఈ రెండును గేటుకాపరు లనవచ్చును. ఈ రెంటిలో యే ఒకటి చెడినప్పటికినీ రెండవదియు కొద్దిగనో, గొప్పగనో చెడును. అందువలన రెండు అవయవములను జత కట్టవలసి వచ్చినది. ఈ రెంటిలో ఒకటే చెడి, రెండవది చెడకుండా మాత్రము ఉండదు. లివరులో ఊరిన మధుర రసము జీర్ణక్రియకు బాగుగా ఉపయోగపడును. పిండి పదార్థమును, ప్రొటీన్సును (Proteins) యీ మధుర రసము పచనము

చేయును. ఈ రాసాయనిక క్రియలో తయారగు మురుగును గాల్ బ్లాడరు (Gall Bladder) లోనికిని అచ్చట నుండి చిన్న ప్రేగుల లోనికిని, అచ్చట నుండి మూత్ర పిండముల ద్వారా మూత్రముగాను బయటకు పంపివేయును.

రక్తమును శుద్ధి చేయుటకు ఉపయోగపడు అవయవములలో స్ప్లీను ఒకటి. చెడు రక్తము హృదయములోనికి పోయి, ప్రాణవాయువుతో కలిసి శుద్ధి అగును. చెడు రక్తము హృదయములోనికి పోవుటకు ముందు స్ప్లీనులోనికి పోవును. హృదయము యెక్కువగా స్పందించి చెడిపోకుండా రక్తములోని మలినము నంతను స్ప్లీను ముందుగా మ్రింగి వేయును. తనకు సాధ్యమైనంత వరకును మ్రింగిన తరువాతనే రక్తమును హృదయము లోనికి పంపును. అందువలననే జ్వరము వచ్చునప్పటికే స్ప్లీను ఉబికియే ఉంటుంది. స్ప్లీను చెడకుండా జ్వరము రాదు. జ్వరము వచ్చునప్పటికే స్ప్లీను యెందుకు చెడుతుందో తెలియక మందు వైద్యులు అనేక సిద్ధాంతముల బయలు దేరదీశారు. ఇవేవియును నిలబడ లేదు. అన్నియు త్వరలోనే అంతరించి పోయినాయి. జ్వరము వచ్చుట వలన దేహమునకు అపకారము జరుగుతుందనియు యీ అపకారమును వారించుటకుగాను మందుల వాడవలసిన దనియు, మందు వైద్యులు అభిప్రాయ పడినారు గాన వారి సిద్ధాంతము లన్నియు తలక్రిందులై పోయినాయి. ప్రకృతి వైద్యమువారి అభిప్రాయమేమంటే - జ్వరము వలన దేహమునకు ఉపకారమే జరుగుతుంది. అపకారము జరుగదు. ప్రతి తరుణ రోగము దేహమును శుద్ధి చేయుటకే వస్తుంది. ఆ

తరుణ రోగమును యే విధముగాను అభ్యంతర పెట్టకపోతే హాని చేయక వెడలిపోతుంది.

ఈ విషయమై వివరములు గోరువారు మాచే రచింపబడిన 'ప్రకృతి వైద్యతత్వము' పుస్తకములోని 10 వ అధ్యాయమును చదువవలెను.

రక్తము స్ప్లీనులోనికి పోయి అచ్చటనుండి హృదయములోనికిపోవును. హృదయమునకు యెక్కువపని కలుగకుండుటకు గాను రక్తములోని రోగపదార్థమును స్ప్లీను మ్రింగివేయును. ఇట్లు మ్రింగివేయుబడిన రోగపదార్థము స్ప్లీనులోని సన్నని గొట్టములద్వారా పోవుటచే వాటికి రూపమేర్పడును. వీటికే తెల్లకణములనిపేరు. రక్తములోని రోగపదార్థమును స్ప్లీను ముందుగా మ్రింగుననియు, ఆరక్తములోని రోగపదార్థము స్ప్లీనులోని సన్ననిగొట్టముల ద్వారా వచ్చుటచే ఆపదార్థమునకు యీకణముల రూపమువచ్చినదనియు మందు వైద్యులు తెలుసుకొనలేక, తెల్ల కణములవలన రోగమువచ్చినదనియు, ఈ కణముల సంఖ్యను తగ్గించనిది రోగము నయము కాదనియు దురభిప్రాయపడినారు.

రోగపదార్థము రక్తముతో కలిసిపోయినయెడల రక్తము చిక్కబడును. జిగురుహెచ్చును. సాంద్రత పెరిగిపోవును. ఇట్లు చిక్కబడిన రక్తములోని రోగపదార్థమును స్ప్లీను మ్రింగివేయుటతో రక్తము యొక్కచిక్కదనము తగ్గిపోవును. రక్తమునకు సహజముగ ఉండవలసిన సాంద్రతవచ్చును.అనగా పలచబడును. ఇంతకన్న జిగురుగానున్నయెడల రక్తము సన్నని

గొట్టములద్వారా ప్రవహించదు. దేహములోని వివిధ భాగములకు, అవయవములకు అందవలసిన ప్రాణవాయువు, ఆహారము అందదు. వివిధ అవయములలోని మలినములు బయటకు రావు. లోపలనే నిలబడిపోవును.

తెల్ల కణములవలననే రోగము గలుగుచున్నదను సిద్ధాంతమును బయలుదేర దీసినవాడు మెచ్నికాఫ్. ఈ మెచ్నికాఫ్, ప్రొఫెసర్ బిఛాంపు సమకాలికులే. మెచ్నికాఫ్ తెల్లకణముల వలననే రోగము వచ్చుచున్నదని యెందుకు అభిప్రాయపడినాడంటే-రోగము ప్రారంభములో ఉన్న తెల్లకణముల సంఖ్యకన్న రోగము ముదిరినకొలదీ ఈ తెల్లకణముల సంఖ్య పెరుగుచూపోవును. తెల్లకణములవలన మంటలు కలుగుచుండును. ఈ మంటలను తగ్గించవలెనంటే దేహమునకు అపకారము జరుగకుండా చూడవలెనంటే ఈ తెల్లకణముల సంఖ్యను తగ్గించవలెనని అభిప్రాయ పడినాడు.

ఈ క్రొత్తశాస్త్రము (ప్రకృతివైద్యశాస్త్రము) యేమి చెప్పుతుందంటే తెల్లకణములు దేహమునకు ఉపకారము చేయును. దేహములోని రోగపదార్థమే యీ తెల్లకణములుగా బయటపడుచున్నది. ఈ తెల్లకణముల సంఖ్యను తగ్గించి మంటలను తగ్గింప చూచుట శుద్ధవెర్రితనము.

అన్నిరకములగు జ్వరములలోను యీ తెల్లకణముల సంఖ్య పెరుగదు. క్షయరోగములోను (miliary tuberculosis), చలిజ్వరములోను, సన్నిపాతజ్వరములోను, ఇన్‌ఫ్లూయెంజా జ్వరమువచ్చినపుడును, నంజువ్యాధిలోను యీ తెల్లకణముల సంఖ్య పెరుగదు. తగ్గిపోతుంది. ఎందుకు తగ్గుతుందంటే,

స్ప్లీను అప్పటికే తెల్లకణములను మ్రింగి మ్రింగి ఉబికి ఉంటుంది. రక్తములో యింకా మిగిలిపోయిన రోగపదార్థమును స్ప్లీను యిక మ్రింగలేదు. స్ప్లీను మ్రింగలేదు కాబట్టి రక్తములోని రోగపదార్థము రక్తములోనే నిలవ ఉండిపోతుంది. ఈ రక్తమును హృదయము కూడా శుద్ధి చేయలేదు. ఆ మలినములన్నీ రక్తముతో కలిసి తిరుగుచునే ఉంటాయి.

మా చదువరు లందరు మురుగు కాల్వను యెరిగియే ఉందురు. ఈ కాల్వ మురుగును మోసికొనిపోవును. ఘన రూపమైన మురుగును ద్రవ రూపమైన మురుగునుండి విడదీయుటకు యినుప జల్లెడను అడ్డము పెట్టుదురు. ఈ జల్లెడలోని సందులద్వారా ద్రవరూపమైన మురుగు బయటకు పోయి, ఘనరూపమైన మురుగు అచ్చటనే నిలబడి యుండును. ప్రతిదినము యీ ఘనరూపమైన మురుగును తీసి వేయనిది ద్రవరూపమైన మురుగు బయటకుపోదు. బయటకు పోవుటకు అభ్యంతరములు కలుగుట వలన సహజముగా ప్రవహించు స్వభావముగల ద్రవరూపమైన మురుగుకూడా ఆగిపోవును. పైన చెప్పిన రోగములలోనూ యిం తేజరుగును.

మెదడునకుపోవు రక్తమును అదుపులో నుంచుటకు కంఠమునకు యిరుప్రక్కలను రెండుగ్రంధులుగలవు. వీనికి టాన్సిల్సు అనిపేరు. రక్తములోని రోగపదార్థమును యీ రెండు గ్రంధులు సాధ్యమైనంతవరకును మ్రింగివేయును. ఈ రోగపదార్థమును మ్రింగుటచే ఆ గ్రంధులు ఉబుకును. ఇట్లా ఉబికిన గ్రంధులను అలోపతీ వైద్యులు శస్త్రములతో తీసివేయుదురు. రోగపదార్థపు తయారును 'తగ్గించవలెగాని, రక్తములోని

మురుగును మ్రింగి దేహమునకు ఉపకారము చేయుచున్న ఈ మురికి తొట్లను తీసివేసినందువల్ల దేహమునకు ఉపకారము జరుగకపోగా, అపకారము జరుగుతుందని వీరు గ్రహించలేరు.

ప్రకృతి వైద్యులన్ననో టాన్సిల్సును తీసివేయరు. రోగపదార్థపు తయారును తగ్గింతురు. అప్పుడు టాన్సిల్సును తీసివేయు అవసరము ఉండదు.

పైన చెప్పిన అన్ని రోగములలోను. లివరు, స్ప్లీనులు, ఉబికియే ఉండును. కనీనికలో వాటి ప్రతినిధి స్థానములలో తెలుపు గుర్తులు కనుబడును. కుడికనీనికలో లివరును తెలుపు 13-వ యేరియాలోను, ఎడమ కనీనికలో స్ప్లీనును తెలుపు 13-వ ప్రతినిధి యేరియాలోను ఈ తెలుపు గీతలు కనుబడును.

ఈ రోగపదార్థము యిట్లాపేరుకొంటూ పోయినయెడల మొదటిలో చైతన్యము కలిగిన అవయవము లైనప్పటికినీ క్రిమేపీ చచ్చుపడిపోవును. తరుణ రూపములోని రెండు దశలను దాటి కాలికరూపములోని రెండు దశలను పొందును. ఆహార, విహారములలో మార్పు రాకపోవుటచేత, రోగపదార్థము అట్లనే తయారగుచుండును. కాలికరోగములోని రెండవ దశనుపొంది నాశనమగును.

కణములకు ఆహారము, ప్రాణవాయువు అందకపోవుట వలనను, ఆ కణములలో తయారగు మలినములు బయటకుపోక పోవుటచేతను, కణములన్నియు చచ్చుపడును.

జ్వరముయొక్క పుట్టు పూర్వోత్తరములు అన్ని రోగములలోను ఒకటిగానే ఉండును. లివరు, స్ప్లీను, ఊపిరితిత్తులు,

జీర్ణాశయము, చిన్నప్రేగులకు సంబంధించిన జబ్బు లన్నిటి లోను యీ క్రమము ఒకటిగానే ఉండును. మొదటలో తరుణ వ్యాధులు వచ్చును. రోగమువలన దేహమునకు ఉపకారము జరుగుతుందను నమ్మకము లేకను, అపకారము జరుగుతుందను భయముచేతను ఆ వచ్చిన తరుణరోగములను మందులతోను, ఇంజక్షనులతోను అణచిపెట్టిన యెడల దేహమునకు అపకారము జరుగుతుంది. మందులతోను, ఇంజక్షనులతోను అణచి పెట్ట బడిన రోగపదార్థమే ప్రధానావయవములలో చేరి కాలిక రోగ ములకు మూలమగుతుంది. కాలిక రోగములోని రెండు దశ లను పొందిన తరువాత మృత్యువు ఆసన్నమగుతుంది.

ఇప్పుడు సంభవించే మృత్యువులన్నీ ఇట్లా క్రమేపి పెంచుకొని తెచ్చిపెట్టు కొన్నవేగాని, నిర్నిమిత్తముగా సంభ వించినవి మాత్రము కావు. ఈ కార్యకారణముల సంబంధ మును తెలిసికొనలేక అంతా ఆగంతుకముగా వచ్చి నెత్తిన పడినదంటారు. మరి మాటలాడితే యిదంతా కర్మ ప్రభావ మంటారు. మన ప్రశక్తియేమీ లేకుండానే రోగారోగ్య ములు రెండూవచ్చి మననెత్తిన పడుతవంటారు.

తరుణ రోగములను మందులతో అణచిపెట్టిననే కాలిక రోగములు వచ్చును. కనీనికలో కనుపడు గుర్తుల రంగునుబట్టి రోగము యేదశను పొందినదీ చెప్పగలము. తరుణరూపమును పొందినదీ, కాలికరూపమును పొందినదీ చెప్పగలము.

మానవదేహములో మనస్సు, భౌతికమైన దేహము అను రెండు విలక్షణమైన వస్తువులుగలవు. ఈరెండును విడదీయ

కాని ఒకే వస్తువుయొక్క రెండు ముఖములు. ఒకటి మాత్రమే చెడదు. ఏదిముందు చెడుతుంది, యేది తరువాత చెడుతుందను వివాదముగలదు. ఈ రెంటిలోను మనసున కేముందుగా జబ్బు చేసిన దని మానసిక శాస్త్రవేత్త లంటారు. లివరు, స్ప్లీనులకును మానసిక రోగములకును సంబంధము గలదని పూర్వీకులకు తెలియును. మానసిక రోగములలో అనేక రకములు గలవు. అందులో యెల్లప్పుడు దిగులుగానుండుట ఒకటి. దీనిని ఆంగ్లమున మెలంకోలియా (Melancholia) అంటారు. ఈరోగమునే పూర్వీకులు బ్లాక్ గాల్ (Black Gall) అన్నారు. తారువంటి నల్లటి పదార్థము Gall Bladder లో చేరును. గాల్ బ్లాడరు (Gall Bladder) లో ఊరిన రసము జీర్ణక్రియకు తోడుపడును. ఈ గాల్ బ్లాడరు (Gall Bladder) లో ఊరిన Bile అను రసము చిన్న ప్రేగులలోనికి పోవును. ఈ రసము చిన్న ప్రేగులలోనికి రాక పోవుటవలన మలబద్ధకము యేర్పడును. Bile చిన్న ప్రేగులలోనికి రాకుండా గాల్ బ్లాడరు (Gall Bladder) లో చేరుకొనిన నల్లటి పదార్థము అడ్డుపడును. చిన్న ప్రేగులలోనికి రావీలు లేక గాల్ బ్లాడరు (Gall Bladder) లోనే నిలవఉన్న బైల్ (Bile) రక్తముతో కలిసిపోవును. కలిసిపోవుటవలన రక్తములో ఉద్రేకము కలుగును. రక్తములో ఉద్రేకము కలుగుటవలన రక్తము ప్రవహించిన ప్రదేశములందల్లా ఈ ఉద్రేకము కనుపడును. ఈరక్తము మెదడులోనికి పోయినప్పుడు, మెదడులో కూడా ఉద్రేకము కలుగును. నాడులకు పోషణకలుగ చేయుటకు యీరక్తము వెడలినపుడు నాడీ మండలములోను యీ ఉద్రేకము కలుగును. రక్తములో కలిగిన ఉద్రేకము వలననే అసంఖ్యాకములగు

నాడీవ్యాధులు కలుగును. మానసికస్తబ్ధత, హిస్టీరియా మొద లగునవన్నీ ఇట్లా వచ్చినవేను.

బొమ్మ 22

గాల్ బ్లాడరులో రాళ్లు ఉన్నవని చేయు ఆపరేషను లలో సగముకేసులలో ఈతిత్తిలో రాళ్లు ఉండుటలేదు. ఆ తిత్తిలో నల్లటిపదార్థము ఉంటుంది. దీనిని పూర్వీకులు black gall అన్నారు. ఈతిత్తిలో రాయి నిలవ ఉన్నయెడల యెంతబాధకలుగుతుందో, యీ నల్లపదార్థము చేరినా అంత బాధఉంటుంది. బాధ ఉన్నదనగానే ఆపరేషను చేయమంటారు అలోపతీవైద్యులు.

రక్తములో కలిసిపోయిన రోగపదార్థమును మ్రింగుట వలన స్ప్లీను లావగును. రక్తములో రోగపదార్థముచేరి ఉద్రే కము కలుగుటవలనను, ఆ చెడురక్తమే మెదడులోనికి పోవుట వలనను, అసంఖ్యాకములగు మానసికవ్యాధులు, నాడీవ్యా ధులుకలుగును. తరుణరోగములలో మూర్ఛ, చావు కలుగును.

## క్షయినా

22 వ బొమ్మలో కనుబడు కసీనికలు ఒకరోగివి. ఈరోగి నంజువ్యాధితో చనిపోయినాడు. ఆ కసీనికలో అవయవ ములోని లోపములతో బాటు మందులరంగులు కూడా కన బడుచున్నవి. కుడికసీనికలోని 13 వ యేరియాలోను, ఎడమ కసీ నికలోని 13 వ యేరియాలోను, గాల్ బ్లాడర్ (gall bladder) ను తెలువు యేరియాలోను నల్లటి గుర్తులు కనుబడుచున్నవి.




22-వ బొమ్మ

వివరణ— కుడికనీనిక 13R లోను, గాల్ బ్లాడరును తెలుపు ప్రదేశములోను నల్లగీతలు గలవు. కుడిచెవిని తెలుపు 5 ప్రదేశములో గుర్తు కలదు. ఎడమ మోకాలును తెలుపు 18 యేరియా మధ్యలో నల్లగీత గలదు. మెదడును తెలుపు ప్రదేశములో బ్రోమీన్ మందుల రంగులు గలవు.

మెదడును తెలుపు ఒకటవ యేరియాలోను, లివరును తెలుపు కుడికనీనికలోని 13వ యేరియాలోను, స్ప్లీనును తెలుపు ఎడమకనీనికలోని 13 వ యేరియాలోను, క్వాయినారంగు కన బడుచున్నది. ఈ పెద్దమనిషికి చిన్నతనములో చలిజ్వరము వచ్చినది. ఈ చలిజ్వరమును యథావిధిగా క్వాయినాతో నయము చేసినారు. అప్పటినుండీ ఈయనకు మానసిక రోగ ములు ప్రారంభించినాయి. అజీర్ణము, మలబద్ధకములతో బాధపడినాడు. ఈబాధలు పడలేక 42వ యేట ఆత్మహత్య చేసుకొన్నాడు. కుడిమూత్రపిండము, యెడమమూత్రపిండము రెండునూ చెడినవి. అందువలననే కుడికనీనికలోని 19వ యేరియాలోను, యెడమకనీనికలోని 19వ యేరియాలోను నల్లటిచుక్కలు గలవు. నాడీవలయములు పెక్కులుగలవు. కుడి కనీనికలోని 5వ యేరియాలోను ఎడమకనీనికలోని 18వ యేరియాలోను నల్లటిచుక్కలు గలవు. ఎడమ కనీనికలోని రెండవ వలయములోని Pancreas ను తెలుపు ప్రదేశములో ఒక నల్లటి సోరామచ్చగలదు.

క్వాయినా వాడినందువలన తలనొప్పి, మానసిక చల నము కలిగినాయి. ఈ బాధలను తగ్గించగలందులకు గాను బ్రోమైన్‌తో తయారుచేసిన మందులను, బొగ్గు తారులనుండి తయారుచేసిన మందులను వాడినారు. అందువలన మెదడును తెలుపు ఒకటవ యేరియాలో వెల్లవేసినట్లుగా తెలుపురంగు కన బడుచున్నది. రెండవకనీనికలోని ఒకటవ యేరియాలోనూ ఈ తెలుపురంగు కనబడుచున్నది.

బొమ్మ 23

ఈ బొమ్మలోని కుడికనీనికలోని 8, 8 m. 9 యేరియాలలోను, ఎడమకనీనికలోని 8,9 యేరియాలలోను గుర్తులు కనబడుచున్నవి. ఈ వ్యక్తికి దక్షిణ అమెరికాలో ఉండగా (Swamp fever) స్వాంప్పుఫీవరు వచ్చినది. యథావిధిగా క్వయినా, పాషాణములను వాడి ఆజ్వరమును అణచివేసినారు. ఈ రోగ పదార్థము బయటకుపోవుటకు వీలులేక ఊపిరి తిత్తులలో చేరినది. క్షయరోగము పుట్టినది ఈ కేసులోని విచిత్రమేమంటే లివరు, స్ప్లీనులు రెండునూ చెడిపోయినవి.

స్ప్లీనుచెడి క్షయరోగము వచ్చినదంటే కష్టము మీదగాని కుదరదంటారు ఆలోపతీ వైద్యులు. ఎందుచేత యీ రోగము కష్టసాధ్యమయ్యేది మాచకువరులు సులభము గానే ఊహించి ఉంటారు. ఎందువలన క్షయరోగము పుట్టి నదికూడా సులభముగానే గ్రహించగలరు. రక్తమంతా రోగ పదార్థముతో నిండినపుడు యీ చెడురక్తమే శుద్ధి యగుటకు ఊపిరితిత్తులలోనికిపోవును. అప్పుడు ఊపిరితిత్తులలోని సన్నని గోళములలో యీ రోగపదార్థము చిక్కుకొని పోవును. ఈ చిక్కుకొని పోయిన రోగపదార్థము అచ్చటనే నిలవ ఉండి పోవును. ఇదియే క్షయరోగమునకు మూలము.

ఆహార విహారములలో మార్పును తెచ్చినయెడల యీ రోగము చాలా త్వరగా కుదురును. ఈ రోగియు ప్రకృతి వైద్యపద్ధతుల నవలంబించి రోగమును నయముచేసికొన్నాడు.

క్వయినావాడిన అన్ని కేసులలోను తలనొప్పి, తలదిమ్ము, బుద్ధిమాంద్యము, అజీర్ణము, నీరసముగా నుండుట మొదలగు







23-వ బొమ్మ

వివరణ— లివరు, స్ప్లీనులు తెలుపు 13R, 13L ప్రదేశములలో నల్లగీతలు గలవు. ఇందువలన రక్తము యొక్క చిక్కదనము బాగుండదు. కుడి, ఎడమ ఊపిరితిత్తులు 8, 8M, 9, 8, 9 యేరియాలలో గుర్తులు గలవు.

లక్షణములన్నీగాని, కొన్నిగాని కనబడుచునే ఉన్నవి. ఇన్‌ఫ్లు యెంజా మొదలగు జ్వరములకు క్వయినావాడి నయము చేస్తారు (అణచిపెడతారు). ఇట్లా నయము చేసిన వారందరి లోను పైలక్షణములన్నీ కనబడుచునే ఉన్నవి. వారి కనీనికలను పరీక్ష చేయుగా క్వయినా రంగు కనుబడినది. ఇన్‌ఫ్లు యెంజా మొదలగు జ్వరములను అలోపతీ వైద్యశాస్త్ర ప్రకారముగా మందులతో నయము చేయక (మందులవాడక) ప్రకృతి వైద్యపద్ధతులతో నయము చేసినయెడల పైచెప్పిన చెడులక్షణము లేవియు కనబడుట లేదు. అందువలన యేమని తేల్చుకొన్నామంటే - తరుణరోగములను మందులతో అణచి పెట్టుటవలననే యిన్ని కాలికరోగములు వచ్చుచున్నవి. మందుల వాడుటవలననే యీ లక్షణములన్నీ కనబడుచున్నవి. ప్రకృతి వైద్యశాస్త్ర ప్రకారముగా నయము చేసినయెడల కనీనికలోని ప్రతినిధి భాగములలో రంగుగాని దేహమునకు కాలిక రోగ ములుగాని, దుర్లక్షణములుగాని కానరావు.

## మూత్రపిండ వ్యాధులు

దేహములో నాలుగు బహిష్కార్యావయవములు గలవు. అందులో యీ మూత్రపిండములు ఒకటి. ఈ మూత్రపిండ ములు కుడి, యెడమ పార్శ్వము లందుండును. రాసాయనిక ముగా తయారగు ద్రవరూపమైన మురుగును యీ మూత్ర పిండములు బయుటకు పంపును. రక్తములోని ద్రవరూపమైన మలినము లన్నిటిని మూత్రపిండములు వడియగట్టి బయటకు పంపును. దేహారోగ్యము బాగాఉన్నంతవరకు మూత్రపిండ ములు తమపనిని తేలికగానే చేయును. దేహము ఆరోగ్యము

బాగా లేనియెడల ఈ మూత్రపిండములు మూత్రకోశముతో బాటు మిగిలిన పనికిరాని పదార్థములకూడా బయటకు పంప వలసి వస్తుంది. అపుడు మూత్రపిండములు యెక్కువగా పని చేయవలసి వస్తుంది. మూత్రపిండములలో మంటలు కలుగుతవి. మూత్రపిండములలోని సన్నని కండరములన్నీ బయటకు వెడలిపోతవి. మూత్రమును పరీక్షచేసినయెడల యీసంగతి బాగా విశదము కాగలదు. మూత్రమును యెక్కువగా వడియగట్టిన మూత్రపిండములు చివరకు చచ్చుపడి పోవును. మూత్రపిండములలో కొద్దిగా బయలుదేరిన మంటలు శాశ్వతముగా (కాలికముగా) నిలబడిపోవును.

బొమ్మ 24

ఈబొమ్మలో కుడికనీనికలోని 19వ యేరియాలోను ఎడమకనీనికలోని 19వ యేరియాలోను నల్లటిగీతలు గలవు. ఈగీతలు బాగా నల్లగా లేవు. బాగానల్లగా లేవుగాన తరుణ రోగములోని మొదటిదశను తెలుపును. ఇంతకన్న మరీనల్లటి మచ్చలు గలవు. లివరును తెలుపు కుడికనీనికలోని 13వ యేరి యాలోను కుడి కనుపాపచుట్టూ నుండు రెండవ ఆవరణలోని Pancreas ను తెలుపునట్టి ప్రదేశములో నల్లటి మచ్చలుగలవు. ఈ రెండుప్రదేశములలోని మచ్చలవలన యీ రెండు అవయ వములు బాగా చెడినవని చెప్పగలము. వీటికన్నను కనుపాప చుట్టూ నుండు ఒకటి రెండు ఆవరణలలోని గీతలు నల్లపడుట వలన యీ అవయవములు బొత్తిగా చెడినట్లు తెలియవచ్చి నది. ఈ అవయవములలోని ఆమత్వచముకూడా చచ్చుపడి పోయినట్లు తెలుసుకొన్నాము. దీనినిబట్టి ఈరోగికి అజీర్ణవ్యాధి




24వ బొమ్మ

వివరణ— కుడి, ఎడమ మూత్రపిండములు రెండును చెడినవి గాని బాగా చేడ లేదు. పాంక్రియాస్, లివరులను తెలుపు 13R ఏరియాలో గుర్తులు గలవు. ఇవి అతి మూత్రలక్షణములు.




25-వ బొమ్మ

వివరణ— ఎడమ మూత్రపిండము 19 బొత్తిగా చెడినవి. సోరామచ్చ పాంక్రియాసును తెలుపు ప్రదేశములో గలదు. తెల్లగీతలు, నాడీవుంగరములు యీ రెంటివలన నాడీమండలము ఉద్రేకమును పొందినట్లు తెలుస్తుంది

బాగుగాగలదనియు, తినినఆహారము అరుగుటలేదనియు, దేహములో రోగపదార్థము బాగా పేరుకొన్నదనియు చెప్పగలము.

రోగి తల్లిని విచారించగా ఆమె యిట్లు చెప్పినది. "ఈపిల్లవానికి చిన్నప్పటినుండియు అజీర్ణవ్యాధిగలదు. మలబద్ధకమున్నది. చిన్నప్పటినుండియు యీపిల్లవాడు యెల్లప్పుడునూ యేడుస్తూనే ఉండేవాడు. ఈబాధను తప్పుకొన గలందులకుగాను నల్లమందుతో తయారుచేసిన మందులను పాదరసముతో తయారు కాబడిన మందులను వాడేదానను". ఈమందుల వాడినందువలన పర్యవసానముగా అతిమూత్రరోగము పుట్టినది. ఆలోపతీ వైద్యశాస్త్రప్రకారము యీరోగమును యథావిధిగా మందులతో అణచిపెట్టినారు. రోగమునునయము చేయుటకు బదులుగా యీమందులు మూత్రపిండముల చెడగొట్టినవి. మూత్రముతో బాటు ఆల్బుమిన్ వెళ్ళిపోవుచున్నది. ఈరోగి ముప్పదవయేటనే చనిపోయినాడు.

బొమ్మ 25

కుడికనీనికలోని 19వ యేరియాలోను, యెడమకనీనికలోని 19వ యేరియాలోను గుర్తులు కనబడుచున్నవి. రెండు మూత్రపిండములు చెడినవి. కుడికనీనికలో 24 వ యేరియాలో సోరామచ్చగలదు. Pancreas ను తెలుపు ప్రదేశములో ఐయోడిన్ మచ్చ గలదు. కుడికనీనికలోను, యెడమ కనీనికలోను నాడీఉంగరములు గలవు. ఈ ఉంగరములు కొన్ని నల్లబడినవి. మెదడును తెలుపు ప్రదేశములో రెండు కనీనికలలోను తెలుపు గీతలు కనబడుచున్నవి.

ములో మరొకరాయి చేరినది. వెనుకటిరాయికన్న యీరాయి మరీ బాధాకరమైనది. ఈ బాధను తొలగించుకొనుటకుగాను అన్ని ఆసుపత్రులలోను, ఆరోగ్యసదనములలోను ఉంటూ వచ్చాడు. బాధమాత్రము అట్లనేఉన్నది. ఏమియూ తగ్గ లేదు. ఎక్కువైనది.

దేహములో మూత్రికామ్లము యెక్కువగా తయా రగుటవలన యీ రోగము వచ్చినది. ఇట్లు దైహికముగా వచ్చిన రోగము, ఆహారవిహారములలోని లోపములను సరి చేయనిది పోదు. ఆహార విహారములలోని లోపములను సరి చేయకుండా, మూత్రపిండములలో చేరిన రాయిని తీసివేసి నందువలన ఉపయోగము జరుగలేదు. రెండు అవయవముల లోను (మూత్రపిండములలోగాని, మరి యే యితర రెండు అవయవములలో ఒకటైనా) చెడి ఒకటైనా దైహికరోగముచే చెడినయెడల, రెండవ అవయము కూడా వెంటనే చెడును. అలోపతీవైద్యులు యీ చెడిన అవయవమును తీసివేయుటతో తమ పని పూర్తి అయినదని భావింతురు. దైహికముగా కలి గిన రోగమగుటవలన, ఆహారవిహారములలోని లోపముల సరి చేయనిది రోగము పోదని చెప్పరు. ఈ లోపముల సరిచేయనిది రోగముపోదని సామాన్యజ్ఞానము గల ప్రతివానికిని తెలియును. మందువైద్యులకు యీ సంగతి తెలిసిగాని, తెలియకగాని చెప్పరు.

చికిత్సకై యీరోగి మా ఆసుపత్రికి వచ్చాడు. ఇచ్చటకు వచ్చునప్పటికే ప్రతి వదిహేను రోజులకును ఒక తడవ మూత్రపిండములలో మంటలు, పోట్లు పుట్టెడివి.

జ్వరము కూడా వచ్చెడిది. ఈ మంటలు ఒకవారము రోజు లుండి తగ్గిపోయెడివి. మా ఆసుపత్రికి వచ్చినతరువాత చికిత్సాకాలములో యీ పోట్లు ఒకపర్యాయమే వచ్చినాయి. అది కూడా వెనుకటంత తీవ్రముగా రాలేదు. అయిదు నెలలు గడిచిన తరువాత రోగము నయమై సుఖముగా యింటికి వెళ్ళినాడు.

ఆయన మిత్రులను విచారించగా యేమి తేలినదంటే- అప్పటినుండీ యీ మంటలురాలేదు గాని సంధివాతము (కీళ్ల నొప్పులు)తో బాధపడెనట. దానినిబట్టి ఆహారవిహారముల లోని లోపముల సరిచేసుకోలేదని నిశ్చయపరచుకొన్నాము మా ఆసుపత్రిలో నుండగా అపక్వాహారము నిచ్చెడివారము. ఉపవాస ముంచెడివారము. ఆసుపత్రిలో చేరిన వెంటనేను, ఆసుపత్రి నుండి వెడలి పోవునపుడును X రే ఫోటోలను తీసినాము మూత్ర పిండములోని రాతి పరిమాణము తగ్గి పోయినది.

అపక్వాహారము, ఉపవాసముల వలన దేహములోని రోగపదార్థపు పరిమాణము తగ్గిపోయినది. రక్తములోని మలినములు తగ్గిపోయినవి. మూత్రికామ్లము తయారగుట లేదు. అయిదు నెలలలోనే మూత్రపిండములోని రాతి పరిమాణము తగ్గిపోయినదంటే మనమొక విషయమును గ్రహింపవచ్చును. రక్తములోని మలినములు హెచ్చుగా ఉంటేనే యీశిలలు యేర్పడును. రక్తములోని మలినములు తగ్గగానే యీశిలలు కూడా తగ్గిపోవును. క్షారసంపదను వృద్ధిచేయు కూరలను, ఫండ్లను హెచ్చుగా తినిన యెడల యీ అమ్లముల పరిమితి




27-వ బొమ్మ

వివరణ— 7-వ ఆవరణ నల్లబడినది. గజ్జిని అణచివేయుటచే యిది యేర్పడినది. 6, 6 వరియాలలో నల్లగీతలు గలవు. ఊపిరి తిత్తులను తెలుపు 8M, 9 - 8, 9 లోను నల్లగీతలు గలవు.. పాషాణమును తెలుపు మంచు ముద్దలుకూడా చుట్టూ గలవు. మెదడును తెలుపు ప్రదేశములో క్లోరారు మందులు గలవు. అయోడిన్ చుక్కలును గలవు.

తగ్గిపోవును. లవణములుగా తయారై మూత్రముతో బయటకు పోవును.

జీర్ణావయవములలో అమోడిన్ మచ్చలుగలవు. కనీనిక వెలుపటి ఆవరణలో తెలుపు ఉంగరములు కనబడుచున్నవి. సోడియము, మెగ్నీషియములతో తయారు కాబడిన మందుల సేవించిన యీ గుర్తులు కనబడును. ఎడమ కనీనికలోని 21L యేరియా మలాశయమును తెలుపును. ఈ ప్రదేశములో నల్లటిగీతలు కనబడుచున్నవి. ఈ గీతలవలన రక్తాభిష్యందముతో బాధపడుచున్నాడని తెలుసుకొన్నాము.

## శ్వా స కో శ వ్యా ధు లు

బొమ్మ 27

ఈ రెండు కనీనికలును ఒకస్త్రీవి. ఈమె పరీక్షార్థమై మా ఆసుపత్రికి వచ్చినది. మా ఆసుపత్రికి వచ్చునప్పటికే ఈమె రోగము చాలాముదిరిపోయినది. తరువాత మూడు నెలలకే క్షయ రోగముతో చనిపోయినది చనిపోవు నప్పటికి ఈమె వయస్సు 24 సంవత్సరములు. ఈమె కనీనికలను చూచినయెడల రోగము యెట్లువృద్ధి పొందినదీ చెప్పగలము. ఏరూపముతో రోగము ప్రారంభించినదీ యేయే దశలను పొందిన తరువాత క్షయ రోగము వచ్చినదీ చెప్పగలము.

ఈమె కనీనికలలో మనకు ప్రధానముగా కనుపడునది వెలుపటి ఆవరణ. దీనినే Scurfrim అంటారు. కనీనికలోని మిగిలిన ఆవరణలలోని రంగు మాదిరిగా ఈ ఆవరణలోని రంగు లేదు. బాగానల్లపడినది. ఈ రంగుకూడా ఆవరణ అంతటిలోను

దాదాపుగా ఒకటిగానే ఉన్నది. ఈ ఆవరణను చూచిన వెంటనే చర్మము చచ్చుపడిపోయిన దనియు స్వధర్మమును నిర్వర్తించుట లేదనియు తెలుసు కొందుము.

వెలుపటి ఆవరణ నల్లపడుటకు మరొక కారణము కూడా గలదు. వంశానుగతముగా వచ్చిన రోగ ప్రవణత వలనను చర్మము చచ్చుపడి పోవును. చిన్నప్పుడు లేచిన గజ్జి, తీట, చీడ, చుండు, కరపాణి మొదలగు చర్మవ్యాధులను, పాదరసము, గంధకము, మైలతుత్తములతో అణచిపెట్టుట వలననూ చర్మము చచ్చుపడి పోవును. మందులలోని ఖనిజరూపమగు లోహములు చర్మములోని సున్నితత్వమును చచ్చుపడగొట్టును.

ఇకను స్వార్జితమైన లోపముల వలన చర్మము యెట్లు చచ్చుపడి పోయినదీ తెలుసు కొందాము. ఎల్లప్పుడునూ వేడినీటితో స్నానము చేయుట వలనను, చర్మమునకు గాలీ యెండలను తగులనీయక గుడ్డలను కప్పుట వలనను చర్మములోని సున్నితత్వము లోపించును. ఇట్లు స్వయముగా సంపాదించుకొన్న రోగపదార్థము వలన చర్మము చచ్చుపడి పోయిన యెడల కనీనికలోని వెలుపటి ఆవరణలోని రంగు ఆవరణ అంతటిలోను ఒకటిగానుండదు. కొన్ని భాగములలో మాత్రమే నల్లగాను వెడల్పుగాను ఉండును. 13 వ బొమ్మలోని వెలుపటి ఆవరణలోని రంగును యిందుకు ఉదాహరణముగా తీసికొన వచ్చును.

చర్మము చచ్చుపడి పోవుటవలన, చర్మము చేయవలసిన పనిని (బహిష్కరణను మిగిలిన మూడు బహిష్కారావ్య

వయవములు చేయవలసి వస్తుంది. శ్వాసకోశములు యీ పని చేయవలసి వచ్చినవి. అందువలన కొంత దగ్గు, తరచుగా జలుబు చేయుట, టాన్సిల్సు పెరిగిపోవుట మొదలు పెట్టినాయి. నాల్గవ యేటనే టాన్సిల్సును తీసివేసినారు. ఈ మురికి తొట్లను తీసివేశినారేగాని, రోగపదార్థపు తయారును తగ్గించ లేదు. ముక్కులద్వారా లోనికి పోవు ప్రాణవాయువు సరి పోవుటలేదు. నోటితో గాలి పీల్చవలసి వచ్చింది. ముక్కులో పెరిగిన కొయ్యగండలను విద్యుచ్ఛక్తి సహాయముతో కాల్చి వేసినారు.

రోగపదార్థపు తయారును తగ్గించక పోవుట వలన యీ రోగ పదార్థము మరొక త్రోవన బయటకు పోవలసి వచ్చినది. తరువాత మెడలోఉన్న శోషరస వాహికలన్నియు వాచినవి. మెడవాచినది. మెడవాచినదని మెడలోని శోషరస వాహికలను తీసివేసినారు.

ఈ పిల్లకు బడికిపోయే యీడు వచ్చింది. టీకాలు వేసు కొంటేనే గాని బడిలోనికి రానీయమన్నారు విద్యాలయాధి కారులు. సరేనని టీకాలు వేశారు. టీకాలు వేసిన వెంటనే ఒంటినిండా గజ్జి లేచుట మొదలు పెట్టినది. గజ్జి బయటకు కనబడకుండా ఉండగలందులకు పూతలు పూశారు. మందులు రాచిన వెంటనే మళ్లీ వచ్చింది. ఇట్లా కొన్ని నెలలపాటు గజ్జి లేస్తునే వచ్చినది. చర్మము మీద మందులు రాచియు, లోపలకు ఔషధమిచ్చియు, గజ్జిని ఎట్లాగయితేనేమి అపివేశారు. వీటివలన చర్మము బొత్తిగా చచ్చుపడి పోయింది. కనీనిక లోని వెలుపటి ఆవరణమంతా నల్లపడి పోయింది. అప్పటినుండి

యీమెగతి మరీ అధ్వాన్నమైనది. దేహమంతా తెల్లపడి పోయింది. పాండువ పుట్టినది. ఆటపాటలలోనికి పోయేదికాదు. మందమతిగా ఉండేది. మందు వైద్యులకు చూపించినారు. ఆహారములోని లోపమువలన పాలిపోతోందన్నారు. బాగా బలము రాగలందులకు కోడిగుడ్లను, మాంసమును పెట్టించారు. పాషాణము, యినుములతో తయారు కాబడిన మందులను వాడినారు. వీటికి స్ట్రిచినిన్ జోడించినారు.

లోపల తయారగుచున్న రాసాయనిక మురుగును చర్మముద్వారాను, ఊపిరితిత్తులద్వారాను ప్రకృతి బయటకు పంపినది. ఆ ప్రయత్నములన్నియు యథావిధిగా మందులతో అణచిపెట్టబడినవి. బయటకువచ్చు రోగపదార్థమంతయు లోనికి గెంటివేయబడినది. ఇట్లా లోనికి గెంటబడిన రోగపదార్థమును ప్రకృతి మలాశయముద్వారా బయటకు పంపుటకు ప్రయత్నముచేసినది. విరోచనములు బయలుదేరినవి. ఈ విరోచనములు తగ్గగలందులకు నల్లమందును వాడినారు. ఈమె జీవితమంతయు యిట్లనే గడచిపోయినది. ఒక మందు తరువాత మరొకమందును వాడ మొదలుపెట్టినారు. ఒక వైద్యుని తరువాత మరొకవైద్యునివద్దకు వెళ్ళినారు. ఆహారవిహారములలో యేమీ మార్పురాలేదు. రోగపదార్థము వృద్ధిఅగుచునే వచ్చినది. దీనినుండి పుట్టిన బొగ్గుపులుసుగాలి బయటకు పోవుటలేదు. అవసరమైన ప్రాణవాయువులోనికి వచ్చుటలేదు. వీటి పర్యవసానముగా దగ్గుపుట్టినది. కళ్ళెపడుట మొదలుపెట్టినది. ఊపిరితిత్తులు శ్లేష్మముతో నిండిపోయినాయి. ఎన్నిమందులు వాడి రోగముల అణచిపెట్ట ప్రయత్నము చేసినప్పటికినీ యీ

లక్షణములు బయటపడుచునే వచ్చినవి. ఈలక్షణములు కనపడ కుండా పోగలందులకు నల్ల మందునువాడినారు. బొగ్గునుండియు, తారునుండియు తయారుకాబడిన మందులను వీటికి జోడించి నారు. వీటి పర్యవసానముగా ఊపిరితిత్తులు చెడిపోయినవి. క్షయరోగము పుట్టినది. క్షయరోగము నయము కాగలందు లకు ఆరోగ్యసదనమునకు పంపినారు. అచ్చట గాలీ వెలుతు రులు బాగా తగిలెడివి. ఈ గాలీవెలుతురులతో రోగము నయము కావలసినదే. బాగా బలము రాగందులకు కోడి గుడ్లను, మాంసములను మెక్క పెట్టినారు. వీటికి పాలను జోడించినారు. వీటివలన ఉపయోగము కలుగకపోగా అప కారముజరిగినది. ఇరువది నాలగవయేటనే మరణించినది.

ఈమె కనీనికలనుచూచి రోగము యెట్లు వృద్ధి పొంది నదీ చెప్పినాము. ముక్కును తెలుపు 31 వ యేరియాలోను, గొంతును తెలుపు 29 వ యేరియాలోను నల్లగీతలు కనబడు చున్నవి. మెడను తెలుపు 6 వ యేరియాలో ఎడమ కనీని కలో నల్లటిచుక్కలు కనుబడుచున్నవి. కుడికనీనికలో కూడా యీచుక్కలు కనబడుచున్నవి. మెడలోని శోషరస వాహిక లను తీసివేయుటచే యీచుక్కలు కనబడుచున్నవి.

ఈకేసులోని విచిత్రమేమంటే కనుపాప చుట్టూనుండు ఒకటి రెండు ఆవరణలలోని గీతలు నలుపుకు మారలేదు. తెల్లగానే ఉన్నవి. ఈ అవయువములద్వారా రోగపదార్థము బహిష్కరింపబడుచున్నది. వీటికి సంబంధించిన బహిష్కారావ్య వయువము మలకోశముగాన, ఆ అవయవముద్వారా బహిష్క రణ జరిగినది. విరోచనములు తరచుగా అగుచుండెడివి.

కుడి ఊపిరితిత్తిని తెలుపు 8 యమ్. యేరియాలో నల్లటిగీతలు గలవు. ఎడమ కనీనికలోని 8 వ యేరియాలోను యీగీతలు గలవు. కుడి ఊపిరితిత్తిలోని మధ్య అరలోను, యెడమ ఊపిరితిత్తిలోని పై అరలోను చిల్లులు యేర్పడినవి. ఈ అరలలోనే చిల్లులు కనపడుటచేత యీ అరలుమాత్రమే చెడినవనియూ, మిగిలినవన్నీ బాగానే ఉన్నవని భ్రమపడుటకు వీలులేదు. మిగిలిన అరలుకూడా కొద్దిగనో గొప్పగనో చెడియే ఉండును. చిల్లులుపడిన భాగములలో మాత్రము రోగ పదార్థము మెండుగా చేరినదనియు అందువలన ఆ అవయవ ములు చిల్లులు పడినవనియు గ్రహించవలెను. చిల్లులుపడిన అరలలోనేగాక, మిగిలిన అరలలోకూడా రోగపదార్థము చేరుటచేతనే మృత్యువు అంత త్వరగా సంభవించినది.

కనీనికలోని బయటసగములో తెల్లటిమేఘములు కనబడుచున్నవి. ఇవి కోడిగుడ్డు పెంకులమాదిరిగా నున్నవి. దీనిని బట్టి యీమె పాషాణముతో తయారుకాబడినమందుల సేవించినదని గ్రహిస్తాము. మెదడును తెలుపు ఒకటి రెండు యేరియాలలో తెల్లగీతలు కనుబడుచున్నవి. దీనిని బట్టి యీమె బొగ్గునుండియు, తారునుండియు తయారుకాబడిన మందులు సేవించినదని తెలుసుకొందుము. ఈమె రెండుకనీనికలలోను అయోడిన్ మచ్చలు పెక్కుగలవు. మెడలోనున్న శోషరసవాహికలు వాచినవి. ఆవాపుతగ్గగలందులకు అయోడిన్ మెడచుట్టూ రాచినారు. ఈ అయోడిన్ కుడి మూత్రపిండములో చేరినది. అందువలననే కుడికనీనికలోని 19 యేరియాలో మచ్చగలదు.




29-వ బొమ్మ

వివరణ—మొదటి ఆవరణలో నల్లగీతలు గలవు ఇవి స్ట్రిచినిన్ కు గుర్తు. పాషాణపు మంచుముద్దలు చుట్టూగలవు. వీటివలన జీర్ణక్రియ సరిగా జరుగనందున ఉబ్బసవ్యాధి వచ్చింది. చికిత్సాకాలములో వెనుకటి రోగములన్ని మళ్ళీ ప్రత్యక్షమైనాయి. 7-వ ఆవరణ నల్లబడినది. శోష రసవాహికలు ఉబికివున్నాయి. మెదడును తెలుపు ప్రదేశములో బూడిదరంగు మేఘములు గలవు. 8, 8M, 9, 28, 29 లోని నల్లగీతలు కాలికదశను తెల్పుచున్నవి. కుడికనీనిక 19 లో నల్లగీత గలదు. ఎడమ 21 L లోని గుర్తు రక్తాభిష్యందమును తెలుపును.

పుట 309.

## అధ్యాయము 21

### కాలికరోగములు-కనీనికలోకనుపడుగుర్తులు

### ఉబ్బసరోగమునకు కనీనికలో కనుపడుగుర్తులు

బొమ్మ 29

ఈ కనీనికలు ఒకరోగివి. ఈరోగిని అయిదు సంవత్సరముల క్రితము చికిత్సార్థమై మాఆసుపత్రికి తీసుకొనివచ్చారు. అప్పుడే చచ్చిపోతుం దనుకొన్నారు. గత యిరువది సంవత్సరముల నుండీ యీయామె ఉబ్బసవ్యాధితో బాధపడుచున్నది. దీనితోబాటు జీర్ణాశయదోషములు కూడా గలవు. ఈ రెండేగాక మిగిలిన బాధలుకూడా ఉన్నాయి. మా ఆసుపత్రికి వచ్చునప్పటికి కళ్లె బాగా పడుచున్నది. బాగాచిక్కిపోయి నీరసపడి ఉన్నది. క్షయరోగములోని నాలగవ దశతో బాధపడుచున్నదా అనుపించినది. చాలారోజులవరకు రెండు, మూడు రోజులలోనే మృత్యువు సంభవిస్తుందా అనుపించినది. సూక్ష్మదర్శనీయంత్రముతో కళ్లెను పరీక్షచేయగా కొన్నిక్షయరోగ జీవులు కనుబడినాయి. కానీ ఆసంఖ్యను బట్టి క్షయరోగమని నిర్ధారణచేయుటకు వీలు లేకపోయినది.

కొద్దివారములు జరుగునప్పటికే రోగము తిరుగుముఖము పట్టినది. గుణము మాత్రము చాలా ఆలస్యముగా కనుబడినది. అప్పుడు స్వాస్థ్యసంకటములు యేర్పడినవి. కొద్దిగా జ్వరమువచ్చినది. ఏడునెలలపాటు చికిత్సను పొంది, యింటికి

వెడలిపోయినది. ఎనిమిదినెలలపాటు బాగా జరిగినది. రోగము మళ్లీ తిరగబెట్టినది. చికిత్సార్థమై ఆసుపత్రికి వచ్చినది.

ఈరోగా ఉబ్బసము వచ్చిపోతూ ఉండేది. వచ్చినపుడు మాత్రము చాలా బాధను కలుగచేస్తూ ఉండేది. అజీర్ణము, మలబద్ధకము బాగా ఉండేది. మూడు నెలలదాకా చాలా కొద్ది ఆహారమునే యిచ్చెడివారము. కొద్దిపాలను, పండ్ల రసమును త్రాగుచుండెడిది. జీర్ణావయవములు బాగుపడగనే ఊపిరితిత్తులకు సంబంధించిన జబ్బుచేసినది. దీనితో పాత రోగాలన్నీ నిర్మూలమైనాయి. అప్పటినుండీ గుణము బాగా కనుపడినది. ఉబ్బసము రూపుమాసిపోయినది.

లోగడ చాలకాలమునుండి మలబద్ధకము, అజీర్ణము లతో బాధపడినది. ఈ బాధలు తగ్గగలందులకు మందుల వాడుచూ వచ్చినది. జీర్ణక్రియ బాగా జరగగలందులకుగాను రసభస్మమును చాలకాలమునుండి వాడుచూవచ్చినారు. స్ట్రిచినిన్, పాషాణముల వీటికి తోడుచేసినారు. మొట్టమొదటగా యీమె కనీనికల చూచినపుడు, జీర్ణాశయమును తెలుపు మొదటి ఆవరణలో స్ట్రిచినిన్ కనబడినది. కనీనిక వెలుపటి సగములో పాషాణమేఘము లున్నాయి. ఊపిరితిత్తులను తెలుపు ప్రదేశములలోమాత్రము యీ మేఘములు బాగా గలవు,

మందులు, అజీర్ణముతోడై ఉబ్బసమును మరింత పెంచినాయి. ఈ రెంటిని తగ్గించగలందులకుగాను మందులను వాడినారు. ఇట్లా పేరుకొనిపోయిన రోగపదార్థమును బయటకు పంపుటకు ప్రకృతి ప్రయత్నముచేస్తునే ఉన్నది. ఊపిరితిత్తుల

ద్వారా బయటకు పంపుటకు ప్రయత్నించినది. న్యూమో నియా, ప్లూరిసీలు యిట్లావచ్చిన వేను. ఇట్లా వచ్చినరోగములను యధావిధిగామందులతో అణచిపెట్టినారు. మంచుగడ్డను రబ్బరు సంచులలో వేసి యెనుముకొమ్ముకు కట్టినారు. దీనితో ఊపిరి తిత్తులలోని బాధ తగ్గినది. కాని ఉబ్బసపుబాధ అధికమైంది.

ఈ ఉబ్బసము తగ్గగలందులకు యెచ్చపెచ్చటి మందు లనో వాడినారు. గుణము మాత్రము కనబడలేదు. బాధ లెక్కువగుచూ వచ్చినాయి. మందులతో అణచిపెట్టబడిన పాతరోగాలన్నీ ఒకదానివెంట ఒకటి బయటపడినాయి. ప్రకృతివైద్యచికిత్సా ప్రక్రియలద్వారా చికిత్సను పొంది సుఖ ముగా యింటికిపోయింది.

ఈమె కనీనికలోని ఒకటి, రెండు ఆవరణలు నల్లబడి నాయి. జీర్ణాశయములోని ఆమత్వచమంతయు చచ్చుపడినది. జీర్ణక్రియ బాగా జరగగలందులకు స్ట్రిచినిన్ యిచ్చారు. చిన్న ప్రేగులను తెలుపు రెండవ ఆవరణలో అయోడిన్ మచ్చలు గలవు. ఊపిరితిత్తులలోని బాధ తగ్గగలందులకు కొమ్ముమీాద టించరైడు రాచినారు.

శ్వాసనాళికలను తెలుపు 27, 28 యేరియాలలోని లోపలి భాగములోను, ఊపిరితిత్తులను తెలుపు 8, 9 యేరి యాలలోను నల్లటి గీతలు గలవు. ఈ గీతలు రోగము కాలిక రూపమును పొందినట్లు చెప్పుచున్నవి. మెదడును తెలుపు ఒకటి, రెండు యేరియాలలో బూడిదరంగు ఉన్నది. బొగ్గు నుండియు, తారునుండియు తయారుచేసిన మందులను వాడి నట్లు తెలియవచ్చుచున్నది. కనీనిక వెలుపటి ఆవరణ బాగా

నల్లగా నున్నది. దానికి లోపలనుండు ఆవరణయు నల్లగానే ఉన్నది. దీనినిబట్టి శోషరసవాహికలు తమ పనిని సరిగా చేయుటలేదని చెప్పవచ్చును.

కుడి కనీనికలో 18వ యేరియాలో ఒక గీతగలదు. ఈమె చిన్నప్పుడు మంచుగడ్డల మీద పడినది. మోకాలికి దెబ్బతగలినది. కుడి కనీనికలోని 13 వ యేరియాలో తెలుపు గీతలు గలవు. ఎడమ కనీనికలో 22 వ యేరియాలో నల్లటిగీతలు గలవు. ఈ ప్రదేశము మలాశయమును తెలుపును. ఈ యేరియాలో నల్ల గీత లుండుటచేత యీమె రక్తాభిష్యందముతో చాలా కాలమునుండీ బాధపడుచున్నదని తెలుసుకొందుము.

## వంశానుగతముగా వచ్చిన రోగప్రవణత.

బొమ్మ 28

ఈ కనీనికలు ఒక రోగివి. ఈ రోగిని మూడు సంవత్సరముల క్రితము చూచినాను. నేను చూచినప్పుడు మెడమీద ఎడమ ప్రక్కన ఒక కాయ లేచినది. అది జీడిగింజంత ఉన్నది. ఈ కాయ మెత్తగా నున్నది. మధ్యలో మాత్రము యెర్రగా నున్నది. పక్వమై పగులుతుం దనిపించినది. అలోపతీ వైద్యులందరును యిది అంత ర్వ్రణమని నిర్ణయించారు. వెంటనే తీసివేయకపోతే ప్రమాదము వస్తుందని భయపెట్టినారు. అపుడు యీ రోగి చికిత్సార్థమై మా ఆసుపత్రికి వచ్చినాడు. ఈ కనీనికలు పైకి కనుపడుటకు గోధుమరంగుగానే ఉన్నవి గాని శ్రద్ధగా పరీక్షచేసిన యెడల నీలపురంగు గలవిగా కనబడినది. కనుపాపచుట్టూనుండు ఒకటి, రెండు ఆవరణ




28-వ బొమ్మ

వివరణ—— ఏడవ ఆవరణలో తెల్లటి ఉంగరము గలదు. 2-వ ఆవరణలో నల్ల గీతలు గలవు. కాలిక మలబద్ధకముతో బాధపడినది. గజ్జిమచ్చలు చాలాగలవు. ఎడమ 6, కుడి 17, కుడి 23, ఒకటి రెండు ఆవరణలలోని గీతలు నల్లబడినవి. ఎడమ 10లో తెల్లగీతలుగలవు. హృదయ కోశములోని లోపమును తెలుపుతుంది. ఎడమ 18లో మూలగీత గలదు. రైలు ప్రమాదమువలన ఎడమ మోకాలు ఒత్తుకుపోయినది.

లలో గోధుమ రంగు బాగానే కనబడుచున్నది. ఈ గోధుమ రంగునకు అడుగున మాత్రము నీలవురంగు కనబడుచున్నది. నేనీ సంగతిని చెప్పగానే తన కనీనికలు పుట్టినప్పుడు నీలవురంగు గలవిగానే ఉన్నవి గాని తరువాత గోధుమరంగు గలవిగా మారినట్లు అతని తల్లి చెప్పినట్లు చెప్పినాడు.

కనీనికలో వెలుపటి ఆవరణ అంతా నల్లగానే ఉన్నది. మెదడును తెలుపు ఒకటి రెండు యేరియాలలో మాత్రము తెల్లగానేఉన్నది. కనీనికలరంగు మారుటయు, కనీనికలోని వెలుపటి ఆవరణరంగు నల్లపడుటయు, యీ రెంటినీబట్టి యీ రోగికి వచ్చిన గజ్జి, తీట, చీడ మొదలగు చర్మవ్యాధులను మందులతో అణచిపెట్టినారని తేలినది. ఈ రోగితల్లి చనిపోవుటచే యీ విషయమును తెలిసికొనుట కష్టమైనది. ఏడు యేళ్లప్పుడు యీ రోగికి సంధివాతము వచ్చినది.ఆరునెలలపాటు యీ జబ్బుతో బాధపడినాడు. మంచువైద్యులు యధావిధిగా వైద్యము చేసినారు. రెండు సంవత్సరములు గడవగానే మళ్ళీ అదే రోగమువచ్చినది. ఆరునెలల పాటు మంచములోనుండి లేవలేదు. అప్పటినుండి యీ సంధివాతము అప్పుడప్పుడు వచ్చిపోతూనే ఉండేది.

ఈ సంధివాతమును తగ్గించుటకు అలోపతీ వైద్యులు Salicylates (సలైసిలిక్ఆసిడ్‌తో తయారు కాబడిన మందులు) ను వాడుతారు. ఈ మందుల వాడినందువలన కనీనిక యొక్క వెలుపటి ఆవరణలో తెల్లటి ఉంగరములు కనబడుచున్నవి. సోడియము, మెగ్నీషియము, పొటాషియములతో తయారైన మందుల సేవించిననూ ఈఉంగరములు కనుబడును.

బ్రోమిన్ ప్రధానముగా మొదటులో చేరును. Salicylates ను సేవించిన జీర్ణావయవములు చచ్చుపడిపోవును. అందువలన కను పాప చుట్టూనుండు ఒకటి, రెండు ఆవరణాలు నల్లపడును. ఈ కసీనికలో యిది ప్రధానముగానే కనబడుచున్నది.

సంధివాతము మొదటగా యేడవయేట వచ్చినది. యథావిధిగా మందులతో యీ రోగమును అణచివేసినారు. అప్పటినుండీ మలబద్ధకము యెక్కువైనది. అజీర్ణము ఉంటూనే ఉన్నది. రెండు సంవత్సరములు గడచిన తరువాత మళ్లీ సంధివాతము వచ్చినది. మందులతో వెనుకటి మాదిరిగనే అణచి పెట్టినారు. రోగము నయమైనదన్నారు. మలబద్ధకము, అజీర్ణము మరీ యెక్కువైనాయి. రోజులు గడచిన కొలదీ తొండ ముదిరి ఊసరవెల్లి అయినది. బేధి మందులను వాడితేగాని విరేచన మయ్యేదికాదు. ఎనిమాకూడా తరచుగా చేస్తూ ఉండేవాడను.

పదునొకండవయేట గజ్జిలేచుట మొదలు పెట్టినది. మలకోశముద్వారా దేహములో తయారగు మురుగు రాకపోవుటచే చర్మముద్వారా పంపుటకు ప్రయత్నము చేసింది. గజ్జి, తీట, చీడ, కరపాణి మొదలు పెట్టినాయి. యిట్లాపుట్టిన చర్మవ్యాధులను పాదరసము, మైలతుత్తము, గంధకములు రాచి నయము చేసినారు. ఎన్నిమందుల రాచినా యీ గజ్జి వెంటనే తగ్గలేదు. రెండు నెలలపాటు బాధించినది.

ఈ గజ్జిని యిట్లాఅణచి పెట్టుటచేత కసీనికలో గజ్జి మచ్చలు యేర్పడినాయి. కుడి కసీనికలోని 17, 23 యేరియాలలోను, ఎడమ కసీనికలోని 6-వ యేరియాలోను యీ గజ్జి

మచ్చలు గలవు. చిన్నప్రేగుల తెలువు రెండవ ఆవరణలో గూడా యీ గజ్జిమచ్చలు చాలా గలవు.

ఈ రోగికి చిన్నప్పుడే టీకాలు వేసినారు. టీకాల వలన బాధ లేకుండా చాలా యింజక్షనుల చేశారు. దేహములో తయారైన రాసాయనిక మురుగు, మందులలోని ఖనిజ రూపములగు లోహములు గలిగి కనీనికరంగును మార్చినాయి. జీర్ణాశయవాలు చచ్చుపడి పోవుటవలన అజీర్ణము, మలబద్ధకము యెక్కువై పోయినాయి యెక్కువగుటవలన ఈ మలినములను ఊపిరితిత్తుల బయటకు పంపుటకు ప్రకృతి ప్రయత్నము చేసింది. అందువలననే తరుచుగా జలుబు చేస్తూవుండేది. ఈ జలుబును మందులతో అణచిపెట్టినారు.

ముప్పదవయేడు వచ్చునప్పటికి యీ సంధివాతము యెక్కువై పోయినది. దేహములో తయారగు రాసాయనిక మురుగు, సేవించిన మందులు, హృదయ గమనమును ఆవుచేసినాయి. నలుబది ఒకటవయేట మెడమీద కాయ యేర్పడినది. దానికి టించరైడు రాచినారు. "ఇది అంత్రవ్రణము, వెంటనే తీసివేయకపోతే ప్రమాదముసంభవిస్తుం"దని మందు వైద్యులు చెప్పగా పరీక్షార్థమై మావద్దకు వచ్చారు. కనీనికను చూచి పైచరిత్రనంతను చెప్పితిని. మామాటలునమ్మి రోగి మా ఆసుపత్రిలో చికిత్సను పొందినాడు. ఈ రోగికి యెన్ని స్వాస్థ్య సంకటములు కలిగినదీ వివరముగా చెప్పవలెనంటే చాలా పెద్ద గ్రంథమగుతుంది. అందువలన టూకీగా చెవుతాను.

రెండు నెలలు జరుగు నప్పటికి మలబద్ధకము పోయినది. మూత్రము తెంవుగా వచ్చేది. చమట బాగా పోసేది. మొద

టలో జలుబు చేసింది. నాల్గు వారాల పాటుండి తగ్గిపోయింది. మూడు నెలలు జరిగిన తరువాత సంధివాతము వచ్చింది. మూడు వారాల పాటుండి యీ సంధివాతము తగ్గిపోయింది. ఇంకో నెల జరుగు నప్పటికి ఒంటినిండా గజ్జి లేచింది. ఈ గజ్జి నాలుగువారాల పాటుండి తగ్గిపోయింది. దీనితో బాటు మెడ మీద ఉన్న కాయగూడా తగ్గిపోయింది. గజ్జిమాత్రము ఆరు నెలలదాకా అప్పుడప్పుడు వచ్చిపోతునే ఉండేది. గజ్జి లేచినపుడు యేమీ గాభరాపడక ఉపవాసముండేవాడు. మందులేమీ రాచేవాడు కాడు. ఇట్లా ఆరు నెలలు గడచు నప్పటికి రోగమంతా పోయింది.

చికిత్సా కాలమంతటిలోను మూడు పర్యాయములే ఉపవాస మున్నాడు. ఆ రోజులలో కూడా కాయలను, పండ్లను తినెడివాడు. శుష్కోపవాసము కాదు.

కనుపాప చుట్టూనుండు ఒకటి, రెండు ఆవరణలలో నల్ల గీతలు గలవు. Salicylates ను సేవించినందు వలన యీ రెండు ఆవరణలలోను నల్లగీతలు యేర్పడినాయి. కుడికనీనికలో లివరును తెలుపు 13 వ యేరియాలో తెల్లగీతలు గలవు. లివరు తన ధర్మమును సరిగా నిర్వర్తించుట లేదు. కుడి కనీని కలోను, యెడమ కనీనికలోను గజ్జి మచ్చలు విశదముగానే కనబడుచున్నవి. ఈ మచ్చలు ముదురు గోధుమరంగుతో నున్నవి. దీనిని బట్టి చాలా సంవత్సరముల క్రితమే గజ్జి లేచిన దనియు, దానిని మందులతో యథావిధిగా అణచి పెట్టినా రనియు తెలియుచున్నది.

మెదడును తెలుపు ఒకటి, రెండవ యేరియాలలో

వెల్ల వేసినట్లుగా తెలుపురంగు గలదు. ఎడమ కనీనికలోని 18 వ యేరియాలో ఒక మూల గీత గలదు. చిన్నప్పుడు రైలులో ప్రయాణము చేయుచుండగా ప్రమాదము సంభవించినది. ఎడమకాలు విరిగిపోయినది.

## మ ధు మే హ ము

బొమ్మలు 13, 18, 22, 24.

అతిమూత్రము అనురోగములో రెండు రకములు గలవు. ఎక్కువ పరిమితితో తక్కువ తడవలు మూత్రమగుట ఒక రకము. తక్కువ పరిమితితో యెక్కువ తడవలు మూత్రమగుట రెండవ రకము. సామాన్య ఆరోగ్యవంతుడు దినమునకు అనగా 24 గంటలకు 6 పర్యాయములు మూత్రమునకు వెడలును. ఈ ఆరు పర్యాయములలోను $2\frac{1}{2}$ పైంట్లు మూత్రమును బయటకు పంపును. అతిమూత్రముతో బాధపడువారు దినమునకు 10, 12 పర్యాయములు మూత్రమునకు వెడలుదురు. వెడలిన అన్ని పర్యాయములు మూత్రము తెంపుగానే అగును.

ఇకను రెండవ రకమును గూర్చి విచారించెదము. దీని లక్షణమేమంటే అనేక తడవలు మూత్రమునకు వెడలవలసి వచ్చినట్లుండును. వెడలినప్పుడల్లా కొద్దిగానే మూత్రమగుచుండును. ఇట్లు దినమునకు 20, 30 పర్యాయములు వెడలవలసివచ్చును. మూత్రము తెంపుగా రాదు. ఇరికిఇరికి అగుచుండును. ఈ రెండు రోగములలోను చెమట పోయును. మలబద్ధకము సంపూర్ణముగా నుండును.

కండరముల కదలికకు చక్కెర అవసరము. ఈ చక్కెరను రక్తమునుండి కణములు తీసికొనకుండా రోగపదార్థము అడ్డుపడును. ఇట్లు అడ్డుపడినందువలన రక్తములోని చక్కెర రక్తములోనే మిగిలి పోవును. కండరములలోనికి రాదు గాన శరీరకష్టము చేయవలసి వచ్చినపుడు నీరసముగా ఉండును.

కండరములలోనికి పోని చక్కెర అంతయూ రక్తముతో కలిసి తిరుగుచుండును. రక్తములోని ద్రవరూప మాలినముల నన్నిటిని మూత్రపిండములు వడియగట్టి మూత్రముగా బయటకు పంపును. చర్మము సరిగా పనిచేయకపోవుటచేతను, చర్మము ద్వారారావలసిననీరుకూడా మూత్రపిండములద్వారా రావలసి వచ్చును. రక్తములోని చక్కెరను, మిగిలిన రోగపదార్థమును బయటకు పంపుటచేతను, చర్మముద్వారా బయటకురావలసిన నీటినికూడా మూత్రపిండములే బయటకు పంపవలసివచ్చుట చేతను, మూత్రపిండములు యెక్కువగా పనిచేసి చచ్చుపడి పోవును.

మూత్రపిండములు చెడుటకు ముందుగా Pancreas, లివరు, జీర్ణకోశము, చిన్నప్రేగులు చెడియుండును. ఇవన్నీ చెడితే గాని మూత్రపిండములు చెడవు. కసీనికను చూడగా Pancreas, లివరు, చిన్నప్రేగులలోని రోగము కాలికదశను పొందగా మూత్రపిండములలోని రోగము తరుణదశలోనే ఉండును.

ఇటువంటి కేసులలో కసీనికలోని క్రిందిసగము రంగునకును, పైసగము యొక్క రంగునకును సంబంధముండదు. క్రింది సగము నల్లగానుండును. పైసగము తెల్లగానుండును. దీనినిబట్టి చర్మతలమున ఉన్న రక్తప్రసరణము బాగుగా లేదని తెలును.

మెదడులోని, ఊపిరితిత్తులలోని, హృదయములోని, రక్తపు పోటు అధికముగా నున్నదనియు తేలుతుంది. చిన్న వ్రేగుల తెలుపు రెండవ ఆవరణ పెద్దదగును.

మూత్రపిండములు చెడుటకుముందు లివరు,pancreasలు యెట్లు చెడునదీ తెలుసుకొందాము. ఆహారపదార్థములోని చక్కెరనంతను లివరు గ్లైకోజిన్‌గా మార్చి తనలో ఉంచుకొనును. అవసరమునకు సరిపోయినట్లుగా యీ చక్కెరను కొద్ది కొద్దిగా విడుదల చేయుచుండును. లివరు నుండివచ్చు చక్కెర యెక్కువతక్కువలు గాకుండునట్లుగా pancreas చూచును. ఈ పనిలో లివరుమీద pancreas బ్రేకని చెప్పవచ్చును. బ్రేకు సరిగా పనిచేయలేకపోవుటవలన, అవసరమునకు మించిన చక్కెర వచ్చి రక్తములో కలియును. రక్తముతో కలిసి ప్రవహించక నిలబడిపోవును. ఇదే మధుమేహమునకు మూలము.

ప్రతిమధుమేహరోగములలోను Pancreas చెడియే ఉండును. కుడికనీనికను చూచినయెడల మూడవ ఆవరణలో అనగా 13వ యేరియాకు పైభాగమందు గల త్రికోణాకారము ఉబికియే యుండును. ఈ అవయవము తనధర్మమును నిర్వర్తించుచున్నంతవరకు యీ ప్రదేశములో యేమియు మార్పురాదు. 13, 18, 22, 24 బొమ్మలలో యీ ప్రదేశము చచ్చుపడినట్లు తెలియగలదు.

ఈప్రదేశముయొక్క స్వభావమును బట్టి, రంగునుబట్టి యీఅవయవమునకు సంబంధించిన రోగము తరుణరూపమును పొందినదీ, కాలికరూపమును పొందినదీ చెప్పగలము. చిన్నప్పుడు లేచిన గజ్జిని యేమందుతోనైనా అణచిపెట్టినయెడల

ఆగజ్జిమచ్చలుకూడా యీప్రదేశములో కనుబడును. చిన్నప్పుడు వచ్చిన యేరోగమునకు వాడిన మందులైనా యీ ప్రదేశములో నిలవ ఉన్నయెడల, అవికూడా కనపడును. చిన్నప్పుడు యేరోగములు రాలేదనియు, మందులను మచ్చునకైనా వాడలేదనియు రోగులు యేమేమో చెప్పుదురు. వారి యింటివైద్యులుగాని, వారి బంధువులలో పెద్దవారినైనను అడిగినయెడల యీ సంగతి బయటపడును. కొంతమందికి యెంతస్వల్ప మందైనను బాధ పెట్టును.

Pancreas లోని లోపముల తెలువుటకు కసీనికానిదానము బాగా తోడ్పడుతుంది. ఈ అవయవమునకు సంబంధించిన జబ్బులు తరుచుగా వచ్చుచున్నప్పటికిని అలోపతీ వైద్యము యేమియు చెప్పదు. కశేరుకానిదానము కూడా యీ విషయమును గూర్చి మూకీభావము వహిస్తుంది. జీర్ణకోశము, చిన్నప్రేగులు పెచ్చుపెరిగి దీని నెత్తిన పడును. అక్కడ యేలోపములు వచ్చినప్పటికినీ జీర్ణకోశములోగాని, చిన్న ప్రేగులలోగాని జబ్బుచేసినట్లే భావింతురు. కసీనికను చూచినయెడల రుగ్మత యే అవయవములో ఉన్నదీ (జీర్ణకోశములో ఉన్నదీ, చిన్న ప్రేగులలో ఉన్నదీ, Pancreas లో ఉన్నదీ) స్పష్టముగా చెప్పగలము. మిగిలిన అవయవములలోని లోపములకన్న యీ అవయవములోని లోపమును యీ నిదానము విశదముగా చెప్పును. ఏ అవయవములోని లోపము వలన బాధ ప్రారంభించినదీ విశదముగా చెప్పగలము.

## Bright's disease బ్రైటు రోగము

మూత్రము వెంట ఆల్బ్యుమిన్ వెడలిపోవును. మందు వైద్యులు యీ రోగమును ఆల్బ్యుమినేరియా అందురు. అతి మూత్రవురోగము మాదిరిగనే, ఆల్బ్యుమినేరియా కూడా దైహికలోపమువలననే వచ్చినదేను. ఈ రోగములలో మూత్రపిండములు చెడినప్పటికినీ యివి ప్రప్రథమముగా చెడవు. Pancreas, లివరు, చిన్నప్రేగులు చెడినతరువాతనే మూత్రపిండములు చెడును. పైన చెప్పిన అవయవములలోని లోపములు కాలికరోగచిహ్నముల తెలుపగా, మూత్రపిండములోని లోపములు తరుణరోగచిహ్నముల తెలుపును. మూత్రపిండములు చెడుటకు ముందు Pancreas, లివరులు యెట్లు చెడునదీ వెనుకటి పేజీలలో చదివినాము. రక్తములోని చక్కెర పదార్థభాగము, ఆల్బ్యుమిన్ భాగములు పెరుగును. రక్తములోని ద్రవరూపమలిన మలినములను మూత్రపిండములు వడియగట్టినపుడును దానితోబాటు చక్కెర, ఆల్బ్యుమిన్‌లను కూడా వడియగట్టును.

మానవదేహమంతయు కణముల సమూహము. మానవదేహమునకు యేలక్షణములుండునో, కణమునకును ఆ లక్షణములుండును. ప్రతి కణము ప్రాణవాయువును తీసికొనును. ఆహారమును స్వీకరించును. మాలిన్యముల బయటకు గెంటివేయును. పునఃసృష్టిచేయును. సమరస న్యాయము వలన ప్రతి కణము రక్తములోని ఆహారపదార్థమును స్వీకరించుకొని, మాలిన్యముల బయటకు పంపివేయును. ప్రతి కణములోను రోగపదార్థము నిలవ ఉండుటవలన సమరస

న్యాయము జరుగుటకు అభ్యంతరము కలుగును. కణములలోని మలినములు కణములలోనే నిలిచిపోవును. రక్తములోని ఆహారపదార్థము రక్తములోనే నిలిచిపోవును. కణములు పోషక పదార్థములేక శుష్కించిపోవును. రక్తములోని మలినముల మూత్రపిండములు వడకట్టవలసివచ్చుటచేత యివియు చచ్చుపడిపోవును. ఇట్లు ఉభయతా నష్టము కలుగును. అనుక్షణము దేహములో తయారగు ఆమ్లములవలన ఈ నష్టము మరింత హెచ్చును. దేహములో రోగపదార్థము చేరినట్లు కనీనికను చూచి చెప్పవచ్చును. కనీనికరంగు నల్లపడును. ముఖ్యముగా వెలుపటి ఆవరణ రంగు నల్లపడును. సరిగాపనిచేయని అవయవములలో తెల్లగీతలు కనుపడును. జీర్ణావయవములు చెడును. కనుపాప చుట్టూనుండు ఒకటి రెండు ఆవరణలు నల్లపడును. కనీనిక అంతటిలోగాని, కొంతలోగాని తెల్లని నాడీఉంగరములు కనుబడును.

అనుక్షణము దేహములో తయారగు ఆమ్లముల వలనను, మందుల వలనను, కణములు చచ్చుపడిపోయిన యెడల కనీనికలో కాలికరోగ చిహ్నములు కనుపడును. 25 వ బొమ్మలోని కుడి, యెడమ కనీనికలలో 19 వ యేరియాలలో ఈ గుర్తులు కనుబడును.

## రంకు రోగములు

పురుషునకుగల రహస్యావయవములు దేహమునకు వెలుపల ఉండును. స్త్రీ కన్నను ఈ రహస్యావయవములు లోనికి ఉండును. స్త్రీకి కూపకములో నున్న మిగిలిన అవయవ

ములతోబాటు యివియు కలిసి ఉండును. మలకోశములో మలము నిలవయుండుటచే కలిగిన మంటలు సన్నిహితదోషము చేత ఈ జననేంద్రియములలో కూడా కలుగును. వివరములు కోరువారు 'ప్రకృతి వైద్యతత్వము' పుస్తకములోని 17 వ అధ్యాయమును చదువవలెను.

రహస్యావయవములలో కలిగిన రోగములవలన దేహమునకు అపకారము జరుగుతుందిగాన శస్త్రముల నుపయోగించి ఈ అవయవముల వెంటనే తీసివేయుమంటారు అలోపతీ వైద్యులు. రోగముయొక్క మూల కారణముల తొలగించకుండా మంటలు కలిగిన అవయవముల తొలగించి నందువలన రోగము పోదు. ఈ రోగములను మందులతో అణచిపెట్టకుండా ప్రకృతి వైద్యపద్ధతులతో నయముచేసినయెడల దేహమునకు అపకారము జరగదు. ఉపకారమే జరుగును.

తరుణరోగములను పూర్తిగా రానీయక మందులతో అణచిపెట్టి నయముచేసినామని చెప్పుటవలననే కాలికరోగములు వచ్చుచున్నవి. ఈ విషయములను గత పదిహేను సంవత్సరములనుండీ మా ఆసుపత్రికి వచ్చిన కేసులవలన రుజువు చేసినాము. తరుణ రోగములను మొదటగానే క్రమప్రకారము నయముచేసినయెడల ఈ కాలికరోగములుగాని, వాటినుండి పుట్టు తరువాతి రోగములుగాని రావు. సుఖరోగముల నుండి వచ్చు సవాయి, కొరుకుడు, బొక్కనాసి మొదలగు చిలిపి రోగము లేవియు రావు.

సవాయిరోగము వలన దేహమునకు జరుగు అపకారముకన్న, గనేరియా వలననే దేహమునకు యెక్కువ

అపకారము జరుగుతుందని అలోపతీవైద్యులు భావిస్తున్నారు. కానీ ప్రత్యక్షములో అట్లు కనపడుటలేదు. . మిగిలిన అన్ని రోగములను మందులతో అణచిపెట్టినందువలన యే దుష్ఫలితములు కలుగునో, యీ చిలిపిరోగములను అణచిపెట్టినందు వలననూ అటువంటి దుష్ఫలితములే కలుగును. ఈ దుష్ఫలితములు మాత్రము మరీతీవ్రముగా నుండును. గనేరియాను అణచిపెట్టినందువలన కలుగు దుష్ఫలితములకన్న, సవాయి రోగమును అణచి పెట్టినందు వలననే యెక్కువ దుష్ఫలితములు కలుగుచున్నట్లుగా మా ఆసుపత్రిలో నయము చేసిన రోగుల చరిత్రలను బట్టి తెలుసుకొన్నాము. అయితే యిందులో ఒక చిత్రమున్నది. గనేరియా అణచిపెట్ట బడిన కొద్ది రోజులకే మళ్లీ కనబడుతుంది. సవాయిరోగము యింతకన్న ఆలస్యముగా బయట పడతుంది. గనేరియా త్వరగా బయట పడుతుంది, కాబట్టియే కాబోలు, సవాయికన్న గనేరియా వలననే దేహమునకు యెక్కువ అపకారము జరుగుతుందన్నారు మందు వైద్యులు. గనేరియాకన్న సవాయి ఆలస్యముగా బయట వడుటకు కారణ మేమంటే సవాయిని అణచి పెట్టుటకు తీవ్రాతితీవ్రమైనట్టిన్ని, మందగతిగా నడచునట్టిన్ని మందుల వాడుతారు. అందువలననే ఆలస్యముగా కనబడుతుంది.

సవాయి, గనేరియాలు రెండూ ఒకే రోగమునకు పేర్లు. ఈ రెండు రోగములలోను బాధపడు అవయవములు ఒకటే. మిలిగిన అన్నిరోగములలో వలనే ఒకే రోగపదార్థము నుండియే యీ రెండు రోగములు పుట్టినవి. ఈ విషయమును

సుప్రసిద్ధ అలోపతీ వైద్యవరులే ఒప్పుకొన్నారు. డాక్టరు ఫ్రాంకెల్ అలోపతీ విశ్వవిద్యాలయ పట్టభద్రుడు. సుఖ రోగముల గూర్చి ప్రత్యేకముగా చదివినారు. వారే మన్నా రంటే—

'ఈ (Contagious Poison) విషము అనగా రోగ పదా ర్థము యొక్క లక్షణమేమిటని మనము విచారింప బనిలేదు. మనకంత ప్రిధానమూ కాదు. దేహములోని రోగ ప్రవణతను బట్టియే యీ రెంపురోగములూ వృద్ధిపొందును.'

సవాయినుండి గనేరియా పుట్టుతుంది. గనేరియా నుండి సవాయి పుట్టుతుంది. దేహారోగ్యము బాగా ఉన్నయెడల గనేరియా గాని, సవాయిగాని రావు. దేహములో తయారగు రాసాయనిక మురుగు చర్మముద్వారా బయటకు పోవును. దేహములోని ధాతుశక్తి తగ్గిపోయి చర్మము తన ధర్మమును నిర్వర్తించక చచ్చుపడిపోయిన వారికి యీ గనేరియా, సవాయిలు త్వరగా వచ్చును.

డాక్టరు జోసఫ్ హెర్మన్ వియన్నాలోని వీడన్ ఆసుపత్రిలో ప్రధాన వైద్యులు. విశ్వ విద్యాలయ పట్ట భద్రులు. ప్రపంచములోని సుఖ రోగముల కుదుర్చు ఆసు పత్రిలలోకల్లా వీడన్ ఆసుపత్రి ముఖ్యమైనది. ఈ ఆసు పత్రిలో ముప్పది సంవత్సరముల నుండి ప్రధాన వైద్యులుగా పని చేసిన డాక్టరు హెర్మన్ యే మన్నాడంటే—

'మిగిలిన అన్ని తరుణరోగముల వలెనే సవాయి గనేరియాలు తేలికగానే కుదురును, మందులతో అణచిపెట్టక,

ప్రకృతి వైద్య చికిత్స పద్ధతులతో నయము చేసిన యెడల యీ బాధలన్నీ అంతరించును. కాలిక రోగము లేవియు రావు. ఈ విషయములను ముప్పది సంవత్సరములనుండి నేను అనుభవములో పెట్టి చెప్పుచున్న మాటలేగాని, బూటకములు గావు'.

బొమ్మ 30

ఈ బొమ్మ ఒక రోగియొక్క కుడికనీనిక. ఈ రోగికి గనేరియా తగిలినది. దానిని మందులతో అణచిపెట్టినారు. పైన పూతలుపూసియు, లోని కౌషధమిచ్చియు యీరోగమును నయముచేసినారు అలోపతీ వైద్యులు. కుడి కనీనికలోని 20వ యేరియా (urethra) జననేంద్రియముల తెలుపును. ఈప్రదేశములో తరుణరోగముపు రెండవదశను తెలుపు చిహ్నము గలదు. కుడి కనీనికలోని 22-వ యేరియా (Prostrate bladder) ఉద్దీపక గ్రంధిని తెలుపును ఈప్రదేశములో కాలికరోగపు మొదటి దశను తెలుపు చిహ్నములు కనదుచున్నవి. గనేరియా రోగమును అణచిపెట్టుటవలన (Chronic prostities) మూత్రకోశములో మంటలు పుట్టినవి. ఈ మంటలు చాలా కాలమునుండి నిలిచిపోయి కాలికమైనవి. మూత్రము బయటకు వచ్చుటలేదు. అందువలన కడ్డీవేసి తీయవలసివచ్చింది. వెంటనే ఆపరేషను చేయకపోతే ప్రమాదము సంభవిస్తుందని అలోపతివైద్యులు చెప్పారు. ఆపరేషను చేసినట్లయితే బాధ యెక్కువగుతుంది. ఈబాధలే మృత్యువును త్వరగా ఆహ్వానిస్తాయి.

ఇట్లు అణచిపెట్టబడిన రోగపదార్థము మూత్రకోశము

లోను, మూత్రపిండములలో చేరినది. అందువలననే మూత్రము వెంటచీము, ఆల్బుమిన్‌లు వచ్చుచున్నాయి. అప్పటినుంచీ రోగి పుంస్త్వము పోయినది. కుడికనీనికలోని 15-వ యేరియా వృషణములను తెలుపును. ఆప్రదేశములో కాలికరోగ చిహ్నములుగలవు. కుడికనీనికలోని 12-వ యేరియా చేతిని తెలుపును. తరువాత యీ రోగికి గనేరియాకు సంబంధించిన సంధివాతము వచ్చినది. ఆప్రదేశములో తెల్ల గీతలు కనబడుచున్నవి. ఈరోగములోని చిత్రమేమంటే ఒక జాయింటు (కీలు) మాత్రమే బిగుసుకొనిపోవును. సంధివాతము వేరు విధముగా వచ్చినయెడల అన్నికీళ్లు బిగుసుకొనిపోవును. గనేరియాను అణచిపెట్టుటవలన వచ్చిన సంధివాతము చాలా బాధను కలుగచేయును. మూత్రాశయములో పుట్టిన మంటలను అణచిపెట్టినందువలన శ్వాసనాళికలలో మంటలు కలుగును. ఈ మంటలను బ్రొగ్గుండియు, తానునుండియు తయారుచేసిన మందులతో అణచిపెట్టినారు. సంధివాతమును అణచిపెట్టుటకు వాడిన మందులవలన జీర్ణకోశము, చిన్న ప్రేగులు చచ్చుపడిపోయినాయి. అందువలన అజీర్ణము మలబద్ధకము యెక్కువై పోయినాయి. అపానవాయువులు యెక్కువైనాయి. ఈకేసులోని చిత్రమేమంటే చిన్నమెదడును తెలుపు 2-వ యేరియాలో క్షయినాదంను కనబడుచున్నది. ఈచిన్న మెదడులో జననేంద్రియములలో కలుగు ఉద్దీపనకు సంబంధించిన కేంద్రముగలదు. ఈరోగికి చిన్నప్పటినుండీ కామోద్రేకము యెక్కువగా ఉండేది. ఈ రోగికి ఆరు, యేడు సంవత్సరములలో చలిజ్వరము వచ్చినది. ఈచలి

జ్వరమును తగ్గించ గలందులకు క్వయినా వాడినారు. ఈక్వయినా వలననే కామోద్రేకము కలిగినది.

బొమ్మ 31

ఈ బొమ్మ ఒక రోగి కుడి కనీనిక. ఈమెకు యేబది సంవత్సరములు. ఇరువది అయిదు సంవత్సరముల క్రితము యీమెకు సుఖరోగములు కలిగినవి. ఈ రోగములు భర్త నుండి యీమెకు సంక్రమించినాయి. మందిచ్చిన వైద్యుడు యీ విషయమును యీమెతో చెప్ప లేదు. తరువాత, కొద్ది రోజులకే యీమె ప్రకృతి వైద్యశాస్త్ర గ్రంథములను చదువుట తటస్థించినది. తన రోగముయొక్క పుట్టుపూర్వోత్తరముల యీమె తెలుసుకొన్నది. మా ఆసుపత్రికి వచ్చునప్పటికే పై అంగలిలో రంధ్రము పడినది. అందువలన మాటలాడ లేకపోయినది. ఘనపదార్థమును తిన లేదు. ఏమైనా తినినయెడల ఆ రంధ్రము ద్వారా ముక్కులోనికిపోయి, కొరపోవును. సవాయిరోగమును పాదరసము, పొటాషియములతో అణచిపెట్టినారు. ఇట్లు అణచిపెట్టిన కొన్ని సంవత్సరములకు గాని బొక్కనాసి యేర్పడ లేదు. గర్భాండములలో మంటలు యేర్పడినాయి. అందువలననే కుడి కనీనికలోని 15 వ యేరియాలో తెల్లగీతలు కనుపడినాయి. మూత్రకోశములో అయోడిన్ మచ్చ గలదు. అప్పటినుండి యీమెకు కామోద్రేకము తగ్గినది. స్త్రీత్వమే లోపించినదని చెప్పవచ్చును. ఒళ్లంతా పోట్లు, మంటలు పుట్టినాయి. ఇది sciatic rheumatism (సియాటిక్ రుమాటిజమ్) అని salicylates ను వాడినారు. సల్లమం




31-వ బొమ్మ

వివరణ— ఈమెకు సవాయిరోగము 25 సం.ల క్రితము భర్త నుండి సంక్రమించింది. అంగిలిలో కురుపులేచింది. మాటలాడలేదు. ఘనపదార్థమును తినలేదు. 15, 18 లలో గుర్తులు గలవు. 22 లోని అయోడిన్ గుర్తు వలన కామోద్రేకము తగ్గినదని తెలుసుకోవచ్చును. 28, 10 లోను అయోడిన్ మచ్చలు గలవు. 29 లో తెల్లగీతలవలన శోషరసవాహికలు వాచినట్లు తెలుసుకొనవచ్చును.

మును తోడుచేసినారు. అప్పటికి తగ్గిపోయినది. తరువాత కాళ్లూ, చేతులూ చచ్చుపడినాయి.

ఈ రోగములన్నీ పాదరసమును వాడినందువలననే వచ్చినాయి. ఈ పాదరసము వెన్నెముకలో క్రింది భాగములో చేరినది. కనీనికలోని పైసగములో యీ పాదరసము కనబడుచున్నది. ఆకుపచ్చని రంగుతో పాదరసము కనబడుచున్నది. అర్ధచంద్రాకారములు కనబడుచున్నవి. అయోడిన్ మచ్చలు 10, 23, 28 యేరియాలలో కనబడుచున్నవి. మెడలోని శోషరసవాహికలు ఉబుకుటచే 29 వ యేరియాలో తెల్లగీతలు కనబడుచున్నవి. మెదడును తెలుపు ఒకటి, రెండు యేరియాలలో తెల్లగీతలు కనబడుచున్నవి. ఈ రోగికి తరచుగా తలనొప్పివచ్చును. తల దిమ్ముగా ఉండును.

మా ఆసుపత్రిలో ఉండి ప్రకృతివైద్య పద్ధతులతో రోగమును నయముచేసుకొన్నది. నాలుగునెలలు జరుగునప్పటికి బొక్క నాసిపోయినది. ఆరునెలలు జరుగునప్పటికి రోగము పూర్తిగా నయమైనది. అప్పటినుండి ప్రకృతివైద్యమును వ్యాప్తిచేయుటకు తన జీవితమును వినియోగింప నిశ్చయించుకొన్నది. మందులతో పనిలేకుండానే చాలామంది రోగముల కుదిర్చినది.

---

# అధ్యాయము 22.

## నాళరహిత గ్రంధులు

నాళసహిత గ్రంధులని, నాళరహిత గ్రంధులని గ్రంధులు రెండు రకములు. ఈ అధ్యాయములో నాళరహిత గ్రంధులను, ఆ గ్రంధులనుండి ఊరురసమును గూర్చి తెలుసు కొందాము.

బొమ్మ 33.

నాళరహిత గ్రంధులనగా (1) పీనియల్ గ్రంధి (2) పిట్యూటరీ గ్రంధి (3) థైరాయిడ్ గ్రంధి (4) పారాథైరాయిడ్ గ్రంధులు (5) ఎడ్రినాల్ గ్రంధులు (6) వృషణములు (7) థైమస్ గ్రంధులు. (8) కోకీగల్ గ్రంధి (9) కరోటిడ్ గ్రంధి. ఈ గ్రంధులు దేహములో యే యే ప్రదేశములలో ఉండునో, యీ గ్రంధుల నుండి ఊరు ధాతువుల వలన దేహములో యే పనులు జరుగునో తెలుసు కొందాము.

ఈ గ్రంధు లన్నియు దేహములోపల ఉండును. ఈ గ్రంధులలో ఊరు ద్రవములు రక్తములోను, రసములోను కలియును. ఈ ద్రవములు కలియుటచేతనే రసము రక్తము వాటివాటి ధర్మముల నిర్వర్తించుటకు వీలగుచున్నది.

నాళరహిత గ్రంధులలో Pancreas ఒకటి. దీనిలో రసము ఊరును. ఈరసము జీర్ణక్రియకు పరోక్షముగా ఉపయోగ పడును. ఇన్ని రసములు యిన్ని గ్రంధులనుండి ఊరుటచేతనే

దేహధర్మములు సక్రమముగా నడచుచున్నవి. ఏగ్రంథియైనను తనధర్మమును సరిగా నిర్వర్తించని యెడల దానినుండి ఊరురసము రక్తములోగాని, రసములోగాని కలియదు. కలియని యెడల వాటి ధర్మములు సరిగా జరుగవు.

1. పీనియల్ గ్రంధి:— దీనికి మేధోమూలగ్రంధి అని కూడా పేరు గలదు. ఇది చిన్న మెదడునకు ముందువైపున దిగువగానుండును. ఏడవ సంవత్సరము వచ్చునప్పటికి యిది పెద్దదగును. యుక్తవయస్సు వచ్చునప్పటికి దీనిలో అమర్పాట మేర్పడును. దీనిలో చిన్నచిన్న కణములుండును.

బ్రతికి ఉన్నంతకాలము, పిట్యూటరీ గ్రంధితో పాటు యీ గ్రంధికూడా బాగా పనిచేయుచునే ఉండునని చెప్పం వారును లేకపోలేదు. పీనియల్ గ్రంధిలో ఊరిన రసములు, పిట్యూటరీ గ్రంధిలోనికి పోవును. ఈ జీవద్రవములు దేహ మంతటా వ్యాపించును. దేహయాత్ర సక్రమముగా జరుగ వలెనంటే యీ గ్రంధులన్నియు సంపూర్ణ ఆరోగ్యముతో ఉండవలెను.

ఈ గ్రంధిలో ఊరురసము జననేంద్రియములలో కలుగు చలనమును అదుపులో పెట్టును. ఈ గ్రంథి శక్తివంతముగా పనిచేయని యెడల జననేంద్రియములలో సంచలనము కలిగి కామోద్రేకము యెక్కువగును. కామోద్రేకమును అదుపులో నుంచుకో దలచినవారు, యీ గ్రంథి ఆరోగ్యమును సరిగా చూచుకొనవలెను. దేహము యొక్క పెంపుదలకు యీ గ్రంధి చాలా అవసరము.

చేపలు మొదలగు జంతువులలోనూ యీ గ్రంధి గలదు. మానవులలోని గ్రంధికన్న చేపలలోని యీ గ్రంధి బాగా పని చేయు చుండును. ఆ జంతువులలో యీ గ్రంధి రెండుగానుండును. ఈ రెంటిలోను ఒక గ్రంధియే యీపనిని చేయును. రెండవది కన్ను మాదిరిగా నుండును. మూడవ కన్నుగా ఉంటుంది గాని దీనిమీద పొరలు ఉంటాయి. మానవుని తలకు వెనుక ప్రక్కన మూడవ కన్ను ఉండేదని చెప్పు కధలుకూడా గలవు.

2. పిత్యూటరీ గ్రంధి:— ఈ గ్రంధి కంటికి వెనుకగా నుండును. మెదడునకు దగ్గరగా నుండును. దీనిలో మూడు భాగములుండును. ఈ మూడు భాగముల ధర్మములు వేరుగా నుండును. ఇవి పుట్టుకలోనే మూడు భాగములుగా నుండును. ఆవేవన (1) లోపలి భాగము (2) మధ్య భాగము (3) వెలుపటి భాగము. ఈ మూడు భాగములలోని లోపలి భాగము చచ్చుపడుట వలన (స్వధర్మమును నిర్వర్తించక పోవుట వలన) ముఖము వికృతాకారము పొందును. కాళ్లూ, చేతులూ రెండూగాని, ఒకటిగాని వికృతాకారము పొంద వచ్చును.

ఈ మూడు భాగములలో యే ఒకటైనా చచ్చుపడుట వలన జననేంద్రియములలోని చైతన్యము తగ్గును. పుంస్త్వము తగ్గిపోవును.

3. థైరాయిడ్ గ్రంధులు:— ఈ గ్రంధులు కంఠములో ఉన్నవి. వీటికి యౌవనగ్రంధులని కూడా పేరు గలదు. ఈ గ్రంధులు బాగా పనిచేస్తున్నంత కాలము దేహ

ములోని పాటవము, ఉత్సాహము, జిగిలి మొదలగు సుగుణము లుండును. ఎప్పుడీ గ్రంథి బలహీనమై, తృప్తికరముగా పని చేయదో అప్పుడే దేహమునందు దౌర్బల్యము, ఔదాసీన్యము, నిరుత్సాహము మొదలగు దుర్గుణములు ప్రవేశించుటయేగాక, దేహముయొక్క పాటవము తగ్గి మేదోవృద్ధి కలిగి దేహము వజవజలాడు చుండును.

ఈ రెండుగ్రంధులు కంఠమునకు చెరిఒక ప్రక్కనా ఉండును. స్వరపేటికకు యిరుప్రక్కలా ఉండును. చిన్నతనములో ఆపరేషను చేసి యీ గ్రంధులను తీసివేసినగాని, గ్రంధులు చచ్చుపడి పోయినగాని, మానసికబ్బతగాని, పిచ్చిగాని పుట్టును.

పెద్దవారికి యీగ్రంధులను తీసివేసినయెడల Myxedema అనే రోగము పుట్టుతుంది. ఈ గ్రంధులనుండి ఊరురసములో అయోడిన్ ఉండును. ఈ గ్రంధులనుండి ఊరు ద్రవములు నత్రజనిని దేహమునకు ఉపయోగపరచును. ఈ గ్రంధుల స్వరూపమే లోపించినగాని, యిందులో ఊరు రసము ఊరని యెడలగాని, నత్రజని ప్రధానముగాగల పదార్థములలోని నత్రజని అట్లనే నిలబడి పోవును.

మెదడునకుపోవు రక్తమును యీగ్రంధులు రెండునూ అదుపులో పెట్టును. రక్తమును యెక్కువ తక్కువలుగా పోనీయవు. ఈ గ్రంధులు రెండునూ బాగా పనిచేయుచున్నంత వరకును దేహములోని యౌవనము నిలిచిఉండును.

4. పారా థైరాయిడ్ గ్రంధులు:— ఇవి కూడా కంఠములోనే ఉండను. థైరాయిడ్ గ్రంధులకు పైగా నుండును.

ఒక్కొక్క ప్రక్కన రెండేసి చొప్పున ఉండును. థైరాయిడ్ గ్రంథులకును, పారా థైరాయిడ్ గ్రంథులకును పుటుకలో యేమియు సంబంధముండదు. అవి నిర్వర్తించు ధర్మములలోను యేమియూ సంబంధము లేదు. ఈ పారాథైరాయిడు గ్రంథులను తీసివేసిన యెడల దేహములో తయారగు రాసాయనిక మురుగు అపరిమితముగా పెరిగి పోవును.

ఈ గ్రంథులను తీసివేసి నందువలన కండరములలోని పటుత్వము బొత్తిగా తగ్గిపోవును.

5. ఎడ్రినాలు గ్రంథులు:—ఇవి రెండుగ్రంథులు. కుడి మూత్రపిండమునకు పైభాగమున ఒకటియు, యెడమ మూత్ర పిండమునకు పై భాగమున వొకటియు ఉండును. వీనికే రేనాల్ గ్రంథులనికూడా పేరుగలదు. మూత్ర పిండాగ్ర గ్రంథులనికూడా చెప్పవచ్చును. యౌవన గ్రంథియందు ఊరునట్టి ద్రవములు రక్తములోకలిసి పని చేయును. ఈపనియొక్క ఫలమును స్త్రీ, పురుష అండములకు చేర్చునట్టి రెండు గ్రంథులలో ఎడ్రినాలు గ్రంథులు ఒకటి. ఈ గ్రంథులనుండి 'ఎడ్రినాలిన్' అనేధాతువు ఊరును. ఈధాతువు రాగోదయకాలమున ఊరి రక్తముతోకలిసి, హృదయమునకుచేరి, అందు వేగమును కలిగించును. 'ఎడ్రి నాలిన్' అనే ధాతువు ప్రణయకాలముననే గాక, కోపమువచ్చి నప్పుడూ, భయము కలిగినప్పుడూ, కూడా ఊరుతుంది. ఈ జీవద్రవము, రక్తములోకలిసి హృదయమునకు చేరిన తోడనే,హృదయముయొక్క స్పందనము లెక్కువగును. భయ కాలమున పారిపోవుటకును, కోపకాలమున పగతీర్చుకొనుట

కును, కావలసిన బలమిందువలన సమకూరును. ఆవేగముతోనే దేహములోని శక్తి అంతా జాగరితమవుతుంది. కనుక యీ గ్రంథులన్నియు మిథునక్రియయందు అన్యోన్యాశ్రయముగా పనిచేస్తూ, రక్తాన్ని నాడులను రెచ్చగొట్టి పనిచేయించును. మజ్జానాడులు వృద్ధిపొందని జంతువులందు యీగ్రంథులే మిథునకాండకు తోడుపడుతవి.

'ఎడ్రినాలిన్' రక్తముతో కలియనందువలన చర్మము నల్లపడును. కండరములు బలహీనమగును. రక్తపుపోటు తగ్గును. మానసిక స్తబ్ధత, నీరసముకలుగును.

6. జననేంద్రియములు:—ఇవి స్త్రీపురుషు లిద్దరియందు నూ ఉండును. కుడి, యెడమ భాగములందు చెరొకటియు ఉండును. పురుషుల్లో ఉండు వాటిని వృషణములనియు, స్త్రీలలో ఉండు అవయవములను గర్భాండములనియు పిలుతురు. పురుషులలోని వృషణములును, స్త్రీలలోని గర్భాండములును మిథునక్రియకువలయు ధాతువులను పూరించు గ్రంథులు. పురుషులలోని వృషణముల తీసివేసినయెడల దేహముయొక్క పెరుగుదల తగ్గిపోతుంది. మగజంతువులలోని వృషణములను ఉండవలసినచోటును తప్పించి మరొకచోట చేర్చినను, కామోద్రేకము తగ్గలేదు. కామము వృద్ధిపొందుచున్నే వచ్చినది.

మగజంతువులలోని వృణములతీసివేసి, వాటి స్థానములలో బదులుగా స్త్రీల గర్భాండముల ప్రవేశపెట్టి ఏటి ఫలిత మెట్లుండునోయని పరిశోధనలు చేసినారు. పరిశోధనల ఫలితముగా ఆ మగజంతువులలోని మగతనము లోపించి స్త్రీత్వము వృద్ధిపొందినదని తెల్సుకొన్నారు.

ఈగ్రింధులలో ఊరు జీవద్రవములు మిధునకాండకు అవసరమగు శక్తి నిచ్చునటకు ఉపయోగపడుటయే గాక మరొక ఉపయోగముకూడా గలదు. తినిన ఆహారపదార్థము పచనమగుటకును యీధాతువు తోడుపడును

. థైమస్ గ్రంధి:—ఈగ్రంధి రొమ్ములో ఉంటుంది. యౌవన గ్రంధియందు ఊరునట్టి ద్రవములు రక్తములోకలిసి పనిచేయునపుడు ఆ ఫలమును స్త్రీ, పురుషాండములకు చేర్చునట్టి గ్రింధులలో థైమస్ రెండవది. ఉరమునందలి శ్లేష్మమును ఎగుడుదిగుడు కాకుండా చేస్తూవున్నది కనుక దీనికి శ్లేష్మగ్రింధి అని కూడా పేరు. ఇది ఉరోస్థికి పైభాగమునను, మెడకు దిగువగా ఉండును. ఈ గ్రింధి చిన్నతనములోనే బాగా పెరిగి ఉండుననియు, మానవ దేహము పెరిగినకొద్దీ యీ గ్రింధి తగ్గిపోవుననియు వెనుకటివారు భావించెడివారు. నవీనశాస్త్రజ్ఞులు మాత్రము వేరుగా భావించుచున్నారు. పుట్టినది మొదలు కొని యుక్తవయస్సు వచ్చువరకును యీ గ్రింధిపెరుగును. యుక్తవయస్సు వచ్చినతరువాత యీ గ్రింధి పెరుగుదల ఆగి పోయి మరణము సంభవించు వరకును అట్లనే నిలబడిపోవును.

మగజంతువులలోని వృషణములు, ఆడజంతువుల లోని గర్భాండములు. తీసివేసినందువలన థైమస్గ్రింధి పెరుగును. వృద్ధిపొందును. థైమస్ గ్రింధిని తీసివేయుట వలన వృషణములు గర్భాండములు వృద్ధిపొందును. మిగిలిన జంతువులనుండి తీసిన థైమస్గ్రింధిని కుక్కలకు పెట్టుటవలన ఆకుక్కల దేహములు పెరిగినట్లును, బుద్ధిమాత్రము యేమియు పెరగలేదనియు తెలుసు కొన్నారు. ఇట్లు తీసిన థైమస్గ్రం




30-వ బొమ్మ

వివరణ —— 21R, 22 ఏరియాలలో తెల్లగీతలు గలవు. గనేరియాను అణచినందువలన యేర్పడుతుంది. వృషణమును తెలుపు 15 యేరియాలో గుర్తు గలదు. 12-వ యేరియాలోని తెల్లగీత సంధివాతమును తెలుపును. 2-వ యేరియాలో తెల్లగీతలు గలవు. క్వైనైనురంగు కనబడుతుంది. దీనివలన చిన్నప్పటినుండి కామోద్రేకముతో బాధపడుచున్నాడు.

థిని చేపలకు పెట్టుటవలన దేహము మాత్రము పెరిగినదనియు బుద్ధి అట్లనే నిలబడిపోయినదనియు తెలుసుకొన్నారు. ఇతర జంతువులనుండి తీసిన థైరాయిడ్ గ్రంథిని పెట్టుట వలన దేహము తగ్గిపోవును.

థైమస్‌గ్రంథిని పెట్టుటవలన దేహములో తయారగు ఆమ్లముల పరిమితి తగ్గును. అందును ముఖ్యముగా భాస్వరముతో తయారగు ఆమ్లముల పరిమితి తగ్గును. థైమస్ గ్రంథిలో ఊరు ధాతువు ఆమ్లములను విడగొట్టును.

థైమస్ గ్రంథివలన దైహిక శక్తులు పెరిగి, మానసిక శక్తులు తగ్గును.

8. కోకీగల్‌గ్రంథి (Cocygal Gland):— వెన్నుపూసల లోని తోకపూసలకు దగ్గరగా ఉండును. గనుక కోకీగల్ గ్రంథి అను పేరు వచ్చినది. ఈ గ్రంథివలన దేహమునకు యేమి ఉపయోగము కలుగునదీ యింతవరకును తెలుసుకొనబడ లేదు. ఈ గ్రంథిని తీసివేసి నందువలన నాడీవ్యాధులు కలుగునని మాత్రము తెలుసుకొన్నారు.

9. కరోటిడ్‌గ్రంథి (Carotid Gland) :— తెనుగు పేరు దొరకనందున యింగ్లీషు పేరేవుంచినాము. ఈ గ్రంథి 323-వ బొమ్మలో చూపబడ లేదు. ఈ గ్రంథివలన దేహమునకు జరుగు ఉపయోగములు సంపూర్ణముగా తెలుసుకొనబడ లేదు. ఈ రెండు ( 8, 9 ) గ్రంథులవలన దేహమునకు ఒక ఉపకారము జరుగుతుందని తెలుసుకొన్నారు. దేహములో తయారగు ఆమ్లములను యీ రెండు గ్రంథులనుండి

ఊరుధాతువులు విశ్లేషము పొందించి, విడగొట్టి, దేహములోని బహిష్కార్యావయవముల ద్వారా బయటకు పంపును.

## నాళరహిత గ్రంధుల పరస్పర సంబంధము

ఈ నాళరహిత గ్రంధులవలన దేహమునకు జరుగు ఉపకారమును గూర్చిగాని, యీ గ్రంధులలో ఒక గ్రంధికి మరొక గ్రంధితో గల సంబంధమును గూర్చిగాని, చాలా సంవత్సరములవరకును మందు వైద్యవరులకు తెలియలేదు. మందు వైద్యము ప్రారంభించి యిన్నిసంవత్సరములు గడచినను యీ విషయమును తెలుసుకొనక పోవుట విచిత్రము. ఈ విషయమును గూర్చి చాలాకొద్ది సంవత్సరములనుండియే విరివిగా పరిశోధనలుజరిగినవి. ఈపరిశోధనల ఫలితముగా యీ గ్రంధుల నుండి ఊరుధాతువులు దేహారోగ్యమునకు చాలా అవసరమని నిశ్చయపరచుకొన్నారు.

శరీరశాస్త్రమును గూర్చి చెప్పిన వైద్యవేత్తలందరు యీ గ్రంధులగూర్చి యేమన్నారంటే ఈ గ్రంధులవలన ఆదిమ మానవులకు యేమైనా ఉపయోగము కలిగెడిదేమో గాని యిప్పుడు మాత్రము యేమీ ఉపయోగము కలుగుట లేదు. యిది మందువైద్యులలోని ఒక తెగవారి అభిప్రాయము. ఈ గ్రంధుల తీసివేసినందువలన యేమీ అపకారము జరుగదని వాదించువారును లేకపోలేదు. ఆపరేషనులచేసి యీ గ్రంధుల తీసివేసినందువలన చాలామంది కాలికరోగములతో బాధపడినారు. యమదర్శనమునకు వెళ్ళినవారును గలరు.

ఇకను రెండవ తెగవారు గలరు. ఏమనుచున్నారంటే, దేహమునకు కలుగు ప్రతిరోగము కూడా యీ గ్రంథులు సరిగా పనిచేయక పోవుటవలననే వచ్చుచున్నవి.

ఇవి రెండును అతివాదములే. ఈ గ్రంథులవలన దేహమునకు యేమీ ఉపకారము జరుగదనుట యెంత నిజమో, యీ గ్రంథులవలన దేహమునకు అంతా అపకారము జరుగుతుందనుట కూడా అంతే నిజము.

ఈ గ్రంథులకును, దేహమునకును గల సంబంధమును గూర్చి తెలుసుకొనుటకు విపరీతమైన పరిశ్రమచేసిన వారిలో సీజా ఒకరు. ఈ గ్రంథులనుండి ఊరుధాతువులవలన దేహములో యేమి మార్పుకలుగునో వివరముగా చెప్పినారు. 'Internal secretions and principles of medicine' అనే వారి పుస్తకమేమి చెప్పుతున్నదంటే, 'కంటికి సమీపములోనుండు పిట్యూటరీ గ్రంథిలో ఊరుధాతువు స్వతంత్ర, అస్వతంత్ర నాడీమండలముల ద్వారా ప్రవహించును. థైరాయిడ్, ఎడ్రి నాలుగ్రంథుల ద్వారా పనిచేయును. దేహములో కలుగు అన్ని కదలికలకును యీ గ్రంథియే (దీనినుండి ఊరుధాతువే) మూలమగుచున్నది.

భౌతిక శాస్త్రమునకును, ఆధ్యాత్మిక శాస్త్రమునకును యిచ్చటనే మైత్రి కుదురుచున్నది. దేహమునకు కావలసిన మానసిక శక్తులు, నైతిక శక్తులు పీనియల్ గ్రంథివలనను, పిట్యూటరీగ్రంథివలనను కలుగుచున్నవి. ఈ రెండు గ్రంథుల వలనను దేహములోని అన్ని కదలికలును కలుగుచున్నవి.

ఆధ్యాత్మికవాదులు యీరెండు గ్రంథుల వలననే దేహమునకు కావలసిన సర్వశక్తులును కలుగునని చెప్పుచున్నారు.

ఈ గ్రంథుల పరస్పర సంబంధమును యీ గ్రంథుల ధర్మములగూర్చి సౌజా యిట్లు అభిప్రాయపడుచున్నాడు.

మజ్జాముఖము యొక్కయు, నాడీమండలముయొక్కయు కదలిక కంతకును పిట్యూటరీగ్రంథియే మూలము. Somatic brain కదలిక కంతకును యీ గ్రంథియే మూలము. ఈ గ్రంథి రెండు భాగములుగా విభజింపబడినది. ఈ రెండుభాగములకును ఒకటి ముందు భాగమనియు, రెండవది వెనుక భాగమనియు పేర్లు గలవు. వీటిలో ఊరిన ధాతువే మూత్రపిండాగ్రగ్రంథియొక్క కదలికకు మూలము.

మూత్రపిండాగ్రగ్రంథులనుండి ఊరినధాతువే దేహములో జరుగు రాసాయనిక గ్రంథమున కంతకును మూలము. ఈ గ్రంథమంతయు పిట్యూటరీ గ్రంథిలోని ముందుభాగము వల్లనే జరుగును. పిట్యూటరీ గ్రంథియొక్క ముందుభాగము వలన మూత్రపిండాగ్రగ్రంథియొక్క కదలికయు, అందువలన దేహములోని రాసాయనిక గ్రంథమంతయు యెట్లు జరుగునో, అట్లనే పిట్యూటరీ గ్రంథిలోని వెనుకభాగములో ఊరుధాతువు వలన థైరాయిడ్ గ్రంథిలోని కదలిక అంతయు జరుగుచున్నది.

పిట్యూటరీ గ్రంథియు, మూత్రపిండాగ్రగ్రంథియు, థైరాయిడ్ గ్రంథియు మూడును కలిసి ఎడ్రినాలు సమూహ గ్రంథులని పేరు.

పిట్యూటరీ గ్రంథిలోని వెనుకభాగమునలన దేహములో పరిధానముగా జరుగు రాసాయనిక గ్రంథమంతయు జరుగును.

దేహములోని యే భాగమునకు స్పృశించినా, బాధ తగిలినా, పిట్యూటరీ గ్రంథిలోని వెనుకభాగమునకు యీ కదలికలు తెలుస్తవి. దేహములోపలా, బయటా జరుగు కదలికలన్నియు పిట్యూటరీ గ్రంథిలోని వెనుకభాగమునకు తెలుస్తవి.

పిట్యూటరీగ్రంథిలోని వెనుకభాగములో నానా కేంద్రములున్నవి. ఈ కేంద్రములలోని ఒక సున్నిత కేంద్రము మీద నాడీ మండలము యొక్క కదలిక అంతయూ ఆధారపడి ఉన్నది. దేహములోని యే ప్రదేశములో ప్రవహించు రక్తము నైనను పిట్యూటరీ గ్రంథిలోని యీ భాగము అదుపులో నుంచును. మెదడులోనికి పోవు రక్త పరిమాణమును, నాడీమండలములోనికి పోవు రక్తపరిమాణమును యీ భాగమే అదుపులో నుంచుకొనును.

## The Test Organ

పిట్యూటరీ గ్రంథి యొక్క రెండు భాగముల నడుమ యీ అవయవము యిమిడి ఉండును. రక్తములోని లోపముల వలన యీ అవయవమునకు దెబ్బతగలకుండా రెండు ప్రక్కలా యీ భాగములు కాపాడుచుండును. థైరాయిడ్ గ్రంథి, మూత్రపిండాగ్రగ్రంథులలో ఊరుధాతువుల వలన రక్తము యెట్లు శుభ్రపడునదియు, లోగడనే చదివినాము. దేహము ఆరోగ్యముగా ఉండవలెనంటే థైరాయిడ్, మూత్రపిండాగ్ర గ్రంథులు యెట్లు తృప్తికరముగా పనిచేయవలసినదీ లోగడనే చదివినాము. థైరాయిడ్, మూత్ర పిండాగ్ర గ్రంథులను

పిట్యూటరీగ్రంథి అదుపులో నుంచుటచేత దేహారోగ్యమునకు అనగా రక్తమును శుభ్రపరచుటకు ఈ పిట్యూటరీ గ్రంథియే పరోక్షముగా కారణమగుచున్నది.

థైరాయిడ్, పారాథైరాయిడ్ గ్రంథులలో ఊరు ధాతువులు సూక్ష్మజీవులకు మూలమగు రోగపదార్థమును విశ్లేషమును పొందించచేయును. రోగపదార్థము విశ్లేషము పొందుటచేత రోగమురాదు. రోగపదార్థము విడబడి బహిష్కార్యావయవముల ద్వారాబయటకు పోవును. దేహము యొక్క ఆరోగ్యము పిట్యూటరీ, థైరాయిడ్, మూత్రపిండాగ్రగ్రంధుల మీద ఆధారపడి ఉండుననియు, దేహములోని రోగనిరోధక శక్తిని వృద్ధిచేయుటకు, పైగ్రంథులలో ఊరు ధాతువులు బాగుగా సాయపడుననియు, తెలుసుకొన్నాము. ఈ గ్రంథుల ధర్మముల వృద్ధిచేయుటవలన రోగనిరోధకశక్తి పెరుగును.

దేహము బాగా ఆరోగ్యముగా ఉన్నప్పుడు పిట్యూటరీ, థైరాయిడ్, మూత్రపిండాగ్ర గ్రంధులలో ఊరు ధాతువుల వలన యేమి జరుగునను విషయమును గూర్చి సౌజా యిట్లు చెప్పుచున్నాడు.

మూత్రపిండాగ్రగ్రంధులలో ఊరు ధాతువునకు (Adrenocidose) యడ్రినోసిడోస్ అని పేరు ఈ ధాతువు గాలిలోని ప్రాణవాయువును స్వీకరించును. ఇట్లు స్వీకరించిన ప్రాణవాయువును సన్నని కేశనాళికలకు అందచేయును. ఎర్రని కణములలో యీ Adrenocidose ఉండును.

దేహములోని రోగపదార్థమును మండము కలిగించు -తువులలో మూత్రపిండాగ్రగ్రంధిలో ఊరు ధాతువు

ముఖ్యమైనది. మిగిలిన గ్రంథులలో తయారగు ధాతువుల వలనను రోగపదార్థపు మందము కలుగును. ఆయా ధాతువులకు మందము కలిగించు స్వభావమును వృద్ధి చేయుటకును యీ మూత్రపిండాగ్రి గ్రంథిలో ఊరు ధాతువే సహాయ పడును.

పై విషయములన్నీ పరిశోధనా పూర్వకముగా నిర్ధారణ చేసినవేను, గాలి కబుర్లుగా చెప్పిన సంగతులు మాత్రము కావు.

రోగముయొక్క పుటుకను గూర్చియు, రోగము వలన దేహమునకు అపకారము జరుగుతుందా, ఉపకారము జరుగుతుందా అను విషయమును గూర్చియు ప్రకృతివైద్యము వారి సిద్ధాంతముల సెాజా ఒప్పుకొంటాడు. కాని చికిత్సా ప్రకరణములలోనికి వచ్చునప్పటికి ప్రకృతివైద్యచికిత్సా ప్రక్రియలతో సెాజాకు ఖుద్రి కుదరదు. రోగము నయము చేయుటకు మందుల వాడమంటాడు. విషములవాడినా ఫరవా లేదంటాడు. ఈ విషములవలన కలుగు దుష్ఫలితముల గూర్చి అతనికేమీ లెక్క లేదు.

శాస్త్రభాగ మంతటిలోను, పిట్యూటరీ గ్రంథియొక్కయు, మిగిలిన నాళరహితగ్రంథుల ఉపయోగమును గూర్చి సెాజా బాగానే చెప్పినాడు.

పాదరసము, అయోడిన్, క్వయినా మొదలగు లోహములు థైరాయిడ్, పిట్యూటరీ, మూత్రపిండాగ్రిగ్రంథులను ఉద్రేకపరచునవియు, ఆ గ్రంథుల ఉద్రేకపరచినందువలన ఆయా గ్రంథులలో ఊరు ధాతువుల పరిమాణము పెరిగి

సూక్ష్మజీవుల త్వరగా నాశనము చేయుననియు, అందు వలన దేహమునకు ఆరోగ్యము త్వరగా కలుగు నంటాడు. ఈ మందుల వాడినందువలన దేహములోని రోగనిరోధక శక్తి పెరుగు నంటాడు.

పాదరసము మొదలగు లోహములను వాడినందు వలన యీ గ్రంధులలో ఊరు రసముయొక్క పరిమాణము యెట్లు పెరుగునదీ చెప్పలేకపోయినాడు.

సౌజా వాదమంతయు రోగలక్షణముల బట్టియే చికిత్స చేయుమంటాడు. రోగము యొక్క పుట్టుపూర్వోత్తరముల గూర్చియు, వృద్ధి క్షయముల గూర్చియు. ప్రకృతి వైద్యమువారి అభిప్రాయముతో యేకీభవిస్తాడు రోగ పదార్థము పెరిగిపోవుటవలన పిట్యూటరీ, థైరాయిడ్, మూత్రపిండాగ్రగ్రంధులలోని ధాతువులు బయటకు రాకుండా అడ్డపడునను సంగతిని విస్మరించాడు.

రోగపదార్థము తయారు కాకుండాను, పుట్టిన రోగపదార్థమునైనను దేహమునకు హానికలుగకుండులాగున, బయటకు పంపవలెనని, ఆలోచించి నట్లయితే, ప్రమాదము లేని, ప్రకృతి వైద్య పద్ధతులను, అవలంబించెడి వాడే. నిరపాయకరమైన ప్రకృతివైద్య పద్ధతులవలన పిట్యూటర్ మొదలగు నాళరహితగ్రంధులు బలపడునని ఒప్పుకొనెడివాడే.

సౌజా వాదమంతయు, బలహీనమైన నాళరహితగ్రంధులను పుష్టివంతములుగా చేయుటయే. వీరవాదన ప్రకారము యీపని రెండుపద్ధతులవలన సాధ్యమవుతుంది. ఒకటి

పాదరసము, క్వయినా మొదలగు లోహములతో తయారుకా బడినమందుల వాడి బలహీనమైన నాళరహితగ్రంథులలో ఉద్రేకము కలుగచేయుట- రెండు, యేగ్రంథి బలహీనముగా ఉంటుందో చూచి జంతువులలో నుండి తీసిన ఆగ్రంధిని రోగుల దేహములలో ప్రవేశపెట్టుటయు- ఈ రెండుపద్ధతులు అపాయకరములే: ఎందువలనంటే పాదరసము మొదలగు ఖనిజ రూపమగు లోహములతో తయారుచేయుబడిన మందుల వాడినందువలన ఆయాగ్రంథులలో ఉద్రేకముకలిగి రోగము తాత్కాలికముగా తగ్గిపోయినప్పటికీని, తరువాత ఫలితముగా నీరసము కలుగును. ఇంతేగాక ఆయామందులు దేహములో నిలిచిపోవును. రక్తముతో కలిసి తిరుగవు, నిలబడిపోవును. ప్రాణవంతమైన యీదేహములో నిర్జీవమైన ఖనిజములకు తావులేదు. దేహమునకు అపకారము కలుగకుండా, రోగ పదార్థమును బయటకు పంపి, యెప్పటికప్పుడు, ప్రకృతి యెట్లు కాపాడుచుండునో, అట్లనే యీ నిర్జీవమైన ఖనిజములను బయటకు పంపుటకే ప్రకృతి సదా ప్రయత్నము చేయుచుండును. తరుణరోగములను మందులతో అణచిపెట్టినందు వలననే కాలికరోగములు వచ్చుచున్నవి.

పిట్యూటరీ మొదలగు గ్రంథులే దేహములోని సర్వశక్తులకును మూలమనుటలోనే భౌతికశాస్త్రమునకును, ఆధ్యాత్మికశాస్త్రమునకును ప్రతికలియుచున్నది. పీనియల్ గ్రంథినే జ్ఞాననేత్రమంటారు.

## అవయవిక చికిత్స

నాళరహిత గ్రంథులనుండి ఊరు ధాతువులవలన

దేహమునకు జరుగు ఉపకారమును గూర్చి వందువైద్యులు తెలుసుకొనుచున్నారు. ఈ ధాతువులు లోపించుటవలన యీరోగములు వచ్చునవియు, ఆయా ధాతువుల వృద్ధిచేసినందునవలన ఆరోగములు నయమగుననియు, తెలుసుకొనుచున్నారు. వీరి అభిప్రాయము ప్రకారము ఆయా ధాతువులను రెండు విధములుగా వృద్ధిచేయువచ్చును. ఒకటి- యేగ్రంధి నుండి ఊరు ధాతువు తక్కువగుటవలన యీ రోగము వచ్చినదో తెలుసుకొని, జంతువులనుండి తీసిన ఆయాగ్రంధులుగల అవయవములను దేహములోనికి ప్రవేశపెట్టుట; రెండు-జంతువులనుండి తీసిన ఆగ్రంధులలోని ధాతువులను దేహములోనికి ప్రవేశపెట్టుట. ఈ సిద్ధాంతము ప్రకారమే ఈ క్రింది పనులను చేసినారు.

జీర్ణక్రియ జరుగుటకు పెప్సిను బాగా సహాయపడును. పెప్సిను కలిసినయెడల జీర్ణక్రియ త్వరగా జరుగును. జీర్ణక్రియ మందగించిన రోగములలో అనగా అజీర్ణము, అగ్నిమాంద్యము మొదలగు రోగములలో జంతువులనుండి తీసిన పెప్సినును మందుగా ప్రవేశపెట్టుచున్నారు.

అట్లాగనే థైరాయిడ్, థైమస్, పిట్యూటరీ, ఎడ్రినాలు మొదలగు గ్రంధులు సరిగాపనిచేయునందువలన కలుగు రోగముల కుదుర్చుటకై జంతువులనుండి ఆయా గ్రంధుల తీయుచున్నారు. వాటినుండి తీయబడిన ధాతువులను మానవ దేహములలోనికి ప్రవేశ పెట్టుచున్నారు. Pancreas నుండి ఊరవలసిన ధాతువు ఊరనందువలన కలిగినరోగములను జంతువులనుండి తీసిన గ్రంధులలోని ధాతువుతో కుదుర్చుచున్నారు.

జీర్ణక్రియకు అవసరమగు రసములలో చిన్నప్రేగులనుండి కొన్ని రసములు ఊరును. చిన్నప్రేగులనుండి యీ రసము సరిపోయినంత ఊరనందువలన జీర్ణక్రియ సక్రమముగ జరుగదు, అందువలన కుంటుపడును. ఈ లోపమును పూర్తిచేయుటకు జంతువుల చిన్నప్రేగులలోని ఆ భాగముల తీసి మానవదేహములలోనికి ప్రవేశపెట్టుచున్నారు.

కొన్ని సంవత్సరముల క్రితము వరకు జంతువులనుండి తీసిన పెప్సినును ప్రవేశపెట్టుటవలన అగ్నిమాంద్యము, అజీర్ణము త్వరగా నయమగునని చెప్పుకొనుచుండెడివారు. పెప్సినును ప్రవేశపెట్టుటవలన యీ రోగములు పూర్తిగా నయమైనట్లు ఒక్క కేసులోనూ చూడలేదు. జంతువులనుండి తీసిన పెప్సినును ప్రవేశ పెట్టుటవలన యీ రోగములు తాత్కాలికముగా తగ్గినప్పటికినీ రోగకారణము తొలగించబడనందున ఆరోగపదార్థము అట్లానే నిలబడిఉంటుంది. రోగము మామూలుగానే ఉంటుంది. చచ్చుపడిపోయి నిరుపయోగమైన చేతిని వ్యాయామము చేయించి బాగుచేయవలెగాని, జబ్బుపడింది గదాయని పూసిపూసి పెడితే పాసిపాసి పోతుంది. పక్షవాతముతో చచ్చుపడిపోయిన దేహభాగమును మర్దనచికిత్స వ్యాయామచికిత్స మొదలగు ప్రకృతి వైద్యచికిత్సలతో బాగుచేయవలెనుగాని, ముడిచి పెట్టినందువలన బాగుపడదు బాగుపడకపోగా, గాలీ, యెండలు ఆప్రదేశమునకు తగలనందువలన ఆ ప్రదేశములు పాలిపోయి చచ్చుపడిపోవును. అట్లాగనే శృంజోషధులను వాడినందువలనకంటె జబ్బులు పోవు.

దేహములో వివిధ అవయవములుగలవు. ఏ అవయవమునకు పనిలేనియెడల ఆ అవయవము చచ్చుపడిపోవును. నిరుపయోగమగును. మానవుడు సర్వశక్తిసంపన్నుడు. దైహిక, మానసిక శక్తులలో ఏశక్తిని వృద్ధిచేసుకొనవలెనని యిచ్ఛగించి తదనుకూలముగా పనిచేస్తే ఆయా శక్తులు కలుగును. దైహిక శక్తులు వృద్ధికావలెనని కోరి తదనుకూలముగా వ్యాయామము చేసినయెడల కండరములు పెరిగి దైహికశక్తులు వృద్ధిపొందును. అట్లనే మానసిక శక్తులును వృద్ధిపొందును. నైతిక శక్తులు అదేరీతిగా పెరుగును.

రోగకారణము పోనిది రోగము పోదు. అజీర్ణరోగి ఆహారము మానంది రోగముపోదు. ఆహారమును తగ్గించకుండా యెన్ని మందుల వాడినను రోగము నయముకాదు. రోగముల నయము చేయుటకు వాడినమందులవలన మందులలోని విషములతో ఆయా అవయవములలో ఉద్రేకము ఆరోగములు తాత్కాలికముగా తగ్గిపోయి నప్పటికిని, మూలచ్ఛేదము మాత్రము కావు.

మందు వైద్యమునకును, ప్రకృతివైద్యమునకును ప్రకృతి కుదరదు. తూర్పు, పడమరల సంబంధముగలదు. మందులవాడి రోగములనయముచేయమంటారు మందువైద్యులు. రోగకారణమును తొలగించనిది రోగము నయముకాదంటారు ప్రకృతి వైద్యులు. రోగపదార్థమును తొలగించుటకైనా, దేహమునకు యిప్పుడుగాని, యెప్పుడుగాని, హానిచేయని జలచికిత్సాప్రక్రియలను, వర్ణవైద్య ప్రక్రియలతోను, మానసికచికిత్సా ప్రక్రి

యులను వాడుతారు. మర్దన చికిత్సను, వ్యాయామమునుతోడు చేసుకొంటారు.

మా చికిత్సాలయము ప్రారంభించి పదునెనిమిది సంవత్సరములు గడచినది. ఈ పదునెనిమిది సంవత్సరములలోను ఒక కంఠమాల రోగికైనా జంతువుల నుండి తీసిన థైరాయిడ్ గ్రంధిని ప్రవేశపెట్టి రోగమును నయము చేయలేదు.

వివిధ గ్రంధులనుండి ఊరుధాతువుల లోపమువలన కలిగిన కాలికరోగములను, తరుణ రోగములను ప్రకృతి వైద్య పద్ధతులతోనే నయముచేసినాము గాని, ఒక్క రోగికైనా జంతువులనుండి తీసిన ఆ యా గ్రంధులను ప్రవేశపెట్టలేదు. అంతేగాక, ఏ గ్రంధినుండిఊరు యేధాతువు లోపించుటవలన యీ రోగమువచ్చినదీ నిర్దుష్టముగా తెలుసుకొనుట కష్టము. జంతువులనుండి తీసిన ఆయా గ్రంధులను ప్రవేశపెట్టుటయు హానికరమే. ప్రఖ్యాత మందువైద్యులు యీవిషయమును ఒప్పుకొన్నారు. నిరపాయకరమైన ప్రకృతివైద్య చికిత్సా ప్రక్రియలుండగా హానికరమైన రస, విష, పాషాణాదుల వాడుట యెందుకో తెలియుటలేదు. ప్రాణాపాయకరమైన కేసులలో, అనగా దేహములోని గ్రంధులనుండి ధాతువులు ఊరి దేహమునకు ఉపయోగపడు వ్యవధికూడా లేనట్టి రోగములలో యీ జంతువులనుండి తీసిన గ్రంధులలోని ధాతువుల సహాయమును పొందు టవసరమేగాని, అన్ని కేసులలోను బయటనుండి తీసిన యీగ్రంధులలో ధాతువులతో రోగముల కుదర్చచూచుట హానికరము.

మా ఆసుపత్రికి వచ్చు రోగులందరును కాలికరోగులే. మందులను తినితిని రోగములు నయముకాక విసిగి, వేసారిన వారే.

ఆ రోగముల నయము చేసికొనుటకై మందుల సేవించినారు. ఆ మందులవలన మొదటలో గుణములు కనబడినప్పటికినీ కాలము గడచినకొలది రోగము మరింతముదిరి కాలికమైనది. రోగకారణము తొలగించ బడనందువలన రోగపదార్థము పెరిగిపోయి గ్రంథులకు అడ్డపడినది. రోగము మరీ కాలికమైనది.

పెప్సిన్ వాడి నందువలన అజీర్ణముపోలేదు. జీర్ణకోశములో మిగిలిపోయిన సరుకు మురుగును. ఆమ్లములుపుట్టును. ఈ ఆమ్లములు జీర్ణకోశములోని ఆమత్వచమును తిని వేయును. ఎంత పెప్సినువాడినను జీర్ణక్రియ బాగా సక్రమముగా జరగదు. ఆమ్లముల తయారు తగ్గదు. ఈ ఆమత్వచము తరిగి పోవుచునే ఉండును. తరుగుదల ఆగదు.

జీర్ణకోశములో పుట్టినమంటలు (ఆమ్లములు) జీర్ణకోశమునేగాక, బయటి అవయవములను చచ్చుపడగొట్టును. మందులలోని పెప్సినువలన యిటువంటి కేసులలో మొదటలో గుణము కనుబడినప్పటికినీ పర్యవసానముగా బాధలు యెక్కువగును. రోగము కాలికమగును. ఇవియే మృత్యువునకు త్రోవ చూపును.

## అ ధ్యా య ము 23

## నాళరహిత గ్రంధుల లోపములవలన వచ్చు రోగములు. కనీనికలో కనుపడు గుర్తులు.

### క ం ఠ మా ల.

దేహములో వివిధ అవయవములు గలవు. ఈ వివిధ అవయవములలో యే ఒకటి సంతృప్తికరముగా పనిచేయుక పోయినను దానికి సంబంధించిన రోగములు వచ్చును. జీర్ణ కోశము సరిగా పనిచేయనియెడల జీర్ణకోశమునకు సంబం ధించిన వ్యాధులు కల్గును. ఇట్లాగనే మిగిలిన అన్నిఅవయవ ములును వాటికి సంబంధించిన జబ్బులును. దేహములో రెండు రకములగు గ్రంధులు గలవు. ఒకటి - నాళసహితగ్రంధులు, రెండు - నాళరహిత గ్రంధులు.

పీనియల్ గ్రంధి, పిట్యూటరీ గ్రంధి, థైరాయిడ్ గ్రంధి, థైమస్‌గ్రంధి మొదలగునవన్నియు నాళరహితగ్రం ధులు. ఈ గ్రంధులలో యే ఒక గ్రంధియైనను సంతృప్తికర ముగా పనిచేయనియెడల దానికి సంబంధించిన రోగములు వచ్చును. స్వరపేటికకు రెండు ప్రక్కలు ఉండునవి థైరా యిడ్ గ్రంధులు. వీటికి యావనగ్రంధులని కూడా పేరు. థైరాయిడ్‌గ్రంధి సంతృప్తికరముగా పనిచేయనందువలన కంఠమాల (Goiter) రోగము వచ్చును. దీనినే కంఠమాల యందురు. ఈ రోగములో రెండు రకములు గలవు. మొదటి రకము మెత్తగానుండును. రెండవ రకము గట్టిగానుండును.

థైరాయిడ్‌గ్రంధినుండి ఉూరుధాతువు జీర్ణక్రియకును, ఆహారపదార్థములోని మాంసకృత్తును జీర్ణముచేయుటకును ఉపయోగపడును. నత్రిజని ప్రధానముగాగల పదార్థములను జీర్ణముచేయుటకును యీ ధాతువు ఉపయోగ పడును. ఈ గ్రంధిలో ఉూరుధాతువు బహిష్కరణక్రియకును సాయపడును. థైరాయిడ్‌గ్రంధి బాగా పెరిగిపోవుటవలన కంఠమాల రోగము వచ్చును. హృదయగమనము సరిగా ఉండదు. ఎగిడిదిగిడిగా నుండును. దీనికి తోడు నాడీవ్యాధు లుండును.

దేహములో తయారగు రాసాయనిక మురుగు అను క్షణము బయటకుపోక లోపలనే నిలిచిపోవుటవలన యీ గ్రం ధులకు అడ్డుపడును. అందువలన ఆ గ్రంధులు ఉబుకును. దేహములో నిలిచిపోయిన మందులవలనను యీ గ్రంధులు ఉబకవచ్చును. అప్పుడు కూడా కంఠమాల రోగము వస్తుంది.

స్విట్జర్లాండు మొదలగు దేశవాసులలో యీ రోగము హెచ్చుగానున్నది. ఐరోపాఖండములోని కొన్ని ప్రాంతము లలో కూడా యీ రోగము హెచ్చుగానుండును. సున్నము యెక్కువగానున్న నీటిని త్రాగుటవలనను యీ రోగము వస్తుందను ప్రతీతి గలదుగాని యీమాట కొందరిలో మాత్రమే నిజము. అందరిలోను నిజముకాదు. ఈ రోగము వంశానుగతముగాను వచ్చును. మాంసకృత్తు ప్రధానముగా గల ఆహారపదార్థముల తినుటవలనను యీ రోగము వచ్చును.




32-వ బొమ్మ

వివరణ— 1, 2 ఆవరణాలు నల్లబడినవి. 28లో థయిరాయిడ్ తెల్లగీతలు గలవు. గండమాలరోగమునకు గుర్తు. తెల్లని నాడీఉంగరములు గలవు. 15, 18, 19, 22 యేరియాలలో గుర్తులు గలవు. ఎడమలో 28-వ లో గుర్తు గలదు. ఈ గుర్తు గండమాలరోగములోని తీవ్రగకమును తెల్పును.

బొమ్మ 32

కంఠమాల రోగములో మొదటిరకమగు కంఠమాల రోగమును గూర్చి తెలుసుకొందాము.

థైరాయిడ్ గ్రంధి ఉబుకుటవలన యీ రోగము వచ్చునని యిదివరకే తెలుసుకొన్నాము. రోగము ప్రారంభించిన మొదటి రోజులలో మెత్తగా నుండును. కాలము గడచిన కొలదీ కంఠమాలలోని మెత్తదనము పోవును. బిరుసెక్కును. గట్టిగా నుండును.

మొదటి దశలోనే అనగా మెత్తగా నున్నప్పుడే కంఠమాలలోని రోగపదార్థము త్వరగా బయటకుపోవును. ఘన పదార్థము స్వస్వరూపములో బయటకు పోదు. ఘనరూపములో నున్న పదార్థము నుండుగా ద్రవరూపమును పొందును. అటుపిమ్మట వాయురూపమును పొందును. అప్పుడుగాని బయటకుపోదు. ఈ న్యాయము అంతటా వర్తిస్తుంది. అందు వలననే మెత్తగానున్న కంఠమాలరోగములు త్వరగా నయమై, రెండవరకమగు గట్టిగా నుండు కంఠమాల రోగములు, ఆలస్యముగా కుదురును.

రోగకారణమును తొలగించి రోగపదార్థమును ప్రకృతి వైద్య పద్ధతులద్వారా నయము చేసిన యెడల మొదటి రకమగు కంఠమాల రోగములు త్వరగా కుదురును.

32 వ బొమ్మలోని కుడి కనీనికలోని 28 వ ప్రతినిధి భాగములో యీ గుర్తులు బాగా కనుబడు చున్నవి.

## రెండవ రకమగు కంఠమాల రోగము

బొమ్మ 32

32 వ బొమ్మలోని యెడమ కనీనికలోని 28 వ ప్రతినిధి భాగమును చూచిన యెడల యీ సంగతి బాగా బోధపడ గలదు.

మానవ దేహము ఒక కొలిమివంటిది. ఈ కొలిమిలో తయారగు రాసాయనికమురుగు యెప్పటికప్పుడు బయటకు పోవుచుండ వలయును. బయటకు పోక లోపలనే నిలిచిపోయినయెడల మిగిలిన అవయవముల కదలికకు అభ్యంతరములు కలుగును. ఈ అభ్యంతరములు యెప్పుడూ కలుగుచున్నయెడల ఆ అవయవములలో కదలికయే ఉండదు. చచ్చుపడి పోవును. ఇట్లాగే రోగము కాలికమగుతుంది. రోగము ఈ దశను పొందకుండా చూడవలె గాని, రోగము కాలికరూపమును పొందిన తరువాత నయమగుట మాత్రము దుర్లభము. నయము కాదనియే చెప్పవచ్చును. అప్పటికైనను ప్రకృతివైద్య పద్ధతులను అవలంబించిన యెడల రోగపదార్థము మరింత తీవ్రరూపమును పొందదు. ప్రమాదము సంభవించదు. ఉపశమనము మాత్రము కలుగును.

ఈ పదునెనిమిది సంవత్సరముల అనుభవములోను నేను చూచిన అన్ని కేసులలోను, ఈ కంఠమాలరోగము దేహములో తయారై బయటకు పోక నిలిచిపోయిన రోగపదార్థమువలనను, రస విష పాషాణాదులతో తయారు చేయబడిన మందుల వాడుటవల్లనూ వచ్చినట్లు తెలుసు

కొన్నాము. నత్రజని ప్రధానముగా గల పదార్థము రక్తముతో కలిసి తిరుగుటవలనను థైరాయిడ్ గ్రంధులు ఉబుకును. ఈ గ్రంధులనుండి ధాతువులు యెక్కువగా ఊరును. ఈ ధాతువులు యెక్కువగా ఊరుటవలన నాడీమండలమును కంపించును. హృదయముకూడా వేగముగా కొట్టుకొనును. ఎక్కువగా ఊరిన ఈ ధాతువు జీర్ణక్రియలోనే గాక, బహిష్కరణ క్రియలోనూ మార్పుల తెచ్చును. పర్యవసానముగా బలము తగ్గిపోయి, నీరసము హెచ్చును.

ఎక్కువగా ఊరిన ధాతువు క్రమముగా తగ్గిపోయి కాలము గడచిన కొలదినీ అంతకన్నను తగ్గిపోవును. దేహపోషణకు అవసరమైనంత ధాతువు వూరదు. అందువలన జీర్ణక్రియయూ, బహిష్కరణక్రియయును కుంటుపడును.

ఆహార చికిత్స:— మెత్తని కంఠమాలరోగములోను, గట్టి కంఠమాలరోగములోను యీచికిత్స ఒకటిగానే ఉండును. మిగిలిన చికిత్సాప్రక్రియలలో మాత్రము కొద్దితేడా ఉండును.

వెన్నెముకలోని లోపములవలనను యీ గ్రంధులు యెక్కువతక్కువలుగా పనిచేయును. ఈ గ్రంధులనుండి ఊరు ధాతువుల పరిమితియు యెక్కువ తక్కువలుగానుండును కశేరుకా చికిత్సతోను యీ రోగము మొదటిదశలో ఉండగా నయము చేయవచ్చును

## గ్రేవు రోగము

బొమ్మ 32. ఏ ఠి యా 28

కంఠమాల రోగముయొక్క చివరదశనే గ్రేవురోగము అంటారు. ఈ రోగముయొక్క ముఖ్యలక్షణ మేమంటే -

హృదయము యెక్కువ వేగముతో కొట్టుకొనుచుండును. నీరసముగా నుండును. కన్నులు బాగా పైకి పుబికిఉండును. కంటిచూపు విచిత్రముగా నుండును. రక్తము యెక్కువవేగముతో ప్రవహించుచుండుటచేతను, నాడీశక్తి యెక్కువగా ప్రవహించుచుండుటచేతను కన్నులు పైకి ఉబికి ఉండును.

ఈ రోగము 15-30 సంవత్సరముల మధ్యవయస్సులో నుండు స్త్రీలలోను, 35-45 సంవత్సరముల మధ్యవయస్సులో నుండు పురుషులలోను యెక్కువగా వచ్చును. అపరిమితమగు భయముగాని, దుఃఖముగాని, సంతోషముగాని, తీవ్రమగు మనోవేదనగాని కలిగినయెడల ఈ రోగము వచ్చుటయు గలదు.

సామాన్య ఆరోగ్యవంతుని నాడి నిముషమునకు డెబ్బది పర్యాయములకు తక్కువ గాకుండాను, ఎనుబది పర్యాయములకు యెక్కువ గాకుండాను కొట్టుకొనును. ఈ రోగములో అన్నినో నాడి 200 పర్యాయములు కొట్టుకొనును. రోగి చాలా పాలిపోవును. ఎరుపు రక్తము యేమియు కానరాదు. హృదయము యెక్కువగా స్పందించి చచ్చుపడిపోవును. ఎన్ని స్ట్రిచినిన్ యింజక్షనుల యిచ్చినను ఉపయోగముండదు. కంటిని అదుపులోనుంచు కండరములు సరిగా పనిచేయక పోవుటవలన చూపులో మెల్ల యేర్పడును. మొదటలో మెత్తగానున్న థైరాయిడ్ గ్రంధి క్రమేపి బిరుసెక్కి గట్టిపడును.

దేహములోని కొన్నిభాగములుగాని, మొత్తమంతాగాని చచ్చుపడిపోవును. జీర్ణాశయ వ్యాధులన్నీ ఉండును. మూత్రపిండములు చెడిపోవుటయు గలవు. మూత్రము యెక్కు

వగుచుండును. మూత్రముతో అల్బుమిన్ పోవును. అప్పు డప్పుడు జ్వరమువచ్చుటయు గలదు. చర్మవ్యాధులు కలుగును. మాంద్యముగా నుండును. ఒకే విషయమును గూర్చి తదేకముగా ధ్యానించుటయు కలుగును. మనస్సును మరల్చుకో లేకపోవును.

రెండురకములగు కంఠమాల రోగములలోను మూత్రముతో బాటు Sketol, indol, phenol మొదలగు పదార్థములు వెడలును. దేహములోని నాలుగు బహిస్స్రావయంత్రములలోను మూత్రకోశము ఒకటియే బాగా పనిచేయుచుండును. చిన్నప్రేగులలో తయారైన రాసాయనికములన్నియు అంతయు ఇలియోకేకల్ వాల్వు (ఆంత్రముఖకవాటము) ద్వారా పెద్ద ప్రేగులోనికి గెంటబడి క్రిమిచలనములవలన మలకోశములోనికి త్రోసివేయబడును. మలకోశము, మూత్రకోశము ఆనుకొనిఉండుటచేత సన్నిహితదోషములవలనను, సమరసన్యాయము (rule of osmosis) వలన మూత్రకోశములోనికి యింకి మూత్రముద్వారా బయటకు వచ్చును. ఆహార పదార్థముల సమ్మేళనము సరిగా కుదరకపోవుటవలనను, పిండిపదార్థము యెక్కువై, తేలికగా అరుగు ఆకుకూరలు, పండ్లు తక్కువగుటవలన యిది సంభవించును. రోగముల నయము చేయుటకు వాడిన మందులవలనను థైరాయిడ్ మొదలగు నాళరహిత గ్రంథులన్నియు ఉద్రేకమును పొందును.

ఈ నాళరహిత గ్రంథులన్నియు ఉద్రేకము పొందుట చేత యీగ్రంథులనుండి ధాతువులు యెక్కువగా ఊరును. ఈ ధాతువులు యెక్కువగా ఊరుటవలన నాడీమండల మం

తయు కంపించును. దేహములోని బలము తగ్గిపోయి నీరసము హెచ్చును. ఆహారములోని లోపముల సరిచేయనియెడల యీ నీరసము హెచ్చిపోవును విరుద్ధ స్వభావముగల ఆహారముల తినినందువలనను, దేహములో తయారైన రాసాయనిక మురుగు బయటకుపోక లోపలనే నిలిచిపోవుట వలనను థైరాయిడ్ మొదలగు గ్రంథులన్నియు ఉద్రేకమును పొందును. వాటినుండి ఊరు ధాతువులపరిమితి హెచ్చును. ఈధాతువులు యెక్కువగా విడుదల అగుటవలన నాడీమండల మంతయు కంపించిపోవును. హృదయము యెక్కువగా స్పందించును. నాడి వేగముగా కొట్టుకొనును.

## చికిత్స

రోగము ప్రారంభించగనే చికిత్సనుపొందుట మొదలిడి నయము చేసుకొనవలయును. స్త్రీలలోని గర్భాండములనుండిగాని, పురుషులలోని వృషణములనుండిగాని ఊరు ధాతువు తక్కువగుటవలనను, పిట్యూటరీ గ్రంథినుండి ఊరు ధాతువు తక్కువగుట వలనను, థైరాయిడ్ గ్రంథినుండి ధాతువు యెక్కువగా ఊరుటయుగలదు. అందువలన దేహము మొత్తమునకే చికిత్స చేయవలెను. హృదయము యెక్కువగా స్పందించునపుడు కశేరుకాచికిత్స చేయవచ్చును. శుభ్రమైనగాలి, యుక్తమైన వ్యాయామము రోగమును నయము చేయుటకు చాలా సహాయకారులగును. అంతేగాని థైరాయిడ్ గ్రంథి యెక్కువగా పనిచేయుచున్నది గదా అని ఆ ఉద్రేకమును తగ్గించుటకు అయోడిన్ రాయరాదు. మంచు

గడ్డను రబ్బరు సంచులలో వేసి కట్టరాదు. యక్సరేలో నయము చేయరాదు.

తిను ఆహారములోను, విహారములోను మార్పురానిది రోగము నయముకాదు. రోగపదార్థము బయటకు పోవుటకు అనుకూలపడు కూరలను, పండ్లను పెట్టవలెను. కాయధాన్యములను, పప్పుధాన్యములను క్రమేపీ పెంచవచ్చును. మర్దన చికిత్సకూడా యిందుకు సాయపడును. కశేరుకా చికిత్సకూడా యిందుకు ఉపయోగపడును. గాలి యెండలను బాగా ఉపయోగించుకోవాలి. మానసిక చికిత్సలను మరచిపోరాదు. ఈ చికిత్సల నన్నిటినీ యథాక్రమముగా చేసినయెడల రోగము త్వరలోనే కుదురును.

మందువైద్యమువారి చికిత్సాపద్ధతి:— రోగజీవుల వలననే రోగమువస్తున్నదని మందువైద్యుల వాదము. మిగిలిన అన్ని రోగములవలెనే యీ రోగము రోగజీవులవలననే వస్తుందంటారు. టాన్సిల్సు ఉబుకుటవలననూ యీ రోగము వస్తుందంటారు. అమెరికన్ వైద్య సంఘమువారు యీ రోగమును గూర్చియు అందుకు చేయవలసిన చికిత్సను గూర్చియు ఒక గ్రంథమును ప్రచురించిరి. ఆగ్రంథములో యిట్లున్నది. ఏ కారణముచేత యీరోగమువచ్చేదీ యింకాబాగా తెలియలేదు. అనేక కారణములవలన యీ రోగము వచ్చుచున్నదని చెప్పుచున్నారు. టాన్సిల్సుకు సంబంధించిన జబ్బులవలనను యీ రోగము రావచ్చును. సంధివాతము వలనను యీ రోగము వస్తుంది.

యీ రోగమును కుదుర్చుటకు రెండు పద్ధతులుగలవు.

ఒకటి - బాధలను తగ్గించుటకు మందులను వాడుట. రెండు-ఏభాగమునుండి యీ రోగము ప్రవేశించినదో తెలుసుకొని ఆభాగముతోడి సంబంధమును తగ్గించుట, అవసరమైతే తీసి వేయుట - అనగా టాన్సిల్సులోని లోపములవలన యీ జబ్బు వస్తే టాన్సిల్సును తీసివేయుట. మందు వైద్యశాస్త్రము ప్రకారము దేహాము అతుకుల బొంత. ఏ అవయవమునకు ఆ అవయవము వేరే. ఏ అవయవములో లోపముంటే ఆ అవయవమును తొలగించాలి. అంతటితో ఆబాధలు పోతాయంటారు.

ప్రకృతికి అనుకూలముగా జీవించి ప్రకృతివైద్యచికిత్సా పద్ధతులతో నయము చేసికొనిన యెడల పళ్లలోని లోపములు గాని, టాన్సిల్సులోని లోపములుగాని, గర్భాండములలోని లోపములుగాని, ఆమాశయములోని లోపములుగాని పోవును. మెదడులోని ఉద్రేకమును తగ్గించుటకు వాడిన బ్రోమిన్, నరములలోని మంటలను తగ్గించుటకు బాగుమందులు, మలబద్ధకమును తొలగించుటకు వాడిన ఉద్రేకకారులగు మందులు, హృదయస్పందనముల తగ్గించుటకు వాడిన మందులు ఆ యా లక్షణముల మొదటలో తగ్గించును. ఈ మందులు రోగకారణము జోలికి పోకపోవుటవలన రోగము అట్లనే నిలబడిపోవును.

ఈ లక్షణముల తగ్గించుటకు వాడిన మందులకన్న తీవ్రమైనవి శస్త్రచికిత్సా ప్రక్రియలు. X రే చికిత్సా ప్రక్రియలు యింతకన్న హానికరమైనవి. అయోడిన్ మందులరాచి నయము చేయుటయు పైకోటిలోనికే వచ్చును. అయోడిన్ రాచి నందువలన దేహములోని వివిధనాడులు యెట్లు చచ్చు పడిపోవునదియు 14 వ అధ్యాయములో చదివియే ఉన్నాము.

కంఠమాలను తగ్గించుటకురాచిన మందులవలనను యింతఅపకారమూ జరుగును. ఈ అయోడిన్ చర్మముద్వారాలోనికి ప్రవేశించి, లోనిగ్రంధులను చచ్చుపడగొట్టును. థైరాయిడ్ గ్రంధి కూడాచచ్చుపడిపోవును. ఇట్లురాచిన అయోడిన్ థైరాయిడ్ లోనేగాక, వెన్నులోని క్రింది భాగములోను (తెలుపు 23 వ ప్రతినిధి భాగములోను), బొమ్మలోను చేరును. మిగిలిన అవయవములలో చేరనప్పటికిని థైరాయిడ్ లో మాత్రము ప్రధానముగా చేరును. కనీనికానిదానము యీ విషయమును విశదముగా తెలుపును. 31 బొమ్మలోని అయోడిన్ మచ్చలు యిందుకు నిదర్శనములు.

థైరాయిడ్ గ్రంధి చూచుటకు చాలా చిన్నదిగా నుండును. ఈ గ్రంధినుండి ఊరు ధాతువువలననే దేహములోని ధాతుశక్తి వృద్ధి అగును. చర్మమునకురాచిన అయోడిన్ దేహములోనికిపోయి రక్తములో కలిసి ప్రవహించుచుండును. క్షీరపోతస్నులను యింకింపచేయును. మూత్రపిండాగ్ర గ్రంధులను యింకింపచేయును. గర్భాండములను, వృషణములను శోషింపచేయును.

కనీనికను చూచినయెడల దేహములో యేభాగములో యీ అయోడిన్ చేరినదీ చెప్పగలము. ఆయాప్రదేశములలో మెరుపుమచ్చలు కనుబడును. నాకు చాలాసంవత్సరముల క్రితము శోషరసవాహికలు వాచి మెడ ఉబికినది. ఈ వాపును తగ్గించగలందులకు అయోడిన్ రాచాను. ఇట్లు రాచిన అయోడిన్ లివరు, మూత్రపిండములలో చేరినది. దియే కాలికరోగమునకు మూలమైనది. దీనిని నయముచేసి

కొనుటకు యూరపు వెళ్ళితిని. అచ్చటివైద్యులు యీసంగతిని చెప్పినారు. ఈ సంఘటనవలననే ప్రకృతి వైద్యశాస్త్రమును చదివితిని. కన్నీనికానిదానమును గూర్చి తీవ్రమైన కృషి సలిపితిని.

శస్త్రచికిత్స :— కంఠమాలను తగ్గించుటకు శస్త్రచికిత్స చేయుటయు గలదు. శస్త్రచికిత్సవలన కలుగు అపకారముల గూర్చి తెలుసుకొందాము. ఉబికిన భాగమునుగాని మొత్తము వంతనుగాని కత్తెరవేసి తీసివేస్తారు. ఈ పనిని రాక్షసకృత్య మనటయే యుక్తము. తొలగింపబడిన అవయవములు మరే విధమునను పూర్తిచేయబడవు. పోయిన అవయవములు మళ్ళీ రావు. థైరాయిడ్‌ను పూర్తిగా తీసివేసినందువలన మృత్యువు కూడా సంభవించవచ్చును. మృత్యువు సంభవించకపోయినా కాలికరోగములన్నా ప్రత్యక్షమవుతాయి. ప్రకృతివైద్యము లోని చికిత్సాపద్ధతుల ప్రకారము నయముచేసుకొన్న యెడల ఆ గ్రంధిలోని ఉద్రేకము తగ్గును. స్వాభావసిద్ధమైన గతి వచ్చును. అవయవము లేవియుపోవు. ఈ గ్రంధులను తీసి వేసినందువలన క్షయరోగము వచ్చినట్లును, దేహములోపల కాయలు, కంతులు, గ్రంధులు లేచినట్లును చాలా కేసులలో మేము ప్రత్యక్షముగా చూచినాము. నాడీవ్యాధులు కలిగి నట్లును, కొంతమందికి పిచ్చి పుట్టినట్లుకూ చూచినాము.

కొద్ది సంవత్సరములక్రితము మా స్నేహితులలో ఒక రికి యీ రోగము వచ్చినది. ప్రకృతివైద్యములోని చికిత్సా పద్ధతులతో ఆ రోగమును నయముచేయుటకు మా స్నేహితులు మరొకరు ప్రయత్నించిరిగాని, రోగికిని వారి బంధువులకును

ప్రకృతివైద్య పద్ధతులలో నమ్మకము లేకపోవుటచేత, యీపద్ధతిని అవలంబింపలేదు. శస్త్రచికిత్సతో రోగమును నయము చేసినారు. థైరాయిడ్ గ్రంథులలోని ఉబికిన మొనలను తీసి వేసినారు. తీసివేసిన యిరువది నాలుగు గంటలు జరిగినదో లేదో దేహములోని రెండు భాగములలోను ఒక భాగము చచ్చుపడిపోయినది. ఎన్నిమందులు వాడినను యీరోగము పోలేదు. రెండు సంవత్సరములు గడచినతరువాత మరణించినది. ఆ మరణముతో బాధలన్నీ తగ్గిపోయినాయి.

## థైరాయిడ్ జబ్బులు

( 32 బొమ్మలోని ఎడమ కనీనికలోని 28 యేరియా )

థైరాయిడ్ గ్రంధినుండి ఊరు ధాతువు తక్కువగా ఊరుటవలన కలుగు జబ్బులగూర్చి విచారింతము. థైరాయిడ్ గ్రంధినుండి యెక్కువ పరిమితిగల ధాతువు ఊరుట వలన కలుగు జబ్బులగూర్చి వెనుకటి పేజీలలో చదివినాము.

థైరాయిడ్ గ్రంధులు వయస్సునకు అనుకూలముగా పెరుగక చిన్నవిగా ఉండిపోయినయెడల మరిగుజ్జులగుదురు. ఈగ్రంధులు వయస్సునకు అనుకూలముగా పెరుగకపోవుట వలన భౌతికదేహముకూడా క్రమముగా పెరుగదు. మనసు కూడా పెరుగదు. దైహిక, మానసిక శక్తులు రెండూ పెరుగక నిలబడిపోవును.

మరిగుజ్జులు చూచుటకు చాలా వికృతాకారముగా ఉందురు. నాలుక బాగా మొద్దుబారి ఉండును. కీచుగొంతుకతో మాటలాడుచుందురు. సౌమ్యముగాను, మృదువుగాను

మాటలాడలేరు. జుట్టు చిక్కుపోడు చుకొని ఉండును. పొట్ట బాగా పెరిగిఉండును. వరిబీజము సాధారణముగా అందరి లోను ఉండును. జననేంద్రియములు బాగా పెరగవు. అట్లనే నిలబడిపోవును. మానసిక శక్తులుకూడా పెరగవు. మాటలు కూడా బాగా రావు. మరిగుజ్జులలో చాలామంది చిన్నతనము లోనే చనిపోవుదురు. వయస్సు మీరువరకును బ్రతికి ఉండరు. ఇందువైద్యశాస్త్రము ప్రకారము జంతువులనుండి తీసిన థైరాయిడ్ గ్రంథులను యీ మరిగుజ్జుల దేహముల లోనికి ప్రవేశపెట్టుదురు.

ప్రకృతి వైద్యములోని అన్ని చికిత్సాభాగములను అవలంబించినయెడల యీరోగము చాలా త్వరగా నయ మగును. ఆహారములో మార్పురానిది రోగము నయముకాదు. మర్దనచికిత్సా ప్రక్రియలును సాయపడును. కసరత్తు చికిత్సాప్రక్రియలు యిందుకు సాయపడును. కాంతిశక్తితో చికిత్సచేయుటయు మంచిదే. జలచికిత్సాప్రక్రియలు, ఆతప స్నానములు యిందుకు తోడ్పడును హోమియోపతీ మందులు వాడవచ్చును. ఈ మందులవలన చచ్చుపడిపోయిన అవయవ ములలో ఉద్రేకము కలుగును.

చిన్నపిల్లలలోని కండరములు, ఎముకలు అన్ని మెత్తగా నుండును. గనుక పిల్లలకు యే రోగమువచ్చినను త్వరగా కుదురును. పెద్దలలోని ఎముకలు, కండరములు గట్టిపడి ఉండును. తేలికగా వంగవు. గనుక వీరికివచ్చిన రోగములు త్వరగా కుదరవు.

పెద్దలలో యీ రోగము వచ్చుటకు చాలా కారణములు గలవు. రోగ పదార్థము, గ్రంధులకు అడ్డపడుట వలన, ఆయా గ్రంధులు తృప్తికరముగా పనిచేయవు. దేహములో చేరిన మంటల వలనను యీ గ్రంధులలో నుండి ఊరు ధాతువుల పరిమితి తగ్గుటయు గలదు. వెన్నెముకలోని లోపముల వలనను యీ గ్రంధులనుండి ఊరుధాతువు పరిమితి తగ్గిపోవుటయు గలదు. రెండు వెన్నపూసలమధ్యన ఉండు సంధాయక ధాతువులోని లోపము వలనను యీ థైరాయిడ్ గ్రంధుల నుండి తక్కువ పరిమితి గల ధాతువు ఊరుటయు గలదు.

థైరాయిడ్ గ్రంధులనుండి కొంత పరిమితి గల ధాతువే తయారు కావలెను. అంతకు యెక్కువ పరిమితి గల ధాతువు ఊరినను హాని కలుగును. అంతకు తక్కువగా ఊరినను హానియే కలుగును. ఎక్కువగా ఊరిన ధాతువువలన నున్న మాంసము లన్నియు అర్చుకొని పోవును. ధాతువు తక్కువగా ఊరుటవలన శరీరము దొంపబారును. లావెక్కును. లంబోదరు లగుదురు. దీనిని బట్టి మనమేమి తెలుసుకొంటామంటే - థైరాయిడ్ గ్రంధి నుండి ఊరు ధాతువు జీర్ణక్రియకును, అందును మాంసకృత్తును జీర్ణము చేయుటకును బాగా సాయపడును. మాంసకృత్తును అవసరమునకు మీరి తినిన అరగదు. అరగక మిగిలిపోయిన దల్లా స్తనముల లోను, పొట్టయందును, బుగ్గల యందును, పిర్రల యందును నిలబడి పోవును. ఇటువంటి కేసులలో జంతువుల నుండి తీసిన థైరాయిడ్ గ్రంధులను ప్రవేశపెట్టిన యెడల గుణము వెంటనే

కనుబడును. ఈ గుణము తాత్కాలికముగానే ఉండును. మందు ఆపుటతోనే మామూలుస్థితి మళ్లీ తయారగును. రోగముమాత్రము మూలచ్ఛేదము కాదు.

## ఈ రోగుల ప్రత్యేక లక్షణములు

ఈ రోగులకు తలనొప్పి ప్రధానముగా నుండును. ఎన్ని మందులు యిచ్చినను యీ తలనొప్పి మాత్రము నయము కాదు. ఇది జన్మావధిగా ఉండవలసినదేను. థైరాయిడ్ గ్రంథి నుండి యెక్కువపరిమితి గల ధాతువు ఊరుటవలన యీ తలనొప్పి వచ్చును. తక్కువగా ఊరుటవలనను తలనొప్పి వచ్చును. ఈ ధాతువు తక్కువగా ఊరుటవలన దేహములో తయారగు రాసాయనికమురుగు విశ్లేషమును పొందుటకు చాలదుగాన లోపలనే నిలిచిపోవును. ఈ నిలిచిపోయిన మురుగు నాడులలో చేరి మంటలను పుట్టించును. నాడీ ఉంగరములు కనబడును. ౩౨ వ బొమ్మలోని రెండు కనీనికలలోను యీ నాడీ ఉంగరములు గలవు.

ఈ చికిత్సా పద్ధతులతో యెల్లప్పుడూ తలనొప్పితో బాధపడు రోగుల బాధలను తగ్గించినాము. ఎప్పుడన్నా ఒకప్పుడు తలనొప్పితో బాధపడు వాని బాధలను తగ్గించి నాము.

థైరాయిడ్ గ్రంథినుండి ఊరుధాతువు సత్రిజని ప్రధానముగా గల మలినముల బయటకు పంపును. ఆధాతువు యొక్క పరిమితి తగ్గుటవలన యీ మలినములు అట్లనే నిలబడిపోవును. బయటకుపోవు. ఈ మలినములవలన ఉబ్బసము

వచ్చును. శ్వాసకోశములకు సంబంధించిన తరుణవ్యాధులు కూడా రావచ్చును.

థైరాయిడ్ గ్రంథి తృప్తికరముగా పనిచేయకపోవుట వలన దేహములోని రోగపదార్థము అట్లాగనే నిలబడిపోవును. విశ్లేషమునుపొంది నాళ్లు ద్వారాలా బయటకుపోదు. బయటకుపోని మలినములన్నీ రక్తముతో కలిసి తిరుగుచుండును. రక్తముతో కలిసి తిరుగునపుడు సన్నని కేశనాళికలలోనికి పోయి అక్కడనే చిక్కుకొనును. ఈ రోగపదార్థము శ్వాసనాళికలలో నిలబడిపోయినచో శ్వాసనాళికల వ్యాధులు కలుగును. దీనినే Bronchities అందురు. ఈరోగపదార్థము శ్వాసకోశములలోని చిన్న గోళములలో చిక్కుకొనిన శ్వాసకోశ వ్యాధులువచ్చును. వీనిని Lung troubles అందురు. తరుణరోగములు గాని, కాలికరోగములుగాని యీ కారణముచేతనే వచ్చును. ఇట్లు చిక్కుకొనిన రోగపదార్థమువలన యీ అవయవములలోనే గాక (సన్నిహిత దోషమువలన) మిగిలిన అవయవములలో కూడా కదలికతగ్గును. మిగిలిన బాధలన్నీ వచ్చును. **Myxodema:**— థైరాయిడ్ గ్రంథులలోని లోపములవలన కలుగు జబ్బులలో యిది ఒకటి. ఈ జబ్బు పురుషులలో కన్న స్త్రీలలో యెక్కువగా ఉండును. పిల్లలులేని గొడ్రాళ్లలోకన్న, పిల్లలుగల వారిలోనే యీజబ్బు యెక్కువగా నున్నది. రోగపదార్థము రక్తముతో కలిసి తిరుగుటవలన యీజబ్బు వచ్చినట్లు తెలియుచున్నది. తలమీది వెంట్రుకలు రాలిపోవుటయు, కనుబొమల మీది వెంట్రుకలు ఊడిపోవుటయు గలవు. గోళ్లు ఊడిపోవుట, పళ్లురాలిపోవుట కూ సంభవించును. చర్మముయొక్క

మార్దవము లోపించును. జంతువులచర్మము మాదిరిగా గట్టి పడిపోవును. ఈ రోగములలో థైరాయిడ్ గ్రంధిని తీసివేసిన యెడల, అట్లు తీసివేసిన ఒకటి, రెండు వారములలోనే మృత్యువు సంభవిస్తుంది.

థైరాయిడ్ గ్రంధి సంతృప్తి కరముగా పనిచేయనందు వలన చర్మవ్యాధులు కలుగును. మూర్ఛలు, హిస్టీరియా మొదలగు మానసిక వ్యాధులు కలుగును.

ఏప్రత్యేక కారణమువలన యీ రోగము సంభవించినది తెలియక పోయినప్పటికినీ, సర్వరోగములును ఒకే మూల కారణముతో వచ్చుననినీ, సర్వరోగములు ఒకే చికిత్సతో పోవుననినీ, రోగమువలన దేహమునకు కలుగు ఉపయోగము కలుగుననినీ, అపకారమేమీ కలుగదనినీ మనకు తెలియును. గాన ప్రకృతి వైద్యములోని చికిత్సాభాగములలోని యే ప్రక్రియలవలన ఉపయోగము కలుగునో తెలుసుకొని ఆప్రక్రియలతో యీ రోగమును చికిత్సింతుము.

అడిసన్ రోగము:— ఈ రోగమును అడిసన్ అను నతడు కనుగొనెను. అందువలన దీనికి అడిసన్ రోగమని పేరు వచ్చినది. ఈ రోగమునకును క్షయరోగమునకును సంబంధ మున్నదంటారు. ఏకారణమువలన రోగము వచ్చేది వివర ముగా తెలియలేదని మందువైద్య గ్రంధములన్నీ చెప్పు తున్నాయి. ఒక అవయవములోని లోపమువలననే గాక దేహము మొత్తమునకు చేసిన జబ్బులవలననే యీ రోగము వచ్చునంటారు. చర్మముయొక్క సౌందర్యము లోపించును. నల్లపడును. చర్మమునకు కంచురంగువచ్చును. అరచేయి వెనుక

భాగము నల్లపడును. అరచేయి పాలిపోయి తెల్లగానుండును. రోగి యీ రోగముతో రెండు సంవత్సరములు బాధపడును. రోగము నయముకాదు. రోగలక్షణములు కొద్దిగనో, ఎక్కువగనో తగ్గునేమోగాని నిర్మూలము మాత్రము కావు.

## అడిసన్ రోగమునకు ప్రకృతి వైద్యమువారి చికిత్సాపద్ధతులు

కుడి మూత్రపిండము మీదను, యెడమ మూత్రపిండము మీదను, చెరియొక గ్రంథియు ఉండును. వీటికి యెడ్రినాలు గ్రంథులనిపేరు. ఈ గ్రంథులనుండి ఎడ్రినాలిన్ అనే ధాతువు ఊరును. ఈ ధాతువు రక్తములో కలియుటవలన రక్తములో చైతన్యము కలుగును. థైరాయిడ్ గ్రంథులనుగాని, ఎడ్రినాల్ గ్రంథులనుగాని ఆపరేషను చేసి తీసివేసిన యెడల మరణము వెంటనే సంభవించును. ఈ గ్రంథులనుండి ఊరు ధాతువు జీర్ణక్రియకు బాగాసాయపడును. బహిష్కరణ క్రియను త్వరచేయును.

ఈ రోగములో ఎడ్రినాలు గ్రంథులు చెడిపోవును. ఈ గ్రంథులు క్రమేపీగాని, ఒకేతడవగాగాని, కొంతగాని, మొత్తముగాని చెడిపోవుటగలదు. రోగి నీరసముగా నుండును. దేహమంతయు విరగగొట్టినట్లుండును. నాడి క్రమముగా ఉండదు. బలహీనముగా కొట్టుకొనును. హృదయస్పందనములు తగ్గును. రక్తపు పోటుతగ్గును. జీర్ణాశయమునకు సంబంధించిన వ్యాధులు ఉండును. జలుబు చేసినట్లుండును. కక్కులు ఉండును. నీళ్ళవిరేచనములగును. చర్మమునకు సహజముగా ఉండు రంగుపోయి కంచురంగు వచ్చును.

ఈ రోగము మిగిలిన రోగములంత తరచుగా రాదు. చాలా అరుదుగా వచ్చును, ఆడవారికన్న మగవారికే యీ రోగము హెచ్చుగావచ్చును. 20-45 సంవత్సరముల మధ్య వయసు వారిలోనే యీరోగము హెచ్చుగా నుండును.

అడ్రినాలు గ్రంధులు పూర్తిగా చెడిపోయినయెడల ప్రకృతి వైద్య పద్ధతులతో చికిత్సించినను కుదరదు. రోగము తరుణరూపములో నున్నప్పుడే ప్రకృతివైద్య చికిత్సాపద్ధతులతో కుదురును. తరుణరూపములో నుండగా అన్ని కేసులను నయము చేయవచ్చును. ఒక్కటికూడా బెడిసిపోదు. మా ఆసుపత్రికి యీ రోగులు చాలా మంది వచ్చెడివారు. వారి కనీనికలను పరీక్షించెడివారము. వారి కనీనికలలో కుడి, యెడమ మూత్రపిండముల తెలుపు 19 వ రేఖలయొలలో మందుల రంగులు కనబడెడివి.

వెన్నుపూసలు యథాస్థితిలో ఉండకపోవుటవలన నాడీ శక్తి క్రమముగా ప్రవహించదు. ఎక్కువ తక్కువలుగా ప్రవహించును. అందువలననూ ఈ బాధలన్నీ కలుగును.

ప్రకృతివైద్యములోని అన్ని చికిత్సాపద్ధతులను ఉపయోగించినగాని యిటువంటి మొండిరోగములు కుదరవు. అవైనను రోగము ప్రారంభించగానే మొదలిడిన కుదురును. అనుకూలమైన ఆహారమును తినుటవలన దేహములో మలినములు యెక్కువగా తయారుకావు. తయారైనప్పటికీను బహిష్కార్యావయవముల నాల్గింటిని బాగుచేసినయెడల వాటి ద్వారా త్వరగా వెడలిపోవును. కైరోప్రాక్టిక్ చికిత్సతో వెన్నుపూసలలోని లోపముల సరిచేయవలెను.

ఈ రోగములో ఉపవాసముంచరాదు. ఎందుచేతనంటే రోగస్వభావములోనే నీరసమున్నది. ఈ ఉపవాసమువలన నీరసము మరింత హెచ్చును. రోగియొక్క ధాతుశక్తి బాగా క్షీణించును. అందువలన మాంసకృత్తు తక్కువగానున్నట్టి పదార్థముల అనగా కాయధాన్యముల (వరి, జొన్న, గోధుమ) పెట్టుట మంచిది. మాంసకృత్తు ప్రధానముగా గల పప్పు ధాన్యముల మారవలెను. సేంద్రియలవణములు యెక్కువగానున్న ఆకుకూరలు అనగా (పెరుగుతోటకూర, బచ్చలికూర, మెంతికూర, పొన్నగంటికూర) లను పెట్టవలయును.

## కనీనికలో కనుపడు గుర్తులు.

32 వ బొమ్మలోని కుడికనీనికలోని 21, 15 యేరియాలలో గుర్తులు గలవు. ఈ గుర్తులలో నలుపురంగు ప్రధానముగా గలదు. రోగము కాలికరూపమును పొందినదని తెలుసుకొనవలెను. ఈ రోగికి నలుబదిఅయిదు సంవత్సరముల వయసు ఉండును. చిన్నతనములో గనేరియా తగిలినది. మందువైద్యులు శాస్త్రోక్తముగా అణచివేశారు. ఈ మందులతో జననేంద్రియములలోని పటుత్వము పోయినది. రోగము నయమై సంవత్సరము గడచినదో లేదో పుంస్త్వము పోయినది. నపుంసకుడైనాడు. అప్పటినుండి సంధివాతముతో బాధపడినాడు. కాళ్ళకుగల సంధులలో యీ బాధ యుండును. కుడి మొదటి కనీనికలోని 18 వ యేరియాలలో వల్లగీతలు గలవు.

గనేరియా, సవాయిరోగములను స్త్రీ పురుషులిద్దరిలో గాని, ఒకరిలోగాని మందులతో అణచివేసినయెడల పుంస్త్వము లోపించినటు చాలా కేసులలో చూచినాము. మిధునకాండను జరుపుటకు శక్తి ఉన్నప్పటికిని, బిడ్డలకను శక్తి లోపించినట్లు చూచుచున్నాము. చాలా కేసులలో 15 వ ప్రతినిధి భాగములలో (కుడి, యెడమ) కనీనికల రెంటిలోను నల్లగుర్తులు కనుపడుచున్నవి.

32 వ బొమ్మలోని కుడి కనీనికలో వెన్నులోని క్రింది భాగమును తెలుపు 23 వ ప్రతినిధి భాగములో తెల్లగీతలు గల చిన్న బొమ్మ గలదు. ఈయనకు చిన్నతనములో వెన్ను మీద దెబ్బతగిలినది. ఈ దెబ్బతో వెన్నుపూసలలోని తోక పూసలు లోనికి వంగిపోయినాయి. ఈ తోకపూసల దగ్గర నుండు గ్రంధిలో అప్పటినుండీ మంటలు పుట్టినవి. ఆ ప్రదేశములో అప్పటినుండీ పోట్లు యెక్కువైనాయి. మలబద్ధకము యెక్కువైనది. రక్తాభిష్యందము గలదు.

మందువైద్యులు యీ గ్రంధిని తీసివేయుమని సలహా యిచ్చినారు. ఈ రోగి చికిత్సార్థమై మా ఆసుపత్రికి వచ్చినాడు. సమీకరణ చికిత్సతో వెన్నుపూసలలోని లోపముల సరిచేసినాము. దీనితో మలబద్ధకము పోయినది. రక్తాభిష్యందము తగ్గినది.

32 వ బొమ్మలోని ఎడమ కనీనికలోని 23 వ యేరియాలో ఒక చిన్నగుర్తు గలదు. ఈ గుర్తు మధ్య నలుపు రంగు గలదు. ఈయనకు చిన్నతనములో సవాయిరోగము వచ్చినది. ఆ రోగమును పాదరసముతో తయారుచేసిన మం

ములతో నయముచేసినారు. తరువాత దేహమంతా చచ్చు పడిపోయినది. కాళ్ళూ, చేతులూ కదల్చుటకు వీలు లేకుండా పోయినది. మలమూత్రముల విసర్జన కూడా రోగి అదుపులో లేకుండా పోయినది. ఇవి యెక్కువగా బయలుపడుతూనే ఉండును.

# కనీనికా నిదానము

## అకారాది

శ



స



హ